S. Veeraswamy Naidu,
1942.

శ్రీ ర స్తు

# పారిజాతాపహరణము

(నంది తిమ్మనార్యకృతము)



నాగపూడి కుప్పుస్వామయ్యగారు

రచియించిన

పరిమళోల్లాస మను వ్యాఖ్యానముతోఁ గూడినది

చెన్నపురి :
ఆంధ్రపత్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రితము.
1929

[సర్వస్వామ్యసంకలితము] [వెల రూ. 3-0-0]

N. KUPPUSWAMAYYA B.A.



నాగపూడి కుప్పుస్వామయ్య

శ్రీ ర స్తు

శ్రీ గణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

# పారిజాతాపహరణ
# మహాకావ్యవ్యాఖ్యాన మగు
## పరిమళోల్లాసమునకుఁ
## పీఠిక

శ్రీకాంతామణికిన్ సురప్రసవముం
ప్రేమంబుతో నియ్యన
స్తోకామర్షముఁ జెంది మానసమునన్
శోకించుసత్యాసతిన్
నాకానీతముఁ బారిజాతనగముం
దా నిచ్చి యూరార్చునా
శ్రీకృష్ణున్ మునివంద్యుఁ బుణ్యచరితున్
సేవింతు నశ్రాంతమున్. 1

క. ప్రతిపదవిన్యాసచమ
త్కృతియుతమై సరసవచనమృదుసంశ్లేషాం
చితమై భావోదయరం
జితమై యీకావ్యరమణి చెలువారుఁ గనున్. 2

తే. సరసకవిమానసాహ్లాదకరమృదూక్తి
భరణమై నీరసగ్రంథపఠనమృదిత
మోదసహృదయహృదయసంభూతతాప
హారణ మై పారిజాతాపహరణ మమరు. 3

క. వలికపురపుఁ బలుకులు పలు
కులఁ దేనియ లొలుకఁ జెలువుకులుకులు దొలఁకం
బలుకువెలఁది కఱపిన చిలు
కలపలుకులు నందితిమ్మకవివరుపలుకుల్. 4

సీ. కొమరారు పారిజాతమహీరుహావతంస
 కుసుమాళివలపులఁ గొల్లవెట్టి
పలుకుఁదొయ్యలిముద్దు లొలుకు విపంచికా
 కలరవంబులతోడఁ జెలిమిచేసి
శారదాచరణాంబుజ స్ఫురన్మంజీర
 మృదురవంబులతోడ మేలమాడి
యమరాలయంబున నరుదారు నమృతంబు
 తియ్యఁదనంబుతో వియ్యమంది
తే. సౌరభములు గుబాళింప సరససుభగ
కోమలతయు శ్రావ్యతయును గొమరు మిగుల
మదురరసములు చిప్పిల మంజుసరణి
నందితిమ్మనపల్కు లానంద మొసఁగు. 5

సీ. సురలలో హరిహూపహారునిచందంబున
 నగములలో మేరునగముమాడ్కి
గ్రహములలోన సారసమిత్రుకైవడిఁ
 దారలలో సుధాధాముపగిది
నదులలో జాహ్నవీనదియొప్పిదంబునఁ
 గవులలో వాల్మీకికవివరువున
రసముల శృంగారరసమువిధంబున
 వర్ణంబులను శుక్లవర్ణముగతి.

తే. నిలను నవతారములలోనఁ గృష్ణలీలఁ
దరులలోఁ బారిజాతంబుకరణి భక్త
గణములో నారదునిపోల్కిఁ గావ్యసమితి
నాంధ్రమునఁ బారిజాతాపహరణ మలరు. 6

సీ. ఏమహీనాథుండు భూమీశమణిమాళి
నీరాజితాంఘ్రిపంకేరుహుండు
ఏపండితవతంసుఁ డిలలోనిపండిత
వ్రాతంబునకుఁ బారిజాతనగము
ఏకవీశ్వరుఁ డిద్ధపాకోద్యదాముక్త
మాల్యదాకావ్యనిర్మాణచణుఁడు
ఏవంద్యచరితుండు శ్రీవేంకటేశ్వర
పాదారవిందైకభజనరతుఁడు.

తే. ఏరసికలోకవర్యుఁడు పారిజాత
హరణముఖ సత్కృతిస్వామి యై విశాల
శాశ్వతయశంబుచేఁ గ్రాలు జగతినట్టి
కృష్ణరాయని గీర్తింతు నెసఁగు పేర్మి. 7

క. వాసిగ నీకావ్యమునకు
వ్రాసితి నానేర్పుకొలఁది వ్యాఖ్యానంబున్
భాసిలు నిలం బరిమళో
ల్లాసం బను పేర రసికులకు ముద మొదవన్. 8

క. తెలిసినవానిని వ్రాసితిఁ
దెలిసినవని తలఁచి వ్రాసితిం దెలియక నా
తెలియమిఁ బొలసిన నలుసులఁ
దెలిపెద రని తెలఁతు లెస్స తెలిసినవారిన్. 9

ఆంధ్రకవితాపారంగతు లగు నన్నయ తిక్కన యెఱ్ఱాప్రెగ్గడ భాస్కరుఁడు బమ్మెరపోతన మున్నగు కవినాథులు తొలుత నీ భాషయందు జనులకు నుత్తమధర్మంబులు బోధించు పురాణాదులు లేమింజేసి భారతరామాయణభాగవతములను సంస్కృతభాషనుండి యాంధ్రీకరించి లోకోత్తరకీర్తినిలయులై యాంధ్రలోకంబునకుఁ బరమోపకారంబు చేసి యున్నారు. వారిలో నన్నయ, తిక్కన యెఱ్ఱాప్రెగ్గడ యను మువ్వురు దేవతలలో హరిహరహిరణ్యగర్భు లనియెడు మూర్తిత్రయమునుంబోలెఁ గవిత్రయం బనం బరఁగుచు నద్దేవతలు సకలప్రపంచంబున కాధారులై వెలయుకరణి నాంధ్రభాషాప్రపంచంబునకు జీవాధారులై వెలయుచున్నవారు. తద్రచితము లగు భారత హరివంశ గ్రంథములే యాంధ్రభాష కూఁతగొమ్మలై యలరారెడు.

అమ్మహాగ్రంథములు పురాణేతిహాసము లైనను దత్కర్తలు సంస్కృతమునందు వాల్మీకివ్యాసులదండంబున నందందు సందర్భములు దొసఁగినచోటులఁ గేవలానందసంధాయకంబులగు వర్ణనాదులను మనోహరంబుగాఁ జేసియేయున్నారు. పిదపఁ గొండొక కాలమునకుఁ గ్రమంబున మహీపాలురకుఁ గావ్యశైలియం దభిరుచి యొదవఁ దద్రంజనార్థము వారికాలంబున నుండిన యాంధ్రకవినాథులగు శ్రీనాథాదు లెఱ్ఱాప్రెగ్గడవిరచిత మగు లక్ష్మీనృసింహపురాణమువాడ్కిని భీమేశ్వరపురాణము కాశీఖండము లోనగు పురాణకథలను గావ్యరీతిని రచియించుటయ కాక శృంగారనైషధము భోజరాజీయము మొదలగు కేవలకావ్యములను వ్రాసిరి.

పదంపడి సంస్కృతాంధ్రములందు విశేషపాండిత్యంబు గలిగి మహీశ్వరుఁడయ్యుఁ గవీశ్వరుఁడై సుకవిజాతంబునకుఁ బారిజాతమహీజాతంబై యాంధ్రభోజుం డనఁ గీర్తిగాంచిన కృష్ణదేవరాయ మహారాజు కాలంబునఁ గేవలకావ్యశైలిని గ్రంథములు రచియించుట యన్నరనాథునకుఁ బ్రీతికరంబను తలంపునఁ గవీశ్వరులు ప్రబంధములను రచియింపఁ దొడంగిరి. అట్టికావ్యము లల్లసాని పెద్దనార్యకృతమగు మనుచరిత్రము నంది తిమ్మనార్యవిరచితంబగు పారిజాతాపహరణము మున్నగునవి. కృష్ణరాయఁడు మహాకవి యగుటచేఁ దానును నాముక్తమాల్యద యను మహాకావ్యమును రచియించెను. *

---

* ఆముక్తమాల్యద కృష్ణరాయవిరచితము కానోప దనియు దాని నల్లసాని పెద్దనార్యుఁడో యొండొక మహాకవియో వ్రాసియుండ నోపు ననియుఁ బండితులలో నొక వాదము బహుకాలమునుండి నెగడుచున్నది. కాని యక్కావ్యమునఁ గృష్ణరాయ కృతమనియే చెప్పఁబడియుండుటచేఁ దద్రచితము కాదని వాదించువారలే తమవాదమును

ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యమును వ్రాసెను. అనంతర మచిరకాలంబుననే రామరాజభూషణుండు వసుచరిత్రమును బింగళిసూరన కళాపూర్ణోదయము ప్రభావతీప్రద్యుమ్నము మొదలగు నుత్తమకావ్యములను రచించి ఖ్యాతి గాంచిరి. వారికిం బిమ్మట కవిపుంగవులు గతానుగతికులై యిమ్మార్గముననే సంచరించుచుం బ్రాయికంబుగాం గేవల ప్రబంధములనే వ్రాయుచువచ్చిరి. వానింగూర్చి యిచ్చట ముచ్చటించుట యనవసరము.

ఇప్పగిది నాంధ్రభాషయందుం బెక్కులు ప్రబంధము లుత్పత్తిల్లినను వానిలోం బ్రధానము లనియు నుత్తమోత్తమకావ్యము లనియుం బండితు లొక్కరీతిని జేర్కొను నవి మనుచరిత్రము, వసుచరిత్ర, మాముక్తమాల్యద, పారిజాతాపహరణము, శృంగారనైషధ మను నీయేనుకావ్యములు. ఇవియే తెనుఁగునం బంచమహాకావ్యము లనంబడు. కొందఱు శృంగారనైషధమునకు మాఱుగాం గాశీఖండమును గొందఱు పాండురంగమాహాత్మ్యమును మఱికొందఱు రాఘవపాండవీయమును నెన్నుదురు. కాని మొదటి నాలుఁగుమహాకావ్యములను గూర్చి పండితులలో నభిప్రాయభేదము లేదు.

పారిజాతాపహరణమహాకావ్యమును వ్రాసిన నంది తిమ్మన జీవితాంశముల నించుక వివరించెద. విపులముగాం దెలిసికొనఁగోరువా రాంధ్రకవులచరిత్రమువలన నెఱుంగఁదగు. కృష్ణదేవరాయలు క్రీస్తుశకము 1509 వ సంవత్సరము మొదలు 1530 వ సంవత్సరమువఱకు రాజ్యముచేసెను గావున నంది తిమ్మకవి యాకాలమున జీవించి యుండెనని సోపపత్తికంబుగా సిద్ధాంతీకరింపవలసి యుండు. మనుచరిత్రశైలిని దీనిశైలిని బోల్చి పరికింప నీశైలులందుం జాలభేదములు గన్పట్టుటచే నిది పెద్దనార్యకృతము కానోపదని నిర్ణయముగాం జెప్పనచ్చును. కృష్ణరాయ లాముక్తమాల్యదయం దనేక గ్రంథములు తాను రచించినట్లు చెప్పికొనియున్నాఁడు. అతఁడు కవి గానిచోం దా నన్నిగ్రంథములు రచించినటు లసత్యము వచియింపఁడు. 'కవితాశ్రీభోజుఁడు,' 'కర్ణకుండలితరసాఖండకవికావ్య,' 'విద్యాఖేలనభోజ,' 'భోజక్షమాపతివిద్యాపరిపాక' యని యల్లసాని పెద్దకవీంద్రుండును, 'కవితాప్రావీణ్యఫణీశ' యని నందితిమ్మకవీశ్వరుండును కృష్ణదేవరాయ మహీనాథుని వినుతించియున్నారు. కావున నతఁడు గొప్పకవియైయుండు ననుటకు సందియము లేదు. రచనాతారతమ్యముచే నాముక్తమాల్యద పెద్దనార్యవిరచితము గాదని స్పష్టమగుటచేతను నితరు లెవరును దానిని రచించినట్లు ప్రవాదము లేనికారణంబునను కృష్ణరాయఁడు కవితానిర్మాణవిచక్షణుం డని పెద్దనార్యతిమ్మనార్యులు నుడివియుండుటచేతను నాగ్రంథమును దాను రచించినట్లు చెప్పికొని యుండుటచేతను నాముక్తమాల్యదను కృష్ణరాయఁడే రచియించె ననుట తెల్లము. ఈవిషయమును నిచ్చట విపులముగాం జర్చించుట యకాండతాండవము.

ననియు నీ కావ్యమును 1516_1520 సంవత్సరముల నడుమ రచియించి యుండనోపు ననియుఁ జరిత్రకారులు వ్రాసియున్నారు.

ఇతఁడార్వేలనియోగి బ్రాహ్మణుఁడు. కౌశికగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. సింగామాత్యునకును దిమ్మాంబకును బుత్త్రుఁడు. మలయమారుత కవీంద్రునకు మేనల్లుఁడు. శివభక్తుఁడు. ఈవిషయములను గవియే చెప్పియున్నాఁడు.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబసూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మేనల్లుండు కృష్ణరాయక్షితీశ
కరుణాసమాలబ్ధఘనచతురంతయానమహాగ్రహారసన్మానయుతుఁడు
తే. తిమ్మయార్యుండు శివపరాధీనమతి యఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష నాదివాకరతారాసుధాకరముగ.

పారిజాతాపహరణము 5_106.

నందితిమ్మకవికి ముక్కుతిమ్మనయని యొకనామాంతరము సుప్రసిద్ధమై వాడుకలోనున్నది. దానికిఁ గారణ మక్కవిపరుఁడు చక్కనివనితామణిముక్కును వర్ణించి

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాఁకందపంబంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసి యై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

అనుపద్యమును జెప్పఁగా దానిచమత్కారముం గాంచి రామరాజభూషణుఁడు తనవసుచరిత్రమునందుఁ జేర్చుకొనెననియు దీనిచే ముక్కుతిమ్మనయను పేరుగలిగె ననియు నొక ప్రవాదము గలదు. కాని యది విశ్వాసార్హముగాదు. పైపద్యము శైలివలననే యది నందితిమ్మనది కా దనియు రామరాజభూషణకృతమే యనియుఁ దెల్లం బయ్యెడు. ముక్కు పొడుగుగా నుండుటచే నీపేరు గలిగెనని కొందఱందురు. ఇదియే నిజము గానోపునని తోఁచెడు. కారణ మెయ్యదియైనను నిక్కవిచంద్రునకు ముక్కుతిమ్మన యను ప్రసిద్ధనామము గలుగుట నిక్కము. 'ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు' అను ప్రాచీన పండితపరంపరాగతవచనమే దీనికి నిదర్శనము.

ఇటులే యితఁడు పారిజాతాపహరణమును రచియించుట కొకకారణము పెద్దలనాఁటినుండి విననయ్యెడు. కృష్ణదేవరాయ లొకరేయి యంతిపురమున నిజకాంతయగు తిరుమలదేవితో నేకాంతంబున నుండుతఱి నాసతి యతనిదెసం గొండొకప్రణయాపరాధము గావింపఁగా నమ్మహీపతి కుపితుండై లేచి చని యమ్మగువమొగంబుఁ

జూడకుండెననియు వారినిరువురిం గలుపుటకై తదీయమిత్రుండును గవీశ్వరుండును బెద్దనాఁడుమునగు నందితిమ్మన యిమ్మహాకావ్యమును రచియించి యతనికి వినిపింపఁ బ్రథమాశ్వాసాంతమునఁ గల 'పాటలగంధి...' 'జలజాతాసన...' 'కోపనపదహతి...' 'నను భవదీయ...' అను నీపద్యంబులను విని కృష్ణరాయలు కోపంబు విడనాడి తనసతిం జేరి సుఖం బుండెననియుఁ జెప్పుదురు.

ఆంధ్రపంచమహాకావ్యములలో మనుచరిత్రము, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, శృంగారనైషధ, మను నీనాలుగింటికిఁ బండితులు వ్యాఖ్యానములు వ్రాసి ప్రకటించియున్నారు. రాఘవపాండవీయము పంచకావ్యములలో నొకటి యని యెన్నంబడినను దానికిని ప్రాచీనపండితవ్యాఖ్యానము గలదు. కాని యెల్లవారును నాంధ్రపంచమహాకావ్యములలో నొకటి యని యంగీకరించుచుఁ బఠించుచున్న పారిజాతాపహరణమున కేలొకో యిందాఁక నెవ్వరును వ్యాఖ్యానము వ్రాయఁదలంపరైరి. ఇది సుబోధమని తలంచి వ్రాయరైరనినచో సామాన్యముగా నర్థములు వీడని ప్రకరణము లింక నెన్నియో కలవు. ఎవరును దీనికి వ్యాఖ్యానము వ్రాయమికిఁ గారణము నన్ను ధన్యుఁ జేయవలయు ననుతలంపుఁ గాఁబోలు నని తలంచుచున్నాను.

చిన్నటనాఁటనుండి పారిజాతాపహరణకావ్యముపై నాకు మక్కువ యెక్కువ. ఇమ్మహాకావ్యంబును జదువఁ జదువ దీనిపై నాకభిరుచి నానాఁట మిక్కుటముగుచు వచ్చెను. దీనికిఁ బండితోత్తము లెవ్వరైన వ్యాఖ్యానము చేయుదురో యని చిరకాలము తద్దయు నిరీక్షించుచుంటిఁ గాని యెవ్వరును జేయరైరి. అంతట దీనికి వ్యాఖ్యానము వ్రాయుతలంపు క్రమంబున నామనంబునఁ బొడముచుండి చిగిరించుచుండె. ఇట్లు కతిపయకాలంబునకు మదీయమిత్రు లగు పలువుర ప్రేరణంబున నల్పజ్ఞుండనగు నే నిప్పనికిఁ గడంగుట తగదని యెదలోఁ దలంపక సాహసంబున నీవ్యాఖ్యానము వ్రాయఁబూని కొండొక కాలంబునకుఁ బూర్తిగావించితి.

ఈగ్రంథమునకు ముద్రితాదర్శములు నాలుగేను గలవు కాని వానిలో సత్ప్రసంగములని నామదికిఁ దోఁచినవి రెండు. ఒకటి నల్లూరుజమీందారుగా రగు శ్రీమన్నాగ మహీశ్వరునిచే ననేకాంధ్రగ్రంథములను దొలుదొల్త బహుళవ్యయప్రయాసములతో నచ్చువేయించి యాంధ్రలోకమున కుపకారము చేసిన వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి ముద్రాక్షరశాలలో దుర్మతి (1861) సంవత్సరంబునం దచ్చు సేయింపఁబడెను. ఇది యనేకాంధ్రగ్రంథపరిశీలనము చేసి శబ్దరత్నాకర మను నిఘంటువును రచించి యాంధ్రజనులకు మహోపకృతి గావించిన బహుజనపల్లి సీతారామాచార్యులవారు పరిష్కరించిన పుస్తకము. దీనియందు వారు గావించిన పదవిభాగములుఁ గలవు. మఱొకటి మదీయమిత్రులును బండితోత్తము లని ప్రఖ్యాతిగాంచినవారును మహామహో

పాధ్యాయ కళాప్రపూర్ణబిరుదాంచితులును నగు వేదము వేంకటరాయ శాస్త్రులవారీ గ్రంథమున ననేకములగు సవరణలు గావించి స్వకీయ ముద్రాక్షరశాలలో ముద్రింపించిరి. ఈ రెండాదర్శములలోను నపపాఠము లనేకములు గానంబడుటచే నింకను ప్రాచీనతాళపత్రలిఖితగ్రంథములు సంపాదింపఁ బ్రయత్నించితిం గాని యెక్కడను నొక్కటియుఁ జిక్కదయ్యె.

కావునఁ బై కనిన రెండాదర్శములే నాకాధారము లయ్యెను. ఈ రెంటియందును నా దప్పులని తోఁచినవానిని నా బుద్ధికి సమంజసమనియుఁ గవిహృదయంబనియు స్ఫురించిన తెఱంగున సాహసించి సవరించితి. ఉన్న పాఠములకుఁ గవిహృదయం బెఱింగి యర్థవివరణము చేయుట యెట్లుండఁగా నపపాఠములు గానంబడినపుడు సాధుపాఠనిర్ణయంబు నేయుటయందు గోచరించు కష్టం బింత యని చెప్పవలయునే.

అప్పగిది నేను గవిహృదయనిర్ధారణము చేసి కావించిన సవరణలను గొన్నింటిని బండితాఖండలులును గీర్తిశేషులును నగు వేదము వేంకటరాయశాస్త్రులకును మఱికొందఱు విద్వాంసులకును జూప వారెల్లరు నా సవరణలను సమీచీనంబు లని యామోదించిరి. ఈ సవరణలను (అ) గుఱుతుగల యనుబంధములోఁ దెలిపియున్నాను. ఇంకను బై కనిన యాదర్శములు రెంటను బాఠభేదములు గానంబడినపుడు నా మనంబునకు లెస్స యని తోఁచిన పాఠములను స్వీకరించితి. వీనిని (ఆ) గుఱుతుగల యనుబంధములో సూచించియున్నాఁడను. వీనిలోను నా చేసిన సవరణలు కొన్ని గలవు. సంస్కృతవ్యాకరణశాస్త్రసాధ్యమగు పదములు గొన్నింటికి సూత్రసహితముగా రూపనిష్పత్తులు వివరించి వానిని (ఇ) గుఱుతుగల యనుబంధములోఁ దెలిపినాఁడను. వాని నాయా పద్యముల వ్యాఖ్యానములలోనే లిఖింపరాదా యని కొందఱు అడిగిరి. కాని యవి సామాన్యజనులకు నిరుపయోగములై పానకములోఁ బుడకలవలెఁ గ్లేశకరంబులై యుండునని తలఁచి యచ్చటచ్చట వివరింపక వానిని దెలియఁగోరువారికై ప్రత్యేకముగా వ్రాసితి.

ఈ వ్యాఖ్యానమునందుఁ జేర్చుకొనఁదగు నంశములను (ఈ) గుఱుతు గల యనుబంధములో వివరించితి.

**ఈ వ్యాఖ్యానము వ్రాయుటయందు నే నవలంబించిన నియమములను వివరించెద.**

1. సామాన్యముగా సులభములగు పద్యములకు వ్యాఖ్యానము వ్రాయకయే సుగమమని విడిచితి. (చూ. 1–46–1–51.)

2. పద్యములలోను గద్యములలోను సులభము లని నాకుఁ దోఁచిన పదముల కర్థములు వ్రాయనైతి. సమాసముల కర్థము వ్రాయునపుడు వానియందలి సులభపదములు

కును నర్థము వ్రాయవలసివచ్చుటచే వ్రాసితి. అతనికిన్—ఆనారదమహర్షికి; చని—పోయి; ఇచ్చి—ఒసఁగి; అప్పుడు—ఆసమయంబున; మగడు—పెనిమిటి; అంభోజేక్షణలు—స్త్రీలు; ఇట్టిపదముల కర్థములు వ్రాయుట వ్యర్థ మని నాతలంపు.

3. ప్రాయికముగా నన్వయక్రమముననే యర్థవివరణము గావించుచు మూలమునందలికఠినపదములకు సులభపదములతోనే యర్థములు వ్రాసితిని.

4. వర్ణనలు మొదలగు కఠినములగు పట్టులలోఁ బ్రతిపదార్థములును దాత్పర్యములును విపులముగా వివరించితి.

5. ఎందేని పద్యములలో విశేషాంశములు వక్తవ్యము లని నాకుఁ దోఁచినవాని నాయాపద్యములవ్యాఖ్యానములకడపట వ్రాసితిని. అట్టిపట్టులలో (వి) యనుగుఱుతు పెట్టఁబడియున్నది.

6. పెక్కుచోట్ల నాచేసినయర్థములకు నిఘంటుప్రమాణములను నితరగ్రంథప్రమాణములను నుదాహరించితి.

7. ఆయాచోట్ల నలంకారములను ధ్వనులు మున్నగువానిని సూచించితింగాని వానిలక్షణములను విద్యార్థు లలంకారశాస్త్రమువలన నెఱుంగఁగల రనుతలంపున లిఖింపక విడిచితి.

8. ఆయావృత్తములకు ఛందోలక్షణములు సంగ్రహముగా వివరించితి.

9. అనేకస్థలములలో సంస్కృతగ్రంథములలో నుండి ప్రమాణవచనముల నుదాహరించి యున్నాను. వానికిని దెలుఁగునఁ దాత్పర్యములు వ్రాసినచో సులభముగాఁ దెలియునని కొందఱు నుడివిరి. కాని గ్రంథవిస్తరభయంబుచే వ్రాయనైతి. వానిని జిజ్ఞాసువు లించుకప్రయత్నముతోఁ దెలిసికొనఁగలరు. ఇక్కాలంబునఁ దెలుఁగుచదువువారికి సంస్కృతభాషాజ్ఞాన మావశ్యకముగాదని కొందఱు దానిదెస ననాదరంబునేయుదురు. వారిమాటలతో నేమికాని యాంధ్రగ్రంథపరిజ్ఞానంబునకు సంస్కృతభాషాజ్ఞాన మత్యంతావశ్యకమని యాగ్రంథములను జదువువారికిని గవిత్వము చేయువారికిని దప్పక గోచరించును. అనేకవిషయములు సంస్కృతగ్రంథములలో నున్నవి కాని తెలుఁగుభాషయందు లేవు. కావున వ్యాఖ్యానముసేయునపుడు సంస్కృతగ్రంథములనుండి ప్రమాణవాక్యముల నుదాహరింపవలసియే యుండును. అవి ధారణార్హము లై యుండును.

10. సంస్కృతషష్ఠీతత్పురుషసమాసముల కర్థములు వ్రాయునపుడు కర్మార్థమున వచ్చిన షష్ఠీవిభక్తులకుఁ దెలుఁగున నావిభక్తులతో నర్థము వ్రాసినచోఁ జదువుటకు సొంపుగా నుండ దనుతలంపున నట్టితావులలోఁ దఱుచుగా ద్వితీయావిభక్తులతోనే యర్థము వ్రాసితి.

ఉదాహరణము:—

తరసాస్వాదన (1_29)—మాంసముయొక్క తినుటయందు-అని వ్రాసినఁ జదువుటకు లెస్సగా నుండదను తలంపున మాంసమును దినుటయందు-అని లిఖించితి.

పణాదాన (1_95)—పందెపుసొమ్మును గ్రహించుటయందు;

కుంభిత్రాణ(2_56)—ఏనుఁగును రక్షించుటయందు;

పృథుకస్వాపక్రియా (2_65)—బిడ్డలను నిద్రపుచ్చు కార్యమునందలి;

జగత్త్రయీనిర్మితి (3_38)—ముల్లోకములను సృజించు కార్యమునందు;

దైత్యవిధ్వంసన (3_41)—రాక్షసులను జంపుటయందు;

కొన్నియెడల షష్ఠీవిభక్తితోనే యర్థము వ్రాసితి:—

బలీంద్రనిర్బంధన (2_53)—బలిచక్రవర్తియొక్క చెఱఁబెట్టు కార్యమునందు;

ప్రసూనాసవార్పణ (3_44)—పుష్పమద్యముయొక్క అర్పించుటవలన;

ఈనియమంబులు కొన్నియెడలఁ దప్పియుండవచ్చును.

మహాపండితసార్వభౌముండును వ్యాఖ్యానచక్రవర్తియు నగు మల్లినాథసూరి కాళిదాసవిరచితము లగు రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, (మాఘకావ్య మనంబడు) శిశుపాలవధము, (భారవికృతం బగు) కిరాతార్జునీయము, (శ్రీహర్ష కృత మగు) నైషధము అనునీ మహాకావ్యములకు వ్యాఖ్యానములువ్రాసి లోకులకుఁ బరమోపకారము చేసియున్నాఁడు గదా. మల్లినాథునిమాడ్కి నిరంకుశము గా వ్యాఖ్యానము వ్రాయఁ దదీయపాదరజంబును బోలనినాఁబోఁటివానికిఁ దరమా. అయినను నప్పండితోత్తముఁ డవలంబించిన పద్ధతిని నేననుసరింపఁబూనితి నని మాత్రము వాక్రువ్వఁగలను. అతని వ్యాఖ్యానములలో నుండి పెక్కు లుదాహృతవచనంబులు నేను గైకొని మదీయవ్యాఖ్యానములోఁ జేర్చితి.

అతఁడు సులభపదములకును గొన్నిచోట్ల నర్థములు వ్రాసెను. కొన్ని సులభపదములకుఁ గఠినపదములతో నర్థములు వ్రాసెను. వీని కుదాహరణములు కొన్ని చూపెద.

| | |
|---|---|
| కుమారః_బాలకః (రఘువంశము 4_37) | అంతం_అవసానం (మేఘసందేశము 2_55) |
| సురాః_దేవాః ( ,, 10_35) | కంపసేన_అవధూనసేన ( ,, 6_30) |
| ముదం_ఆనందం (మాఘకావ్యము)6_72) | గురోః_పురోధసః (కుమారసంభవము 7_81) |
| శుక్లైః_శుభ్రైః(కిరాతార్జునీయము5_42) | మానస్య-వాగ్యమవ్రతస్య(నైషధము 3_30) |
| కృత్తైః_నిర్మితైః ( ,, 8_1) | కంఠం_గ్రీవాం ( ,, ,, ) |

ఇట్లు వ్రాసియుంటకి న్యూనతయని నేను వచియింపను. వ్యాఖ్యానము వ్రాయుటోర ణిలో నిట్టివి లిఖింపఁబడుట సహజము. ఇట్టివి మదీయవ్యాఖ్యానమునందును గల వని యెఱింగి మల్లి నాథసూరిని శరణు సొచ్చితి.

## ఈ కావ్యమునందలి కథను సంగ్రహముగా వివరించెద.

శ్రీకృష్ణుఁ డొకనాఁడు రుక్మిణీదేవిగృహంబున నుండఁగా నారదమహర్షి యచ్చ టికి వచ్చి వారిచేఁ బూజితుఁడై యొకపారిజాతపుష్పమును గృష్ణుని కిచ్చెను. అతఁడు రుక్మిణియింట నున్న కారణంబున దాని నద్దేవి కిచ్చెను. దీని నెఱింగి సత్యభామ యీసుఁ జెంది మగనిపైఁగోపించి దుఃఖించుచుండఁగాఁ గృష్ణుఁ డామె ననునయించి యొకపు ష్పమునకై నీవు వగవనేల పారిజాతవృక్షమునే నీయింటికిఁ దెచ్చి నాటించెదనని చెప్పఁ గా సత్యభామ సంతసించి కాంతునికి మజ్జనాద్యుపచారములు సేయఁదొడంగె. అచ్చ టికి నారదుండును వచ్చిన నందఱును భుజించినపిదంపడి నారదునితోఁ గృష్ణుఁడు నర కాసురుం డపహరించినకుండలముల నదితి కిచ్చుటకై నేను మీవెంటనే యమరావతికి వత్తు నని యింద్రునితోఁ జెప్పు మని వీడ్కొలిపె.

అమ్మఱునాఁడు కృష్ణుఁడు సత్యభామాసహితుండై గరుత్మంతు నెక్కి యమరా వతికిఁ బోయి దేవేంద్రునిమన్ననలు వడసి సతీయుతుండై నందనోద్యానంబునకుఁ జని కొంతసేపు విహరించి యారేయి కడపి మఱునాఁ డుద్యానవనంబునకుఁ బోయి పారిజాత వృక్షమును బెల్లగించి గరుత్మంతునిపైఁ బెట్టెను. వనపాలకు లావృత్తాంతము నింద్రు నితోఁ జెప్పఁగా నతఁడు తనసేనలతో వచ్చి కృష్ణునితో యుద్ధముచేసి యోడి యతనికి శరణాగతుండై యీవృక్షంబును నీవు భూమికిఁ గొనిపోయి నీ యిచ్చవచ్చినంతకాలము పెట్టుకొనియుండు మని చెప్పినఁ గృష్ణుఁడు దానిం దెచ్చి సత్యభామయింట నాటించెను.

వెండియు నారదుండు వారికడకువచ్చి సత్యభామతోఁ బుణ్యకవ్రతమును జేయు మని బోధింప నద్దేవి యావ్రతము నాచరించి వ్రతాంగముగా నాకల్పవృక్షమును దన భర్తతోఁ గూడఁ జేర్చి నారదునికే దాన మిచ్చి సుఱల నమ్మహామునివలనఁ గైకొని సకలసుఖంబు లనుభవించెను.

ఈ యుపాఖ్యానము సంస్కృతహరివంశమునందు 123 మొదలు 140 వఱకుఁ బదియెనిమిదియధ్యాయములలో విపులముగాఁ జెప్పఁబడియున్నది. ఆకథనే కైకొని నందితిమ్మకవి పారిజాతాపహరణమహాకావ్యమును వ్రాసెను. మూలగ్రంథములోని చాలభాగముల ననుసరించియే యీకవివరుఁడు వ్రాసినను కొన్నిచోటులలోఁ గథలను మార్చియు సంక్షేపముచేసియు బొత్తిగా వదలియు లేనివర్ణనాదులను విస్తరించి పెం

చియు భేదములు గానించెను. అతఁ డేల యటు లొనర్చెనని యడుగుట యసంగతము. పురాణకథను నితివృత్తముగా గైకొని చమత్కృతికిని రసపుష్టికిని వలయు నటుల స్వతంత్రతతోఁ గావ్యములు రచియించుటయే యుత్తమకవుల సంప్రదాయము. కుమారసంభవము, శిశుపాలవధము మొదలగు మహాకావ్యము లీపద్ధతినే రచింపఁబడినవి. ప్రాయికముగా మహాకవు లుత్తమపురుషుల చరిత్రములనే తమకావ్యముల కితివృత్తము లుగాఁ గైకొందురు. మనకవి పురుషోత్తముఁ డగు కృష్ణునిచరిత్రమును గైకొని... దీనికిఁ గారణ మేమనఁగాఁ గావ్యనిర్మాణమునకు ముఖ్యప్రయోజనము సహృదయుల హృదయంబులం దానందంబుఁ బొందించుటయే యైనను భగవంతునిచారిత్రము నైనచో... బార లౌకిక సుఖాపాదనంబు నగు ననుటయే. భగవత్స్మరణసహితంబుగా నానంద... ననుభవించుటకంటె శ్రేయం బొండు గలదే.

సంస్కృతహరివంశమును నందితిమ్మకవి తనకావ్యములో ననుసరించినపట్టుల... (ఉ) గుఱుతుగల యనుబంధములోఁ దెలిపియున్నాను. ఈగ్రంథములలోఁ గల కథా... ముల గొన్నిటిని (ఊ) గుర్తుగల యనుబంధములో సూచించినాఁడను.

ఇంక నీప్రబంధమునందలిగుణవిశేషంబులం బ్రదర్శించెద.

అలంకారములు కావ్యశోభాకరము లగుధర్మము లనుటచే నంది తిమ్మన... నీ మహాకావ్యంబున శబ్దార్థాలంకారములను బ్రయోగించి దానికి మెఱుఁగు ... యున్నాఁడు. శబ్దచిత్రములగు ఛేకము- వృత్త్యనుప్రాసము- యమకము- గుణితక్రమము పాదభ్రమకము- మొదలగువాని కుదాహరణము లెత్తి చూపవలసియుండదు. అర్థాలంకా రముల నాయాపద్యముల వ్యాఖ్యానములందుఁ గొన్నింటిని సూచించియున్నాఁడను. వీనిలో నుత్ప్రేక్షలును రూపకములును స్వభావోక్తులును నీకావ్యమునందు మెండు. ఉపమలు నందందుఁ గలవు. అతిశయోక్తు లల్పములు. ద్వితీయాశ్వాసమందలియంధకా... వర్ణనము (2_34), నక్షత్రవర్ణనము (2_37), చంద్రోదయపూర్వభావికిరణవర్ణనము (2_39), చంద్రాస్తమయ వర్ణనము (2_59) వీనిలో నొక్కొక్కపాదమునం దొక... యుత్ప్రేక్ష గలదు. ఈ యాశ్వాసమునం దితరపద్యములు ప్రాయికముగా రూప... త్ప్రేక్షాలంకృతములై చెన్నారు. అట్లులే తృతీయచతుర్థాశ్వాసములలోను బెక్కు... ములు గానంబడు.

'శ్లేషప్రాయ ముదీచ్యేషు ప్రతీచ్యే ష్వర్థమాత్రకమ్,
ఉత్ప్రేక్షా దాక్షిణాత్యేషు గౌడేష్వక్షరడంబరః'

అని హర్షచరితమున బాణుఁడు నుడివినట్లు దాక్షిణాత్యు లుత్ప్రేక్షాప్రి... లనుట తెల్లము.

మనోహరములగు రూపకాలంకారముల కుదాహరణము లొకకొన్ని చూపెద. 'అమరులబోనపుట్టిక...' (2–41); 'వినవయ్యెం గృకవాకుకూజితములు...' (2–65); 'వనజశ్రీధన...' (4–47); 'మొగుడుఁదమ్మ్మిలఁ జిక్కు......' (4–49); 'భోజనకన్యా పరిద్రాజహంసము......' (5–105).

ఇందుఁ గన్పట్టు స్వభావోక్తులంలోఁ బరమరమణీయము లని నామదికిఁ దోఁచినవానింగొన్నిటి నిచటఁ బ్రదర్శింతు. నారదమహర్షి వర్ణనంబును (1–44), కృష్ణస్వామి స్నానవర్ణంబును (2–9...13), చంద్రికావర్ణనంబును (2–53), సిద్ధకిన్నర విద్యాధరాది వర్ణనంబును (2–89...96), భ్రమరవిహారవర్ణనంబును (3–51), మధ్యాహ్నకాలవర్ణనంబును (4–20...23), కమనీయము లగుస్వభావోక్తులఁ గొమరారుచుఁ జదువరులడెందంబుల నానందకందళితంబులు గావించు.

ఇంక స్త్రీ పురుషగుణవర్ణనము లీకావ్యమునఁగడురసవంతములై యాప్రకరణములఁ జదువునపుడు మనము ప్రత్యక్షముగా వారిసమక్షమున నుండి వారిచర్యలం జూచుచున్నట్టులే తోఁపఁజేయుచు నిర్భరానందపరవశులం గావించు. ప్రథమాశ్వాసమందు నారదమహర్షి పారిజాతకుసుమమును వర్ణించుచు రుక్మిణీదేవిని భూషించి సత్యభామను దూషించుటయు నది విని సత్యభామ కోపావిష్టచిత్తయై తనపరిభవంబునకుఁ గుందుచుఁ బరిపరివిధంబులఁ బరితపించుటయు కృష్ణుఁ డాదేవిని ప్రేమరసార్ద్రము లగు సులలితవచనంబుల ననునయించుటయుఁ దత్కాలంబునజరిగిన యుభయులసరసవ్యాపారసంభాషణాదులును నారదుఁడు సత్యభామను నుతించుటయుఁ గృష్ణుఁడు పారిజాతవృక్షమును బెకలించి గరుడునిపైఁ బెట్టినపు డాక్షేపించిన నందనవనపాలకులతో సత్యభామ చెప్పిన గర్వోక్తులునుఁ బుణ్యకవ్రతాచరణసమయంబున ధర్మజాదులు నుడివినహాస్యవచనములును మనుజగుణస్వభావానురోధంబులై మనోహరంబులై యొప్పారు. ఇవి ముందువిస్తరించి తెలుపంబడు.

ఈ కావ్యము శృంగారరసప్రధానమైనది. కావ్య మంతయు శృంగారరసపూరితంబై యుండుటచే దాని కుదాహరణము లెత్తిచూపుట యనావశ్యకము. అయినను నతిమనోజ్ఞము లగు కొన్నిపట్టులఁ దెలిపెద. చకోరవిలాసవర్ణనము (2–49), చంద్రికావర్ణనము (2–53), మేరుపర్వతవర్ణనము (2–88), శ్రీకృష్ణుం గాంచునప్పటిసురసుందరీవిభ్రమములవర్ణనము (3–11...21), వైజయంతివర్ణనము (3–41), నందనోద్యానవర్ణనము (3–44...57), పారిజాతనగవర్ణనము 4–3...10), జలక్రీడావర్ణనము (4–29...38), మున్నగునవి కేవలకోమలశృంగారరసవిలసితంబులై లలితంబులై సహృదయహృదయంగమంబులై డెందంబుల నమందానందతుందిలంబులు గావించు.

వీర రౌద్ర భయానక బీభత్సప్రముఖము లగు నితరరసములును నిందుఁ బ్రస్తావవశంబున వర్ణింపఁబడియున్నను నవి యిందు మెత్తఁబడినవని చెప్పవలసియున్నది. ఆ పట్టులలోను శృంగారరసము తలసూపుచుండును. పట్టఁదలంచె నేని... (4–72), సురవీరుఁ డొకఁడు...(4-73), చుక్కలరాణివాసముల...(5–10); గిరితటము...(5–15); అలనాఁటినన్ను...(5–27); ఈ పద్యములలో వీరరౌద్రరసములు శృంగారరసముచే మఱుంగుపడినవి. అమరవిభునిసమరం బకఠోరాహవంబై ముదావహంబై క్రాలెడు. కరుణరసమున కీకావ్యమునఁ బ్రసక్తి లేదు. అద్భుతరసవర్ణనమును లేదనియే చెప్పందగు. హాస్యరసవర్ణనము 'వనితయొకర్తు...(3–13); 'బలివనుజేంద్రు...(5–81); 'మేళవించినది సుమ్మి...'(5–86); వీనియందుఁ గాంచునది.

శాంతరసమున భక్తిరసము చేరును. నారదమునికృతకృష్ణస్తుతి (1-49-50) (5-92...99); వైతాళికోద్గీతకృష్ణప్రబోధనము (2-56-57); అదితికృతదశావతారస్తవము (3-27...37); కృష్ణదివ్యచరిత్రాత్మకస్తుతి (దండకము 3-88); ఇవి చదువునపుడే మానవునిమానసము భగవద్భక్తిరసాందోళితము గాకుండును. ఏ సుందరి డెందము భగవత్పాదారవిందభజనపరాయణము గాకుండును. ఇందలి భక్తిరసము శృంగారరసమున కంగముగాఁ దద్రసపోషకమై చెలువారు.

ఇందు వృత్తులలోఁ గైశికీవృత్తియు రీతులలో వైదర్భీరీతియుఁ బ్రధానములు. ఇది లలితమగు ద్రాక్షాపాకమున నొప్పారును. వీని కుదాహరణము లందందుఁ గాంచునది.

పారిజాతాపహరణకావ్యమునందలి వైశిష్ట్యములం గొన్నిటిని బ్రదర్శించెద:—

(1) ఒకవిషయమును వర్ణింపఁ బ్రసక్తి కలిగినపుడు దాని నాపట్టున వర్ణించుట సరస మగుంగాని దాని కించుకసంబంధము గల యెల్లవిషయములను ననుస్యూతముగా నప్రాసంగికముగా వర్ణించుట యౌచిత్యమునకు సుదూరము. ఒకపట్టణము గలదని చెప్పెడి చోట నందలి బ్రాహ్మణాదిజాతులను వనితలను వేశ్యలను బువ్వులావికలను వప్రపరిఖాదులను భటగజతురగస్యందనాదులను వరుస దప్పక గతానుగతికముగా వర్ణించుట యాంధ్రకవుల యాచారమై యున్నది. వాని నతిశయోక్తులతోనే వర్ణింతురు.

"సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి ముది మదిదప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటు నంపి భార్గవునైన బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతినైన మునుసంచి మొదలిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి నాదిభిక్షువు భైక్షమైన మాన్చు

తే. నచటి వెలయాండ్రు రంభాదులైన నొరయఁ
గా సెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టిన చిగురుఁగొమ్మైనఁ జేవ."

—అని మనుచరిత్రము ఆ. 1

వసుచరిత్రము- కళాపూర్ణోదయము- ప్రభావతీప్రద్యుమ్నము - ఆముక్తమాల్యద- కవికర్ణరసాయనము మున్నగు గొప్పకావ్యములలో నిట్టులే యీవర్ణనలు కానంబడుచున్నవి. ఈ వర్ణనలు పాపరాజకృతోత్తరరామాయణము రసికజనమనోభిరామము మొదలగు నాధునికకావ్యములం దత్యుక్తులగు నతిశయోక్తులతో విరాజిల్లుచున్నవి. నంది తిమ్మకవి తనకావ్యమునందిట్టి వర్ణనలు గావింపఁడయ్యె.

(2) సామాన్యముగాఁ గవులు తమకావ్యములలో నాయికలను వర్ణించుచో నాపాదతలమస్తక వంగములను రతిక్రీడలను విచ్చలవిడిం బచ్చిగా వర్ణింతురు. ఇదియు నౌచిత్యకిఁ గతంబు బాహ్యం బనియే సహృదయులు దలంతురు. పారిజాతాపహరణంబున వనితావయవరతిక్రీడాదివర్ణనములు గానరావు. రుక్మిణీ సత్యభామల సౌందర్యమును వర్ణింపఁ బ్రసక్తి యుండియుఁ గవి వర్ణింపక యౌచిత్యపరిపాలనంబు చేసె. శ్రీకృష్ణుని శయనాగారంబును హంసతూలికాతల్పంబును నీ కవివర్యుఁడు పెల్లుగా వర్ణించి యచ్చట నతనికి సత్యభామకును గుసుమశరలీలలు జరిగెనని వర్ణింప నవసరము ప్రసక్తమయ్యును వర్ణింపక 'శయనాగారంబున వినోదకేళిం దేలి నిద్రాముద్రితనేత్రుఁడై శయనించె' నని నయంబుగ నింతయే చెప్పి వదలెను. (1–53). ఇప్పగిదినే వైజయంత వర్ణనమును దిమ్మకవి విపులముగాఁజేసి యందారాత్రి సత్యభామతో 'మనోభూరాజ్యసౌఖ్యనిద్రాపారీణత నుండె' నని సులలితముగాఁ జెప్పి వదలెను. ఈ చందంబున నౌచిత్యంబుఁ బాటించినకవులు పెక్కండ్రు లేరని నిక్కముగా వక్కాణింపవచ్చును.

అయినను నీకావ్యమునందు 'వలిజక్కవలపెక్కువలు దక్కువగ నిక్కు చనుదోయి కొకవింతచాయ దోఁచె' నని 1–56 లో నొక్కచోఁ గుచవర్ణనము గన్పట్టెడు. ఇది పారిజాతకుసుమధారణంబుచే రుక్మిణీదేవికిఁ గలిగిన శోభాతిశయమును వర్ణించు ప్రస్తావంబునఁ గావింపఁబడినది. స్తనవర్ణనమును వాల్మీకివ్యాసాది ప్రాచీనమహాకవులు గావించియుండుటయేకాక మహర్షిప్రోక్తములగు దేవీస్తోత్రములందును గానంబడియెడుఁ గాన నిది యనుచితం బనందగదు. 'కులాచల స్పర్ధికుచనమన్మధ్యామ్', 'కూలంకషకుచశిఖరామ్', అని దుర్వాసోమహర్షిప్రోక్తమగు లలితాస్తవరత్నమునందును, 'కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ', నాభ్యాలవాలరోమాళి లతాఫలకుచద్వయా' యని

లలితాసహస్రనామస్తోత్రమునందును జూపట్టుచున్నవి. ఇంకను బెక్కులుదాహరణములు చూపవచ్చు.

ఈ కావ్యమునందు 1–56 'అళినీలాలక...' 4–18 'వదలిన నీవిబంధముల - - -' అను నీ రెండు పద్యములయందు రతిప్రస్తావంబు గావింపఁబడియున్నది.

వీనింగూర్చి—

'రతిశ్రమ స్వేదవినాశహేతు, ర్నవోదభారానయనేవ హేతుః
సమారుతస్స్యా ద్యది చారుగాత్రి, న మేఘకాలో మమ వల్లభ స్స్యాత్'
'ఏవం విశేషు ప్రియసంగమేషు, రతావసానే యదుపైతి వాయుః
'రతిశ్రమస్వేదహర స్సుగంధి, స్తతః పరం కిం సుఖ మస్తి లోకే'
'ఉమా స్తనద్వంద్వసమర్పితానన, స్తయాసమాశ్లిష్యనిపీడితాధరః
ఘర్మాంబువిక్షాళితచంద్రశేఖర, స్తాంచాపివీక్ష్య బహుళ స్తదా శివః'

అని హరివంశమునందు వ్యాసుఁడు వర్ణించియుండుటచేఁ దిమ్మకవియుఁ బైకనిన చొప్పున వర్ణించుట యనుచితము కాదని సమాధానము చెప్పనగుంగాని మఱియొకచోటను నిట్టి రతిప్రస్తావమే లేనియీకావ్యమున నివియు లేకుండిన లెస్సగా నుండు నని చెప్పవలసియుండు. పరికింపఁగా నివియు రతిక్రీడావర్ణనములు కావు. వీనిలో మొదటి పద్యమునందు రత్యుత్సాహజనకం బగుననియు రెండవ దానియందు రతిక్రీడానంతరకాలీననారీశరీరపరిదృశ్యమానలక్షణంబులును గవి వర్ణించెను గాని కేవలరతిక్రీడావర్ణనంబుల నెంతమాత్రమును జేయఁడయ్యె. అట్టి యసహ్యము లగు శృంగారవర్ణనము లాంధ్ర మహాకావ్యములలోఁ బ్రాయికముగా నన్నిటియందును గాంచనగు.

'సహసానఖంపచ.........' మనుచరిత్రము (3–116);
'నెలఁతను త్రిపుసబ్బ.........' వసుచరిత్రము (6-91);
'జారు కెఱుంగని.........' కళాపూర్ణోదయము (3–38);
'మఱియుఁ గపోలచుంబన...' ప్రభావతీప్రద్యుమ్నము. (5–44)
'కరలతలందంద...' కుమారసంభవము (9_343)
'తెమలించి కురులొయ్య......' ఉత్తరహరివంశము (5–195);
ఇట్టి వెన్నేనియుఁ గలవు.

ఇట్టివర్ణనలు పారిజాతాపహరణములో లేమి గొప్పసుగుణము.

(3) సాధారణముగాఁ గావ్యములలో స్త్రీవిరహమును వర్ణించునపుడు విరహిణి చంద్రమన్మథమారుతాద్యుపాలంభనము సేయునట్లు కవులు వర్ణింతురు.

'త్రిపురసంహార మొనరించునపుడు హరుఁడు
బండిగల్లుగ నీమేను గండిఁ జేసె
నదియు సెలవాఱి తెగటాఱ నైతి చంద్ర
యకట రోహిణివలనిపథ్యమునఁ జేసి'—అని మనుచరిత్రము—ఆ. 3

ఇట్టియుపాలంభనములు స్వభావవిరుద్ధము లయ్యు రసపుష్టికని వీనిని వర్ణించినను నొకటి రెండున్నఁ జాలుఁగాని పెక్కుపద్యములు వ్రాసిన నవి వెగటు పుట్టించు. ఈ కావ్యమున నట్టియుపాలంభనములకుఁ గవి ప్రసక్తి గలిగించుకొనఁడయ్యె.

(4) ఇందలి సంస్కృతపదములు సుప్రసిద్ధ గీర్వాణ మహాకవులు వాడిన ప్రశస్త శబ్దములుగాని కేవలనిఘంటుమాత్రగోచరము లగు నప్రసిద్ధ శబ్దములు కావు. శ్రుతికటువులగు పదము లిందు లేవు.

(5) ఆంధ్రపదములు జాత్యములును లోకవ్యవహారసిద్ధములై తద్దయు ముద్దులు గురియుచుండు. ఓ లెమ్మ, అమ్మా యేమనిచెప్పుదు, ఎంతకు లేదు, ముల్లోకముఁ దానయేలుగతి, కన్నులు గప్పుకొనంగ, వారు నమం దలలెత్తిచూడఁగా, సన్నలఁజాయలంబలుక సైతునె, ప్రాణము లెంత తీపొకో, ఇంతగా నోచితి, పూసలలో దారంబు మాడ్కి, అనఁగి పెనఁగి, కలసి మెలసి, కూడిమాడి, దీనికంచ మొకయించుక చూచెద, పలుకులఁ దేనె లుట్టిపడ, కల్లఁదనంబు, నీవు పుట్టఁగాఁబుట్టినది, మాయలు నీకు వెన్నతోఁ బెట్టినవి. ఇట్టి చమత్కార జనకములగు మధురరసములు గురియు జాతీయయములు సరసుల మానసంబులఁ గరఁగించునని చెప్పవలయునే.

(6) ఈ కావ్యమున నందందు ధ్వనులు గోచరించుచున్నను గృతిపతిస్తుతులగు నాశ్వాసాద్యంతపద్యములలోను గావ్యవర్ణితాంశములను సూచించు ధ్వనులు గోచరించుచునికి రసజ్ఞుల కానందకరమై యొప్పారు. ధ్వనిప్రాచుర్యవిలసితమగుటచే నిదియుత్తమకావ్యము.

ఇంక మనుజగుణవర్ణనముం గూర్చి యుపన్యసించెద.

ఇక్కావ్యంబునఁ బాత్రగుణములను రసము లొలుక ముద్దులు గులుక స్వభావానుసారంబుగాఁ దేటమాటలతోను రమణీయము లగు జాతీయములతోను నందితిమ్మకవి యింపముగా వర్ణించియున్నాఁడు. అవి చదువునప్పుడు చదువరులు నా పాత్రగణముతోఁ బ్రత్యక్షముగాఁ గలసి మెలసి యున్నట్లు తలంచుచు నాయా భావంబులను జెందుచు నానందింతురు.

పారిజాతాపహరణకావ్యంబున వర్ణింపఁబడినవారలు నారదుఁడు, కృష్ణుఁడు, సత్యభామ, రుక్మిణి, దేవేంద్రుఁడు నను నేవురు. వీరిలోఁ బ్రధానులు నారదుఁడును సత్యభామయుఁ గృష్ణుఁడును. వీరలగుణంబుల నెట్టివని కవివర్ణించుచుఁ జదువరులకుఁ జవు లొదవించునో యించుక యరయుదము.

నారదుఁడు.

ఈ కావ్యమందలికథకు మూలకందము నారదమహాముని. రుక్మిణీదేవిగృహంబునఁ గృష్ణుఁ డున్నసమయమున నిమ్మునిచంద్రుఁ డందుల కరుదెంచి యొకపారిజాతకుసుమంబు నొసంగుటయే యీ కథకు బీజావాప మయ్యెను. అతఁ డన్నళినాక్షుని సన్నిధికి రాకున్నను వచ్చినను బూవు నొసంగకున్నను నిచ్చినను రెండుపూవులనిచ్చినను నతఁడు తెచ్చిన దొకపూవే యైనచో దానిం గృష్ణుం డేకాంతచింతను లేక యేకాంతమున నున్నపు డిచ్చినను బారిజాతాపహరణవృత్తాంతమునకుఁ బ్రసక్తియే యొనరియుండదు. ఆంధ్రలోకంబున కిమ్మహాకావ్యంబును లభించియుండదు. ఈవిషయంబున నారదుని యుద్దేశములు నాలుగు. 'చక్కనిదాననంచు నెలజవ్వనినంచు జగంబులోనఁ జేరెక్కినదాననంచుఁ బతి యెంతయు నాకనురక్తుఁడంచుఁ దా నిక్కుచు విఱ్ఱవీఁగుచుఁ గాంతల గణింప' కున్న సత్యభామ కించుక యహంభావశాంతి యొదవించుట ముఖ్యోద్దేశము. ఇది కృష్ణునికిని హృదయకుహరాంతరమున నొక్కింతసమ్మతమే యై యుండనోపు. ఈ దంపతులకుఁ బ్రణయకలహము గలిగించి వేడుక చూచి సంతసించుటయు నింద్రుని కించుకపరాభవము గలిగించుటయు రుక్మిణీదేవికిని నత్యల్పముగాఁ బ్రాభవహాని యొదవించుటయు గలహాశనుఁ డగు నమ్మునినాథునికి బెఱతలంపులు గానోపు.

పారిజాతకుసుమం బొకటిని నారదుఁడు కృష్ణున కిచ్చిన దానిని సత్యభామకుఁ బంపునా రుక్మిణి కిత్తునా యని తనమనంబున నరియాడుచుండ రుక్మిణి కిమ్మని నారదుఁడు కన్నుసన్నచేసి దాని నిప్పించె. సత్యభామ కసూయవొడముట కిదియే చాలదా. ఆయసూయ పెనుంగువడక యగ్గలం బగుటకై నారదుఁ డాకుసుమము నుద్దేశించి రుక్మిణితో నిది పారిజాతప్రసూనంబు నరులకు ధరియింప నరిది సూవె పౌలోమి పార్వతి పద్మపద్మజురాణియును ననుదినంబు శిరంబునఁ దాల్తురనియుఁ బరిమళము సెడదు వాడదనియుఁ గోరినవాని నెల్ల నొడఁగూర్చుననియుఁ బొగడెను. అంతియకాక యీపువ్వును గృష్ణుఁ డితరసతుల కియ్యక నీకిచ్చుటచే నతనికి నీవే యత్యంతప్రేమపాత్రమవగుట తెల్లమయ్యెననియు నింతట నీసవతులందఱును నీకు విధేయురాండ్రై నీ సరణసారసయుగ్మము లాశ్రయింపఁగలరనియు నీకాంతుఁడు నీమాటజవదాఁటక వశంవదుఁడై యుండఁగలఁడనియు నద్దేవి నిభూషించెను. ఇంతమాత్రమును జాలదనియు నింకను ముడిచిటవుగాఁ బడవలయు

ననియు నెంచి సత్యభామ పేరెత్తి యామె యిందాఁక కన్ను మిన్ను గానక విఱ్ఱవీఁగుచు సవతులను పరకసేయుచుండెనే. రుక్మిణీ యిప్పటి నీమహిమ సూచినబోటులు లామెతో విన్నవింప నామె ప్రాభవం బంతయు నంతమై డెందంబునఁ గుందచుండునే యని సత్యభామను దూషించెను. 'నీమహిమ సూచినబోటులు విన్నవించిన' నని నారదుఁడు చెప్పవలయునే. అట్లు చెప్పకున్నను బోటులు విన్నవింపక మిన్నకుందురా. అయినను నొక వేళ చెప్పకతప్పుదుగో యనియుఁ జెప్పకున్నఁ దా నెంచినకార్యము తప్పు ననియుఁ దలఁచి యట్లు హెచ్చరికచేసెను. అంత నక్కాంతమానసంబున మానానలంబు దరికొని మండఁదొడంగె. తన తలంచినపని నెఱవేఱె. ఇఁక జరుగవలసినపనులకై యాదంపతులను వదలి తాఁ బ్రద్యుమ్ననిసేవలు గైకొనుచు మున్నీటికిఁ జని మాధ్యందినకృత్యము లాచరించుచుండె.

ఇక్కడ సత్యభామ హృదయంబున రవుల్కొనియెరియు కోపాగ్నిం జల్లార్పఁ గృష్ణునికి భగీరథప్రయత్నము సేయవలసివచ్చెను. తుదకు నెన్నియో పాటులు పడి యెట్లొకో యామెకు మనశ్శాంతి యొనవించె. వారు సమాధానపడినతోడనే నారదుఁ డచ్చటఁ బ్రత్యక్షుఁడై యొక చిన్నముడి పెట్టె. వారితోడ భుజియించి కూర్చుండి సత్యభామను జూచి 'పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసంతతి నిన్నుం గొనియాడఁగా సవతికాంత లూనిలజ్జింపఁగా నతులప్రాభవవైభవోన్నతులప్రోవై' నీవు వర్తించుచున్నదానవే యని యామెను గొండపైనుంచి పొగడి 'యనికైన నీపతినిన్నుఁబాసి చనునో' యని పలికి పారిజాతమహీరుహాహరణమునకై సురపురంబున కరుగునపుడు కృష్ణుఁ డామెనుం దోడ్కొని చనునట్లు పురికొల్పి కృష్ణునిసందేశమును నింద్రునితోఁ జెప్ప నరిగెను. ఇమ్మహామునిసమయోచితకార్యసమాచరణనైపుణ్యం బగణ్యంబు. ఇంతటితో నైనను నీప్రకరణమున నారదునిపని తుదముట్టినదికాదు. మురవైరి బలవైరితో నాలంబుచేసి యతని నోడించుటయు నితనికి సంతోషావహమే. కృష్ణుఁడు పారిజాతవృక్షమును ద్వారకాపురికిఁ దెచ్చి సత్యభామాగృహంబున నాటించినపదంపడి వెండియు నిమ్మునిసత్తముఁడు వారిచెంగటికి విజయంచేసెను. ఇంకను నతనికిఁ గృత్య మొండు గలదు. అమ్మహర్షి సత్యభామంగని 'హేమనిభగాత్రి నీభాగ్య మేమి చెప్ప జిష్ణుభూజంబు నీ పెట్టుఁజెట్టు చేసి సవతులన కాదు త్రిభువనేశ్వరి యనంగఁ బొలుచు పౌలోమి గెలిచితి వలఘుమహిమ' నని కీర్తించి యంతటితోఁ బోక 'యతులితతావకీన మహిమాతిశయోచిత మైనపుణ్యకవ్రత మొనరింపఁగావలయు' నని తద్విధానంబుఁ దెలిపి యావ్రతం బాసతీమణిచేఁ జేయించె. తద్వ్రతాంగంబుగా నప్పారిజాతనగంబును గృష్ణసహితంబుగా సత్యభామ దానం బొసంగఁ దాను గైకొని కృష్ణునిపైఁ దనకత్తఱిఁ గలిగిన స్వామిభావంబును నెఱపుచు వేడ్క సేయఁ దలంచి తనవీణాద్యుపకరణముల నతనిచే

మోయించి సొమ్ము సొమ్మని యంతం డొక కొంత పోవఁ బోవ రమ్ము రమ్మని మరలఁ జేరంగఁ బిలిచి వినోదంబులు సలిపి కృతార్థుఁ డయ్యె.

నారదుఁడు దేవర్షి శ్రేష్ఠుఁడు. సాక్షాద్బ్రహ్మమానసపుత్త్రుఁడు. సంతత విష్ణుభజనైకశీలుఁ డగుపరమభాగవతోత్తముఁడు. అట్టిమహనీయుఁడు కలహప్రియుం డెట్లయ్యెనో యని యందఱకును సందియంబు గలుగనోపు. నిక్కముగ నమ్మహర్షి సత్త్వమూఁడితరులకుఁ గావలయునని కలహములఁ బొసఁగించి వేడుకఁ జూచువాఁడుకాఁడు. అయినను జనులకుఁ గర్మవశంబున నేయేఫలంబులు సంప్రాప్తములు కాఁగలవో వానిం బాపియుట కనురూపము లగుకార్యములం బ్రవర్తింపఁజేయునటు లామునీంద్రుఁడు జనుల కుత్సాహంబుఁ గల్పించు నని యెఱుంగనగు. అట్లు చేయుట కలహంబులపగిదిం గానంబడును. కాని యది లోకోపకారార్థ మనియే యెన్నందగు.

దేవేంద్రుఁడు.

దేవేంద్రుని గుణముల నరయుదము. ఇతఁడు శుష్కప్రతాపోక్తులు వచియించువాఁడు. పారిజాతవృక్షమును భగవంతుఁ డగు శ్రీకృష్ణుఁడు పెకలించికొని పోవఁ బూనుట యెఱింగి 'రౌద్రాకారుఁడై పేర్చి యేమేమీ కృష్ణుఁడు మందలోఁబలెనె తానింద్రపద్రుమోత్పాటనంబీమై నిచ్చటఁ జూపవచ్చె నిదిమే శేతార్క్ష్యుఁడైన నస్మదీయామోఘాశనిపాత మిట్టిదని యాహా తెల్పెదఁ గాంచుమీ' యని వీరాలాపంబులు పలికి నిజసతి యగు శచీదేవిం జూచి నీవింతమాత్రన విన్నంబడనేల. ఇదె సత్యభామగర్వమును బారిజాతభూరుహంబును విడిపించివచ్చి నీకు మనఃప్రియంబు గావింతు నని వనితాసముత్కంఠంబున నుత్తరకుమారప్రతాపములు వచియించె. కాని కృష్ణునితో యుద్ధముచేయునపు డీ శూరత్వము లెందుఁ బోయెనో. తనవజ్రాయుధమును గమలనాభుం డొడిసిపట్టుకొనఁ గా నింద్రుఁడు భయకంపితుఁడై సిగ్గువోడమ నద్దేవదేవునిచరణంబులవ్రాలి నమస్కరించి యేనొనపరాధిని గావుమాయని వేడుకొనియె. అబ్బినచోఁ దలయు నబ్బకున్నఁ గాళ్లును బట్టుకొనుట యితనిగుణము. కృష్ణుఁడు పారిజాతద్రుమంబును బుచ్చుకొనుమని దాని నియ్యఁ బూనిన నింద్రుఁడు 'సొమ్మన నెద్ది యే ననఁగ సొమ్మన కెవ్వఁడు గర్త వీవు నీసొమ్మ యీ ప్రపంచమును' నని వేదాంతోపన్యాసము చేసి నీవు ధరణియందుండునంతదాఁక నీ భూరుహమును నుంచుకొనుమని మహోదాత్తకరణిం బలికె. ఇతఁడు సమయానుగుణంబుగాఁ బ్రవర్తించుచు నేగాలికాచాప యెత్తువాఁడనుట కివి నిదర్శనములు.

రుక్మిణి.

రుక్మిణీదేవి దెసను నారీజనసహజగుణంబు లొకకొన్ని చూపట్టెడు. వానిలో నసూయయు గర్వమును బ్రధానములు. సవతులందఱిలోను సత్యభామపై నిద్దేవిమనంబున

నీసు సందడించుచు నేయుండెను. సత్యభామకును రుక్మిణిపైనసూయ నిరంతరము హృదయాంతరమున నెలకొనియుండె. దీనిని సకారణంబుగ మనోహరంబుగా మనకవి

‘ కులమును రూపము న్మగనికూరిమియుం గలదాననంచు నీ
వల నల రుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా రవరవల్వొడమె న్మది వారి కెంతయుక్.’

—అని వర్ణించెను.

రుక్మిణి కెట్లు ప్రాభవహానివాటిల్లెనో కను గొందము. ‘వెలఁదులు పదియాఱువేవురలో నెన్న సరిలేదు సౌభాగ్యగరిమ నీకు’ననియు, నీ వీకుసుమంబు దాల్చుటచే ‘సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము లాశ్రయింతు’రనియు మునీంద్రుఁడు తన్ను వినుతింప వీనుల విందుగా విని మనంబునఁ బొంగుచుండిన రుక్మిణి యిప్పుడు పారిజాతద్రుమంబు నే నాకబునుండి తెచ్చి కృష్ణుఁడు తన పెరటిచెట్టుగా నాటింప నపరిమితప్రమోదరసంబునఁ దేలియాడు సత్య విభవముగాంచి మనంబున నీసుచెందకున్నే. అంతియకాక సత్యభామ చేయు పుణ్యకవ్రతముఁ గనుఁగొనుటకై సవతుల నందఱ నామతింపఁ దాను వచ్చుట కిష్టములేకున్నను ‘సతులు పదాఱువేవురును సంగడి రా వదనాంబుజంబునం గృతకవికాసముప్పడ రాఁ దగవౌ నని కమలరాగమణీ శిబికాధిరూఢయై’ వచ్చెను. అత్తన్వి యుదాత్తచిత్త యగుటం జేసి తనయాంతరంగిక భావంబును వెలుపటికిఁ గానరానీయక గాంభీర్యంబున నందఱిచందంబున వచ్చిన ట్లితరులకుఁ దోఁపఁ జేసెఁగాని మనంబున నామహిమ యిట్లయ్యెనే యనుమనస్తాపంబు సందడించుచు నేయుండె. ఇది నారీజనంబులకు సహజగుణము.

సత్యభామ

సత్యభామగుణాతిశయంబుల విచారింతము. ఈకావ్యమునఁ గథానాయిక సత్యభామ. ఆ రమణీమణిగుణములను గార్యములను నీకవికులతిలకుఁ డెంతయు మనోజ్ఞముగా వర్ణించి లోకంబున స్త్రీలస్వభావగుణంబులను మధురముగాఁ జిత్రించి యున్నాఁడు. పారిజాతకుసుమంబును దన కియ్యక తనమగఁడు తనసవతియగు రుక్మిణికి నిచ్చిన మానవతియగు నమ్మానిని సైరించునా. అద్దేవిబోటి సంభ్రమంబునఁ గనుగవ నెఱసంజవోడముఁగా వచ్చి యేమో మహాపద సంభవించినటు ‘లమ్మ యేమని చెప్పుదు’ నన్నపుడే యన్నెలఁత గుండియ ఝల్లనియె. కుసుమవృత్తాంతము విన్నంతన తనమనంబున నగ్గి దరికొనుడు దిగ్గన లేచి యిట్లు పలవించె. ఆహా నాప్రాణమైన మగఁ డిట్లయిన నామనం బెరియఁడే. అవ్విరి నవ్వనజాక్షుఁడు తనకుఁ బ్రియంబు గల్గునెడ కర్పణచేసినఁ జేయుఁగాక. నన్నామునినాథుఁడు తూలనాడనేల. కలహమే కల్యాణమని జగంబుల

వెంట మెలఁగెడు మానికి నన్ను దూఱుట సహజముగుంగాని నాపతి వంచని యతనిని వారిం పవలదా. తరుణుల తెగులములు నమ్మఁదగవని పురుషులందురుగాని నిజముగాఁ బురుషులే శరదంబుదచలచిత్తులు కావున వారిని నమ్మఁబోలునే. అని పనవిపనవి వెండియు శోకం బగ్గలం బగుడుఁ దన కిప్పుడు వాటిల్లిన యవమానమును దొల్లిటి మేలిమియుం దలంచి

‘ఇన్నిదినంబులు న్సవతు లింవజేలోఁగడు గారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగనుండి యా
వన్నెయు వాసియుం దఱఁగి వారు ననం దల లెత్తిచూడఁగా
సన్నలఁ జాయలం బలుకనైతును ప్రాణము లెంతతీపొకో’

యనియు నిట్టిమాటలు చెవుల న్వినఁబడియుఁ ‘బ్రాణము దాల్చెదమేన నింతగా నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మియున్నదాలనో’ యనియుఁ బలవించె. మునుపటి తన విభవంబులం దలంచుకొని నామగఁడు కలలోను నామాట జవదాఁటువెఱచునే యేపదార్థం బును నాకొసంగక యొరులకియ్యఁడే యనియు నాతో నతఁడు సలిపిన వేడుక పను లన్నియు రుక్మిణిమాయలకుఁ జిక్కి మఱచెనో మగఁ డింతులకు ధన మిచ్చి పుచ్చుకొన్న నోర్వవచ్చుంగాని చనవిచ్చి పుచ్చుకొన్న నోర్వవచ్చునే యనియుఁ బరిపరివిధంబులఁ బరిత పించి కోపగృహంబునకుఁ జని మాసినచీర కట్టుకొని సొమ్ములూడ్చి పాఱవైచి తలకుఁ బట్టు వెట్టి మంచముపై మేను వైచి ‘గాఢమనోజవిషాదవేదన’చేఁ బొరలుచు ‘మసకపుఁ బాముకాటుగతి మచ్చరమన్విష మగ్గలింపఁగ వెడవెడఁ గన్నుమూయుచుఁ గనువిచ్చుచు నగుచుఁ దలయూఁచుచుఁ బాన్పుపైఁ బడుచు నుసురంచు లేచుచు’ నిప్పగిదిం జెప్పరాని దుర్భరసంతాపానలంబునఁ గ్రాఁగుచుండె. ‘తనకుఁ బ్రియంబు గల్గునెడ కర్పణఁ జేసినఁ జేసెఁగాక’ యని రుక్మిణిపేరుం జెప్పనొల్లక యిట్లు చెప్పుటచే నప్పడఁతి కెంతటి యసూయ యుండెనో తెలియఁదగు.

కృష్ణుండు వచ్చి త న్నెన్నియో విధంబుల మృదువచనంబుల నుపలాలించియుఁ బ్రసన్నురాలుగాకున్న నత్తరుణి చరణంబుల వ్రాలి నమస్కరింప మానక్రోధావేశంబున నతనిశిరంబును వామపాదంబునం దన్నె. ‘రతిచక్రేప్రవృత్తేతు నాస్తి శాస్త్రం న చ క్రమః’ అను ప్రాక్తనసహృదయోక్తిచందంబున నట్టి సమయంబుల నంబుజాక్షులు మర్యాదలు పాటింతురే. పాదాహతిం బొరసి సరసిజాక్షుఁ డన్నలినాక్షితో నింకను సులలితవచనం బుల నాప్రాణమా ప్రణయకోపంబున నీవు తన్నినది నాకు మన్ననయ మెత్తనిచిగురుం బోలుచెన్నగునీ పదము నొచ్చెనో యని చింతిల్లెద నింకనైనను గోపం బుజ్జగింపవే యని బుజ్జగించె. అప్పలుకులు ములుకులై యాశీవిషవిషంబుకంటె హెచ్చుగ నమ్మచ్చెకంటి మానసంబు నేర్పఁదొడంగె. అంత నాయింతిమిన్న ‘మే యఱదోఁపనిక్కి వీడినకచములను

బల్మిని వెడఁదోపుచుఁ బై చెఱంగు గ్రక్కునఁ జనుదోయిఁ జేర్చుచు జంకెన నెఱిమాపు చూచి యీ చందంబున మగనిం బరుసములాడెను. ఈ నయగారపుం బ్రియము లీపసలీ మొగమిచ్చుమాటలేల. నిను నమ్మియుండిన ఫలంబిది తోడనె కల్గె. ననుం జెనకి యాఱడి పెట్టిన నీయానసుమీ. పసులకాపరి భావజమర్మకర్మము లెఱుంగునే. ఇంక నిన్ను నమ్మను. ఈ బొంకులు భవత్ప్రియాంగనయగు రుక్మిణికి రుచించుఁగాని మాకు రుచింపవు. నీవు పుట్టఁగానే కల్లదనంబులు పుట్టె. మాయలు నీకు వెన్నతోఁ బెట్టినవి. నేను పేల తనంబున నిన్ను నమ్మి నా గుట్టును బేజమును బోఁగొట్టుకొంటిని. మునివల్లభుండు నీ ప్రాణవల్లభను బొగడఁగా విని యుల్లసిల్లినవీనుల మా చవిగానిమాటలను వినవలసి వచ్చెనే. ఇఁక నీశమంతకరత్నమును నెవ్వతె ధరింప నోఁచియున్నదో. ఈ రైవతకాద్రి కేళి యేవనితకుఁ బ్రాపించునో. ఈ వసంతారామ కర్పూరకదళికాగారవసతి యేసుద తికిఁ దక్కునో. ఇఁక నన్నియు దిగనాడి యే నెందేనియుఁ జనుదాన. అని కావలసి నంత వడ్డించె. నన్నన్యతఁగాఁ జూచితివని మగని వదల్చె. అంత నక్కాంత దగ్గుత్తికచే మాటలాడఁజాలక క్రొంజివుళులు మెక్కి యెలుంగురాల్పడఁ గోయిలచానక్రోల్చినవిన్న నువున ముద్దుముద్దుగా నేడ్చె. అప్పుడప్పద్మాక్షుండు తగినమంత్రము వేయఁగలఁక దేఱి యత్తరుణి ప్రసన్నచిత్తయయ్యె. నెలంతుక లలంతులం జెనువంతం బొరయుటయు నలం తుల నయాఱుటయు స్వభావగుణంబులు.

సత్యభామ కోపముశమింపఁగానే దానిని నించుకయు మనంబున గణింపక మగనికి మజ్జనాద్యుపచారములు సలుపఁగడంగి తన యుదాత్తగుణంబుఁ జూపెను. మగని కుపచారాదులు సేయుటయే కాక తనయింటి కప్పు డరుదెంచిన నారదమహర్షికి నతఁడంతకు మున్ను తన్ను నిందించినది మదిం దలఁపక యుదారభావంబున నాతిథేయ సత్కృతు లొనరించి భోజనాదివిధులు గావించి ప్రసన్నచిత్తయై యతనిచరణంబులకు నమస్కరించి తదీయాశీర్వాదంబులఁ గైకొనియె. సామాన్యముగాఁ దొయ్యలు లిట్లు చేయుట యరుదు.

మహిళలకు సహజగుణంబగు తాలిమిలేమి సత్యభామయందును గన్పట్టుచున్నది. కృష్ణుఁడు తనదేవేరితో దేవేంద్రుని నందనోద్యానమునందలి వైభవములను వర్ణించి చెప్పుచుండఁగా దాని నర్ధాంగీకారముగా వినుచు నావరవర్ణిని యావర్ణన లెంతసేపటికిని ముగియకున్న నన్నలినాక్షుంజూచి ప్రాణేశ్వరా యేల తామసంబుచేసెదవు. ఈపారి జాతమహీజాతమును గ్రక్కునఁ దెల్లగించి మదీయభవనప్రాంగణంబున నాటించి నీప్రతిన నెఱవేర్పుమాయని త్వరమాణయై పురికొలిపె. తరుణుల కొకవస్తువుపై మనసు పోయెనేని యది చేపడునందాఁక వారికి నిద్దుర పట్టదుకదా.

అయ్యుత్తమాంగన యుదాత్తగుణోత్తరయయ్యు నహంకార మా రమణికి వెన్నతోఁ బెట్టిన దగుటచే నాగుణ మామెను వదలక యప్పుడప్పుడు తలసూపుచునే యుండెను. పారిజాతవృక్షమును బెల్లగించికొని పోవఁబూనిన కృష్ణుని వనపాలకు లధిక్షేపింప నతఁడేమో వచియింపఁబూన నతనిం గరసంజ్ఞను మాన్చి తానే వారితో గర్వోక్తులు పలికినచందముం గనుఁడు.

'వినుఁడు సురేశ్వరు వనపాలకులు వార్ధిఁ బొడమిన యీ దివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక తెక తేర యిదియేమి యొకరిసొమ్మె
యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు నొడియించుకొని యేగుచున్నదానఁ
బలుకు లేటికిఁ దా వీరపత్నియేని, మీశశీదేవి తనదు ప్రాణేశుఁడైన
మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయు, వలన మరలంగఁ గొనుటె పో వాసితనము..

ఔరా సత్యభామగర్వోక్తులు. ఆమె చేసిన హేతువాదము లెంత యుక్తియుక్తములుగా నున్నవో. వారిధియందుఁ బొడమిన పారిజాతనగంబున కింద్రుఁడు నింద్రాణియు నెట్లధిపులైరి. దానితోఁ బుట్టిన లక్ష్మీదేవియుఁ గౌస్తుభమణియు నేప్రభువునకుఁ దక్కెనో యతనికే యీవృక్షమును దక్కవలయునని యుక్తులు నుడివి వాదించె. మదీయ విభునిచే దీనిని నపహరించికొని యరుగుచున్నదానఁ గానఁ నేను వీరపత్ని నగుదును. మీశచీదేవి వీరపత్నియగునేని తనవిభు నిటకుఁ బంపి మరల దానిని నావిభునివలనఁ గొని పోవఁదగును. అని యొషలెఱుంగని యహంభావముతోఁ బలికె. ఓహో! నేనేమఱుపాటున 'నావిభునివలన' నని పైవాక్యమున వ్రాసితి. ఆప్రౌఢాంగన చెప్పినది 'సత్యభామా విధేయువలన' ననియే. ఈమాటలలో నెంతగర్వము కానవచ్చుచున్నది. తాను జెప్పిన ట్లాడువాఁ డని భావము. నిక్కముగాఁ గృష్ణుఁ డమ్మహాదేవి చెప్పిన ట్లంతయు నాడు చుండెను గావున సత్యభామావిధేయుఁ డని తనమగనిని దాఁ జెప్పినది యొప్పే యగుం గాని తప్పు గాదు.

మఱియు నొండొక సందర్భమున సత్యభామాసముచితకార్యసమాచరణంబున నయ్యంబుజానన వినయంబున గర్వప్రాభవంబులు గోచరించెను. పుణ్యకవ్రతపరిసమాప్తి యయిన పిదప నామదవతి కనకపాత్రములం గల్పవగము ప్రొవ్విరులను నించి రుక్మిణీప్రభృతులగు పదియాఱువేవురు సవతులకు వాయనము లిచ్చునపుడును నామె దెస గర్వభావమును రుక్మిణియెడ హృదయతాపంబును సూక్ష్మదృష్టులకుఁ దప్పక గోచరించు.

ఇది యంతయు నిట్లుండ సత్యభామ కొక పెనుమనఃక్షోభ కారణము మహానుభావుఁడగు నారదునిచేఁ గలిగె. వ్రతవిధానమంతయుఁ గ్రమముదప్పకయు నేకొఱం

తయు లేకయు లెస్సగా జరిగినది. అమ్మహోత్సవముఁ జూడవచ్చినవా రెల్లరు మృష్టాన్న భోజనాద్యుపచారగౌరవములువడసి సంతసిల్లిరి. సత్యభామ మనోరథము లన్నియు నీడేరెను. కాని మొదటికి మోసము వచ్చినది. ఈ పుణ్యకవ్రతమును సాకల్యంబుగాఁ జేసినయెడ 'ధనకనకవస్తుసమితియుఁ దనయసమృద్ధియును గల్గి తానుం బతియును మనమున నలఁగలెఱుఁగక యనితరసులభైకసుఖము లందుదు'రని నారదుఁడు సత్యభామతో వ్రతాచరణమునకు ఫలంబుగా మున్నె చెప్పియుండెఁ గదా. ఇప్పుడే మైనది. సత్యభామ పరమోత్సాహ దోహలితాంతరంగ యై మహావిభవంబున నమ్మహావ్రతమును సాకల్యంబుగా ననుష్ఠించి యాగమోక్తంబు గావునఁ దన ప్రాణేశ్వరుని బారిజాతవృక్షముతోఁ జేర్చి కట్టి నారదునికి ధారాపూర్వముగా దానమిచ్చెను. నారదుఁడు కృష్ణునిం దనకింకరునిగాఁ గైకొని నిజస్వామిభావము ననుష్ఠించుచుండఁ గాంచి సత్యభామ యుల్లంబు డిల్లపడియె. ఇంక నేమున్నది. పారిజాతవృక్షమున కాశపడి ప్రాణేశ్వరుని మునివరుని కొసంగి యమ్మగువ వగవఁదొడంగె. ఇఁక మదీయభర్త యొరులయధీనమైనపు డీకల్పవృక్షము నాకేల. ఈవ్రతము నాచరించుట కిదియా ఫలము. నారదుఁడొక్కొక్కటియె నాకుఁ దెచ్చిపెట్టుచున్నాఁడు. దైవమా యేమిసేయుదు. అని మనంబున నుత్తలంపడఁ జొచ్చె. అప్పు డయ్యువిద సవతు లొండొరుల మొగంబులు సూచుచు నిది యేమి యన్యాయము. ఇక్కలికి కొక్కతె కా కృష్ణుఁడు మగఁడు. మనకును మగఁడు కాఁడా. మన మగనిని దానము చేయుటకు దీని కధికార మేమి గలదు. ఈ దాన మెట్లు చెల్లునో చూతము. అని గుజగుజలు వోవుచుండి రేమో. దీని నంతయుఁ గాంచి నారదుఁడు మందహాసాంచితవదనుఁడై సత్యభామతో నిదిగో నీమగని హరిని నిచ్చెదం జేకొనుమని చెప్పె. అప్పలుకు లమృతంపుసోనలై యామెవీనులం బడుటయు నపరిమితప్రమోదభరితాననయై యాత్మభూషణవితానము లన్నియు నత్తపసికి నిష్క్రయంబుగా నిచ్చి తనప్రాణవల్లభుం గైకొనియె. అప్పటి కప్పంకజాక్షి మనంబు కుదుటఁబడియె. నారదుఁడు భగవంతుండగు కృష్ణునిఁ బెక్కుగతుల వినుతించి యరిగినపిమ్మటనే యమ్మించుఁబోణి గట్టెక్కితిఁ గదా యని నిరవధికానందభరితచిత్త యయ్యె. తక్కిన యిందువదన లందఱును డెందంబుల నమందానందంబుఁ జెందిరి.

## శ్రీకృష్ణుఁడు

భగవంతుండగు కృష్ణుఁడు సాక్షాద్విష్ణువే యని యెఱుంగనివారు గలరే. అతఁడు దుష్టనిగ్రహశిష్టపరిపాలనంబునకును ధర్మసంస్థానమునకును భూలోకమున లీలామానుషవిగ్రహుఁడై యవతరించె. మనుజుండై పుట్టినకతంబున 'నతండు మనుజుల ధర్మంబులను నాచారంబులను ననుష్ఠించె. కావుననే మహర్షిపుంగవుం డగు నార

డుఁడు తనయొద్దకు వచ్చిన నతని కెదురుగవచ్చి రుక్మిణీయుతుండై నమస్కృతు లొనర్చి యాతిథ్యంబులు సలిపి మీ రాకచే నేను గృతార్థుఁడ నైతి నని సగౌరవంబుగా నుపచార వచనంబులు పలికె. సత్యభామాగృహంబున భోజనశాల కరుగునపుడు నారదుఁడు మున్నుగా నడువఁ గృష్ణుఁడు సత్యభామాసహితుఁడై యతనిపిఱుంద నడిచె. (2_17) తల్లియగు నదితికి సతీయుతంబుగా నమస్కారంబుగావించె. ఇట్లు కృష్ణుఁడు పూజ్యుల దెస మనుజు లాచరింపవలసినవిధానంబులను స్వానుష్ఠానంబుచే లోకుల కెఱింగించె.

పారిజాతపుష్పంబును దాను రుక్మిణి కిచ్చుట యెఱింగి సత్యభామ కోపావిల చిత్తయై యుత్తలపడుచుండఁగాఁ గృష్ణుఁడు మనమ్మలో నిమ్మగువకుఁ గొండొక గర్వ శాంతి కావలసినదే యని తలఁచియుండునని మున్నె నుడివితిఁగదా. కావుననే యీలలి తాంగివంద మొకయించుక చూచెద నంచు ధూర్తగోపాలుఁ డాదేవిపిఱుందనుండి యొకలోలలోచన వీచుచుండిన వీవనను దాఁ బుచ్చుకొని వీచుచుఁ బారిజాతకుసుమవా సనం బ్రకటించె. ఇది యాసుదతి నెక్కసక్కెము చేయుటయే కదా. ఇఁక నారదమునీం ద్రుఁడు తనచేఁ జేయించినపని తనకును సమ్మతంబనుటకు సందియము కలదే. దీనిం గాంచి యాచంచలాక్షికిఁ గోపశోకంబులు ద్విగుణితంబై తనతో నాబోటి మాటలాడ కుండుటయుఁ దా నేమియు నెఱుంగని నిరపరాధికరణి నారమణితో నయగారపుఁ బలుకులు పలుకఁ దొడంగె. కృష్ణుఁ డప్పుడు చెప్పినమాటలు నంది తిమ్మకవిచంద్రుఁడు చెప్పినయొప్పిదంబున మనము చెప్పలేము. కావున నమ్మహాకవి వలననే యాపలుకుల నాలింతము.

ఇందునిభాస్య మైఁ దొడవు సేల ధరింపవు నున్నగావు లీ
వెందును మానలేవు తెలుపేటికిఁ గట్టితి వీటికారుచు
లెక్కొందలిరాకుమోవిఁ దులకింపఁగఁజేయక యున్కి యేమి నీ
చందము వింతయయ్యెడు నిజంబుగ నాకెఱుఁగంగఁ జెప్పుమా.

మన మరయఁదలంచి యొకమార్గము వన్నితొ నవ్వుటాలకో
నను వెఱపించెదో యకట నాయెడ నిక్కము తప్పు కద్గానో
వనజదళాయతాక్షి పగవాఁడనె నన్నిటు లేల చూడ వొ
క్కనిమిషమైన నీవు దయఁ గద్గొనకుండిన నిల్వనేర్తునే.

ఇవియా కుపితురా లగు సత్యభామను నుపలాలించుమాటలు. ఇవి కడుపు మండించుమాటలని కృష్ణునికిఁ దెలియదా. తెలిసి యాచేడియ నేడ్పించి వేడుకచూడ నల యుననియే కృష్ణుం డిప్పగిదిం బుల్లకుట్టుమాటలు చెప్పెనని యొప్పుకొనఁదగు. ఇప్పలుకు

లప్పుడఁతి కురిసినపుండుల నుప్పు వెట్టినయట్టులును గనగనమండు నగ్నిలో నేయివోసినట్లును నైయా దేవిమనంబును మఱియు దహింపఁ జొచ్చె.

అదియు నెఱుంగని వాఁడపోలెఁ గపటనయనుఁడు వెండియుఁ గాపట్యంబు వహించి

పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁడిది యేమి వాలుగ
న్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొనవేల యురస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌఁగిటఁ జేర్పవేటికే
చిలుకలకొల్కి యెవ్వ రెడచేసిరి నీకిటు లేల చింతిలన్.

ఇదియుఁ జాలదని శపథవచనంబులు నుడువఁ బూని

మనమున మాటలం గ్రియల మన్నన లీనొకనాఁడు నెట్టికా
మినులకు గారవంబు మెరమెచ్చులకై పచరింతుఁగాని పా
యని యనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టునాకు నీ
పనిచినపంపు సేయుటయుఁ బ్రాభవ మాటది నీ వెఱుంగవే.

అనిపలికి యాభామినికిఁ గోపోద్రేకంబును వేయిమడుంగులు హెచ్చు కావించె. పాపము—సత్యభామను గృష్ణుఁ డీలీలఁ గరుణమాలి గేలిసేయుటం జూడ సత్యభామ దెస మనకు జాలి యొదవకుండునే. పుష్పముం దనకొసంగక రుక్మిణి కొసంగుటచేఁ గలిగిన యవమానమునైన నమ్మానవతి సైరింపనోపుంగాని ప్రాణపదమైనతనమగఁడే పైకనిన చందంబునఁ దన్నవమానించినదియకాక యిప్పుడు తన్నునయించువానిపగిదిఁ దేనియ పూసిన విసపు ములుకులం బోని పలుకులు చెప్పి నొప్పించుటను సైరింపఁజాలునే.

అంతటఁ గపటనటనాపరుఁ డగు కృష్ణుఁ డొండొకయుపాయంబు మనంబున నిశ్చయించి దీనివలన నేమి కలుగునో చూతముని దానిఁ బ్రయోగించె. అది చదువరు లెఱుంగుదురు కదా. అటుల కుటిలకుంతలచరణంబులపైఁ దనశిరంబు సోఁక సాఁగిలఁబడి కృష్ణుఁడు నమస్కరించెఁగాని దానివలనఁ జింతితార్థసిద్ధి కాకపోవుటయేకాక నిజశిరంబు తదీయవామపాదాహతిం జెందెనను విశేషఫలంబును బొడమె. దానికి రసికశిఖామణి యగుకృష్ణుఁడు వెనుదీయక నతినిపుణంబుగా

నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగునీపదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానముఁ దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానుపుగదా యికనైన నరాళకుంతలా.

అని పలికె. ఇంతమాత్రమున నాభామినికిఁ గ్రోధశాంతి యొదవునే. వ్యాధికిఁ దగిన మందు నిచ్చినంగదా రోగము కుదురును. ఇందాఁకను గృష్ణుఁడు పన్నిన యన్నియుపాయంబులును విఫలంబులయ్యె. సత్యభామ మగనిం బరుసము లాడఁదొడఁగి తనకడుపులో గ్రిక్కిఱిసిన వెక్కసం బగు మచ్చరంపువిసమును వెడలఁగ్రక్కెను. అతనినిఁ గసిదీఱ యథేష్టముగా నుపాలంభించెను. అంతట గద్గదంబుచే మాటలాడ శక్యము గాక యెలుఁగెత్తి యేడ్వఁదొడంగెను.

ఇఁకఁ గృష్ణుఁడు మిన్నకున్నఁ గార్యము తప్పునని యెంచి రోగనిదానంబు ననుసరించి యుచితౌషధప్రయోగము చేసెను. అటు లేడ్చుచున్న యన్నాతిని వనజాక్షుఁడు దననిండుఁగౌఁగిటం జేరిచి బుజ్జగించి యామెనునుఁజెక్కుల జాఱు కన్నీరు కరంబునం దుడిచి నెయ్యముఁదియ్యము దోఁప నాప్రేయసీ యొకపువ్వుంబునకై యేల యిట్లు పరితపించెదవు. నామాట వినుము. ఇంద్రునితో యుద్ధముచేసియైనను పారిజాతవృక్షము నే తెచ్చి నీయింటి పెరటిచెట్టుగా నాటింతు నిఁక నూఱడిల్లుమా యని యామంత్రము వేసె. వేసినతోడనే రోగము ప్రశాంతం బయ్యె. కృష్ణుఁడు పూనినకార్యమును సాధించి వైదగ్ధ్యంబునఁ జెన్ను మీఱె.

కృష్ణుఁడు రసికశిఖామణి యని నుడివితిమి కదా. అతఁ డమరావతికిఁ బోయినప్పుడు వీథిని వచ్చుచుండఁగా నచ్చటియచ్చరలేమ లతనిం గాంచునప్పుడును వారితో సురతరంగిణియందు జలకేళి సలుపునపుడును దన రసికత్వంబును దేటపఱిచె.

దేవేంద్రుఁడు తన్నెదిరించి యుద్ధము సేయ నతనిని దదీయసేనలతో జయించి యతని వజ్రాయుధము నవలీలం బట్టుకొనిన సిగ్గును భయంబును జెంది పురందరుండు కృష్ణునికి మ్రొక్కి యేనపరాధిం గావుమా యని వేఁడిన గోవిందుఁడు కృపాళుఁడై నీపారిజాతతరువు నిచ్చెదఁ గైకొనుమని పలికి నిజనిరుపమనిరవధికనిర్వ్యాజకరుణారసంబును శరణాగతవత్సలత్వంబును దెల్లంబుచేసె.

నారదమహామునీంద్రుండు కృష్ణుని సపారిజాతంబుగా సత్యభామవలన దానము గొనిన నతనికిఁ గృష్ణుఁడు వశంవదుఁడగుటం జేసి యతఁడు వీణాద్యుపకరణంబులఁ దనపైఁ బెట్టి మోయించిన వానిని సంతసంబునఁ జేకొని యతఁడు పొమ్మపొమ్మని శాసించిన నొకకొంత పోయిపోయి రమ్మరమ్మని చెప్పిన మరలఁ జేరంగవచ్చి తన కింకరత్వంబును నెఱవేర్చురీతిని నిజభక్తపరాధీనత్వముం బ్రకటించె.

ఇటు లాభగవంతుని లీలావినోదంబులవలనఁ దదీయమాహాత్మ్యంబు దేటపడునట్లు కవిశిరోమణి యగు నందితిమ్మన యమ్మహాత్మునిచరితంబును నిపుణముగాఁ జదువరులకుఁ జవు లొదవించునటుల వర్ణించియునికి కరంబు సంస్తవనీయంబు.

ఇందుఁ బుణ్యకవ్రతసమాచరణకథ యప్రసక్తమని కొంద ఱందురు. కాని యది సరికాదు. పారిజాతతరులబ్ధిచే సత్యభామ కొనరిన యుత్తమఫలంబులను నిరూపింపకున్న నది కవిదెసఁ గొఱంతయగు. పారిజాతమహీజాతమాహాత్మ్యం బందఱికిని దెలుపవలసియుండు. తాఁ గోరినవస్తువు చిక్కెఁగదా యని సత్యభామ యుల్లంబున నుబ్బునఁ దేలియాడక యాయన కర్ఘ్యవస్తువునే దానముచేయుట శ్రేయస్కరంబని యామె కెఱింగింపవలసియున్నది. వ్రతాచరణము శుభప్రదంబని జను లెఱుంగవలయు. రుక్మిణీదేవి కించుక ప్రాభవహాని కావలసి యున్నది. కృష్ణునిభక్తపరాధీనత్వంబు జేటపడవలసి యున్నది. ఇటు లీకథను వివరించుటకుఁ బ్రయోజనము లున్నకారణంబున నిది యప్రసక్తమనఁ జనదు. సంస్కృతహరివంశమునం దీకథ యింకను విపులముగా నున్నది.

ఈకావ్యమును రచియించుటయందు నందితిమ్మన మాఘకవికృతశిశుపాలవధమహాకావ్యమును గొన్నిపట్టుల ననుసరించి యున్నాఁడు. నారదునివర్ణన మగు 'సరిగమపదనిస...' అనుపద్యమును శిశుపాలవధకావ్యమందలి

'రణద్భిరాఘట్టనయా నభస్వతః, పృథగ్విభిన్నశ్రుతిమండలైః స్వరైః
స్ఫుటీభవద్గ్రామవిశేషమూర్ఛనా, మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః'

అనుశ్లోకముతోఁ బోల్చిచూడనగు. శిశుపాలవధమునందు దేవీసహచరుఁడై కృష్ణుఁడు యాత్రవెడలెను. పారిజాతాపహరణమునందును సత్యభామాసహితుండై సురపురంబున కేగెను.

ఇట్టికావ్యరత్నమును రచియించి తనకంకితము గావించిన నందితిమ్మనకుఁ బ్రబంధకర్తల నందఱిలోను గృష్ణరాయఁ డుత్తమస్థానము నొసఁగి సంభావింపక మనుచరిత్రరచయితయగు నల్లసానిపెద్దనను నధికునిఁగా గ్రహించి యతని కాంధ్రకవితాపితామహుఁ డను బిరుదమిచ్చి కవిగండపెండేరమును నతనిపాదములందుఁ దొడిగి మనుచరిత్రం బందుకొని పురంబేగింపఁ బల్లకిఁ దాఁజేతఁ బట్టి యెత్తి యెదురైనచోఁ దనమదకరీంద్రము నిల్పి చేయూఁతయిచ్చి యెక్కించుకొని యిక్కరణిం బెక్కుతెఱంగుల నక్కవినాథుని గారవించెఁగాని సరసమసృణవచనరచనాధౌరేయుఁ డగు నందితిమ్మనకుఁ జతురంతయానమహాగ్రహారదానమాత్రసంభావనలు గావించె.

ఈరెండుకావ్యములను నిష్పక్షపాతబుద్ధితో సహృదయులు పోల్చి చూతురేని యెల్లవిధంబులను మనుచరిత్రకంటెను బారిజాతాపహరణమహాకావ్యము కరంబు రసవంతమని గోచరించును. అందు వైస్వైక్యము లేదు. కథానాయకుఁడగు స్వారోచిషమనువు గ్రంథాంతిమ భాగముననే మనకుఁ గన్పడుచున్నాఁడు. వరూథినీప్రవరాఖ్యుల

యుపాఖ్యానము రసవంతమని పలువురు నుతింతురు కాని యది రసాభాసపూరితము. వరూధినీగంధర్వులసమాగమము నీతికి బాహిరము. మృగయావర్ణన మప్రసక్తము. అరుణాస్పదపురవర్ణనమున బ్రాహ్మణాదివర్ణనము లతిశయోక్తులతో నిండియున్నవి. అచ్చటచ్చటఁ గొన్నిపద్యములు పక్కఁ దక్కినవన్నియుఁ గఠినపాకమునఁ గూర్పఁబడినవి. భక్తిరసవర్ణన మల్పము.*

'నవోఽర్థో జాతిరగ్రామ్యా శ్లేషోఽక్లిష్టః స్ఫుటో రసః
వికటాక్షరబంధశ్చ కృత్స్నమేకత్ర దుష్కరమ్'

అను బాణోక్తిలోఁ జెప్పఁబడిన గుణంబు లన్నియుఁ బారిజాతాపహరణకావ్యమునందుఁ గలవు గాని మనుచరిత్రమునందుఁ గన్పట్టవు. మనుచరిత్రము పారిజాతాపహరణముతో నేచందమునను సరిరాదని నిస్సంశయముగాఁ గంఠోక్తిగాఁ జెప్పవచ్చును. ఏవిషయంబునఁ బరికించినను నీరెంటిలోఁ బారిజాతాపహరణమునకే యగ్రస్థానము నొసంగఁదగియున్నది. మనుచరిత్రమును కృష్ణదేవరాయల కంకితముసేయక పెద్దనార్యుఁ డొరుల కంకితము చేసియుండెనేని యేతత్కావ్యద్వయ తారతమ్యవిచారంబున కిచ్చటఁ బ్రసక్తియే యొనరియుండదు. ఆంధ్రభోజుండగు కృష్ణరాయలే యీరెండుకావ్యములకుఁ గృతిపతిత్వమునంగీకరించి యగ్రసమ్మానార్హుం డగు నంది తిమ్మనను బెద్దనకంటెఁ దక్కువగా బహూకరించుట రసికశిఖామణియుఁ బండితుండును గవితాప్రావీణ్యఫణీశుండును నగు కృష్ణరాయని దెస న్యూనతయని చెప్పవలసి యున్నది. దీనికిఁ గారణము లేవియో తెలియరావు. ఏమియున్నను గేవల మేతదుభయకావ్యతారతమ్యమాత్రపరిశీలనము చేయునెడ నంది తిమ్మనకవనంబుపైఁ గృష్ణరాయలకు గౌరవాధిక్యము తప్పకయుండఁ దగు ననియుఁ బెద్దనకంటెఁ దిమ్మనకే యెక్కువ సమ్మానాదులు చేసియుండవలయు ననియు నట్లొనర్పమి యతనిదెసఁ గొఱంత యనియు విబుధవర్యులకు దోఁపకమానదు.

ఇమ్మహాకవీశ్వరుని వచనంబులు నవ్యశిరీషకుసుమకోమలంబులు. మకరందరసాసారమధురంబులు. సకలజనమనోమోదసంధాయక సరసగుణాలంకార విరాజితంబులు. సహృదయహృదయంగమలలితభావగాంభీర్యసురుచిరంబులు. అమృతంపు సోనలు.

---

* దీనియందలి గుణాగుణములను శ్రీయుతులగు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందలి దశమసంపుటమునందు విపులముగా సయుక్తికముగాఁ జర్చించి విమర్శించియున్నారు. వారి యభిప్రాయములతో నేను బూర్ణముగా నేకీభవించెద.

తేనియ తేటలు. ఈ కావ్యమును జదువఁ జదువఁ జవు లూరుచు వెండియుఁ జదువఁ దలంపు గలుగుఁ గాని తనివి యొదవదు.

ఇటు లీ యుత్తమకావ్యమును నిర్మించి రసికుల కమందానందంబు సమకూర్చునంది తిమ్మకవినాథుని కవితాప్రావీణ్యంబు నెంత వినుతించినం జాలదే. ఆంధ్రకావ్యములలోఁ బారిజాతాపహరణ మగ్రస్థానమును వహించి నిచ్చలు నిరుపమానంబై నెగడుఁ గాక.

ఈ వ్యాఖ్యానమును దొలుదొల్తఁ బ్రకటింపఁబూని కడపపురంబున శ్రీ వేంకటేశ్వరాలయంబున 5-2-1928 తేదిని నొక మహాసభం జేర్చి నాదెస ననూనప్రేమాదరంబులు నెఱపి నన్ను గారవించిన మన్మిత్రులు శ్రీయుతులగు జనమంచి శేషాద్రిశర్మగారు, విరూరు పిచ్చయ్యగారు, కురుడి సుందరరావుగారు, కౌకూరు శ్రీనివాసరావుగారు వీరికిని నమ్మహాసభయం దగ్రాసనాధిపత్యంబు వహించి నన్ను బహూకరించిన మన్మిత్రులు కవిసార్వభౌమ బిరుదాంచితులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారికిని నీ వ్యాఖ్యానముంగూర్చి నాకుఁ బలుదెఱంగులఁ దోడ్పాటు గావించిన మదీయ మిత్రులకెల్ల రకును గృతజ్ఞతాతరంగిత హృదయుండనై ధన్యవాదంబులు గావించుచున్నాఁడ.

శ్రీ కృష్ణాయ నమః.

నాగపూడి - కుప్పుస్వామయ్య.

# అ ను బం ధ ము లు

---

(అ) ఈ వ్యాఖ్యానమునందు నేను గావించిన సవరణలు.

(ఆ) నే నంగీకరించిన పాఠములు.

(ఇ) సంస్కృతవ్యాకరణసాధ్యశబ్దములరూపనిష్పత్తులు.

(ఈ) వ్యాఖ్యానమునందుఁ జేర్చుకొనవలసిన యంశములు.

(ఉ) నందితిమ్మన సంస్కృతహరివంశము ననుసరించిన పట్టులు.

(ఊ) సంస్కృతహరివంశమునకును పారిజాతాపహరణమునకును గల కథాభేదములు.

(ఎ) వ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథముల నామములు (సంస్కృతము)

(ఏ) గ్రంథనామములు పేర్కొనఁబడని ప్రమాణములు(సంస్కృతము)

(ఐ) తెలుగుగ్రంథములనామములు.

(ఒ) పద్యానుక్రమణిక.

(ఓ) తప్పొప్పులసూచి.

---

## ఈ కావ్యమునందు నేను గావించిన సవరణలు:—

| ఉన్న పాఠము | సవరణ |
|---|---|
| 1- 28 వరభలు-పరభట | |
| 1- 42 వాసిఁబెనంగఁగ- జెలంగఁగ | |
| 1- 95 పరస్పరావేల్లనములు-పరస్పరా [న్వేషణములు | |
| 1 102 కోపోద్యోగమున-కోపోద్వేగమున | |
| 1-110 నల్గడలు నారసి-నల్గడలుఁ గన్గొని | |
| ,,-,, బాష్పకళికా-బాష్పకణికా | |
| 1-1?6 నడికింపఁడు-నుడికింపఁడు | |
| 1-134 బొగల-బొగుల | |
| 1-138 హృదయారంగన్న యాచార-రజ్య [న్న యాచార | |
| 1-140 రణవీక్షిత-రణవిక్షుత | |
| 2- 15 క్షోభవిభ్రమ-విశ్రమ | |
| ,,-,, సమయనిర్గత-నిర్గమ | |
| 2- 36 నెపంబున-నెవంబున | |
| 2- 39 నేలపురుటింటి-నెలపురుటింటి | |
| 2- 53 బొడమె( న్వేగురుఁజుక్క ) - బొలి [చెఁ | |
| 2- 55 ఫణితులు-భణితులు | |
| 2- 65 స్వాపక్రియాడోలికల్ - క్రియాలో [లికల్ | |

| ఉన్న పాఠము | సవరణ |
|---|---|
| 2- 7? ధారుణి-ధారిణి | |
| 2- 85 యామికీకృత-కృతి | |
| 3- 38 నొక్కి-దేవతా-నొక్కి-వేదేవతా | |
| ,, శౌండీర్య / శౌండర్య | —శౌండీరు [ణ్ణా |
| 3-41 (యమకామినీ) ధూమోద్గీర్ణ-ధూమో [ద్గీర్ణ | |
| 4- 17 వృత్తి నరుగఁ-వృత్తిఁ దిరుగఁ | |
| 4- 46 రాక్షసాలితిలకాంచద్దీధితిఁ-రాక్ష [సాసిలతికాంచద్దీధితిఁ | |
| 5- 8 నిర్ణిరోధ-నిర్నిరోధ | |
| 5- 64 నాత్మకీయంబైన-నాత్మనీనంబైన | |
| 5- 70 విడంబిత / విడంబిక | —విడంబక |
| 5- 95 శ్రీపరపరపదహృత - శ్రీపరవరపర [హృత | |
| 5- 96 జనికర్మికర్షణా-జనివల్మికక్షపా | |
| 5-104 గోమేధిక-గోమేదక | |

# II

## (ఆ)

### నే నంగీకరించిన పాఠములు:—

(సీ) గుఱుతు గలవి సీతారామాచార్యులు కావించిన సవరణలు.

(వే) ,, వేంకటరాయశాస్త్రులు కావించిన సవరణలు.

(*) ,, నేను గావించిన సవరణలు. తక్కినవి ప్రాచీన పుస్తకములలోని పాఠములు.

ఉన్న పాఠము — సవరణ

*1- 2 ఔపల-ఔఁదల
*1- 7 కాంచెదుర్వసున్- కాంచెఁ దుర్వ
1- 10 ఐంతలు-వ్రంతలు [సున్
*1-26 గాధాధఃకరణ-గాఢాఢఃకరణ
1- 35 నృపవల్లభు-జనవల్లభు
1- 56 వెసఁ జిందు-వెదచిందు
1- 85 ముల్లమాటలుకలహామె-మాటలఁగల
1- 93 తొలుజన్మము-తొలిజన్మము[హామె
1- 94 కూడియాడి-కూడిమాడి
1- 95 చంద్రికావళీ-చంద్రికాకేళి
*1-104 తత్తరంబు-తత్తఱంబు
1-110 బురడింపన్-బురుడింపన్ (సీ)
*1-113 పడఁబెట్టుచు / పడివెట్టుచు } పడిఁగట్టుచు
1-120 పాటలకాంత-పాటలకాంతి
1-122 గసుర్పొడవఁగ-పొడువఁగ (సీ)
1-140 లేపకృత-లేపకృతి
2- 11 వెలిం బొరయ-బొలయ
2- 19 గులుకరింప-గులకరింప
2- 20 చేతులకుఁదార్చు / చేతులకువార్చ } చేతులను వేల్చె (సీ)
*2-36 కజ్జలముల్నవ-కజ్జలపన్నవ
2- 42 గొలపండి-గెలపండి
2- 43 గ్రుచ్చుచో-గూర్చుచో
2- 50 కాజిపువ్వులు-జాజిపువ్వులు (వే)
2- 52 జలపూఁత్ర-జలపోఁత
,, గప్పూరంపుఁగొప్పెల-గుప్పెల

ఉన్న పాఠము — సవరణ

* ,, నవయవంబులపై- నవయవంబులతో
2- 59 వోకాడి-వోనాడి
2- 60 కైకొనె-కైకొన
2- 61 మండలాంత-మండలాంక (వే)
2- 75 అఁటంచు-అటంచు
2- 80 పసిడికాముల-కాముల [ధరము
2- 86 యామరుత్కధరము -యామరుత్త్రా
2- 96 బచ్చికతిండి-బచ్చికఁదిండి (వే)
2-100 చొజ్జ-చోజ
*3- 3 అంతకమున్న-అంతకుమున్న
3- 5 తత్కుశలంబె-తత్కుశలంబు
3- 18 గనుఁగొనుపుం-గనుఁగొనుచుం
3- 19 మౌక్తికాళులన్-మౌక్తికావళుల్
3- 31 పికిలి-పెకలి
*3-32 మానరోరి-మానురోరి
3- 51 పరుసంబు గాఁగ-పరుసంబుగాక
3- 56 గమియుఁగా-గమువఁగా (సీ)
3- 61 మరుప్వృతా-మరుద్వృధా
4- 10 గవుంగిటం-గవుంగిలం (వే)
4- 16 జలములు తారతారక-జలములదార [దారక (సీ)
,, ప్రేంకనమునకు-ప్రేంకనమునన (వే)
4- 17 కందుకాహతి-కర్ణికాహ్వాతి (వే)
4- 20 శీధురసమున్-శీధురసముల్
4- 38 చీకుబండల-జీర్కబండల (సీ)
4- 44 కిన్నరద్వయంబు-ద్వయములు (వే)
4- 49 బీరెండ-బీటెండ (సీ)

4- 56 కుసుమకోమలి-కుసుమకోమల (వే)
4- 64 సంధితాన్న-సందితాన్న
4- 66 (గణయ)కంకణ-కంపణ
4- 72 బట్టకపట్టఁగా-బట్టఁగఁబట్టఁగా
5- 7 యసురాంగములక్ - యసురాంగక
[ముల్
5- 13 శిథిలితానువిద్ధులగు - శిథిలతానువిద్ధు
[లగు
5- 17 నిశామన్యంబు- నిశంమన్యంబు (వే)
5- 20 నానగండ-నానగేడి
5- 28 బోరనం-బోరునం
5- 35 ద్వాదశాత్మప్రఖరతరకరాపమ్యామై-
ద్వాదశాత్మప్రకరఖరకరాప
మ్యామై
5- 36 గేలశతపత్ర-గేలిశతపత్ర
*5-37 (గగ్గులకాండై)రి-గగ్గులకాడైరి
5- 94 మునివర్య-మునివార
F- 96 రాత్రీజ్ఞాచిర-రాత్రీనాంచిత (వే)
,, భామితాక్షు-భామితాబ్జ

# IV

## (ఇ)

## సంస్కృతవ్యాకరణసాధ్యశబ్దములు; వానికి సూత్రసహిత రూపనిష్పత్తి వివరణము:—

**1.** దర్పణాత్ (1-12)

ఆచారార్థే క్విబంతా చ్ఛతృప్రత్యయః—
సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః—అని వార్తికము.

**2.** సుభగంభావుక (1-25)

(సూత్రమ్) కర్తరిభువః ఖిష్ణుచ్ ఖుకఞౌ (3-2-57)
ఆఢ్యాదిషుచ్వ్యర్థేష్వచ్వ్యంతేషు భవతేరేతౌ స్తః - అనాఢ్యఆఢ్యోభవతీతి
ఆఢ్యంభవిష్ణుః - ఆఢ్యంభావుకః - సుభగంభావుకః (అత్రఖుకఞ్).

**3.** కూలముద్రుజ (1-28)

(సూ) ఉదికూలే రుజివహోః (3-2-31)
ఉత్పూర్వాభ్యాంరుజివహిభ్యాం కూలే కర్మణ్యుపపదేఖశ్ స్యాత్ - కూల ముద్రుజతీతి కూల ముద్రుజః- (కూల ముద్వహః)
(సూ) అరుర్ద్విషదజన్తస్యముమ్ (6-3-67) ఇతిముమాగమః.

**4.** ఆముష్యాయణ (1-28)

(సూ) అలుగుత్తరపదే (6-3-1)
(సూ) షష్ఠ్యా ఆక్రోశే (6-3-21)
(వా) ఆముష్యాయణాముష్యపుత్రికాముష్యకులికేతిచ-
అముష్యాపత్యం - ఆముష్యాయణః - నడాదిత్వాత్ఫక్.

**5.** నేదిష్ఠ (1-29)

(సూ) అతిశాయినేతమబిష్ఠనౌ (5-3-55)
(సూ) అంతికబాఢయోర్నేదసాధౌ (5-3-63)

**6.** తుందపరిమృజ (1-29)

(సూ) తుందశోకయోః పరిమృజాపనుదోః (3-2-5)
తుందశోకయోః కర్మణో రుపపదయోః రాభ్యాంకస్స్యాత్ - ఆలస్యసు

ఖాహరణయో రితివ_క్తవ్యం – తుందంపరిమార్ష్టీతి తుందపరిమృజో ఒలసః
(శోకాపనుదః – సుఖస్యాహర్తా)

7. విస్మృమర (1-30)

(సూ) సృఘస్యదఃక్మరచ్ (3-2-160)
సృమరః – ఘస్మరః – అద్మరః

8. జనతా (1-32)

(సూ) తస్యసమూహః (4-2-37)
(సూ) గ్రామజనబంధుసహాయేభ్య_స్తల్ (4-2-43)
గ్రామతా – జనతా – బంధుతా – సహాయతా (సమూహార్థేతల్)

9. వర్ధిష్ణు (1-33)

(సూ) అలంకృఞ్ నిరాకృఞ్ ప్రజనోత్పచోత్పతోన్మదరుచ్యపత్రప వృతువృధు సహచర ఇష్ణుచ్ (3-2-136)
అలంకరిష్ణుః.........వ_ర్తిష్ణుః.........వర్ధిష్ణుః

10. విశ్వజనీన (1-48)

(సూ) ఆత్మన్విశ్వజనభోగో_త్తరపదాత్ఖః (5-1-9)
(సూ) ఆత్మాధ్వానౌఖే (6-4-169)
ఏతౌఖేప్రకృత్యా_స్తః – ఆత్మనేహిత మాత్మనీనం-విశ్వస్మైజనాయ హితం
విశ్వజనీనం – అధ్వనేహితం – అధ్వనీనం.

11. వశంవద (1-65)

(సూ) ప్రియవశేవదఃఖచ్ (3-2-38)
(సూ) అరుర్ద్విషదజ_న్తస్య ముమ్ (6-3-67) ఇతి ముమాగమః.

12. తావకీన (1-67)

(సూ) యుష్మదస్మదోరన్యతరస్యాంఖఞ్చ (4-3-1)
(సూ) తస్మిన్నణిచయుష్మాకాస్మాకౌ (4-3-2)
యౌష్మాకీణః – యౌష్మాకః – ఆస్మాకీనః – ఆస్మాకః
(సూ) తవకమమకావేకవచనే (4-3-3)
ఏకార్థవాచినోర్యుష్మదస్మదో_స్తవకమమకా_స్తః – ఖఞ్యణిచ – తావకీనః,
తావకః; మామకీనః – మామకః.

13. ఆతిథేయ (2-17)

(సూ) పథ్యతిథివసతిస్వపతేర్ఢఞ్ (4-4-104).

పథిసాధు - పాథేయం; అతిథౌసాధు - ఆతిథేయం;

వసనం - వసతిః - తత్రసాధు - వాసతేయీ - రాత్రిః;

స్వాపతేయం - ధనం.

14. అపలితం కరణ (2-34)

(సూ) ఆఢ్యసుభగస్థూలపలితనగ్నాంధప్రియేషు చ్వ్యర్థే ష్వచ్వౌ కృఞః కరణేఖ్యుఞ్ (3-2-56)

ఆఢ్యంకరణ-సుభగంకరణ-పలితంకరణ-అంధంకరణ.

15. అసూర్యంపశ్య (2-69)

(సూ) అసూర్యలలాటయోర్దృశితపోః (3-2-36)

అసూర్యమిత్యసమర్థసమాసః దృశి నానఞస్సంబంధాత్-

సూర్యం నపశ్యం తీత్యసూర్యంపశ్యా రాజదారాః-

లలాటంతపః—సూర్యః.

16. పశ్యతోహర (2-72)

(సూ) అలు గుత్తరపదే (6-3-1)

(సూ) షష్ఠీ చానాదరే (2-3-38)

(వా) వాగ్దిక్పశ్యద్భ్యో యుక్తిదండహరేషు

వాచోయుక్తిః - దిశోదండః - పశ్యతోహరః - (పశ్యంతంజనమనాదృత్య హరతీ త్యర్థః).

17. పాథేయ (2-90)

13-ఆతిథేయ శబ్దవత్.

18. అధ్వనీన (2-93)

10-విశ్వజనీన శబ్దవత్.

19. అష్టాపద (3-41)

(సూ) అష్టనస్సంజ్ఞాయాం (6-3-125); ఇతి దీర్ఘః

అష్టసు లోహేషుపదం ప్రతిష్ఠాయస్యేతి.

**20.** వాసతేయీ (3-41)

13 అతిథేయశబ్దవత్.

**21.** ప్రవాళత్వద (3-41)

1 దర్పణత్ రూపవత్.

**22.** శర్కరిల (3.60)

(సు) దేశేలుబిలచౌ చ (5-2-105)

చాదణ్ మతుప్ చ-సికతాస్సంత్యస్మిన్ దేశే సికతా ;-సికతిలః-
సైకతః-సికతావాన్-ఏవం శర్కరేత్యాది.

**23.** సర్వాంగీణ (4-87).

(సూ) తత్సర్వాదేః పథ్యంగకర్మపత్రపాత్రం వ్యాప్నోతి (5-2-7)

సర్వాదేఃపథ్యాద్యంతాత్ ద్వితీయాంతా త్ఖస్స్యాత్
సర్వపథాన్ వ్యాప్నోతి-సర్వపథీనః-సర్వాంగీణః-సర్వకర్మీణః
సర్వపత్రీణః-సర్వపాత్రీణః.

**24.** పాణింధమ (4-90).

(సూ) ఉగ్రంపశ్యేరమ్మదపాణింధమాశ్చ (3-2-37)

ఏతే నిపాత్యంతే-పాణయోధ్మాయంతేస్మిన్నితి పాణింధ
మోఽధ్వా-అంధకారాద్యావృత ఇత్యర్థః-తత్రహి సర్పాద్యప
నోదనాయపాణయశ్శబ్ద్యంతే.

**25.** భిదేళిమ (4-90)

(సూ) తవ్యత్తవ్యానీయరః (3-1-96)

ధాతో రేతే ప్రత్యయాస్స్యుః

(వా) కేళిమర ఉపసంఖ్యానం.

పచేళిమామాషాః-పక్తవ్యాః; భిదేళిమా స్సరళాః-భేత్తవ్యాః
కర్మణిప్రత్యయః.

**26.** నిశంమన్య (5-17)

(సూ) ఆత్మమానే ఖశ్చ (3-2-83)

స్వకర్మకేమననేవర్తమానాన్మన్యతేః సుపి ఖశ్ స్యాత్ -చాణ్ణినిః-
అనిశాం నిశామితి మన్యతే.

**27.** ఘస్మర (5-22)

7. విస్మృమరశబ్దవత్

**28.** పతయాళు (5-35)

(సూ) స్పృహిగృహిపతిదయి నిద్రా తంద్రాశ్రద్ధాభ్య ఆళుచ్ (3-2-158)
ఆద్యాస్త్రయశ్చురాదా వదంతాః; స్పృహయాళుః-
పతయాళుః-దయాళుః-నిద్రాళుః-తంద్రాళుః-శ్రద్ధాళుః.

**29.** ఆత్మనీన (5-64)

10. విశ్వజనీనశబ్దవత్.

**30.** భంజిత (5-98)

నివృత్తప్రేషణాద్భంజధాతోర్ణిజంతాత్కర్మణి క్తప్రత్యయః.

**31.** వర్తిష్ణు (5-105)

9. వర్ధిష్ణుశబ్దవత్.

**32.** ఏకచ్ఛత్రిత (5-107)

ఏకచ్ఛత్రం-ఇత్యస్మాత్కరోత్యర్థే తత్కరోతి తదాచష్టే ఇతిణిచ్-
తస్మాత్కర్మణి క్తప్రత్యయః.

శ్రీ ర స్తు.

# పారిజాతాపహరణ వ్యాఖ్యలో

ఈ క్రింద వివరింపఁబడిన సవరణలను గావించుకొనునది.

(పుట 26, క. వనితా జనతా......అను పద్యమునందు రెండవపాదమున కర్థ మిట్లు వ్రాసికొనవలయు.

ఘన-మేఘుఁడు; తాపని-తపనుని (అనఁగా సూర్యుని) కొడుకగు కర్ణుఁడు; "భానుర్హంస స్సహస్రాంశు స్తపన స్సవితారవిః" అని యమరుఁడు; తారకాభిక-(నక్షత్రములకు మనోహరుఁడగు) చంద్రుఁడు; "క్రముకః కామయితా భీకః కమనః కామనోఽభికః" అని యమరుఁడు; ద్యుచరగవీ—కామధేనువు; (వీరియొక్క)......... "సజ్జనులు కామధేనువు యొక్క" అనుటను "సజ్జనులు మేఘుఁడు మొదలగు వారియొక్క" అని సవరించికొనఁదగు.

(పుట 142) గజకచ్ఛ.. ...ఘాతుకుండు—దీని వ్యాఖ్యానమున, గజ కచ్ఛప రూపంబులఁ దాల్చియుండిన "క్షత్రియుల నిరువురి" అనుటను "విప్రుల నిరువురి" అని సవరించికొని యీ క్రిందఁ గనిన దానిని జేర్చుకొనునది:—

సంస్కృత భారతమున విభావసుఁడును సుప్రతీకుఁడును దొలి జన్మమున మహర్షులని వ్యాసుఁడు:—

" ఆసీద్విభావసుర్నామ మహర్షిః కోపనోభృశమ్,
భ్రాతాతస్యాను జస్యాసీ త్సుప్రతీకో మహాతపాః. "

మహర్షులు విప్రులుగాను విశ్వామిత్రునింబోలె క్షత్రియులుగాను నుండవచ్చును. తిక్కన సోమయాజి విభావసుఁడును సుప్రతీకుఁడును దొలి జన్మమున మధుకైటభులను దనుజేంద్రులని వ్రాసెను:—

" క. విను మధుకైటభు లనియెడు
దనుజేంద్రులు కచ్ఛపంబు దంతియునై పు
ట్టినవారు తమ్మెఱుంగమిఁ
బెనఁగుదు రొండొరులతోడ భీకరభంగిన్. "

అనుశాసనిక పర్వము. ఆ—1.

(పుట 146) నొగలన్—దీని యర్థమునందు—" కట్టెడు కొయ్యలను " అనుటను " కట్టెడు కొయ్యతో బండిని జేర్చి కట్టెడు నిడుపగు కొయ్యలను " అని సవరింపఁ దగు.

(పుట 172) బాసదప్ప వరగండాంకా!—అనుట కర్థము నిట్లు సవరింపవలయు:—" బాసెదప్పు వరగండాంకా!" అని యుండఁదగు. కృష్ణరాయనికి " భాషగెతప్పువరాయరగండ " అను బిరుదము గలదని యొక శాసనమువలనఁ దెలియవచ్చెడి. దీనికి, ఆడినమాటను దప్పువారిని శిక్షించువాఁడని యర్థము చెప్పవచ్చును.

(పుట 183) 15–వ పద్యము వ్యాఖ్యానమునందు:—

" బొంకెన్ " అని యుండుటచే, " అనృతోదరి " యను పదము సాభిప్రాయము. అని చేర్చుకొనఁదగు.

(పుట 191) 29-వ పద్యము వ్యాఖ్యయందు 5-వ బంతిలో నీ క్రిందఁ గనినదానిని జేర్చుకొనఁదగు:—చిలువ— అనుటకు, "చిలుము+వాయి"—విషము నోటియందుఁ గలది యని యవయవార్థమును జెప్పవచ్చును.

(పుట 234) ఎలదేఁటి దాఁటులో నూనిన......అనుట కీ దిగువఁ గనినటు లర్థము వ్రాసికొని వ్యాఖ్యానమున నున్నదాని నర్థాంతరముగా గ్రహించునది.

ఎలదేఁటిదాఁటు-తుమ్మెదలగుంపు, లోనూనిన దప్పిక-తమలోఁ గలిగిన తృష్ణచేత, మూఁగఁబడి-చుట్టుకొని, ఇచట స్వార్థమునఁ బడ్వను బంధము.

(పుట 252) తామ్రపర్ణిరమై యూప్పిక—అనుట కీ క్రిందఁ గనిన దానిని వ్యాఖ్యయందుఁ జేర్చుకొనఁదగు:—

తామ్రపర్ణినదిలో ముత్యములు పుట్టుట ప్రసిద్ధము. అట్లు వర్ణించుట కవి సమయము.

(పుట 263) 60-వ పద్యము వ్యాఖ్యయందు—ఇంద్రద్రుమ-అను పదమున కర్థమందు "దేవదారు వృక్షమును" అను మాటలకు బదులు "మద్ది మ్రాఁకులను" అని సవరించి వ్రాసికొని 'శ్రీ కృష్ణుని శైశవ క్రీడలలోని యమళార్జున భంజనకథ యిట ననుసంధేయము.' అని చేర్చుకొనవలయు.

(పుట 265) కదనాభిశంసిరమై—దీని యర్థమందు-"యుద్ధమును దెలుపునదిరమై" అనుటను "యుద్ధమును నిందించునదిరమై" అని సవరింపఁదగు.

(పుట 270) మానసవేగ రథ్యమును—దీని యర్థమందు "వేగముగల గుఱ్ఱమును" అనుటను "వేగముగల గుఱ్ఱము గలదియును" అని సవరింపనగు.



కేసరి ముద్రాక్షరశాల, చెన్నపురి.

(ఈ)

వ్యాఖ్యానమున నీక్రిందఁ వివరించినవానిని జేర్చుకొనఁదగు:—

పుస్తకము వచ్చినవెంటనే చదువరు లాయాచోటులలో 'అను' అను సంకేతాక్షరములను వ్రాసికొనినచో వానిం జూచునపు డీసూచికం గాంచి యవ్విశేషాంశములను (ననుబంధములను) జదువుకొనవచ్చును.

1–12–17 వ బంతికిఁ బిమ్మట నీక్రిందఁ గనినదానిని జేర్చుకొనవలయు:

'భద్రాసనము'—అభిషేకోపయోగి పీఠవిశేషము.
"శ్లక్ష్ణం షడంగులోత్సేధం షోడశాంగుళవిస్తృతం
ద్వాదశాంగుళాయామం క్షీరదారు సముద్భవం
పద్మాంకితం భవే ద్భద్రపీఠం స్నపనకర్మణి"

—అని వాస్తుశాస్త్రజ్ఞులు చెప్పియున్నారు.

('ద్వావింశదంగుళాయామం' అని పాఠాంతరము)

'సింహాసనము'—

"రుచిరేణ సువర్ణేన నిర్మితం రత్నరంజితం
అష్టభిస్స్ఫాటికై స్సింహై ర్మూర్ధ్ని తత్సువిరాజితం
అధఃకాంచన విన్యస్తరత్న వేదిత్రయాన్వితం
ఆస్థానమండపే రాజ్ఞాం సింహాసన మిదం పరం"

—అని మానసోల్లాసము.

1–30 (25–5) మరువః (పుం)-స్వార్థేకః-తత్రవృక్షభేదే......స్వల్పపత్రతులస్యాం-జంబీరభేదే-వ్యాఘ్రే-రాహౌ-భయానకేచ-అనితారానాథతర్క-వాచస్పతికృత శబ్దస్తోమమహానిధి యను నిఘంటువునం దున్నది.

ఆప్టేగారి సంస్కృత హూణనిఘంటువునందు:—

మరూవక— (adjective) terrible; formidable;

మరూవకః—a kind of plant; a tiger; Rahu; a variety of lime; a crane;
అని యున్నది.

దీనిచే, మరువకః-మరూవకః— అని రెండురూపములుం గలవని తెలియవచ్చెడు.

1_44 (32_18)

అగ్నిరాపశ్చ వేదాశ్చ సోమసూర్యానిలా స్తథా
సర్వఏవతు విప్రస్య శ్రోత్రే తిష్ఠంతి దక్షిణే. —అనియుఁగలదు.

1_58 (44_4) సౌభాగ్యకరిమణి—సౌభాగ్యము—స్వాధీనభర్తృకత్వము.

1_64 (45_12) తలపూవాడికె—అనఁగా శిరోభూషణముగా నుండుట (వనితలలో శ్రేష్ఠురాలుగా నుండుట) తగ్గక, యనియు నర్థముచెప్పవచ్చును. అప్పు డరసున్న లేదు. ప్రాచీనముద్రితగ్రంథములో నిర్బిందుకముగానే యున్నది.

1_70 (47_8) 'విధికి'—'సర్వధనీ'—ఈపదముల మధ్యమందు 'అసుబ్రతః, అను పదమును జేర్చుకొనఁదగు.

1_71 (47_16) శృంగారవనంబు—'శృంగార' మనఁగా మన్మథోద్భేదమును (మన్మథప్రాదుర్భావమును) బొందినదని యర్థము.

శృణాతిచరమదశాప్రాపణేన హినస్తి కాముకానితి శృంగం మన్మథో
ద్భేదః—(శృ—హింసాయాం) —శృంగమృచ్ఛతి ప్రాప్నోతీతిశృంగారః.

1_91 'ఆనరకాసురదమనుఁడు— ఈవిశేషణము సాభిప్రాయము—నే నతనికా సమయంబునఁ జేసినమేలును దలఁపఁడయ్యెనే యని ధ్వనిస్ఫురించెడు.

1_94 (వ్యాఖ్య 7వ పంక్తిలో)—'సరసము' అను పదమునకుఁ బిదప —'కావున నిట్లు పాఠమును సవరించితి' అని చేర్చుకొనవలయును.

1-112_(63-11) 'కందర్ప' శబ్దనిర్వచనము—

'కందర్పయామీతి మదా జ్జాతమాత్రో జగాదచ
తేనకందర్పనామానం తంచకార చతుర్ముఖః' —ఆని.

**1-131. (68 వ పుట-4 బంతులకుఁ బిదప):—**

'మాన' మనఁగాఁ బ్రియునిచేఁ బ్రేయసికిఁ బాదపతనాదిపూజ చేయించునది యని భోజరాజు చెప్పియున్నాఁడు:—

'మానపూజాయాం' ఇతిధాతోః స్వార్థికణిజంతత్వాత్ ణిచ్ ఘుణిచ మాన ఇతి రూపం—సహిప్రేయాంసమస్యాః పాదపతనాదిపూజాయాం ప్రయోజయతి.
—అని సరస్వతీకంఠాభరణము.

**1-133 (74 వ పుట-వ్యాఖ్యానముకడపట):—**

ఇందు శోకము వర్ణింపఁబడినను నిది కరుణరసము కానేరదు. కరుణరసమునకు స్థాయిభావము శోకము.

ఇష్టనాశాదనిష్టాప్తేః కరుణాఖ్యోరసోభవేత్
శోకోఽత్రస్థాయిభావస్స్యాచ్ఛోచ్యమాలంబనం మతమ్.
—అని సాహిత్యదర్పణము.

ఇచట రతియే స్థాయిభావము-మానముచే దంపతులకుఁ గలిగినయయోగము పునర్యోగపర్యవసాయి కావున నిచట విప్రలంభశృంగారమే రసము.

అప్రాప్తి ర్విప్రలంభస్స్యాద్యూనోర్జాతాభిలాషయోః-(తత్రహేతవఃపంచ)
అయోగో విరహో మానః ప్రవాసశ్శాప ఇత్యపి.

విప్రలంభశృంగారము సంభోగశృంగారమునకుఁ బుష్టికరమని యాలంకారికులు నుడివెదరు:

'నవినావిప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే
కషాయితేహి వస్త్రాదౌ భూయాన్ రాగో వివర్ధతే' —అని

**2-53. 119 వ పుట కడపట:—**

'బంధుశ్చోరసుహృద్వాదీకల్పః ప్రఖ్యః ప్రభస్సమః
దేశీయదేశ్యరిపాప్వభసోదరాద్యా ఇవార్థకాః'
——అని కవికల్పలత.

ఆద్యపదముచే-ఆప్త-సపత్న-సబ్రహ్మచారి- సనాభి - సగంధి - సచ్ఛాయ - సధర్మ- సగర్భ-సతీర్థ-దాయాద-ప్రతిచ్ఛంద-ప్రతిబింబ-అనుబింబ-అనుప్రాస-మొదలగునవియు గ్రాహ్యములు.

**2-53. (125-3):—**

విలాసినీవిలాసులు-విలాసవతులగు యువతులును విలాసవంతులగు యువజనులును;

స్త్రీవిలాసలక్షణము:-

ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః
తాత్కాలికో విశేషోయ స్సవిలాస ఇతీరితః.'

పురుషవిలాసలక్షణము:—

'ధీరసంచారిణీదృష్టిర్గతిర్గోవృషభాంచితా
స్మితపూర్వంతథాలాపో విలాస ఇతికీర్తితః'.
—అని రసార్ణవసుధాకరము.

**2-54. (వ్యాఖ్యానముకడపట):—**

'పూడమెక్' అనియే యన్నియాదర్శములలోను బాఠము కానంబడుచున్నది. అపుడు ప్రాసభంగమగునుగావునఁ 'బొలిచెను'నని సవరించితి: అర్థమును రత్నము ప్రకాశించెనని సరసముగానున్నది. లడలకుఁ బ్రాసమంగీకరింపఁదగినదికాదు.

**2-75 (144 వ పుట 3 వ బంతిలో):—**

జాతులనఁగా మనోరథసిద్ధియని యర్థము చెప్పవచ్చునని ప్రకరణముంబట్టి యూహింపఁదగియున్నది.

**2-88. (157 వ పుటకడపట):—**

'సువర్ణరూప్యతామ్రాశ్మహరితాలమనశ్శిలాః
గైరికాంజనకాశ్మీరలోహసీసాశ్చ హింగులాః
గంధకాభ్రకమిత్యాద్యా ధాతవో గిరిసంభవాః'

—అని గైరికాదిధాతువివరణము.

**2_92_(162_22)** 'లాలసులై'—

'లోలుపో లోలుభో లోలో లాలసో లంపటశ్చ సః'

—అని యాదవనిఘంటువు.

**2-106 (172 వ పుటకడపట)**

'పరాభూతసంక్రందనా'—అనుటచేఁ గృష్ణుఁడు యుద్ధమున దేవేంద్రుని జయించుట ధ్వనించెడు.

**3-59 (230 వ పుటనడుమ)—**

'శరీరమోహితజగద్వామా'—అనుటచేఁ గృష్ణుని జూచి సురపురకామినులు మోహించుట ధ్వనించెడు.

**4-46 (256_26)** 'అసిలతికా'—కత్తిని లతగా వర్ణించుట కవిసమయము. దీనికిఁ బ్రయోగము—

'తత్రచశయనతలనిషణ్ణః క్షితితలోపవిష్టయాశనైశనైరుత్సంగనిహితాసిలతయాఖడ్గవాహిన్యా నవనలినదళకోమలేన కరసంపుటేన సంవాహ్యమానచరణః'

—అని కాదంబరి.

1_70 తే. వారిలోపల.........రూపయౌవనసంపన్నా సౌభాగ్యేన చ గర్వితా. ,,

1_82 చ. అనవిని..............జగ్రాహారోషాకులితేన చేతసా
వహ్నే శ్శిఖాగ్రేరివవర్ధితాననా. ,,

1_84 చ. అతులమహా..........యత్పారిజాతకుసుమం దత్తవాన్నారదస్తవ
తత్కిలేష్టజనేదత్తం త్వయాహంపరివంచితా
స్తోతవ్యాయదితావత్సా నారదేనతవాగ్రతః
దుర్భగోఽయం జనస్తత్రకిమర్థమనుశబ్దితః.
—అధ్యాయము. 126.

1_96 క. అని పగల మిగుల.......దందహ్యమానా జ్వాలనేనవర్ధతా
నేర్ష్యాసముత్థేనగతప్రభేవ
క్రోధాన్వితా క్రోధగృహంవివిక్తం
వివేశతారేవ ఘనం సతోయమ్.
—అ. 124.

1_99 ఉ. మాసినచీర............బద్ధ్వాలలాటేహిమచంద్రశుభ్రం
దుకూలపట్టంప్రియరోషచిహ్నం
పర్యంతదేశం సరసేనదేవీ
లిలేపసాలోలోహితచందనేన
దీర్ఘోపధానేశయనేఽపనీయ
విభూషణాన్యేకనిబద్ధవేణీ. ,,

1_101 చ. వెడవెడకన్ను.......సంస్మృత్యసంస్మృత్య శిరస్సరోషం
ప్రకంపమానాసముపోపవిష్టా
ప్రేష్యామధ్యగతాం క్రోధా
న్నిశ్వసంతీం ముహుర్ముహుః
పునరుత్థాయశయానాత్పతంతీవ పునః పునః.
—అ. 125.

1_107 క. అని యనుమానించుచు..భీతభీతస్సశనకైర్వివేశ యదునందనః
అవకుంఠ్యయదావక్త్రముపధానేన్యవేశయత్. ,,

1_108 ఉ. కొందఱు............ప్రేష్యాజనంసంజ్ఞయాథనాఖ్యేయోస్మీతిసంజ్ఞపక్. ,,

1_109 ఉ. ~~ఈలలితాంగి~~.........గ్రహాయవ్యజనంచైవ స్థిత్వాసపరిపార్శ్వకః
శనై రవాసృజద్వాతం జహాసశనకైరివ. ,,

1—110 ఉ. అంతటఁ బారిజాత....సపారిజాతస్యపుష్పస్య సంస్పర్శేనానువాసితః
బభారభగవాన్గంధం దివ్యం మానుషదుర్లభమ్.
అత్యద్భుతతమంగంధం జిఘ్రిత్వా విస్మయాన్వితా
అపాఙ్గేణోన్ముఖంసత్యా కిమేతదితిచాబ్రవీత్. ,,

1—111 క. తలవాంచిమగుడ......తస్యాఃసుస్రావనేత్రాభ్యాం వారి ప్రణయకోపజం
కుశేశయపలాశాభ్యా మవశ్యాయజలం యథా. ,,

1—115 ఉ. ఇందునిభాస్య......కిమర్థం కౌంశుకంవాసో మహారజనమేవచ
నానుగృహ్ణాసిసుశ్రోణి శుక్లంవాసోనుగృహ్యతే
వాసస్యేతేతవాభీష్టే మహారజనకౌంశుమే
దేవాభిగమనా దూర్ధ్వం శుక్లంనేష్టంహి తేప్రియే
కించానాభరణంగాత్రం సుగాత్రితవకథ్యతామ్. ,,

1—117 చ. పలుకులఁ దేనెలు......కిమునాభాషసేమాద్య ముఖేనోత్పలగంధినా
అర్ధాక్షిపిహి తావన్మాం కిమర్థంన నిరీక్షసే. ,,

1—118 చ. మనముల..........త్వదీయోహంయథాదేవి ఖ్యాతో జగతికింకరః
నాజ్ఞాపయసిమాం కిం త్వంపునేవవరవర్ణిని
మనసాకర్మణావాచా నత్వామతిపరామ్యహం
స్నేహశ్చబహుమానశ్చ త్వయ్యుతేఽన్యాసునాస్తిమే

1—125 ఉ. ఈనయగార......వాఙ్మాత్రమివ పశ్యామి మాధుర్యం సంప్రయుజ్యతే
మయిస్నేహశ్చకృతక స్తవాన్యత్ర నకృత్రిమః. ,,

1—127 ఉ. గట్టిపచేతలుం.......శ్రుతంచాప్యథవాశ్రావ్యం దృష్టః స్నేహఫలోదయః
నాహంత్వాంకితవంధూర్తమజ్ఞాసిష మరిందమ
అద్యజ్ఞాతోసితత్వత్తు శ్చపలోజనవంచకః.
—అ. 126.

1—128 చ. మునిపతివచ్చి........తామస్తౌషీత్సమక్షంతే ప్రియాంస కిలనారదః
తస్యశ్లాఘీచ్చ హృష్టస్త్వం ప్రియాయాస్సంస్తవంకిల.,,

1—129 క. మానంబె తోడవు......మానార్థంజీవ్యతేలోకే సద్భిరిత్యుక్తవానసి
తదేవంసతినేచ్ఛామి జీవితుం మానవర్జితా. ,,

1–130 తే. తనదుకోడండ్ర..... యదద్రాక్షీద్ధిమాంశ్వశ్రూర్బహుమానేన నందినీ
అవజ్ఞాతాత్త్వయా ద్రాక్షీన్నానందౌర్భాగ్యకర్శితామ్

1–131 సీ. ఉవిద యొవ్వతె...... వసంతకుసుమైశ్చిత్రం సదారైవతకం గిరిం
ప్రియాభూత్వా ప్రియాభూతా కథం ద్రక్ష్యామ్యహం
జలక్రీడాంతవాంకస్థా దేవకృత్వామహోదధౌ [పునః
కథం దౌర్భాగ్యమాపన్నా పశ్యేయమపి సాగరమ్. ,,

1–133 ఉ. ఈసునఁ బుట్టి...... ఇతీదముక్త్వా పునరేవ శోభనా
ముమోచితోయం నయనోద్భవం సతీ
గ్రహాయపీతం హరివాససప్రభా
పటాంత మాధాయ ముఖే శుచిస్మితా.

—అ. 125.

1–134 ఉ. ఆరమణీలలామ..... సముత్పత్యజలం తత్ర పతితం వదనాంబుజాత్
ప్రతిజగ్రాహ పద్మాక్షః కరాభ్యామపి సత్వరః. ,,

1–135 ఉ. ఓలలితేంద్రనీల..... పారిజాతస్య పుష్పాణి యదీచ్ఛస్యతి కోపనే
తదాదాతాస్మి సుశ్రోణి సత్యమేతద్బ్రవీమి తే.

—అ. 126.

1–136 తే. వామలోచన....... స్వర్గాదిహానయిత్వాచ పారిజాతం ద్రుమేశ్వరం
గృహే తే స్థాపయిష్యామి యావత్కాలం త్వమిచ్ఛసి.

2–16 క. చనుదెంచె.......... అభ్యాజగామ సస్నాత్వా మునిశ్రేష్ఠో మహోదధౌ. ,,

5–46 మ. బెరసెన్మేన } ...... వృక్షోత్తమం పశ్యతాం వై వృద్ధానాం నాగమజ్జరా
5–47 క. వినసేర్చిరి } ...... యేంధాస్సచక్షుషస్సర్వే సంబభూవుః క్షణాదివ
విరోగా రోగిణశ్చాసన్ ఘ్రాత్వా గంధం వనస్పతేః.

—అ. 134.

5–52 సి. విరివిగా............. మనీషితేన సతరు రల్పో భవతి భారత
మహత్త్వాద్వాసుదేవస్య తదద్భుత మభూన్మహత్
కదాచిద్ద్వారకాం సర్వాం ప్రచ్ఛాదయతి భారత
కదాచిద్ధస్తహార్యస్తు భవత్యంగుష్ఠసన్నిభః. ,,

5–85 క. సత్యముగ............ భోః కేశవ మదీయ స్త్వమద్భర్తాసి సత్యయా
సత్వం మామనుగచ్ఛస్వ కురుష్వ యద్బ్రవీమ్యహమ్.

—అ. 135.

5—౮౬ (సీ. మేళవించినది. అనుపద్యములోని)

తే—హొమ్మ హొమ్మని—.........ప్రథమఃకల్పఇత్యేవ మబ్రవీన్మధుసూదనః
వ్రజంతమనువవ్రాజ నారదంచ జనార్దనః
పరిహాసా౯ బహువిధా౯ కృత్వాము[illegible]
తిష్ఠస్వగచ్ఛామీత్యుక్త్వా పరిహాసవి[illegible]
అపనీయతతఃకంఠా త్పుష్పదామైన [illegible]. ,,

# XVIII

## (ఊ)

## సంస్కృత హరివంశమునకును పారిజాతాపహరణమునకును గల కథాభేదములు :—

(1) సత్యభామనుననునయించుచోఁ గృష్ణుఁడద్దేవితో రుక్మిణిదగ్గఱ నే నవుడుండుటచే దాక్షిణ్యంబునఁ బారిజాతకుసుమంబును నామె కిచ్చితి నిది యొకటే నేను నీకుఁ గావించినయపరాధము. దీనిని క్షమింపవేయని వేఁడుకొనె నని సంస్కృతహరివంశమున నుండఁగా, నంది తిమ్మకవి తనకావ్యంబునఁ గృష్ణుఁడు సత్యభామచరణంబులకుఁ బ్రణమిల్లెననియు నాకోమలాంగి తదీయశిరంబులు వామపాదంబునఁ దొలఁగఁ ద్రోచెననియు వ్రాసెను.

(2) సత్యభామ నేను దపంబుసేయఁబోయెదను; నీకు నాపైఁ బశ్చాత్తాపము గలదేని దీనికనుజ్ఞయిమ్ము; భర్తయనుమతిలేక తనంతట సతిచేయుతపోవ్రతములు నిష్ఫలములు గాన నీయనుమతిఁ గోరెదనని కృష్ణు నడిగినట్లు హరివంశముననున్నది. తెలుఁగున నిట్లు లేదు.

(3) నారదుఁడు సత్యాకృష్ణులను వీడుకొని యరుగునపు డమ్మహేంద్రునితోఁ గృష్ణుఁడు నీవు సురేంద్రునొద్దకుఁబోయి పారిజాతవృక్షమును నేఁగోరితినని చెప్పి దానిని నాతఁ డిచ్చునట్లు సమ్మతింపఁజేయుమనియు నతఁడియ్యనినాఁ డతనియురంబును నాగదతో మోఁదుదుననియుఁ జెప్పుమనఁగా నతఁడప్పగిదిం జెప్పియు నప్పురందరుఁ డొప్పుకొనకున్న నారదునిచే దాని నెఱింగి కృష్ణుఁడు స్వర్గమునకుఁ బోయి యింద్రునితో యుద్ధముచేసి యావృక్షమును దెచ్చెనని హరివంశమున నున్నది. మనకావ్యమునందుఁ గృష్ణుఁడు నారదునితో నే నదితికుండలముల నద్దేవికిచ్చుటకై సురపురంబునకు వచ్చెదనని యింద్రునితోఁ జెప్పుమని చెప్పిన ట్లున్నది.

(4) కృష్ణుఁ డమరావతికిఁబోవునపుడు సత్యభామను దోడ్కొనిపోయినట్లును నింద్రునిచే సత్కృతుఁడైనట్లును నందితిమ్మన చెప్పెను. హరివంశములో నిట్లుకానంబడదు. కృష్ణుఁడు పరమేశ్వరుఁగూర్చి తపంబొనర్చి పారిజాతహరణంబునకై వరంబు వడసినట్లు హరివంశమున నున్నయంశము తెలుఁగున లేదు.

(5) ఇంద్రోపేంద్రులయుద్ధమును గాంచి లోకములు భీతిఁజెంద బ్రహ్మప్రచోదితులై యదితియుఁ గశ్యపుఁడును వారిసమరంబును వారించి రనియు నదితియే పారిజాతవృక్షమును ద్వారకకుఁ దీనికొనిపొమ్మని యనుమతినొసంగఁ గృష్ణుఁడు దానిం దీసికొనిపోయెననియు హరివంశమున నున్నది. తెలుఁగున వ్యత్యస్తముగా నున్నది.

# (౧)

## ఈ వ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథములు:—(సంస్కృతము)

| గ్రంథనామము | పుటసంఖ్య | విభాగసంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| అంగిరస్స్మృతి | 312 | 5 | 59 |
| అనర్ఘ రాఘవము | 161 | 2 | 91 |
| అమరుకము | 69 | 1 | 121 |
| అమరకోశము | 9 | 1 | 9 |
| | 11 | 1 | 12 |
| | 16 | 1 | 19 |
| | 22 | 1 | 26 |
| | 24 | 1 | 29 |
| | 26 | 1 | 32 |
| | 62 | 1 | 109 |
| | 75 | 1 | 135 |
| | 81 | 2 | 1 |
| | 82 | 2 | 2 |
| | 83 | 2 | 8 |
| | 90 | 2 | 20 |
| | 104 | 2 | 42 |
| | 114 | 2 | 51 |
| | 125 | 2 | 53 |
| | 127 | 2 | 55 |
| | 129 | 2 | 59 |
| | 137 | 2 | 68 |
| | 138 | 2 | 68 |
| | 141 | 2 | 71 |
| | 145 | 2 | 79 |
| | 146 | 2 | 82 |
| | 148 | 2 | 85 |
| | 150 | 2 | 86 |
| | 150 | 2 | 87 |
| | 152 | 2 | 88 |
| అమరకోశము | ,, | ,, | ,, |
| | 154 | 2 | 88 |
| | 155 | 2 | ,, |
| | 156 | 2 | ,, |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | 157 | 2 | 88 |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | 161 | 2 | 91 |
| | ,, | ,, | ,, |
| | 163 | 2 | 93 |
| | 165 | 2 | 94 |
| | 168 | 2 | 99 |
| | 172 | 2 | 106 |
| | ,, | ,, | ,, |
| | 175 | 3 | 1 |
| | 178 | 3 | 8 |
| | 180 | 3 | 11 |
| | 186 | 3 | 21 |
| | 191 | 3 | 29 |
| | ,, | 3 | 30 |
| | 201 | 3 | 38 |
| | ,, | ,, | ,, |
| | 203 | 3 | 38 |
| | 204 | 3 | 38 |
| | 207 | 3 | 38 |
| | ,, | ,, | ,, |

## ఈవ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథములు:—(సంస్కృతము)

| గ్రంథనామము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| అమరకోశము | ,, | ,, | ,, |
| | 214 | 3 | 41 |
| | 214 | 3 | 41 |
| | 216 | 3 | 41 |
| | 217 | 3 | 41 |
| | 230 | 3 | 59 |
| | ,, | ,, | ,, |
| | ,, | 3 | 60 |
| | 235 | 4 | 6 |
| | 249 | 4 | 30 |
| | 254 | 4 | 41 |
| | 257 | 4 | 47 |
| | 259 | 4 | 49 |
| | 266 | 4 | 66 |
| | 267 | 4 | ,, |
| | 267 | 4 | 67 |
| | 268 | 4 | 69 |
| | 273 | 4 | 79 |
| | ,, | 4 | 80 |
| | ,, | ,, | ,, |
| | 276 | 4 | 86 |
| | 283 | 5 | 6 |
| | 284 | 5 | 9 |
| | 291 | 5 | 14 |
| | 292 | 5 | 18 |
| | 294 | 5 | 23 |
| | 295 | 5 | 25 |
| | 297 | 5 | 30 |
| | 300 | 5 | 35 |
| | 300 | 5 | 36 |

| గ్రంథనామము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| అమరకోశము | ,, | ,, | ,, |
| | 305 | 5 | 48 |
| | 313 | 5 | 61 |
| | 350 | 5 | 105 |
| ఆశ్చర్యచూడామణి | 214 | 3 | 41 |
| ఆశ్వలాయనస్మృతి | 32 | 1 | 44 |
| | 308 | 5 | 56 |
| ఐతరేయోపనిషత్తు | 327 | 5 | 87 |
| కఠోపనిషత్తు | 311 | 5 | 50 |
| | 327 | 5 | 87 |
| కవికల్పలత | 109 | 2 | 47 |
| | 271 | 4 | 77 |
| కామసూత్రము (వాత్స్యాయనకృతము) | 67 | 1 | 121 |
| ,, జయమంగళుని వ్యాఖ్యానము | ,, | ,, | ,, |
| కాశీఖండము | 138 | 2 | 68 |
| | 308 | 5 | 56 |
| కావ్యచంద్రిక | 7 | 1 | 6 |
| కావ్యప్రకాశిక | 334 | 5 | 87 |
| కావ్యాదర్శము | 33 | 1 | 44 |
| | 61 | 1 | 109 |
| | 115 | 2 | 52 |
| | 119 | 2 | 53 |
| | 120 | 2 | 53 |
| | ,, | ,, | ,, |
| | 334 | 5 | 87 |
| కాళిదాసుని దేవీస్తవము | 97 | 2 | 35 |
| కిరాతార్జునీయము | 334 | 5 | 87 |
| కుమారసంభవము | 69 | 1 | 122 |

## ఈవ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథములు:—(సంస్కృతము)

| గ్రంథనామము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| కుమారసంభవము | 70 | 1 | 123 |
| | 90 | 2 | 20 |
| | 120 | 2 | 53 |
| | 160 | 2 | 90 |
| | 161 | 2 | 91 |
| | 190 | 3 | 27 |
| కృష్ణకర్ణామృతము | 205 | 3 | 38 |
| కేనోపనిషత్తు | 325 | 5 | 87 |
| కౌషీతకిబ్రాహ్మణోపనిషత్తు | 311 | 5 | 59 |
| | 327 | 5 | 87 |
| ఛాందోగ్యోపనిషత్తు | 311 | 5 | 59 |
| | ,, | ,, | ,, |
| | 325 | 5 | 87 |
| | 326 | 5 | 87 |
| తత్త్వరత్నాకరము | 123 | 2 | 53 |
| | 124 | 2 | 53 |
| తైత్తిరీయోపనిషత్తు | 311 | 5 | 59 |
| | 327 | 5 | 87 |
| | ,, | ,, | ,, |
| త్రికాండశేషము | 4 | 1 | 3 |
| | 216 | 3 | 41 |
| దశరూపకము | 54 | 1 | 114 |
| దక్షస్మృతి | 308 | 5 | 56 |
| ద్విరూపనానార్థకోశము | 148 | 2 | 86 |
| ధ్వన్యాలోకము | 3 | 1 | 1 |
| | 336 | 5 | 87 |
| నలోదయము | 161 | 2 | 91 |
| నారదసంగీతశాస్త్రము | 159 | 2 | 89 |
| | 206 | 3 | 38 |
| నారాయణీయము | 297 | 5 | 30 |
| నారాయణీయము | 328 | 5 | 8 |
| నిమిత్తనిదానము | 48 | 1 | 73 |
| నీతిసారము | 331 | 5 | 87 |
| నైషధము | 158 | 2 | 88 |
| పద్మపురాణము | 196 | 3 | 37 |
| పరాశరస్మృతి | 312 | 5 | 59 |
| పాతంజలమహాభాష్యము | 354 | 5 | 109 |
| ప్రతాపరుద్రీయము | 246 | 4 | 22 |
| బృహదారణ్యకోపనిషత్తు | 311 | 5 | 59 |
| | 325 | 5 | 87 |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | 326 | 5 | 87 |
| భగవద్గీత | 140 | 2 | 70 |
| | 310 | 5 | 59 |
| | 325 | 5 | 87 |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | 326 | 5 | 87 |
| | ,, | ,, | ,, |
| | ,, | ,, | ,, |
| | 327 | 5 | 87 |
| | 327 | 5 | 87 |
| | 330 | 5 | 87 |
| | 340 | 5 | 94 |
| | 344 | 5 | 97 |
| భట్టికావ్యము | 350 | 5 | 107 |
| భరతశాస్త్రము | 163 | 2 | 92 |
| భవిష్యత్పురాణము | 297 | 5 | 30 |
| భాగవతము | 36 | 1 | 4[illegible] |

## ఈవ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథములు:—(సంస్కృతము)

| గ్రంథనామము | పుటసంఖ్య | భాగసంఖ్య | పద్యసంఖ్య | గ్రంథనామము | పుటసంఖ్య | భాగసంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| భాగవతము | 206 | 3 | 38 | | 328 | 5 | 87 |
| | 331 | 5 | 87 | ముద్రారాక్షసము | 293 | 5 | 21 |
| | ,, | ,, | ,, | ముహూర్తమార్తండము | 273 | 4 | 79 |
| | 347 | 5 | 101 | మృగవర్మీయము | 164 | 2 | 93 |
| భాగురి | 76 | 1 | 138 | మేఘసందేశము | 194 | 3 | 84 |
| భామతి (వాచస్పతిమిశ్ర) | 310 | 5 | 59 | యాదవనిఘంటువు | 149 | 2 | 86 |
| భామినీవిలాసము | 201 | 3 | 38 | | 160 | 2 | 90 |
| భారతము | 161 | 2 | 91 | యాస్కనిరుక్తము | 310 | 5 | 59 |
| | 188 | 3 | 24 | రఘువంశము | 70 | 1 | 123 |
| | 216 | 3 | 38 | | 120 | 2 | 53 |
| | 310 | 5 | 59 | | 158 | 2 | 88 |
| | 312 | 5 | 59 | | 169 | 2 | 100 |
| | ,, | ,, | ,, | | 184 | 3 | 17 |
| | 328 | 5 | 87 | | 205 | 3 | 38 |
| | 347 | 5 | 101 | | 218 | 3 | 41 |
| భావప్రకాశము | 14 | 1 | 18 | | 249 | 4 | 29 |
| | 29 | 1 | 42 | రత్నశాస్త్రము | 83 | 2 | 8 |
| బృహత్సంహిత | 162 | 2 | 91 | రసార్ణవసుధాకరము | 30 | 1 | 42 |
| మనుస్మృతి | 34 | 1 | 45 | | 39 | 1 | 53 |
| మనోరమ | 47 | 1 | 70 | | 41 | 1 | 56 |
| మాండూక్యోపనిషత్కారిక | | | | | 42 | 1 | 56 |
| (గౌడపాదీయము) | 311 | 5 | 59 | | ,, | ,, | ,, |
| మాఘకావ్యము | 97 | 2 | 35 | | 43 | 1 | 56 |
| | 109 | 2 | 47 | | 65 | 1 | 117 |
| | 119 | 2 | 53 | | 68 | 1 | 121 |
| | 221 | 3 | 45 | | 184 | 3 | 18 |
| | 335 | 5 | 87 | | 319 | 5 | 74 |
| | | | | | 321 | 5 | 73 |
| మార్కండేయపురాణము | 303 | 5 | 56 | రాజపుత్రీయము | 164 | 2 | 93 |
| ముండకోపనిషత్తు | 311 | 5 | 59 | రామాయణము | 50 | 1 | 82 |

## ఈవ్యాఖ్యానమున నుదాహరింపఁబడిన గ్రంథములు:—(సంస్కృతము)

| గ్రంథనామము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య | గ్రంథనామము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| రామాయణము | 57 | 1 | 98 | శ్వేతాశ్వతరోపనిషత్తు | 325 | 5 | 87 |
| | 68 | 1 | 121 | | 326 | 5 | 87 |
| | 187 | 3 | 21 | | ,, | ,, | ,, |
| | 222 | 3 | 46 | | ,, | ,, | ,, |
| లలితాసహస్రనామస్తోత్రము | 202 | 3 | 38 | | 328 | 5 | 87 |
| వసిష్ఠస్మృతి | 310 | 5 | 59 | సరస్వతీకంఠాభరణము | 7 | 1 | 6 |
| విశ్వనిఘంటువు | 110 | 2 | 48 | | 29 | 1 | 40 |
| | 215 | 3 | 41 | సంగీతచూడామణి | 212 | 3 | 41 |
| విష్ణుపురాణము | 297 | 5 | 30 | సాహిత్యదర్పణము | 3 | 1 | 1 |
| | 346 | 5 | 100 | | 64 | 1 | 113 |
| వేదము | 131 | 2 | 60 | | 184 | 3 | 18 |
| | 132 | 2 | 60 | సారస్వతాలంకారము | 354 | 5 | 109 |
| | 161 | 2 | 91 | సౌందర్యలహరి | 119 | 2 | 53 |
| | 188 | 3 | 21 | స్కాందపురాణము | 308 | 5 | 56 |
| | 201 | 3 | 38 | హయశీర్ష పాంచరాత్రము | 290 | 5 | 13 |
| | 231 | 3 | 61 | హరివంశము | 37 | 1 | 49 |
| | 259 | 4 | 49 | | 44 | 1 | 58 |
| | 312 | 5 | 59 | | 285 | 5 | 9 |
| (మంత్రవర్ణము) | 327 | 5 | 87 | | 297 | 5 | 30 |
| శాకుంతలము | 69 | 1 | 121 | | 298 | 5 | 30 |
| | 166 | 2 | 95 | | 307 | 5 | 55 |
| శారదాతిలకము | 31 | 1 | 44 | | 330 | 5 | 87 |
| శారీరకమీమాంసాసూత్రము | 325 | 5 | 87 | హర్ష చరితము—పీఠిక | | | |
| శాశ్వతనిఘంటువు | 156 | 2 | 88 | హలాయుధనిఘంటువు | 218 | 3 | 41 |
| శుద్ధార్థచింతామణి | 312 | 5 | 59 | హఠయోగప్రదీపిక | 202 | 3 | 38 |

### 'ఈ' గుర్తుగల వ్యాఖ్యానానుబంధములోని ప్రమాణములు:—

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| కవికల్పలత | 119 | 2 | 53 | రసార్ణవసుధాకరము | 125 | 2 | 53 |
| కాదంబరి | 256 | 4 | 46 | ,, | ,, | ,, | ,, |
| మానసోల్లాసము | 10 | 1 | 12 | సరస్వతీకంఠాభరణము | 68 | 1 | 131 |
| యాదవనిఘంటువు | 162 | 2 | 92 | సాహిత్యదర్పణము | 74 | 1 | 133 |

# (ఏ)

## గ్రంథనామములు పేర్కొనఁబడని ప్రమాణములు:—(సంస్కృతము)

| సంస్కృతము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| | 2 | 1 | 1 |
| | 12 | 1 | 13 |
| | 21 | 1 | 24 |
| | ,, | ,, | ,, |
| | 23 | 1 | 27 |
| | 29 | 1 | 42 |
| | 31 | 1 | 44 |
| | ,, | ,, | ,, |
| | 32 | ,, | ,, |
| | 35 | 1 | 48 |
| | 39 | 1 | 53 |
| | 41 | 1 | 56 |
| | 46 | 1 | 67 |
| | 60 | 1 | 106 |
| | 62 | 1 | 109 |
| | 67 | 1 | 121 |
| | 68 | 1 | 121 |
| | 76 | 1 | 137 |
| | 97 | 2 | 35 |
| | 113 | 2 | 50 |
| | 123 | 2 | 53 |
| | 130 | 2 | 59 |
| | 140 | 2 | 70 |
| | ,, | ,, | ,, |

| సంస్కృతము | పుటసంఖ్య | ఆశ్వాససంఖ్య | పద్యసంఖ్య |
|---|---|---|---|
| | 163 | 2 | 93 |
| | 165 | 2 | 94 |
| | 178 | 3 | 7 |
| | 181 | 3 | 12 |
| | 182 | 3 | 13 |
| | 183 | 3 | 15 |
| | 184 | 3 | 17 |
| | 186 | 3 | 21 |
| | 188 | 3 | 24 |
| | 225 | 3 | 51 |
| | 236 | 4 | 9 |
| | 272 | 4 | 78 |
| | 309 | 5 | 59 |
| | 312 | 5 | 59 |
| | 313 | 5 | 59 |
| | 316 | 5 | 67 |
| | 317 | 5 | 70 |
| | 324 | 5 | 86 |
| | 329 | 5 | 87 |
| | 338 | 5 | 93 |
| | 343 | 5 | 96 |
| | 345 | 5 | 98 |
| | 346 | 5 | 100 |
| | 347 | 5 | 101 |

### అనుబంధములోనివి

| | | | |
|---|---|---|---|
| | 10 | 1 | 12 |
| | 32 | 1 | 44 |
| | 68 | 1 | 112 |

| | | | |
|---|---|---|---|
| | 74 | 1 | 33 |
| | ,, | ,, | ,, |
| | 157 | 2 | 88 |

# (ఐ)

## తెలుగు గ్రంథములు:—

శ్రీరస్తు

శ్రీ గణాధిపతయే నమః

శ్రీ శారదాంబాయై నమః

# పారిజాతాపహరణము

## పరిమళోల్లాసనామకవ్యాఖ్యానసహితము



## ప్రథమాశ్వాసము



### దేవతాస్తుతి

శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చినయుయ్యెలలీల వైజయం
తీమిళితాచ్ఛకౌస్తుభము నిద్దపుఁగాంతిఁ దనర్చి యూత్మవ
క్షోమణివేదిఁ బొల్పెసఁగఁ జూపఱులపండువు సేయువేంకట
స్వామి కృతార్థుఁ జేయు నరసక్షితినాథునికృష్ణరాయనిన్. 1

### అవతారిక

క. ద్విరదవదను శరజుని సజ,
హరిహర వాణీ రమాంబికాదిత్యుల మ
ద్గురువుల నిరతముఁ గొలిచెదఁ,
బరమ సుఖావాప్తిఁ గోరి భావమునందున్.

ఆంధ్రకవికులతిలకుం డగు ముక్కుతిమ్మనార్యుఁ డను నామాంతరము గల నందితిమ్మకవి సత్కావ్యరచన యనేకశ్రేయస్సాధన మను తలంపున లీలామానుషావతారుం డైన శ్రీకృష్ణస్వామి నిజదేవియగు సత్యభామకుఁ బ్రీతి సేయుటకై స్వర్గలోకమునుండి పారిజాతమును దెచ్చిన చరిత్రను మహాభారతాంతర్గతహరివంశమునను భాగవతమునను నిరూపింపఁబడిన దానిం దెనుఁగు ప్రబంధముగా రచియింపఁబూని యక్కావ్యమున

కాంధ్రభోజుఁ డగు శ్రీకృష్ణరాయనరపతిం గృతిపతింగా నేర్పఱిచి గ్రంథాదియం దాశీర్వాదముగాని యిష్టదేవతానమస్కారముగాని వస్తునిర్దేశముగాని చేయవలయునను విద్వత్కవిసంప్రదాయనియమముచేఁ గృతినాథుండగు కృష్ణరాయమహీనాథుని నాలు పద్యములచే నిష్టదేవతానుతిపురస్సరంబుగ నాశీర్వదించెను. అం దిది మొదటిపద్యము.

ఇయ్యది గ్రంథాదిపద్య మగుటంజేసి లక్ష్మీవాచకమైన శ్రీశబ్దమును బద్యాదియందుఁ గవి ప్రయోగించెను. దేవతావాచకశబ్దములును భద్రాదివాచకశబ్దములును గ్రంథాదియందుఁ బ్రయోగింపఁబడినచో వర్ణగణాదిశుద్ధి యని యభియుక్తసమ్మత మగుటచే శ్రీశబ్దము దేవతాభద్రాద్యుభయవాచకము గావునఁ బ్రాయికముగాఁ గవులు దీనినే గ్రంథాదిని బ్రయోగింతురు. చంద్రదేవతాకమైన భగణము ప్రథమప్రయుక్తము గావునఁ గవికిని, కృతిపతికిని, జదువువారికిని, వినువారికిని, శుభావహమును గీర్తికరమును నగు.

(వ్యాఖ్యానము) శ్రీ-లక్ష్మీదేవి; ఉయ్యెలలీలన్-ఉయ్యెలవలె; వైజయంతీమిళిత-విష్ణుదేవుని వనమాలతోఁ గూడిన; అచ్ఛ-దోషరహితమగు; కౌస్తుభము-విష్ణుదేవుఁడు వక్షంబున ధరించుమణి; నిద్దపుఁగాంతిన్-మనోజ్ఞ మగు కాంతితో, (నిద్దము-స్నిగ్ధశబ్దభవము); తనర్చి-ఒప్పి; ఆత్మవక్షోమణివేదిన్-తన యురంబనెడు మణినిర్మితంబగు తిన్నెమీఁద; (విష్ణుదేవునియురము మణివలె మెఱయుటచే మణివేదికిఁ బోల్పఁబడియె.)

శ్రీవేంకటస్వామియురంబు మణిఖచితంబగుతిన్నెచందంబున నున్నదనియు, నా తిన్నియపై వనమాలానిబద్ధం బగు కౌస్తుభమణి లక్ష్మీదేవిమనంబున కింపు సంపాదింప నమర్చిన యుయ్యెలవలె నున్న దనియు భావము. లక్ష్మీదేవి విష్ణుదేవునివక్షంబున వసించుట ప్రసిద్ధము.కౌస్తుభమణిని మణివేదియందుంచుట సరసము. పండువు-పండుగు; (కొన్నియెడల నాంధ్రపదములలో గకారమునకు వకారము వచ్చును. పగలు-పవలు; తీఁగియ-తీవియ; ఈగి-ఈవి; ఇత్యాదులు). వేంకటస్వామి-వేం-పాపములను, కట-దహించువాఁడు;

" సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే
సర్వపాపదహో యస్మాత్తస్మాద్వేంకటనామవాన్."

"కలౌ వేంకటనాయకః" అను నార్యోక్తిచే నీకలియుగమున వేంకటేశ్వరుఁడు సర్వపాపనివారకుఁడై సర్వాభీష్టప్రదుండగుటచే సర్వజనోపాస్యుఁడై వెలయునని యెఱుఁగునది. నరసక్షితినాథుని కృష్ణరాయనిన్-నరసమహీపాలుని సుతుఁ డగు కృష్ణరాయమహారాజు నని భావము. ఇట్లు తండ్రిపేరును షష్ఠీవిశేషణముగాఁ గూర్చి నుడువుట యాంధ్రకవీశ్వరుల సంప్రదాయము. ఇట షష్ఠీవిభక్తికి జన్యజనకభావము వివక్షితము

అభ్యుదయార్థము గ్రంథాదిని నిష్టదేవతానుతిపురస్సరముగఁ గృతినాయకుని నాశీర్వదించుటయు మహాకవిసంప్రదాయము.

(విశేషము.) ఈమహాకావ్యమును రచించిన ముక్కుతిమ్మన యని ప్రసిద్ధిఁ గాంచిన నందితిమ్మన యాశ్వాసాంతగద్యమున "శ్రీమదుమామహేశ్వర వరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది" యని చెప్పికొనియుండుటచే శివభక్తుఁడుగాఁ గానంబడు చున్నను, కృష్ణరాయమహారాజునకుఁ దిరుపతిమహీధరంబుపై భక్తానుగ్రహార్థము దివ్య మంగళరూపుఁడై వేంచేసియుండు శ్రీవేంకటేశ్వరుం డిష్టదేవతకావునఁ దొలుత నద్దేవుని వినుతించె నని యొఱుంగునది.

"శ్రీమదికిం బ్రియం బెసఁగఁ జేర్చిన యుయ్యెలలీలఁ" అనుటచేఁ గవి యీ కావ్యమునందు వర్ణ్యమాన మగు సత్యభామాప్రీత్యర్థ పారిజాతాపహరణరూపమైన యితి వృత్తమును వ్యంగ్యమర్యాదచే సూచించె నని సహృదయులమానసంబులకు గోచరంబగు. ధ్వనిప్రధానంబగు కావ్య ముత్తమంబని యాలంకారికమతము.

"కావ్యస్యాత్మా ధ్వని రితి బుధై ర్యస్సమామ్నాతపూర్వః"

అని నుడివి ధ్వనిలక్షణమును

" యత్రార్థశ్శబ్దోవా తమర్థ ముపసర్జనీకృతస్వార్థౌ
వ్యఙ్క్తః కావ్యవిశేష స్సధ్వనిరితి సూరిభిః కథితః."

అని ధ్వన్యాలోకమున నానందవర్ధనాచార్యుఁడు చెప్పియున్నాఁడు.

అలంకారములు:—వైజయంతీమిళితకౌస్తుభమును శ్రీదేవికై యమర్పఁబడిన యుయ్యెలగా నుత్ప్రేక్షించుటచే వస్తూత్ప్రేక్ష. ఆత్మవక్షోమణి వేది యనుచో రూపకము. కావ్యార్థసూచనంబుచే ముద్రాలంకారము. వీనికిఁ బరస్పరాంగాంగిభావాదులు లేమింజేసి సంసృష్టి.

"మిథోఽనపేక్షయా తేషాం స్థితిస్సంసృష్టిరుచ్యతే" అని సాహిత్యదర్పణము.

ఇది యుత్పలమాలావృత్తము. ప్రతిపాదమును భరనభభరలగ గణములును, బదియవ యక్షరము యతిస్థానంబును గలది.

మ. పొలఁతుల్ గొంగిట గ్రుచ్చియెత్తి తలఁబ్రా లొల్కించుచున వ్వేళ నొఁ
దల గంగం దననీడఁ దాన కని మాద్ధ్యం బొప్ప వేఱొక్కతో
య్యలియంచు న్మది నెంచుపార్వతియసూయావాప్తికి న్నవ్వుక్రొ
న్నెలపూఁదాలుపు కృష్ణరాయనికి సంధించు న్మహైశ్వర్యముల్. 2

ఈపద్యమునఁ బార్వతీపరమేశ్వరవివాహవర్ణనరూపమగు శివస్తుతి చేయఁబడినది.

(వ్యా) పొలఁతుల్ - చెలికత్తెలగు స్త్రీలు; కౌఁగిటన్ - కౌఁగిలిశబ్దమున కిది యధాప విభక్తికరూపము, కౌఁగిలిచే ననియర్థము; గ్రుచ్చి - చేర్చి (చిక్కఁబట్టి); పార్వతీదేవి లజ్జాభరంబున వరునిపైఁ దలఁబ్రాలుపోయుటకై స్వయముగా లేవకుండుటయు నించుక వెనుదీయుటయుం గని చెలికత్తె లాదేవిని గౌఁగిటఁ జిక్కఁబట్టి యెత్తిరని భావము. ఇది నవవధూలక్షణము. తలఁబ్రాలు - తలపైఁబోసెడు ప్రాలు, అనఁగా బియ్యము. పెండ్లిసమయమున నవవధూవరు లొండొరులశిరంబులపై మంగళార్థము బియ్యమును జెక్కఁమా ఱులు పోసికొనుట యాంధ్రదేశప్రజనుల కాచారమైయున్నది. ఇది ద్రావిడులలోఁ గానంబడదు. జొఁదలగంగన్ - నడితలయందలిగంగానదియందు. "జొఁదల" యనుపదము సార్థబిందుకము. "జొఁదలఁ జదలేటి లేఁ దరఁగలు బాలుఁ డగు చందమామ నుయ్యాల లూఁప" అని యెఱ్ఱాప్రెగ్గడ హరివంశము; మౌగ్ధ్యంబు - మూఢత్వము (అజ్ఞత్వ మని భావము); సౌందర్యమని యర్థాంతరము; "ముగ్ధ స్సుందరమూఢయోః" అని త్రికాండశేషము; క్రొన్నెలపూఁదాలుపు - బాలచంద్రధరుఁ డగు శివుఁడు.

పరమశివుని మౌళియందలి గంగానదియందుఁ బ్రతిఫలించినతనబింబమును గాంచి పార్వతి యన్యాంగన యని భ్రమించుటచే భ్రాంతిమదలంకారము.

(వి) పార్వతీదేవిని బొలఁతులు కౌఁగిటం బొదివి తలఁబ్రాలు వోయించునెడ శివజటాజూటమందలి నిర్మలమందాకినీసలిలంబులం బ్రతిఫలించిన తన ప్రతిబింబమును గాంచి మఱియొక కాంతామణి యను భ్రాంతిచేఁ బార్వతి యసూయపడుటం గని నవ్వు పరమేశ్వరుఁ డని వర్ణించుసందర్భమునఁ గవి తనకావ్యమందుఁ జెప్పఁబడు పై కథాభాగము నిట్లు సూచించెను. ఎట్లన, రుక్మిణీదేవిగృహమందు శ్రీకృష్ణుఁ డుండునెడ నారదుఁడువచ్చి తెచ్చియిచ్చిన పారిజాతపుష్పమును గృష్ణుఁడు దా నచ్చటనున్న కారణమునను నారదప్రేరణమునను రుక్మిణికియ్యఁగాఁ దద్వృత్తాంతమెఱుంగక తనపై హరికిఁ బ్రేమ లేదని సత్యభామ యసూయపడుట మున్నగు కథాసందర్భము లిందు సహృదయహృదయగోచరంబు లగు.

క్రొన్నెలపూఁదాలు పనుటచేఁ బారిజాతకుసుమధారణమును ధ్వనిత మగు.

ఈవృత్తము మత్తేభవిక్రీడితము - సభరనమయవగణంబులును బదునాలుగవయక్కరము యతిస్థానమును గలది.

మ. తనదంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి, యుద్యత్కుంభయుగ్మంబుచే
త నితాంతోన్నతి, దానవిస్ఫురణ నుత్సాహంబు, శుండాముఖం

బున దీర్ఘాయువు, నిచ్చుఁగావుత గుణాంభోరాశికిం గృష్ణరా
యనికి న్వారణరాజవక్త్రుఁడు కృపాయత్తైకచిత్తాబ్జుఁడై. 3

ఈపద్యమున గణాధిపతిస్తుతిచేయఁబడినది.

(వ్యా) వారణరాజవక్త్రుఁడు-ఏనుఁగుమిన్న మోముగల గణేశ్వరుఁడు; దానవిస్ఫురణన్—దానము-ఏనుఁగు చెక్కిలినుండి పాఱెడు మదజలము; ఉత్సాహంబు-పాలనశక్తి, బలము (ప్రభుమంత్రోత్సాహము లని శక్తులు మూఁడు); శుండా-తొండము.

(వి) తనదంతాగ్రముచేతఁ దీక్ష్ణమతి నిచ్చుఁగావుత మని చెప్పుటచే దంతాగ్రము తీక్ష్ణముగా నున్న దనియెడు ధ్వని స్ఫురించెను. ఇట్లె కుంభయుగ్మ మున్నతముగా నున్నదనియు దానవిస్ఫురణ ముత్సాహకలితముగా నున్న దనియు శుండాముఖము దీర్ఘంబుగ నున్నదనియు ధ్వనుల నూహించునది.

ఇది కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుధ్వని.

ఇటఁ దీక్ష్ణమత్యాదిదానయోగ్యతావిశిష్టత్వద్యోతక విశేషణములచే గణాధిపతి వర్ణింపఁబడియుండుటచేఁ బరికరాలంకారము. వారణరాజ వక్త్రుఁడగు విఘ్నేశ్వరుఁడు తనదంతాగ్రములు తీక్ష్ణములుగావున బుద్ధితీక్ష్ణత్వమును, కుంభము లున్నతములు గావున నత్యంతోన్నతిని, దానవిస్ఫూర్తి యుత్సాహకార్యముగాన నుత్సాహమును, తొండ మతి దీర్ఘముగావున దీర్ఘాయువును, నిట్లు నిజావయవరూపసౌష్ఠవంబుల కనురూపము లగు గుణాదులను గృష్ణరాయనికొసంగుఁ గాక యని చెప్పుట చమత్కారము.

చ. సరసపుటల్కఁ దీర్చుతఱి శార్ఙ్గ సుదర్శన నందకాబ్జ సం
భరణగుణాప్తి నెన్నడుముపైఁ గటిపై జడపై గళంబుపై
హరినలుగేలుఁ బైకొన సుఖాంబుధి నిచ్చలు నోలలాడు నిం
దిర కృపఁ జూచుఁగాత నరదేవశిఖామణిఁ గృష్ణరాయనిన్. 4

ఈపద్యమున లక్ష్మీస్తుతి చేయఁబడినది.

(వ్యా) సరసపుటల్క-ప్రణయకలహము; శార్ఙ్గ-విష్ణుదేవుని వింటికిఁ బేరు; సుదర్శన-అతనిచక్రము; నందక-అతనిఖడ్గము; అబ్జము-శంఖము; పైకొనన్-చేర్పఁగా;

విష్ణువు లక్ష్మీదేవికిఁ బొడమినపొలయలుకం దీర్చుటకై యద్దేవి ననునయింప శార్ఙ్గమును ధరించిన తనయొకహస్తమును నద్దేవినడుముమీఁదను, సుదర్శనమును ధరించిన చేతిని గటిప్రదేశంబుమీఁదను, నందకమును ధరించినకరంబును జడమీఁదను, శంఖమును ధరించినకేలును నద్దేవిమెడమీఁదను చేర్చి యామెను సంతసింపఁజేసెనని భావము.

శార్ఙ్గసుదర్శనాదులు గలహస్తంబులఁ గ్రమముగా నడుము కటి మొదలగు స్థానములయం దుంచెనని చెప్పుటచే నిది క్రమాలంకారము. దీనికే యథాసంఖ్యాలంకార మనియుఁ బేరు.

(వి) ఇట నడు మతిసూక్ష్మమై పిడికిటఁ బట్టఁదగియుండుటచే వింటిం బోలి యున్నదనియుఁ, గటిప్రదేశము చక్రమువలె నున్నదనియు, జడ కత్తిచందంబున నున్నదనియు, గళము శంఖముపగిది నున్నదనియు, నుపమానములు స్ఫురించెడుఁ గావున నిది శబ్దశక్తిమూలాలంకారధ్వని.

ఇది చంపకమాలావృత్తము. నజభజజజరగణంబులును బదునొకండవ యక్షరము యతిస్థానమును గలది.

చ. తనమృదుగీతికాపరిణతధ్వనివైఖరిఁ బల్కు మంచు మిం
చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు గీఁటుచు నేర్పు చున్నదో
యన నఖరాంకురంబుల నయమ్మునఁ దంత్రులు మీటి గాన మిం
పొనరఁగఁ జేయువాణి ప్రతిభోన్నతుఁ జేయుతఁ గృష్ణరాయనిన్. 5

. ఈపద్యమున సరస్వతీస్తవము చేయఁబడినది.

(వ్యా) పరిణత-పక్వమైన(అనఁగా నుత్కృష్టమైనదనుట); వైఖరి-విధము; వీణియ-వీణ. రూపాంతరము 'వీణె'. కొన్నిశబ్దములలో 'నియ'కు మాఱుగా నెత్వంబు వచ్చును; తీనియ-తీవె; కన్నియ-కన్నె; ముత్తియము-ముత్తెము. గీఁటుచున్-తాఁకుచున్ (దువ్వుచు నని భావము); నఖర-నఖము.

తనకంఠస్వరమునకు సాటిగాఁబలుకుమని వీణకుఁ జెప్పుచున్నదో యనునట్లు వ్రేళులచేఁ దంత్రులను మీటుచున్నదని చెప్పుటవలనఁ గంఠస్వరమున కుపమానమైన వీణానాదమునకు సరస్వతీకంఠస్వరము నుపమానముగాఁ గల్పించుటచేత నుపమేయమైన వాణీకంఠస్వరమున కుత్కర్షాతిశయము చెప్పఁబడినది.

అలంకారము—ప్రతీపభేదము. 'నేర్పుచున్నదో' యనునెడ నుత్ప్రేక్ష; వీనికి సంసృష్టి.

## కృతినాయక వంశానువర్ణనము

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించినపూవుగుత్తి వే
ల్పులగమిజీవగఱ్ఱ యుడివోవనిచల్వలకుంకి వెన్నెల
ల్మొలచినపాదు పాల్కడలి ముద్దులపట్టి నృసింహకృష్ణరా
యలఁ గరుణారసంబు నినుపారెడిచూపులఁ జూచుఁగావుతన్. 6

ఈపద్యంబునఁ జంద్రస్తుతి చేయఁబడినది.

(వ్యా) వలిమల-హిమాచలము; అల్లువాఁడు-అల్లుఁడు; తలవాఁక-తలమీఁద నుండునదియందు (గంగానదియం దని భావము); జీవగఱ్ఱ-ప్రాణాధారము.

ఈసమాసము సంస్కృతాంధ్ర పదమిశ్రితము గావున నసాధువైనను మహాకవి ప్రయుక్తమగుటచే నిది "ప్రాణగొడ్డము" మున్నగువానిరీతి ననింద్యగ్రామ్య మనియు గ్రాహ్యమనియుఁ దెలియవలయు. అయినను నిట్టిసమాసములను గవులు క్రొత్తగాఁ గల్పించి కబ్బంబులందుఁ గూర్పఁదగదు.

ఉడివోవని-ఉడిగిపోవని-తగ్గని; చల్వలటెంకి-శైత్యములకు స్థానము; నినుపారెడు-విస్తరింపఁజేయు;

(వి) (1) కృష్ణరాయనికి వంశకర్తయైన చంద్రునికిఁ జెప్పఁబడిన విశేషములచే నట్టిగుణములు కృష్ణరాయనికిఁ గల వనుధ్వని స్ఫురించెడు. ఎట్లనఁగా-మహేశ్వరుఁడు శిరస్సున ధరించిన వాఁడనుటచే సజ్జనశ్లాఘనీయుఁడనియు, దేవతలకుఁ బ్రాణాధారుఁ డనుటచేఁ బూజ్యులకు జీవనాధారభూతుఁ డనియు, నుడివోవని చల్వలటెంకి యనుటచే నెడతెగని శాంత్యాదిసద్గుణములకు నివాసస్థానమైనవాఁ డనియును, వెన్నెలల్మొలచిన పా డనుటచే నెల్ల వారికి నాహ్లాదము గావించు సౌజన్య సౌశీల్య సౌమనస్యాదిసుగుణములతనియందే యంకురింపఁ బ్రసిద్ధిఁగాంచినవాఁ డనియు, క్షీరసాగరసంజనితుఁ డనుటచే నుత్తమకులప్రసూతుఁ డనియు ధ్వను లూహ్యంబులు.

ఇందుఁ గావ్యగుణము ప్రసాదము. దీనికి లక్షణము:—

"యత్తు ప్రాకట్య మర్థస్య ప్రసాదస్సోఽభిధీయతే" అని సరస్వతీకంఠాభరణము.

"వ్యక్తార్థపద మగ్రామ్యః ప్రసాదః పరికీర్తితః" అని కావ్యచంద్రిక.

"ప్రసిద్ధపదంబుల నలఘూక్తిప్రసాద మయ్యె నది యెట్లన్నన్" అని కావ్యాలంకారసంగ్రహము.

(2) చంద్రస్తుతి నే నెఱిఁగినంతకు నే యితరకవులును జేయరైరి. కృష్ణదేవరాయఁడు చంద్రవంశసంజాతుఁ డని చెప్పఁబూని కవి తదవతరణార్థము చంద్రుని వినుతించె నని యూహించునది.

(3) ఇక్కడ నాంధ్రకవిసంప్రదాయానుసార మగు సంస్కృతాంధ్రకవిస్తుతి నేలొకో తిమ్మనార్యుఁడు చేయక విడిచిపెట్టెను. 6-7 పద్యముల సంబంధముం బరికించి చూడ నిట గ్రంథపాతంబును లేదని తెలియవచ్చెడు.

ఉ. ఆయమృతాంశునం దుదయ మయ్యె బుధుం, డతఁ డార్తరక్షణో
పాయుఁ బురూరవుం గనియె, నాతని కాయువు పుత్త్రుఁడయ్యె, న
య్యాయతశక్తికి న్నహుషుఁ డాత్మజుఁడై యిల నేలెఁ, దత్సుతుం
డై యలరె న్యయాతి, యతఁ డాహవదోహలుఁ గాంచెఁ దుర్వసున్.

(వ్యా) ఆహవదోహలుఁడు-యుద్ధమునం దత్యంతోత్సాహము కలవాఁడు; తుర్వసున్-కొంద ఱీశబ్దమును 'దుర్వసు'నని దాదిగా వ్రాయుచున్నారు. తుర్వసు నని తకారాదిగా వ్రాయుటయే సరి యని తోఁచుచున్నది.

క. ఉర్వీశమౌళి యగునా,
తుర్వసువంశంబునందు దుష్టారిభుజా
దుర్వారగర్వరేఖా,
నిర్వాపకుఁ డీశ్వరాఖ్య నృపతి జనించెన్. 8

(వ్యా) మౌళి-శిరస్సు; అనఁగా శిరమువలె శ్రేష్ఠుఁ డని యర్థము; కిరీటమనియు నర్థము గలదు. నిర్వాపకుఁడు-పోఁగొట్టువాఁడు.

ఇది కందపద్యము-గగభజసనలగణములలో మూఁడేసి గణములు ప్రథమతృతీయ పాదములకును, నైదేసి గణములు ద్వితీయ చతుర్థ పాదంబులకును నుండవలయు. బేసి స్థానమందు జగణము నుంపఁదగదు. పద్యార్థమునం దాఱవగణము నలజములలో నొకటిగా నుండఁజను. ద్వితీయచతుర్థపాదంబులలోఁ జతుర్థగణాద్యక్షరము యతిస్థానము. ప్రతి పాదమునందును దొలుతటియక్కరము గురువుగానైనను లఘువుగానైనను నుండవలయుఁ గాని గురులఘువులఁ జేర్పఁదగదు. ద్వితీయచతుర్థపాదంబులలోఁ గడపటి యక్షరము గురువుగా నుండవలయు.

ఉ. తామసవృత్తి లేదు, సతతంబును నుగ్రుఁడు గాఁడు, పౌరుషం
బేమియు వెల్తి గాదు, తన కెందును బైమఱి రాజు లేఁడు, సం
గ్రామములోన నొక్కనరుగానికి వాసి దొఱంగఁ డీశ్వర
క్ష్మామహిళామనోహరునిసాటియె యీశ్వరుఁ డెన్నిభంగులన్. 9

ఈపద్యమునం దీశ్వరునికంటె నీశ్వరమహారాజున కుత్కృష్టగుణంబులు కలవని వర్ణింపఁబడియె.

(వ్యా) తామసవృత్తిలేదు-ఈశ్వరమహారాజునకుఁ దామసవృత్తిలేదని చెప్పుటచే భగవంతుఁడగు నీశ్వరునకుఁ దామసవృత్తి కలదని యూహించునది. తామసవృత్తి యనఁ గోపాదిగుణవిశిష్టవర్తనమని రాజుపరముగానర్థము; తమోగుణవిశిష్టుఁడని శివునిపరముగా నర్థము; సతతంబును నుగ్రుఁడు కాఁడు—ఉగ్రుఁడు-భయంకరుఁడు; అనఁగా శత్రువులపై యుద్ధమునకుఁ బోవునపుడు తక్కఁ దక్కినవేళలందు నుగ్రుఁడు కాఁడనియు శాంతుఁ డనియు భావము; శివుఁడో సతతము నుగ్రుఁడే-ఉగ్రశబ్దవాచ్యుఁడని భావము. "ఉగ్రః కపర్దీ శ్రీకంఠః" అని యమరుఁడు; పౌరుషంబేమియు వెత్తిగాదు—పౌరుషము-పరాక్రమము, పుంస్త్వము; ఈశ్వర రాజున కొకప్పుడును బరాక్రమము తగ్గినది కానియు, శివుఁ డర్ధనారీశ్వరుఁడగుటచే నతనికిఁ బౌరుషము (పుంస్త్వము) తగ్గినదనియు భావము; రాజు—నృపతి-చంద్రుఁడు. ఈశ్వరరాజునకుఁ బైని రాజు లేఁడనియనఁగా నతనికంటె నధికుఁడగురాజు లేఁడనియు, శివునికిఁ బైని రాజుగలఁడనియు ననఁగా నతనిశిరంబుపైఁ జంద్రుఁడుగలఁడనియు భావము; సంగ్రామము-యుద్ధము; నరుఁడు-మనుష్యుఁడు-అర్జునుఁడు; ఈశ్వరరాజు యుద్ధమునం దేనరునివలనను బరాజయము నొందఁడనియు, శివుఁ డర్జునుని వలన యుద్ధమున గాసిఁ జెందె ననియు భావము.

అలంకారము:—ఉపమానమునకంటె నుపమేయమున కాధిక్యమును జెప్పుటచే వ్యతిరేకము. శ్లేషోత్థాపితము.

ఉ. రాజులనెత్తుటం బరశురాముఁడు వ్రంతలు సేసె రెండుమూఁ
డీజగతిన్, గణింప నది యెంతటివిస్మయ, మబ్జినీసుహృ
త్తేజుఁడు కందుకూరికడఁ దిమ్మయయీశ్వరుచే జనించె ఘో
రాజి బెడందకోట యవనాశ్వికరక్తనదీసహస్రముల్. 10

వ్రంతలు-('వంతలు' అని రూపాంతరము) కాలువలు; ఇక్కడ మడుఁగు లని భావము; రెండుమూఁడు—ఇది స్వల్పార్థమును సూచించెడు చులకనమాట; ఇచ్చట నైదని యర్థము; అబ్జినీసుహృత్తేజుఁడు-సూర్యునివంటి తేజస్సుఁ గలవాఁడు; బెడందకోట యవనాశ్విక-బెడందకోట యను దుర్గమునందలి తురుష్కులైన గుఱ్ఱపురౌతులు.

తొల్లి పరశురాముఁడు క్షత్రియుల నిరువదియొక్కమాఱులు చంపి తదీయరక్త ప్రవాహములను ధరణిపైఁ బ్రవహింపఁజేసెనని పురాణకథ గలదు. అట్లు పరశురాముని

క్షత్రియసంహారమువలనఁ బొడమిన నెత్తురులు రెండు మూఁడు (అనఁగా నైదు) మడుఁగులుగా శ్యమంతపంచకమున నేర్పడెననియు నది యాశ్చర్యము కాదనియు నీశ్వరమహారాజుచే నఱుకఁబడిన యవనాశ్వికులరక్తము పెక్కువేలనదులుగాఁ బ్రవహించెననియు నిదియే విస్మయావహం బనియు భావము.

అలంకారము. అత్యుక్తి—

క. శాశ్వతవిజయుఁడు తిమ్మయ,
యీశ్వరనృపతికిని గౌరి కెన యగు తత్ప్రా
ణేశ్వరి లక్కాంబికకు,
న్విశ్వాతిగయశుఁడు నరస విభుఁ డుదయించెన్. 11

(వ్యా) విశ్వాతిగయశుఁడు-ప్రపంచము నతిక్రమించి వ్యాపించినకీర్తి గలవాఁడు. అనఁగా సర్వలోకములయందును వ్యాపించిన కీర్తి గలవాఁడనుట.

సీ. ఎవ్వానివిజయంబు లెఱిఁగించుశాసన
స్తంభంబు లాశాంత శైల వితతు
లెవ్వానియరిగాఁపు లేపారుకాళింగ
యవ నాది వివిధ దేశాధినాథు
లెవ్వానినిత్యదానైకవిలాసంబు
లారూఢతరతులాపూరుషంబు
లెవ్వానిచిరకీర్తి యింద్రలోకాంగనా
భోగినీగీతికాభోగపదము
తే. వాఁడు వొగడొందు సర్వసర్వంసహాధి
దేవతాముఖదర్పణద్విజయనగర
భద్రసింహాసనస్థుఁ డున్నిద్రతేజుఁ
డీశ్వరాధిపు నరసభూమీశ్వరుండు. 12

(వ్యా) ఆశాంతశైలవితతులు-దిగంతములందలిపర్వతముల సమూహములు; అరిగాఁపులు-(కప్పములు కట్టు) సామంతరాజులు; (అరి-కప్పము); తులాపూరుషంబు-తులాపూరుషమను పేరుగల యొకమహాదానము.

ఒకపెద్దత్రాసునం దొకవైపున దానముచేయునతఁడు కూర్చుండి మఱియొకవైపునఁ దనకు సరిగాఁ దూఁగునంతటి ధనమును (బంగారు, వెండి మున్నగువానిని) బోసి దానినిసత్పాత్రములకు దానముచేయుటకుఁ దులాపూరుషదానంబని పేరు. ఇది మహాప్రభువులు చేయఁదగినది. తొల్లి మహామహీపతులు చేయుచుండిరి.

ఇంద్రలోకాంగనా................పదము—ఇంద్రలోకాంగనా-స్వర్గకామినులు; భోగినీ-నాగలోకకామినులు (వీరియొక్క); గీతికాభోగ-గానాతిశయమునకు; "ఆభోగః పరిపూర్ణతా" అని యమరుఁడు; పదము-స్థానము.

నరసరాజు దిగంతములవఱకుఁ గల సమస్తభూములను జయించుటచే నందలిపర్వతము లీతనివిజయంబులఁ దెలుపుశాసనస్తంభంబులై యొప్పుచున్నవనియుఁ, గళింగయవనాది సమస్తదేశాధిపతు లీతనికి సామంతరాజు లనియు, నితఁడు ప్రతిదినమును దులాపూరుషదానము చేయువాఁడనియు, నితనికీర్తిని సురలోకకామినులును నురగాంగనలును గానముసేయుచుందురనియు, వరుసగా సీసచరణములు నాలుగింటికిని భావము.

సర్వసర్వంసహాధి.........సింహాసనస్థుఁడు—సర్వ-సమస్తమైన; సర్వంసహా-భూమియొక్క; అధిదేవతా-అధిష్ఠానదేవతయొక్క; ముఖ-వదనమునకు; దర్పణత్-అద్దమువలె నాచరించుచున్న; విజయనగర-విజయనగరరాజ్యమునకు; భద్రసింహాసనస్థుఁడు-పట్టాభిషిక్తుఁడగు మహాప్రభువు. అనఁగా సర్వభూమండలమందలి యెల్లయుత్కృష్టవస్తువులను నీవిజయనగరసామ్రాజ్యమునం దలరారుచున్నవని భావము.

ఇది సీసపద్యము—నాలుగు పెద్దచరణములును, బిమ్మటఁ దేటగీతియో యాటవెలఁదియో యొకటియు నుండవలయు. ఒక్కొక్క పెద్దచరణమునకును నాలేంద్రగణములును, రెండు సూర్యగణములును నుండవలయు. ప్రతిపాదమునకుఁ బ్రథమ తృతీయగణాద్యక్షరములకును, బంచమ సప్తమగణాద్యక్షరములకును, యతిఁగూర్పవలయు. తేటగీతి నాలుగు పాదములుకలది. ప్రతిపాదమునందును, సూర్యగణమొక్కటి, యింద్రగణములు రెండు, మఱల సూర్యగణములు రెండు నుండవలయును. చతుర్థగణాద్యక్షరమున యతి నుంపవలయును. ఆటవెలఁదియు నాలుగు పాదములు కలది. ప్రథమ తృతీయపాదములలో సూర్యగణములు మూఁడు, నింద్రగణములు రెండు, ద్వితీయ చతుర్థపాదములలో నైదు సూర్యగణంబులు నుండవలయు. అన్నిటను జతుర్థగణాద్యక్షరము యతిస్థానము. ఇ మూఁడుపద్యములందును బ్రాసయతి నుంపవచ్చును.

అలంకారము-అతిశయోక్తి.

సీ. కుంతలేశ్వరుఁడు సిక్కు వడంగ విద్యాపు
　　　రంబు గైకొని నిజప్రౌఢి నెఱపెఁ
బారసీకునకు దుర్భరమానవత్వంబుఁ
　　　దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధ
　　　రము లిచ్చి మధురాపురంబుఁ గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీవి
　　　నోదంబు యావనేంద్రునకుఁ జూపె
తే. నతఁడు నుతికెక్కె రామనేత్వంతరాళ,
కలితషోడశదానవిఖ్యాతయశుఁడు
మండలీకరమేఘ మార్తండబిరుదుఁ,
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు. 13

(వ్యా) కుంతలదేశాధిపతిని జిక్కు—పఱచి-కుంతలములను (వెండ్రుకలను) జిక్కు— పఱచిన నవి శోభావిహీనంబులై పూర్వస్థితిం జెందుట దుర్లభముకదా; విద్యాపురంబు— బిజాపురము; చోళవల్లభునకు సురవధూమధురాధరము లిచ్చి-చోళదేశపురాజును జంపి స్వర్గమునకుఁ బంపి యనుట; షోడశదానవిఖ్యాతయశుఁడు—షోడశదానములు :—

"స్వర్ణం రౌప్యం తథా తామ్రం కాంస్యం గావో గజా హయాః,
గృహం భూమి ర్వృషో వస్త్రం శయ్యా క్షేత్ర ముపానహౌ,
దాస్యన్నం సర్వకార్యేషు దానం షోడశకం మతం."
అని ప్రమాణము.

క. ఆనరసమహీమహిళా,
జానికిఁ గులసతులు పుణ్యచరితలు తిప్పాం
బా నాగాంబిక లిరువురు,
దానవదమనునకు రమయు ధరయునుబోలెన్. 14

(వ్యా) మహీమహిళాజాని-భూ సతిని భార్యగాఁ గలవాఁడు, రాజు.

అలంకారము. ఉపమ.

క. వారలలోఁ దిప్పాంబకు,
మారుఁడు పరిపంథికంధిమంథాచలమై
వీరనరసింహరాయఁడు,
వారాశి పరీతభూమివలయం బేలెన్. 15

(వ్యా) పరిపంథికంధిమంథాచలమై—పరిపంథి-శత్రువు లనెడు; కంధి-సముద్రమునకు; మంథాచలమై-మందరపర్వతమై; మందరపర్వతము సముద్రమును మథించి సంక్షోభము గావించినటుల వీరనరసింహరాయఁడు శత్రువులను హింసించె నని భావము.

## కృష్ణరాయవర్ణనము

శా. వీరశ్రీనరసింహశౌరి పిదపన్ విశ్వక్షమామండలీ
ధౌరంధర్యమునన్ జనంబు ముద మంద న్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుం డై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులు న్గహనశైలారోహముం జేయఁగన్. 16

(వ్యా) ధౌరంధర్యము-భారవాహిత్వము;కృష్ణరాయఁడు సింహాసనం బారోహింపఁగా నతనిశత్రువులు వనపర్వతంబుల నారోహించి రని చెప్పుటచే నిది యక్రమాతిశయోక్త్యలంకారము.

ఇది శార్దూలవిక్రీడితవృత్తము-మసజసతతగ గణంబులును, బదుమూఁడవ యక్షరము యతిస్థానమును గలది.

సీ. యాదవత్వమున సింహాసనస్థుఁడు గామి
సింహాసనస్థుఁ డై చెన్ను మెఱయ
గొల్లయిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి
పరకామినీసహోదరతఁ జూపఁ
మఱి జరాసుతునకై మథుర డించుటఁ జేసి
పరవర్గదుర్గము ల్వలిమిఁ గొనఁగఁ
బారిజాతము నాసపడి పట్టి తెచ్చుట
నౌదార్యమున దాని నడుగువఱుపఁ

తే. కోరి తొలుమేనఁ దన కైనకొదువ లెల్ల
మాన్చుకొనవచ్చి భువనైకమాన్యలీల
నవతరించిన కృష్ణుఁడౌ ననఁగ మించె
నరసవిభు కృష్ణరాయ భూనాయకుండు. 17

ఈ పద్యమున శ్రీకృష్ణుఁడే తనయవతారమునఁ దనకుఁ గల్గిన కొదువలను దీర్చి కొనుటకై యిపుడు కృష్ణరాయలుగా నవతరించి యప్పటికొదువలను మాన్చుకొనియెనని వర్ణింపఁబడినది.

(వ్యా) కోడిగించుట-పరిహాసాస్పదముగాఁ గ్రీడించుట.

కృష్ణావతారమునందు సింహాసనస్థుఁడు కాకుండిన కతంబున నిప్పుడు సింహాసనస్థుఁ డయ్యెననియు, నపుడు గొల్లచేడియలతోఁ గ్రీడించుటంజేసి యిప్పుడు పరస్త్రీపరాఙ్ముఖుఁడై యొప్పెననియు, నపుడు జరాసంధునకు మధురాపట్టణంబును విడిచి పరాజితుఁ డగుటంజేసి యిపుడు శత్రురాష్ట్రీయుల జయించి స్వాధీనపఱచుకొనెననియు, నపుడు పారిజాతవృక్షము నాశించి దేవేంద్రునితో యుద్ధము చేసి దానిం దెచ్చుటచే నిపుడొకరి సొమ్మున కాశింపక యెల్లరకును దాను దానములఁ జేసి కీర్తిగాంచెననియు భావము.

అలంకారము:—అధికాభేదరూపకము-కావ్యలింగము-వీనికి సంకరము.

శా. శ్రీరంగేశ్వర నాభి పంకజ రజ శ్శ్రీ కంటెఁ జోళేంద్ర త
న్వీరాజత్కుచపాళిమంజరులకంటె న్సహ్యభూభృత్తటీ
నీరంధ్రీకృత గైరికద్రవముకంటె న్వన్నె గావించెఁ గా
వేరీతోయముఁ గృష్ణరాయఁ డహితోర్వీనాథరక్తప్రభన్. 18

(వ్యా) పంకజశ్రీ-తమ్మిపుప్పొడులసంపద; కుచపాళిమంజరులు-స్తనప్రదేశములం దలంకరించుకొనిన పూగుత్తులు: స్తనప్రదేశములందు విలాసార్థము రాజస్త్రీలు మకరికాపత్రరచనలు కావించుకొనుటచే వారు ధరియించుపూవుగుత్తు లెఱ్ఱనిరంగుల నొప్పారునని తెలియునది; సహ్యభూభృ.........గైరికద్రవము—సహ్యభూభృత్తటీ- సహ్యపర్వతప్రదేశమందలి; నీరంధ్రీకృత-నిబిడమైన; గైరికద్రవము-గిరినుండి జాఱు నెఱ్ఱనిద్రవపదార్థము; ఇది గైరికాదిధాతువనంబడును; లక్షణము "గైరికం రక్తధాతుశ్చ గైరేయం గిరిజం తథా" అని భావప్రకాశము.

కృష్ణరాయఁడు శత్రురాజులను జంపి తదీయరక్తములను గావేరీజలంబులం బ్రవహింపఁజేయుటచే నవి శ్రీరంగనాథస్వామి నాభికమలమునందలి పుప్పొడులకంటెను,

జోళమహీపాలాంగనలకుచప్రదేశములం దలంకృతము లగు పువ్వుగుత్తులకంటెను, గావేరీ నదికి జన్మస్థాన మగు సహ్యాద్రితటములందలిగైరికద్రవముకంటెను మించినరక్తవర్ణముచే విరాజితంబు లై యొప్పారెనని భావము.

కృష్ణరాయఁడు శ్రీరంగనాథుని సేవించి సహ్యాచలప్రాంతదేశంబుల జయించి చోళదేశమహీనాథుల రూపుమాపి జితకాశుఁడై చెలువారె నని యెఱుంగునది.

అలంకారము:—ఇందు గైరికద్రవాదిసంపర్కముచే మునుపే శోణవర్ణముగా నుండిన కావేరీతోయంబులు శత్రురాజులరక్తములు కలిసిన కారణంబున నధికారుణప్రభాకలితంబు లయ్యె నని చెప్పుటచే ననుగుణాలంకారము.

సీ. చక్రవర్తిమహాప్రశస్తి నాఁడును నేఁడు
        చెలఁగి ధర్మక్రమస్థితి ఘటించె
    భూభృదుద్ధరణ విస్ఫూర్తి నాఁడును నేఁడు
        గోరక్షణఖ్యాతిఁ గుదురుపఱిచె
    సాధుబృందావన సరణి నాఁడును నేఁడు
        వంశానురాగంబు వదలఁ డయ్యె
    సత్యభామాభోగసక్తినాఁడును నేఁడు
        నాకల్ప మవని నింపార నిలిపె
తే. నాఁడు నేఁడును యాదవాన్వయమునందు
    జనన మందెను వసుదేవమనుజవిభుని
    కృష్ణుఁ డనుపేర నరసేంద్రుకృష్ణదేవ
    రాయఁ డనుపేర నాదినారాయణుండు. 19

ఈపద్యమునం దాదినారాయణుఁడు తొల్లి శ్రీకృష్ణుఁడుగాను, నిప్పుడుకృష్ణదేవరాయలుగాను నవతరించె నని కవి నుడివి వారిద్దఱికిఁ గల సాధర్మ్యములను వర్ణించియున్నాఁడు.

(వ్యా) నాఁడును-కృష్ణావతారమందును; చక్రవర్తిమహాప్రశస్తిన్-చక్రాయుధముచేత వర్తించుచుండెనను ఖ్యాతిచేత; ధర్మక్రమస్థితిన్-యుధిష్ఠిరునియొక్క న్యాయస్థితిని; ఘటించెన్-ఒనఁగూర్చెను; నేఁడున్-కృష్ణరాయావతారమందును; చక్రవర్తిమహాప్రశస్తిన్-సార్వభౌముఁడను మహాఖ్యాతితో; ధర్మక్రమస్థితిన్-ధర్మమార్గమునందునికిని;

ఘటించెన్; నాఁడును; భూభృదుద్ధరణవిస్ఫూర్తిన్—భూభృత్-కొండయొక్క(గోవర్ధన గిరియొక్క); ఉద్ధరణ - ఎత్తుటయొక్క (ఉత్ + ధరణ); విస్ఫూర్తిన్ - అతిశయముచే; గోరక్షణఖ్యాతిన్-గోపాలుఁ డను ప్రసిద్ధిని; కుదురుపఱిచెన్ - ఘటింపఁజేసెను; నేఁడున్—; భూభృదుద్ధరణవిస్ఫూర్తిన్; భూభృత్-రాజులయొక్క(శత్రురాజులయొక్క); ఉద్ధరణ-(ఉత్ + హరణ) సంహరించుటయొక్క; విస్ఫూర్తిన్—; గోరక్షణఖ్యాతిన్-భూపాలనప్రసిద్ధిని; గో-భూమియనుటకుఁ బ్రమాణము. "స్వర్గేషు పశువాగ్వజ్రదిఙ్నేత్రఘృణిభూతలే" అని యమరుఁడు. కుదురుపఱిచెన్—; నాఁడును—; సాధుబృందావనసరణిన్—సాధు-రమ్యమైన; బృందావనసరణిన్-బృందావనమార్గమందు(అనఁగాఁ బ్రదేశమందు); వంశానురాగంబున్-వేణువునందలి ప్రేమను (అనఁగా వేణుగానమునందనుట); వదలఁడయ్యెన్-విడువఁడయ్యె; నేఁడున్—; సాధుబృందావన సరణిన్—సాధుబృంద-సజ్జన సమూహములయొక్క; అవనసరణిన్-రక్షించుమార్గమునందు; వంశానురాగంబున్-తనవారియందలిప్రేమను; వదలఁడయ్యెన్—నాఁడును—; సత్యభామాభోగసక్తిన్-సత్యభామతోడిసుఖమును బడయు నాసక్తిచే; ఆకల్పమున్-ఆప్రసిద్ధమైన పారిజాతవృక్షమును; అవనిన్-భూమియందు; ఇంపారన్—నిలిపెన్-స్థాపించెను; నేఁడున్—; సత్యభామాభోగసక్తిన్—సత్య-యథార్థభాషణమునందును; భామాభోగ-స్త్రీలతోడి భోగమునందును(నిజభార్యలతోననుట); సక్తిన్-ప్రీతిని; అకల్పము-కల్పాంతస్థాయిగా; అవనిన్-నిలిపెన్; నాఁడున్—(అనఁగాఁ గృష్ణునికాలమునందును); యాదవాన్వయమునందున్-యాదవులవంశమందు; వసుదేవ మహీపతిపుత్త్రుఁడైన కృష్ణుఁడనుపేర నాదినారాయణుఁ డవతరించె ననియు, నేఁడును యాదవాన్వయమునం దనఁగా యదువునకు సంబంధించిన వంశము (యదువు యయాతికి జ్యేష్ఠకుమారుఁ డనియుఁ దుర్వసునకగ్రజుఁ డనియు భారతమువలనఁ దెలియనయ్యెడి) నందాదినారాయణుండు నరసేంద్రుని కృష్ణదేవరాయఁ డనుపేర నవతరించె ననియు భావము.

అలంకారము: — శ్లేషోత్థాపితానుభయాభేదరూపకము.

చ. అలఫణిభోగరత్నములు నాదిగిభోత్కటగండగంధము
ల్తలఁపునఁ బాఱి నవ్వ వసుధాసతి దా భుజకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రుని బాహువునందు భూషణో
జ్జ్వలమణుల న్మృగీమదమువాసనయుం గని ధూర్తలం గనల్. 20

(వ్యా) వసుధాసతి-భూదేవి; కృష్ణరాయనృపచంద్రుని బాహువునందున్— బాహువునందుఁ బ్రకాశించుచున్న; భూషణోజ్జ్వలమణులన్-ఆభరణమైన భుజకీర్తియందు

మెఱయుచున్న రత్నములను; మృగీమదమువాసనయుఁ౯-కస్తూరీపరిమళమును; కని-; ఆలఫణిభోగరత్నములుఁ౯-తొల్లి తన్నుఁ దాల్చియుండిన శేషునిపడగలయందలి మణులును; ఆదిగిభోత్కటగండగంధముల్-తొల్లి తన్ను ధరించిన దిగ్గజములయొక్క యధికమైన చెక్కిళ్ల వాసనలును; తలఁపునఁబొడ-జ్ఞప్తికిరాఁగా; తాఁ౯-(ఇది వాక్యాలంకారము); భుజకీర్తి మౌక్తికచ్ఛలమునఁ౯-భుజకీర్తియందలి ముత్యము లనెడు వ్యాజముచే (భుజకీర్తి-భుజాభరణము); నవ్వుఁ౯-పరిహసించుఁ౯; అంగనల్-స్త్రీలు; ధూర్తలు-దుష్టస్వభావలు.

భూమిదేవి యిప్పుడు తనభారమును వహించిన కృష్ణరాయలబాహువునందు ధరింపఁబడిన భుజకీర్తియందలి మణులను గస్తూరివాసనయుం గని పూర్వము తన్ను భరించియుండిన శేషునిపడగయందలి రత్నములును దిగ్గజములచెక్కిళ్లయందలి వాసనలును దనకు జ్ఞప్తికిరాఁగా (నవి వీనికంటెఁ దద్దయునికృష్టంబు లను భావంబున) నమ్మహీపతి భుజకీర్తులందలి ముత్యము లనెడు వ్యాజముచే నవ్వె ననియు స్త్రీలు చెడ్డస్వభావముగలవా రనియుఁ దాత్పర్యము.

భూమిని దొల్లి యాదిశేషుఁడును దిగ్గజములును భరించియుండఁగా నప్పుడు శేషునిఫణాభోగరత్నములును దిగ్గజముల గండస్థలగంధములును దా ననుభవించుచు సంతసించుచుండెననియు, నిప్పుడు తన్నుఁ గృష్ణరాయ మహీనాథుఁడు నిజబాహువునందు భరింపఁగా నందు ధరింపఁబడియుండు భూషణమునందలి రత్నములను బూయఁబడియుండు కస్తురియొక్క పరిమళమును ననుభవించుచుఁ దొల్లిటిఫణాభోగరత్నములను మత్తేభగండగంధములను స్మరించి యవి వీనికంటెఁ దద్దయునికృష్టములని భావించి వానిం బరిహసించెననియు, నాపరిహాసము ముత్తెములవలె ధవళమైయుండుటచే నిచ్చటఁ గృష్ణదేవరాయలు భుజమునందు ధరించిన భుజకీర్తియనెడు భూషణవిశేషమందలిముత్యములు వసుధాసతినవ్వువలె నొప్పారె ననియు భావము.

ఇచట భూదేవి తొల్లి తాను ప్రీతితో మన్నించుచుండిన శేషునిఫణాభోగరత్నములును దిగ్గజములగండగంధములును నిప్పుడు తాను వేఱొక నాయకునిఁ జేరి యతని మణులనువాసనలనుగాంచి సంప్రీతిఁ బొంది పైనిజెప్పిన వస్తువులను దిరస్కారభావముతోఁ బరిహసించుటచేత నిది భూదేవికి సత్ప్రవర్తనముగాదు. కావున దీనింబట్టిచూడ స్త్రీలుధూర్తస్వభావ లని విశేషమునుండి సామాన్యమును సమర్థించుటచేఁ గవి యర్థాంతరన్యాసమును నలంకారమును జెప్పెను.

ఇందు నాయిక (భూదేవి) పరకీయ.

అలంకారములు:—కైతవాపహ్నుతి-స్మృతి - అర్థాంతరన్యాసము.

చ. మునుకొని కొండవీటికడ మూఢత రుద్రుఁడు కృష్ణనందను
న్మనసిజునిన్ జయించె నది మానుషమే నరసేంద్రుకృష్ణరా
యనృపతి కొండవీటికడ నాహవభూమిఁ బ్రతాపరుద్రనం
దనుఁ డగు వీరభద్రుఁ గరుణామతిఁ గాచె జగత్ప్రసిద్ధిగన్. 21

(వ్యా) మునుకొని-పూని;కొండవీటికడన్-కైలాసపర్వతప్రాంతమునందు;కొండ వీడను పట్టణమునకు సమీపమునందు, అని యర్థాంతరము. తొల్లి రుద్రుఁడు కృష్ణనంద నుఁడగు మన్మథుని జయించె ననుట పరాక్రమవిశేషము గాదు. ఇప్పుడు కృష్ణరాయలు ప్రతాపరుద్రనందనుఁడగు వీరభద్రుని జంపక దయతోఁగాపాడెను. తనకుమారుని జంపిన వాని కుమారుని దాను రక్షించుట యుదాత్తగుణముగదా. కావున నిదియే శ్లాఘనీయ మని భావము.

ఇందుఁ గృష్ణరాయని ధీరోదాత్త నాయకునిగా వర్ణింపఁబడినది.

లక్షణము:—

క. ధీరుఁడుగంభీరుఁడు సత్కారుణ్యుఁడు నస్వయంకృతస్తుతి నిరహం
కారుఁడు నగు నాయకుఁ డిల, ధీరోదాత్తుండు నాఁగ ధృతిఁ బెంపారున్.

అని కావ్యాలంకారచూడామణి.

చ. నెలకొని కృష్ణరాయ ధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ
గలన నెదిర్చి హస్తికరకాండతతు ల్మసకంపుఁబాములై
మలసినచోటఁ గూడిన సమగ్రయశోవసనంబు గప్పి తా
వలవఁగ జేసె భూసతిని వశ్యవిధిజ్ఞుఁడు గాన నేర్పునన్. 22

(వ్యా) కలనన్-యుద్ధమునందు; మసకంపుఁబాములై - రతిక్రీడాపరవశములగు సర్పములై;మసకము-సంభోగేచ్ఛ;మలసినచోటన్-చేరినస్థలమునందు;సమగ్రయశోవసనం బున్-విశాలమైన యశస్సనెడువస్త్రమును; కప్పి-(భూసతిమీఁదననుట); వశ్యవిధిజ్ఞుఁడుగా నన్-వశీకరణవిద్యాప్రవీణుఁ డగుటచేత; భూసతిని వలవఁగజేసె నని యన్వయము. లోకమునందుఁ గాముకులగు పురుషులు తాముకోరిన పడఁతులను దమ్ము వలచునట్లొనర్చు టకై యొకధవళవస్త్రముమీఁద సర్పమిథునములను రమింపఁజేసి యావస్త్రము నాయంగ నపైఁ గప్పిన నప్పడఁతి తనకు వశురాలగునని లోకప్రసిద్ధమగు వశీకరణతంత్రము గలదు. దీనిని మసకలాడించుట యందురు.

సీ. ఉదయాద్రివేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్చెదరంగఁ గొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యుద్వృత్తి భంగము సేసె
జల్లిపల్లెసమగ్రశక్తిఁ గూల్చెఁ
గినుక మీఱుననంతగిరి క్రిందుపడఁ జేసెఁ
గంబంబుమెట్టు గ్రక్కునఁ గదల్చె
తే. బలనికాయము కాలిమట్టుల నడంచుఁ
గటకమును నింక ననుచు నుత్కలమహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయవిభుఁడు. 23

(వ్యా) వేగఁ_వేగమును (ఆటోపమును); వేగ యనుటకుఁ బ్రయోగము—
"ఆ, ధృతరాష్ట్రుం డవినీతి సేసినను సంధింపంగరాదంచు వే। గ తెగంబాఱను"...
భారతము, ఉద్యో. ఆ 3.

అత్యుద్ధతిఁ_అతిపరాక్రమముతో; అత్యున్నతితో ననుట. ఈపదము సాభిప్రాయమై చమత్కారపోషకముగ నుండెను. ఇట్టులే తక్కినపాదంబులలోను నరయునది. వినుకొండను-వినియెడుకొండను; మాటమాత్రన-(మాటచేతనే) జయించె నని చెప్పుట చమత్కారము; కొండవీడు - పర్వతపట్టణమును; కూటముల్ - శృంగములు; చెదరంగఁ-కదలునట్లుగా; అగలించెఁ_కదల్చెను; బెల్లముకొండ-అను నొకదుర్గమును; అచ్చెల్లఁజెఱిచెఁ_స్వరూపనాశనము చేసె ననుట; అచ్చుతో బెల్లము చేయఁబడుటచే బెల్లముకొండయచ్చెల్లఁ జెఱిచెనని చెప్పుట సరసము. అనంతుఁడు (శేషుఁడు) క్రింద నున్నవాఁడు కావున ననంతగిరిని క్రిందుపడఁజేసెనని చెప్పుట చమత్కారము; మెట్టును గదల్చిన శిథిలమై చెడుంగావునఁ గంబముమెట్టును గదల్చెనని చెప్పుటసరసము; మెట్టు-కొండ; కటకమును-కటక మనుపేరుగల పట్టణమును; కటక మను నాభరణవిశేష మనియు భావము; కటకము_కడియము; బలనికాయము-(కృష్ణరాయల) సేనలసమూహము; కాలిమట్టులఁ-కాలిత్రొక్కుడులచేత; అడంచుఁ-అణఁచును, జయించు ననుట; ఉత్కల

మహీశుఁడు-ఉత్కలదేశపు రాజు. కృష్ణరాయలు తన సేనాసమూహముయొక్క పాద సంచారముచేతనే తన రాజధానియగు కటకమను పట్టణమును జయించునని యుత్కల దేశపురాజు కృష్ణరాయలకు భయపడుచుండె ననియుఁ గావున నీతఁడు రాజసామాన్యుఁడు కాఁడనియు భావము.

అలంకారము:—పరికరము.

సీ. బాహుసౌధక్రీడఁ బరఁగు పంటవలంతి
తొయ్యలి నిడుదకస్తూరిబొట్టు
వైరి సైన్యాబ్ధిలో వచ్చు గెల్పులనావఁ
గడఁ జేర్చు ప్రాఁకుడుఁగడపుఁజేయి
యరికుంభికుంభముక్తాక్షరాంకిత మగు
జయరమాకన్యక చదువుపలక
శత్రురాజులకు నచ్చరల నాకర్షించు
సమరేంద్రజాలపింఛంపుఁగుంచె
తే. మేను సగము యశోమహేశానునకును
శౌర్యరవిఁ గోరి వచ్చిన చాయలేమ
నరసవిభు కృష్ణరాయ భూనాథచంద్రు
చేత ననిలోన మించు కౌక్షేయకంబు. 24

యుద్ధమునందు విజృంభించు కృష్ణరాయని హస్తమునందలి కత్తి యిందు వర్ణింపఁబడినది.

(వ్యా) అనిలోనన్-యుద్ధమునందు; మించు-విజృంభించు; కౌక్షేయకంబు-కత్తి; బాహుసౌధక్రీడ......తొయ్యలి—తన బాహువనెడు మేడయందు సంచరించు భూసతియొక్క; నిడుదకస్తూరిబొట్టు-దీర్ఘమైనకస్తూరీతిలకము; గెల్పులనావన్-జయమనెడు నావను; కడఁజేర్చు-దరికిఁదీసికొనిపోవు; ప్రాఁకుడుఁగడపుఁజేయి-(నీటియందు) నావను నడపు తెడ్డు. శత్రుసేనయను సముద్రమునుండి వచ్చెడు జయమనెడు నావను దరికిఁజేర్చెడు గడవలెఁ గృష్ణరాయనికత్తి యొప్పుచున్నదని భావము.

అరికుంభి...ముక్తాక్షరాంకితమగు—శత్రువుల యేనుఁగుల కుంభములనుండి పుట్టు ముత్యములనెడు నక్షరములచే చిహ్నముగాఁ గల; జయరమాకన్యక-జయలక్ష్మి యనెడు

పడుచు; చదువుపలక – చదివెడుపలక; నల్లనిపలకమీఁద నక్షరములు వ్రాసి చదువుట యిప్పటికిని బల్లెటూళ్ల బడులలో వాడుకయైయున్నది.

క. జలధరఫణిఫణకీచక, జలచరకరిమస్తకేక్షుశంఖవరాహో
జ్జ్వలదంష్ట్రిశుక్తిజాతంబులు ముత్తెము లొప్పు రత్నముల వివిధములై.
—అని రత్నశాస్త్రము.

దీనికి సంస్కృతము.
"గజేంద్రజీమూతవరాహశంఖ మత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని,
ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవమేవభూరి."

శత్రురాజులకుఁ – శత్రురాజులయొద్దకు; అప్సరస్త్రీలను రప్పింపఁజేయు యుద్ధమనెడు నింద్రజాలసంబంధమగు నెమిలిపింఛపుఁగుచ్చువలెఁ గృష్ణరాయలకత్తి యున్నదని భావము. అనఁగా శత్రువులఁ జంపి దేవలోకమునుండి వచ్చు నప్సరస్త్రీలతో గూడ స్వర్గమునకుఁ బంపు నని భావము.

"అదేశకాలపారోక్ష్యం పరోక్షస్యైవ వస్తునః।
యత్రౌషధాదిభి స్సోయ మైంద్రజాలవిధిస్మృతః॥" అని ప్రమాణము.

యశోమహేశానునకును–తనకీర్తి యనెడు శివునకు; తనయశస్సనెడుశివునకు నతని కత్తి పార్వతివలె నర్ధశరీరమై యున్నదని భావము. యశస్సు ధవళమగుటచే శివునకుఁ బోల్పఁబడియె. శౌర్యరవిఁ గోరివచ్చిన చాయలేమ—తన పరాక్రమమనెడు సూర్యుని చెంతకువచ్చిన ఛాయాదేవివలెఁ గత్తి యొప్పుచున్నదని భావము. చాయలేమ నలుపు వర్ణముఁ గలది కావునఁ గత్తికిఁ బోల్పఁబడియె.

అలంకారము:—రూపకములాఱు. వీనికి సంసృష్టి—ఉల్లేఖము.

షష్ఠ్యంతములు

క. ఏవంవిధ గుణఖనికిని
ద్యోవనితా ప్రార్థ్యమానధూర్తారిధరి
త్రీవర సంగతి సుభగం
భావుకరణముదిత కలహపారణమునికిన్.




(వ్యా) ఏవంవిధ–ఇటువంటి; గుణ–సుగుణములకు; ఖనికిన్–గనియైన వానికిని; ద్యోవనితా...మునికిన్—ద్యోవనితా – స్వర్గకామినులచేత; ప్రార్థ్యమాన–కోరఁబడు

చున్న; ధూర్త-దుష్టులగు; అరిధరిత్రీవర-శత్రురాజులయొక్క; సంగతి-కూడికకు; సుభగంభావుక-మనోజ్ఞముగా నగుచున్న; రణ-యుద్ధముచేత; ముదిత-సంతుష్టుఁడైన; కలహాపారణమునికిన్-నారదుఁడుగలవాఁడగు కృష్ణరాయనికి; కృష్ణరాయఁడు కలహప్రియుఁడగు నారదమహర్షికి సంతోషము గలుగునట్లు తనతో యుద్ధముచేయవచ్చెడు శత్రురాజులను జంపి స్వర్గమున కంపు నని భావము.

కలహాపారణమునికిన్-కలహము నే యశనముగాఁ గలముని (నారదుఁడు).

ఈకావ్యమునందుఁ బ్రారంభముననే నారదుఁడు కృష్ణునిపాలికిఁ జనుదెంచి పారిజాతకుసుమం బొక్కటి యొసంగి సత్యభామాకృష్ణులకుఁ గలహముఁ గావించుట వర్ణింపఁబడినది. దాని నిక్కడ సూచించుటకై "రణముదితకలహాపారణమునికిన్" అని చమత్కారముగఁ జెప్పఁబడియె.

అలంకారములు—పర్యాయోక్తి - ముద్రాలంకారము. సూచ్యార్థసూచనము చేయుట ముద్రాలంకారలక్షణము.

క. రాధాతనయాధారిత
గాథాధఃకరణ నిపుణకరణశయునకున్
మేధావ దసాధారణ
బోధాకరహృదయునకు విబుధసదయునకున్. 26

(వ్యా) రాధాతనయ-కర్ణునియందు; ఆధారిత - ఆవహింపఁబడిన; గాథా-కథను (ప్రసిద్ధిని); (అనఁగా దానముచేయుటయందుఁ గర్ణుఁడు నిరుపమానుఁడను లోకప్రసిద్దిని); అధఃకరణ-క్రిందుపఱచుటయందు-అనఁగాఁ దిరస్కరించుటయందు; నిపుణ-సమర్థమైన; కరణ-సాధనమైన; శయునకున్-హస్తముగలవానికి; మేధావత్-ప్రజ్ఞావంతులకు (పండితులకుమాత్రము); అసాధారణ-విశేషమైన, అనఁగా ననితరసాధారణమైన; బోధ-జ్ఞానమునకు; ఆకర-స్థానమైన; హృదయునకున్-మనస్సుగలవానికి. మఱియొక యర్థము.—

మేధావత్-ప్రజ్ఞావంతులకును; అసాధారణ-సామాన్యముగాని; బోధ-జ్ఞానమునకు; ఆకర-స్థానమైనవానికిని; విబుధ-పండితులయెడల; సదయునకున్-దయాళువైనవానికిని; "నిపుణకరసదయునకున్" అని యొకపాఠము గలదు. దాని కర్థము—

నిపుణ-సమర్థమైన; కర-హస్తముయొక్క; సత్-శ్రేష్ఠమైన; అయునకున్-శుభావహవిధి గలవానికి; అనఁగా దానవ్యాపారము గలవాఁడని భావము.

—'అయ శ్శుభావహో విధిః' అని యమరుఁడు.

క. నాగాంబికా కుమారున
కాగామి గతాధునిక నృపాలభ్య యశ
శ్శ్రీగుంభ హసిత హిమగుది
శాగజ తనుకటజ నైల్య సంభారునకున్. 27

(వ్యా) ఆగామి............సంభారునకున్—ఆగామి-జనింపఁబోవు; గత-చనిపోయిన; ఆధునిక-ఇప్పుడుండెడు; నృప-రాజులకు; అలభ్య-పొందఁదగని; యశశ్శ్రీ-కీర్తిసంపదయొక్క; గుంభ-చేరికచేత; హసిత-నవ్వఁబడిన; ఇక్కడఁ దెల్లఁగాఁజేయఁబడిన యని భావము. హిమగు-చంద్రునియొక్కయు; దిశాగజ-దిగ్గజములయొక్కయు; తనుకటజ-దేహమునుండియుఁ జెక్కిళ్లనుండియుఁ బుట్టిన (అనఁగాఁ జందురునియొక్క శరీరమునుండి పుట్టినదియు దిగ్గజముల కటములనుండిపుట్టినదియు నగు); నైల్యసంభారునకున్—నీలకాంతిభరము ను గలవానికి. అనఁగాఁ గృష్ణరాయనియశస్సు భూతభవిష్యద్వర్తమానప్రభువులయశస్సుకంటె మించినదనియు నీతని యశస్సు చంద్రునిశరీరమునందలి నీలకాంతులను బోఁగొట్టి తెల్లగాఁ జేసినదనియు నీతని యశస్సు స్వర్గపర్యంతమును దిగంతములందును వ్యాపించె ననియు భావము. "దానాది ప్రభవా కీర్తిః ప్రతాప ప్రభవం యశః" అని కీర్తియశస్సులకు భేదము. అయినను గవులు వీని నభేదముగాఁ బ్రయోగింతురు. (హిమగు-మంచుకిరణములు గలవాఁడు.)

అలంకారములు:—అతిశయోక్తి-తద్గుణము-అలంకారకృతవస్తుధ్వని.

క. సామర్ష దళిత పరభట
సామజ హయ కూలముద్రుజ క్షతజఘునీ
కాముకితాఖిలజలధికి
నాముష్యాయణ సుధీ గృహాంగణ నిధికిన్. 28

(వ్యా) సామర్ష ......జలధికిన్—సామర్ష-కోపయుక్తముగా; దళిత-చీల్పఁబడిన; పరభట-శత్రువులయొక్క-సేనలు; సామజ-ఏనుఁగులు; హయ-గుఱ్ఱములు; (వీనియొక్క) కూలముద్రుజ-గట్టును జెల్లగించి పడఁద్రోయుటవలని (అనఁగా నిర్మూలము సేయుటవలని); క్షతజఘునీ-నెత్తురుటేఱులచేత (సంపూర్ణ రక్తప్రవాహములచేత నని భావము); కాముకిత-కాముకులుగాఁజేయఁబడిన; అఖిలజలధికిన్-అన్ని సముద్రములు గలవానికి. అనఁగాఁ గృష్ణరాయలు చంపిన శత్రువులసేనలు గజములు గుఱ్ఱములు వీని రక్తములచే నేర్పడిన నదులు సమస్తసముద్రములకుఁ బ్రవహించెననియు నది సముద్రుఁ

డు సరిత్పతిగావునఁ గ్రొన్నెత్తురుటేఱులు వచ్చుచో వానిం గామించున ట్లొప్పెనని యు భావము. ఆముష్యాయణ.........నిధికిన్—ఆముష్యాయణ-సద్వంశమునందుఁ బుట్టిన; సుధీ-పండితులకు; గృహాంగణనిధికిన్-గృహమధ్యమందలి నిధియైనవానికి; అనఁగాఁ బరంపరాప్రసిద్ధులగు పండితులకుఁ గృష్ణరాయలు ముంగిటి పెన్నిధివలె సమస్తసంపత్కరుఁడై వారిని బోషించు నని భావము. 'వరభట' అని ముద్రితగ్రంథములలోఁ బాఠము కానఁబడుచున్నది. అది సమంజసముకాదు.

అలంకారములు—అసంబంధాతిశయోక్తి-ఉత్ప్రేక్షగమ్యము-కడపటి పాదమున రూపకము. అలంకారకృతాలంకారధ్వని.

క. కోదండద్రోణునకును
వేదార్థస్థాపన ప్రవీణునకు సమి
న్నేదిష్ఠ విమత తరసా
స్వాదనవశ తుందపరిమృజ కృపాణునకున్. 29

(వ్యా) కోదండద్రోణునకున్-విలువిద్యయందుద్రోణునకుసమానమైనవాఁడును; సమిన్నేదిష్ఠ...కృపాణునకున్—సమిత్-యుద్ధమునందు; నేదిష్ఠ-మిక్కిలి సమీపించిన (దగ్గఱిన); విమత-శత్రువులయొక్క; తరస-మాంసమును; ఆస్వాదన-తినుటయందు, 'పిశితం తరసం మాంసంపలలంక్రవ్యమామిషం' అని యమరుఁడు; వశ-అధీనమైనకారణముచేత, అనఁగాలోఁబడుటవలన; తుందపరిమృజ - (కడుపునిండఁగఁదిని) కడుపును దడవుచున్న, అలసమైన; కృపాణునకున్-కత్తిగలవానికి. అనఁగాఁ గృష్ణరాయనికత్తియుద్ధమునందుఁ దన్ను సమీపించిన శత్రువులను జంపి వారి మాంసములను యథేష్టముగాఁ దినుటచేఁ గడుపుఁ దడవికొనుచు సోమరియై యుండెనని భావము.

తుందపరిమృజ-తుంద-కడుపును, పరిమృజ-తడవువాఁడు (తిండిపోఁతు, సోమరి యని యర్థము.)

అలంకారము—పర్యాయోక్తి.

క. అసుహృదసుపవన విసర
గ్రసనరసవ్యసనవశవికసదసిరసనా
ప్రసరణ శయుఫణ విలసన
విసృమర మరువకిత సమరవీథీస్థలికిన్. 30

(వ్యా) అసుహృ.........స్థలికిన్—అసుహృత్-శత్రువులయొక్క; అసుపవనవిసర-ప్రాణములనెడు వాయుసమూహములను; గ్రసనరస-ఆస్వాదించు రుచియందలి;

వ్యసన-ఆసక్తికి; వశ-అధీనమై; వికసత్-విచ్చుచున్న; బయలువెడలుచున్న; అసిరసనా-కత్తియనెడు నాలుకయొక్క; ప్రసరణ-చాఁచుటను గల్గిన; శయఫణ-హస్తమనెడు పాముపడగయొక్క; విలసన-విలాసముచేత; విస్మరమరుపకిత-అధికభయంకరముగాఁ జేయఁబడిన, (మరుపః-భయానకం), (దీనియర్థ మింకను విచార్యము); సమరవీథీస్థలికిన్-యుద్ధరంగము గలవానికి.

శత్రువులయొక్క ప్రాణము లనెడు వాయువులను కృష్ణరాయని హస్తమనెడు పాముపడగయందుఁ బ్రకాశించు కత్తియనెడు నాలుక శత్రువులయొక్క ప్రాణములనెడు వాయువుల నధికముగాఁ గ్రోలుటయందు లోలుపమై చాఁచి యిటునటుఁ ద్రిప్పుటచే యుద్ధరంగము మిక్కిలి భయంకరముగాఁ జేయఁబడె నని భావము.

అలంకారము:—వృత్త్యనుప్రాసము (శబ్దాలంకారము); సావయవరూపకము.

క. వైంధ్యద్విపగంధనిబ
ద్ధాంధ్యాళి ప్రతిపదోదితాలయవిభవా
వంధ్యప్రబంధకృతి సం
బంధ్యనుభావునకు బుధితమనుభావునకున్. 31

(వ్యా) వైంధ్యద్విప.............బంధ్యనుభావునకున్—వైంధ్యద్విప-వింధ్యపర్వతభవములగు నేనుఁగులయొక్క; గంధ-వాసనలచేత; నిబద్ధ-కలిగింపఁబడిన; ఆంధ్య-గ్రుడ్డితనముగలిగిన; అళి-తుమ్మెదలచేత; ప్రతిపద-సర్వత్ర (సర్వదా అనియు నర్థము); ఉదిత-చెప్పఁబడిన (కీర్తింపఁబడినయనుట); ఆలయవిభవ-గృహవైభవముచేత(కలిగినట్టి); అవంధ్య-అధికమైన; ప్రబంధకృతి-కావ్యనిర్మాణమునకు;సంబంధి-సంబంధమైన(అనఁగాఁ గవులచేఁ బ్రబంధములందుఁ బొగడఁబడిన); అనుభావునకున్-మాహాత్మ్యముగలవానికి.

కృష్ణరాయని గృహవైభవములను వింధ్యోద్భవములగు నేనుఁగుల మదజలములఁ గ్రోలుచు మదాంధములై యున్న తుమ్మెదలు సర్వత్ర కీర్తించునటుల ఝుంకారములు చేయుచున్నవనియు నట్టిగృహవైభవముల నలరు నతనిమాహాత్మ్యమును గవులు ప్రబంధములందుఁ బొగడుదు రనియు భావము.

వైంధ్యద్విప-అని చెప్పుటచేఁ గృష్ణరాయఁడు వింధ్యపర్వతమువఱకుఁ గల దేశముల నాక్రమించె నని ధ్వని స్ఫురించెడు. ఇక్కడ శబ్దశక్తిమూలధ్వని.

బుధితమనుభావునకున్—బుధిత-తెలిసికొన్న; మను-మంత్రములయొక్క; భావునకున్-అర్థముఁగలవానికి (అనఁగా రహస్యములగు నర్థముల నెఱిఁగినవాఁ డనుట.)

క. వనితాజనతాస్మరునకు
ఘనతాపనితారకాభికద్యుచరగవీ
ఘనతాయనకారకస
త్పనితాత్మనితాంతదానపరతంత్రునకున్. 32

(వ్యా) వనితాజనతా-స్త్రీజనసమూహములకు; స్మరునకున్-మన్మథుఁడైనవానికిని (సమూహార్థమునందు "తల్" ప్రత్యయమువచ్చి 'జనతా' యనురూప మేర్పడియె). ఘనతా.........తంత్రునకున్—ఘనతాప-అధికమైనవ్యసనమును; నితారక-పోఁగొట్టుటయందు; అభిక-ఆసక్తిగల; "క్రమః కామయితాభికః కమనః కామనో౽భికః" అని యమరుఁడు; ద్యుచరగవీ-కామధేనువుయొక్క-; ఘనతాయన—ఘన-అధికమగు; తాయన-వృద్ధికి (అనఁగా గొప్పతనమునకు); కారక-హేతువైన; సత్-సత్పురుషులచేత; పనిత-స్తోత్రముచేయఁబడిన; ఆత్మ-తనయొక్క-; నితాంత-ఎడతెగని; దాన-ఈవికి; పరతంత్రునకున్-అధీనుఁడైనవానికి; కృష్ణరాయని సంతతదాన మహిమమును సజ్జనులు కామధేనువుయొక్క- యీవింబోలియుండుటచే దాని మాహాత్మ్యమువంటి దని పొగడుదు రనుట.

ఈపద్యమున ద్విప్రాసము.

క. పరిపంథి దోర్బలసమి
త్పరివర్ధిష్ణు ప్రతాపదహ నారణికిన్
సరసకళాధోరణికిన్
నరసాధిప కృష్ణరాయనాయకమణికిన్. 33

(వ్యా) పరిపంథి......దహనారణికిన్—పరిపంథి-శత్రువులయొక్క-; దోర్బల-బాహుబలమనెడు; సమిత్-సమిధలచేత; పరివర్ధిష్ణు-మిక్కిలి వృద్ధిఁబొందు స్వభావముగల; ప్రతాప-శౌర్యమనెడు; దహన-అగ్నినిబుట్టించు; అరణికిన్-కొయ్య యగువానికి; అనఁగాఁ గృష్ణరాయఁ డను నగ్నిమథనదారువునుండి ప్రతాపమనెడు నగ్ని పొడముచున్నదనియు నది శత్రువుల బాహుబల మనెడు సమిధలచే వృద్ధిఁబొందుచున్నదనియు భావము.

సరసకళా-రసవంతములైన విద్యలయొక్క-; ధోరణికిన్ - మార్గముగలవానికి; అట్టి కృష్ణదేవరాయలకు.

అలంకారము—రూపకము.

# కథాప్రారంభము

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన పారిజాతాపహా
రణం బను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టి దనిన.

(వ్యా) అభ్యుదయ-శ్రేయస్సు; మహాప్రబంధమునకున్-మహాకావ్యమునకు. నగరార్ణవాదులగు పదునెనిమిదివిషయములైనను వానం గొన్ని తక్కువగానైనను వర్ణింపఁబడియుండునది మహాకావ్య మనంబడును.

క. జనమేజయ జనవల్లభుఁ
డనుదినమును హరికథాసుధాస్వాదమునం
దనివి సనక వైశంపా
యనముని కిట్లనియెఁ గౌతుకాయత్తమతిన్.

(వ్యా) అనుదినమును-ప్రతిదినమును; సుధాస్వాదము-అమృతపానము.

సీ. హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్టు
విని కృతార్థుఁడ నైతి మునివరేణ్య
యా దానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యా యదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱ వారి కాధార మగు పారి
జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి

తే. తెలియ నానతి యిమ్ము సందియము దీఱ
వినఁగ వేడుక యయ్యె సవిస్తరముగ

ననిన నా వ్యాసమునిశిష్యుఁ డతనితోడ
నధిప విను మని పలికె నత్యాదరమున. 36

(వ్యా) ఆనుపూర్విగ౯_ఒకటివెంబడి నొకటిగా (వరుసగా);
ఒండేని_కాకున్న; పాడి_న్యాయమును; తొలఁగి_విడిచి.

చ. హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రుని యింట నున్న య
చ్చరలకొలంబువారి నెలజవ్వనముం బొలివోనివారిఁ ద
న్వరునిఁగఁ గోరువారి లలనామణులం బదియాఱువేవురం
బరిణయ మయ్యె నారదునిపంపున సౌఖ్యరసైకలోలుఁ డై. 37

సుగమము.

తే. మఱియు రుక్మిణి సత్య జాంబవతి మిత్ర
వింద భద్ర సుదంత కాళింది లక్ష్మ
ణ యనఁగా మున్న కల రబ్జనాభునకును
మహిషు లెనమండ్రు సమతాభిమానవతులు. 38

(వ్యా) మహిషులు_పట్టపుదేవులు; ఏకవచనము మహిషి.

ఉ. ఆరమణీలలామముల నందఱఁ గూడి యదూద్వహుండు త
ద్ద్వారవతీపురోపవనవాటికలం గృతకాద్రిసీమల
న్వారిధితీరకుంజసదనంబులఁ గేళితరంగిణీతటీ
కైరవిణీసహాయ మణికల్పిత సౌధముల న్వసించుచు౯. 39

(వ్యా) యదూద్వహుండు _ యదువంశము నుద్ధరించువాఁడు; కైరవిణీ
సహాయ_చంద్రుఁడు; కైరవిణీసహాయమణి_చంద్రకాంతమణి.

శా. ఏయేవేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁ దా
నాయావేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయం జూచినఁ దాన యై మెలఁగుచు న్సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుం డయి పెక్కురూపముల మాయాకల్పనాచాతురి౯. 40

(వ్యా) ఓలాడుఁ—ఓలలాడు, రూపాంతరము; తేలియాడు నని యర్థము.
ఈపద్యంబున సమత యను కావ్యగుణంబును దెలియునది.

"అవైషమ్యం క్రమవతాం సమత్వమితికీర్తితమ్" అని సరస్వతీకంఠాభరణము.

కం. దొరఁకొన్న కొలఁది విడువక, చరణపదార్థములనడక సరిసాగెడు వి
స్ఫురణ యది సమత యనఁ జను, నరయం గుకవులకు నంద దది పరికింపన్.
అని కావ్యాలంకార చూడామణి.

క. హరి యిట్లు సతుల నందఱ
సరిగాఁ జూచియును భోజజనపాలసుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్. 41

(వ్యా) భోజజనపాలసుత-రుక్మిణి; సాత్రాజితి-సత్యభామ; చనవులు-ప్రేమతోడి స్వాతంత్ర్యములు.

చ. కులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నీ
వల నల రుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా
వలఁ బచరింపఁగా రవరవ ల్వొడమె న్మది వారి కెంతయున్. 42

(వ్యా) కులము-సద్వంశజననము, ఆభిజాత్యమనుట; రూపము—చతుర్విధ భూషణములను నన్గాఁ గర్ణాభరణములగు కుండలములను గంఠాభరణములగు ముక్తాహార ములను బాదాభరణములగు నందెలను హస్తాభరణము లగు కడియములను ధరింపకున్నను నా సొమ్ములచే నలంకరించుకొన్న విధముననే ప్రకాశించునట్టి యాకారవిశేషము.

"కుండల ముక్తాహార నూపురాంగదాది చతుర్విధభూషణా
భావేపి భూషిత వదవభాసమాన ఆకారవిశేషః."

అని సంస్కృతమున రూపనిరూపణము.

"అవేధ్యారోప్యవిక్షేప్య బంధనీయై రభూషితం
యద్భూషిత మివా భాతి తద్రూప మితి కథ్యతే."

అని భావప్రకాశము.

"అంగాన్య భూషితాన్యేవ ప్రక్షేపాద్యై ర్విభూషణైః
యేన భూషిత వద్భాతి తద్రూప మితి కథ్యతే."

అని రసార్ణవసుధాకరము.

ఈవలన్_ఒకవైపున; వాసిఁజెలంగఁగన్_ప్రాభవముతోనొప్పారఁగా; ఇచ్చటఁ "జెనంగఁగన్" అని యొకపాఠము కానంబడుచున్నది కాని దానికంటె "చెలంగఁగన్" అని యుండుటయే లెస్స; ఆవలన్_మఱియొకవైపున; అనఁగా రుక్మిణికడ్డిగా; పచరింపఁగాన్_మెలఁగఁగా; రవరవలు_అసూయలు, స్పర్ధలు.

ఇందును 'సమత' యనుగుణము.

## శ్రీకృష్ణునొద్దకు నారదమునివచ్చుట.

ఉ. అంతట నొక్కనాఁడు ధవళాంబుజనేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంత గృహంబులోన శశికాంతశిలామయవేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయతనేత్రలు గొల్వ జూద మ
త్యంతవినోదకేలిమెయి నాడుచు నుండఁగ నద్భుతంబుగన్. 43

(వ్యా) శశికాంత......వేదిమీఁదన్_చంద్రకాంతమణులచేఁ గల్పింపఁబడిన తిన్నెపై.

సీ. సరిగమపధనిస సంజ్ఞస్వరంబుల
మహతి నభోవాయునిహతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణమణికమం
డలువు హస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవమంత్రావృత్తిపావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణశష్కులిక వ్రేల
సమరనృత్యోచిత చమరవాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ
తే. దేహకాంతు లకాలచంద్రికల నీన
జడలు మోక్షదుసల్లవశంక సేయ

గగనమునుండి వచ్చె నాకస్మికముగ
నారి వేరంపుఁదపసి దైత్యారికడకు. 44

ఈపద్యంబున నారదాగమనము వర్ణింపఁబడినది.

(వ్యా) సరిగమపధనిస సంజ్ఞస్వరంబులన్—సరిగమపధనియనుసంజ్ఞలుగల స్వరములచేత, ఇచ్చటఁ గడపటి 'స'కారము తారషడ్జ మని తెలియునది (మధ్యమషడ్జమని యర్థము).

"సరిగమపధని"యని సప్తస్వరంబులకు సంజ్ఞలు. సప్తస్వరములు—షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము, అనునవి.

"శ్లో. శ్రుతిభ్యస్స్యుస్స్వరాష్షడ్జ
ర్షభ గాంధారమధ్యమాః,
పంచమో ధైవతశ్చాథ నిషాద ఇతిసప్తతే
తేషాంసంజ్ఞా సరిగమపధనీత్యపరామతా. అని ప్రమాణము.

మహతి—నారదుని వీణెకు మహతి యని పేరు.

"విశ్వావసోస్తు బృహతీ తుంబురోస్తు కళావతీ
మహతీ నారదస్య స్యా త్సరస్వత్యాస్తు కచ్ఛపీ." అని ప్రమాణము.

నభోవాయునిహతిన్—(నారదుండు గగనంబునుండి వచ్చుటచే) ఆకాశవాయువుల తాఁకుడులచేత; మొరయన్—శబ్దింపఁగా; ప్రణవమంత్రా.........కర్ణశష్కులిక ప్రేలన్—ప్రణవమంత్ర—'ఓం' అను మంత్రముయొక్క; ఆవృత్తి—పురశ్చరణము చేత; పావన—పవిత్రమైన; స్ఫటికాక్షవలయంబు—స్ఫటికమణినిర్మిత జపమాల;

కర్ణశష్కులికన్—(శష్కులిక—చక్కిలము)—చక్కిలమురూపమును బోలిన కర్ణమునందు.

అక్షశబ్దవ్యుత్పత్తి:—

"ఆదిక్షాంతార్ణయోగిత్వా దక్షమాలేతి కీర్తితా
తద్వర్ణసంఖ్యై ర్మణిభి ర్జపమాలాం ప్రకల్పయేత్." అని శారదాతిలకము.

దీని వివరణము:—

"అకారాది లకారాంతం పంచాశన్మణిసూత్రకం
క్షకారం మేరుసంస్థానే లకారాది విలోమతః
వర్గాష్టకవిభేదేన శత మష్టోత్తరం భవేత్
ఏకైకాంతరితం మంత్రం జపా దేవం ఫలప్రదం."

స్ఫటికమణులతో జపించిన మోక్షము కలుగును.

'స్ఫాటికో మోక్షదః పరః' 'స్ఫాటికో మోక్షదాయకః' అని ప్రమాణము. స్ఫటికాక్షమాలను నారదుఁడు కర్ణమున ధరించెనని చెప్పఁబడి యుండుటచే దానియం దెన్నిమణు లుండెనని విచారింపఁదగు. అష్టోత్తరశతసంఖ్య యనినచో నంతటి దీర్ఘమగు జపమాలను చెవిని దాల్చుట యసంగతము కావున నమ్మునీంద్రుఁడు మోక్షార్థియగుటచే నిర్వదేనుమణులుగల స్ఫాటికజపమాలను ధరించె నని తెలియనగు. దీనికిఁ బ్రమాణము:—

"పంచవింశతిభి ర్మోక్ష స్త్రింశద్భి ర్ధనసిద్ధయః
సర్వార్థాస్స ప్తవింశత్యా పంచదశ్యాభిచారికం
పంచాశద్భిః కామ్యకర్మ సిద్ధి స్స్యాచ్ఛతు రుత్తరైః
అష్టోత్తరశతై స్సర్వసిద్ధి రక్షైః కృత స్సృజా."

కర్ణ మనఁగా నిచ్చటఁ గుడిచెవి యని తెలియునది. స్ఫటికాక్షమాలను గుడిచెవియందు ధరించుట యేల యనఁగా దక్షిణశ్రవణమునఁ బ్రణవోపదేశము చేయఁబడును గావునను నందు గంగ వసించునని యైతిహ్యము గలదు గావునను పరమపావనమైనయంగ మగుటచే దానియందు నారదుఁడు జపమాలను ధరించె నని యెఱుంగునది.

"విప్రాణాం దక్షిణే శ్రోత్రే గంగాద్యా స్సరితోఽఖిలాః
వసంతి సతతం పుణ్యా స్తస్మాత్తాం సంస్పృశేచ్ఛ్రితిం."
అని ఆశ్వలాయనస్మృతిరత్నము.

చమరవాలము—చమరమృగముతోఁకయందలి వెండ్రుకలతోఁ జేయఁబడినచామర మని యర్థము;

అకాలచంద్రికలక్ష—కాలము కానప్పటి వెన్నెలను; ఈనక్ష—కల్పింపఁగా; అనఁగా వెన్నెల కాయుటకు సమయము కాకున్నను నారదునిదేహకాంతి ధవళము కావున వెన్నెలవలెఁ గాయు చున్న దని భావము. ఆరివేరంపుఁదపసి—కలహప్రియుఁడైన ముని; ఆరివేరము—కలహము.

(వి) నారదుఁడు విష్ణుభక్తాగ్రేసరుఁడు, త్రికాలవేది, లోకానుగ్రహతత్పరుఁడు, జితేంద్రియుఁడు, సర్వజ్ఞుఁడు. అట్టి మహనీయునిఁ గలహప్రియుఁ డనియుఁ గలహభోజి యనియుఁ జెప్పఁదగునాయని శంక యెల్లరకును గలుగనోపు. నిక్కముగ నమ్మహర్షిసత్తముఁ డితరులకుఁ గావలయునని కలహములఁ బొసఁగించి వేడుకఁ జూచువాఁడుకాఁడు. అయినను జనులకుఁ గర్మవశంబున నేయేఫలంబులు సంప్రాప్తములు

కాఁగలవో వానిం బడయుట కనురూపములగు కార్యములం బ్రవర్తింపఁజేయునట్లు లా మునీంద్రుఁడు జనుల కుత్సాహంబుఁ గల్పించునని యెఱుంగునది. అట్లుచేయుట కలహం బులపగిదిఁ గానంబడును. ఇక్కడ నారదమహర్షి ని 'అరివేరంపుఁదపసి' యని చెప్పు టచే నితఁడు సత్యభామకును కృష్ణునకును గలహము లొనరించుటకై వచ్చినవాఁడు కావున నీపద మిక్కడ సాభిప్రాయం బై యున్నది.

అలంకారములు—"మహతి నభోవాయునిహతి మొరయఁగ", అనుచోట సంబం ధాతిశయోక్తి—పురుష వ్యాపారము లేకయే వీణపలుకుచున్నట్లు చెప్పుటచే విభావనాలంకా రము ప్రతీయమానము.

ఇది యలంకారకృతాలంకారధ్వని.

ఇచ్చట నారదునివీణ యతిసుకుమారముగాఁ జేయఁబడిన దని స్ఫురించెడు.

"దేహకాంతు లకాలచంద్రికల నీనఁగ", అనుచోట నారదాగమనము రుక్మిణీ కృష్ణులకును దదితరులకును జంద్రికాప్రసరణమువలె హృదయాహ్లాదకరమై యొప్పెననిధ్వని.

"మోక్షద్రుమపల్లవశంక సేయఁగ", అనునెడ నుత్ప్రేక్ష; రూపకానుప్రాణితము. ఇట 'శంక'యను పద ముండుటచే నిది భ్రాంతిమదలంకార మనుశంక గలుగవచ్చునుగాని యది భ్రాంతియే.

"మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవ మాదిభిః
ఉత్ప్రేక్షావ్యజ్యతేశబ్దై రివ శబ్దోఽపి తాదృశః"

అని యాచార్యదండికృతకావ్యాదర్శమునఁ బ్రమాణము.

ఇచ్చట నారదమహర్షి జడలను గాంచి యెవరును మోక్షవృక్షపల్లవములని భ్రమపడ లేదు. కావున నిట నుత్ప్రేక్షయే యని తెలియవలయు.

"అరివేరంపుఁదపసి" యనుచోటఁ బరికరాలంకారము.

క. వచ్చినమునిపతి కెదురుగ
వచ్చి నమస్కృతు లొనర్చి వనితయుఁ దానుం
బొచ్చెంబు లేనిభక్తి వి
యచ్చరరిపుభేది సలిపె నాతిథ్యంబుఁ. 45

(వ్యా) పొచ్చెంబులేని—తక్కువకాని; వియచ్చరరిపుభేది—వియచ్చర—ఆకాశమునందు సంచరించువారు (దేవతలు), వియచ్చరరిపు—దేవతలకు శత్రువులు (రాక్ష

నులు), వారిని సంహరించినవాఁడు వియచ్చరరిపుభేది; పెద్దలు చిన్నవారియొద్దకు వచ్చు నపుడు వీరిప్రాణములు భయగౌరవములచే శరీరములనుండి లేచి వెడలు ననియు వీరా పెద్దలకుఁ బ్రత్యుత్థాననమస్కారములఁ జేసిన మఱల నాప్రాణములు తమశరీరముల యందే నిలుచు ననియు స్మృతులు నుడువుచున్నవి.

శ్లో. ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతి యూనస్థ్సవిర ఆగతే
ప్రత్యుద్గమాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే. అని మనుస్మృతి.

కృష్ణుఁడు భగవంతుఁడుఁ బరమాత్ముఁడునైనను బ్రకృతిమున మనుజరూపమున నవతరించుటంజేసి సనాతనుఁడగు నారదమహర్షి కంటెను నెంతయో చిన్నవాఁడు గావునఁ గృష్ణుఁ డార్యధర్మమును బాటించి యాసంయమీంద్రునకుఁ బ్రత్యుత్థాననమస్కారములఁ జేసె నని తెలియునది.

తే. అపుడు రుక్మిణి కనుసన్న నబ్జముఖులు
రత్నసింహాసనంబు నారదున కిడిరి
హరియు నమ్మౌనియనుమతి నర్హపీఠ
మున సుఖాసీనుఁ డయి కరంబులు మొగిడ్చె. 46

సుగమము.

క. సురసంయమివర మీ రిటు
కరుదేరఁగ నిప్డు డేఁ గృతార్థుఁడ నయితిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిది యకారణము సుమీ. 47

(వ్యా) నిరతంబు_ఎల్లప్పుడు; ఇది దేశ్యశబ్దము. సంస్కృతమైనచో మిక్కిలి యాసక్తి గల దని యర్థము.

ఇది_ఈవిషయము, అనఁగా నాపైఁ గరుణ గలిగియుండుటయను నీవిషయము; అకారణము_నిర్హేతుకము.

(వి) భారతమున 'నిరత'మను పదము దేశ్యముగాఁ బ్రయోగింపఁబడియున్నది.

*తరువోజ: నిరతంబుగా నేను నీవను భేద నియమంబులేకున్కి నిక్కము మనకు
నిరువురకును నీకు నిష్టుండ నాకు నిష్టుండు మఱి నీ కనిష్టుండ నాకుఁ

గరపునిష్ఠుం డట్లు కౌనమ్ము మనుచు ఘనభుజుల్ భువనోపకారైకమతులు
హరియుణనర్జునులుఁ బ్రియముతోడఁదగిలి యన్యోన్యహితభాష లాడుచు
న్నంత"]

ఆరణ్యపర్వము. ఆశ్వాసము, 1.

కం. "నిరతము రాక్షసభావముఁ, జొరనీయక నీ విట్లు ధర్మబుద్ధి వసుట య
చ్చెరు విది కావున నీకును, దిరముగ నమరత్వమిచ్చితిని గృప వత్సా"

ఆరణ్యపర్వము. ఆశ్వా. 6.

ఈపట్టులలో 'నిరతము' అనుటకు 'సతతము' అను నర్థముపొసఁగదనియు 'నిశ్చయముగా' అనునర్థము చెప్పవచ్చు ననియుఁ దోఁచెడు.

క. నావుడు శౌరికి ని ట్లను
నా వేలుపుఁదపసి మర్త్యుఁ డాడెడిరీతిన్
నీ విట్లు పలుక నుచితమె
యే విశ్వజనీనచరిత యెఱుఁగ నె నిన్నున్. 48

(వ్యా) విశ్వజనీనచరిత—ప్రపంచమునందలి సర్వజనులకు హితమైన చరిత్రము గలవాఁడా.

కావ్యగుణము—సౌశబ్ద్యము.

సంస్కారవిశేషశాలి శబ్దప్రయోగము సౌశబ్ద్యమనంబడును.

"శబ్దశాస్త్రేణవిజ్ఞేయా శ్లాఘ్యసంస్కారశాలితా,
శబ్దానాం విద్యతేయత్ర సౌశబ్ద్యం తత్రకథ్యతే."

—అని లక్షణము.

"సుపాంతిఙాంచవ్యుత్పత్తి స్సౌశబ్ద్యమితి కథ్యతే"

—అనియుఁ గలదు.

ఈయాశ్వాసమందు 25వ పద్యమునందలి "సుభగంభావుక" యను పదమును 28వ పద్యములోని "కూలముద్రుజ"యను పదమును "నాముష్యాయణ"యను పదమును 29వ పద్యములోని "నేదిష్ఠ" "తుందపరిమృజ" శబ్దములును వ్యాకరణశాస్త్రసంస్కారవిశేషోత్పన్నములు కావున నచ్చటను సౌశబ్ద్యమను గుణమును గాంచునది. ఈ శబ్దముల రూపనిష్పత్తింగుఱించి పీఠికలో విస్తరించి వ్రాయఁబడియున్నది.

## నారదుండు శ్రీకృష్ణుని స్తుతించుట

సీ. ప్రామినుకులదొంగఁ బాతాళకుహరంబుఁ
  జొరఁబాఱి చీఱినచోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁ దాల్చి వేల్పులఁ గూటి
  చవిఁ దేల్చినట్టి కచ్ఛపమ వీవ
నీటిలోఁ మునిఁగిన నేలచేడియఁ గొమ్ము
  కొన నుబ్బ నెత్తిన ఘోణి వీవ
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
  క్కఱఁ గాచినట్టి సింగంబ వీవ
తే. దితిజు మెట్టిన యా పొట్టిదిట్ట వీవ
పుడమిఱేఁడుల నడఁచిన ప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బి వీవ
యిపుడు ద్వారక వసియించునీవు నీవ. 49

ఈపద్యమున విష్ణుదేవుని దశావతారములలోఁ గృష్ణావతారమువఱకుఁ గల యవతారములు ప్రాయికముగా నచ్చతెలుఁగు మాటలతో వర్ణింపఁబడినవి.

(వ్యా) ప్రామినుకులు_ప్రాఁతపలుకులు, అనఁగా వేదములు; దొంగన్_సోమకాసురుని; చీఱిన_చంపిన; చోఱవు_మత్స్యవిశేషమవు(మత్స్యావతారము); తరిగొండన్_మందరపర్వతమును; కూటిచవిన్_ఆహారరుచియందు (అనఁగా నమృతపానముఁ జేయించి); తేల్చిన_సంతోషపఱచిన; కచ్ఛపము_తాఁబేలు (కూర్మావతారము); నేలచేడియన్_భూసతిని; ఘోణి_పంది (వరాహావతారము); మునిమాపు_మాపు_రాత్రి; మునిమాపు_రాత్రికిఁబూర్వమైన కాలము; అనఁగా సాయంకాలము; సింగంబు_సింహము (నృసింహావతారము; దితిజున్ _ బలిచక్రవర్తిని; మెట్టిన _ అణఁచిన; పొట్టిదిట్ట _ వామనస్వామి (వామనావతారము); పుడమిఱేఁడులనడఁచినప్రోడ___(పరశురామావతారము); కడలిఁ గోలకుఁ దెచ్చిన___సముద్రముపై బాణముఁ బ్రయోగించి యాతనిగర్వము నణఁచిన; గబ్బి_శూరుఁడు (రామావతారము); నీవు నీవ_నీవు సర్వాంతర్యామియగు పరమాత్మవే యని భావము.

అయినను శ్రీకృష్ణుఁడు దశావతారాంతర్భూతుఁడు కాఁడనియుఁ సాక్షాద్భగవంతుఁడే యనియు భాగవతము నుడువుచున్నది. "ఏతేంశాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్" శ్రీభాగవతము స్కంధము. 1. అధ్యా. 3. శ్లో. 2.

ద్వారకవసియించు నీవనుటచే బలరామావతారమును జెప్పఁబడినది. బలరామకృష్ణు లొక్కఁ యవతారముగానే భావింపఁబడుదురు. దీనికిఁ బ్రమాణము:—

ఆయుధ ప్రగ్రహౌ వీరౌ తావన్యోన్య మయా వృథౌ
పూర్వజానుజ సంజ్ఞౌతు రామ గోవిందలక్షణౌ
సమరే ఽప్రతిరూపౌతౌ విష్ణురేకో ద్విధాకృతః
ద్విషత్సు ప్రతికుర్వాణౌ పరాక్రాన్తౌ యథేశ్వరౌ.

హరివంశవిష్ణుపర్వము. అధ్యా 17. శ్లో. 18.

క. రక్కసిమగువల యీలువు
మొక్కపఱిచెదవు పాపములగమి కాలం
ద్రొక్కెదవు నీవ యింకిట
నిక్కముగా నిన్నుఁ బొగడ నేర్తునె కృష్ణా. 50

(వ్యా) ఈవ—నీవే; రక్కసిమగువల—రాక్షసస్త్రీలయొక్క; ఈలువుల్—పాతివ్రత్యమును; మొక్కపఱచెదవు—చెఱుపఁబోయెదవు (భవిష్యదర్థము); ఈవాక్యము బుద్ధావతారమును నుడువుచున్నది; పాపములగమిఁ గాలంద్రొక్కెదవు—ఇది కల్క్యవతారమును సూచించుచున్నది.

క. ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి మీర లిచ్చట నునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర ముకుంద మురారీ. 51

సుగమము.

వ. అని యిట్లు బహుప్రకారంబులం బ్రశంసించి యవ్విరించినందనుం డమందానందంబు డెందంబునం గ్రందుకొన నిజవాసనా బిరుదగాథా కథనవందిబృందాయమానేందిందిరంబును నుచితోపయోగజనితానందబాష్పసందోహ శంకావహ మకరందబిందుతుందిలంబును నిఖిల మనోరథప్రదానకీర్తిశంకాకరవిశదప్రభానిచుళితంబును నగు పారి

జాతంపుఁ గ్రొన్నన మిన్నేటిపసిండినెత్తమ్మిచిగురుటాకునం బొదివి
యిచ్చిన. 52

ఇందుఁ బారిజాతకుసుమము వర్ణింపఁబడినది.

(వ్యా) నిజవాసనా...దిందిరంబును—నిజవాసనా—తన పరిమళముయొక్క (అనఁగాఁ బారిజాత కుసుమపుఁ బరిమళముయొక్క); బిరుదగాథా — బిరుదగానములను (అనఁగా స్తుతిపాఠములను); కథన — చెప్పెడు; వంది బృందాయమాన — వంది బృందమువలె నాచరించుచున్న; వంది — స్తుతి పాఠకుఁడు, బట్టువాఁడని యర్థము; ఇందిందిరము — తుమ్మెదలు కలది. అనఁగాఁ బారిజాతకుసుమ పరిమళముచే నాకర్షింపఁబడి యందలితేనియం ద్రాగుటకై తుమ్మెదలు మూఁగుచున్నవనియు నవి చేయు ఝుంకారము లా కుసుమరాజ పరిమళమును బొగడుచున్నట్లుండెననియు భావము. ఉచితోపయోగ...తుందిలంబును—ఉచితోపయోగ—అర్హమైన యుపయోగముచేత (నారదుఁడు కృష్ణుని కొసంగుటయనెడు నర్హోపయోగముచేత); జనిత—కలిగిన; ఆనందబాష్పసందోహ—ఆనందాశ్రువులగుంపు లనెడు; శంకావహ—సందేహమునుగల్గించు; మకరందబిందు—తేనెబొట్టులచేత; తుందిలంబును—బలిసినదియు; అనఁగా భారముకలిగినదియనుట; నిఖిలమనోరథ...నిచులితంబును—నిఖిలమనోరథప్రదాన—ఎల్ల కోరికల నిచ్చుటవలనఁ బొడమిన; కీర్తిశంకాకర—కీర్తి యను సందేహమును గలిగించు; విశదప్రభా—తెల్లని కాంతులచేత; నిచులితంబు—కప్పఁబడినది; అనఁగాఁ బారిజాతకుసుమము తెల్లదగుటచే దానిచుట్టును ధవళకాంతు లలమియున్నవనియు నవి యాపుష్పము సర్వాభీష్టముల నొసంగుటచేఁ గలిగినకీర్తులో యనునట్లుండెననియు భావము. కీర్తి ధవళ మని యెఱుంగునది. కీర్తిని ధవళ మని వర్ణించుట కవిసమయము. కవిసమయము లనఁగాఁ గవు లవలంబించుసంప్రదాయములు; అవి యనేకములు గలవు. కీర్తిని తెలుపుగాను క్రోధము నెఱుపుగాను నాకాశమును నీలముగాను వర్ణించుట, కొన్నివృక్షములను లతలుగా వర్ణించుట, వసంతమునందే కోయిల లుండుట, మానససరోవరంబున మరాళములుండుట, చక్రవాకదంపతులు రాత్రులలో వియోగమును బొందుట, చకోరపక్షులు చంద్రకిరణములనే భుజించుట, చాతకములు వాననీళ్లనే పానము సేయుట, మొదలగునవి; క్రొన్నన—క్రొత్తపువ్వు; అప్పుడు కోసినపువ్వ మనుట; మిన్నేటి...చిగురుటాకు—మిన్నేటి—ఆకాశగంగయందలి; పసిండినెత్తమ్మి—బంగారుతామరయొక్క; చిగురుటాకునన్—పల్లవమునందు; పొదివి—చుట్టి.

అలంకారము—మూఁడుసమాసవాక్యములలోనుత్ప్రేక్ష.

(వి.) నారదాగమన పారిజాతకుసుమప్రదానము లీకావ్యమందు వర్ణ్యమానంబగు కథామహీరుహంబునకు బీజావాపం బని యెఱుంగునది.

క. వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డాక్రో
న్నన గయికొని భీష్మకనం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలువన్. 53

(వ్యా) విస్మయంబు—అపూర్వవస్తువును జూచుటచేఁ గలుగు చిత్తవిస్తారము.
'అపూర్వదర్శనాచ్చిత్తవిస్తారో విస్మయో మతః' అని లక్షణము.

—రసార్ణవసుధాకరము.

భీష్మకనందనన్ — రుక్మిణిని; తలఁపున నిలువన్ — జ్ఞప్తికి రాఁగా, స్మరించి.

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి దాని కే నిపుడు ప్రేమం బంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకొ యా లెమ్మిందు నే నున్కిఁ జె
ల్లదువో యేరికిఁ బంపఁగా ననుచు లీలన్ రుక్మిణీకాంతకున్. 54

(వ్యా) ఎల్లిదము—గేలి, అవమానము, చులకన; ఔ లెమ్మ—సరేకాని; ఇది వితర్కాంతరభావినిశ్చయమును దెలుపును; ఇందు నే నున్కిన్—ఈ రుక్మిణియింట నే నుండుటచే; ఏరికిఁ బంపఁగాఁ జెల్లదు—ఇతరులకెవరికిని బంపుట తగదు; వో—వోమ్మ, అనుట; ఇది నిశ్చయదార్ఢ్యమును దెలుపును; రుక్మిణీకాంతకున్—దీనికి మీఁదటిపద్యమందలి 'యిచ్చినన్' అను పదముతో నన్వయము. కావున నీరెండుపద్యములలో భావము మిళితమై యుండుటఁ జేసి యుగ్మ మనంబడును.

"శ్లో. ద్వాభ్యాం యుగ్మమితిప్రోక్తం త్రిభిః శ్లోకై ర్విశేషకం
కాలాపకం చతుర్భిస్స్యా త్తదూర్ధ్వం కుళకం స్మృతం."

అని ప్రమాణము.

అయినను గొందఱు రెండుశ్లోకములకును గుళకమనియే వక్కాణించియున్నారు.

చ. కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక న్మునినాథుని కన్నుసన్న ని
చ్చినఁ దగ భోజనందనయుఁ జేకొని మానికి మ్రొక్కి యవ్విరిం

దన నెఱిగొప్పునం జెరివిన న్వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ
తనెల ధరించిన ట్లమరెఁ దద్దయు మోహనకాంతిసంపదన్. 55

(వ్యా) మునినాథుని కన్నుసన్నన్—కృష్ణుఁడు స్వయముగానే పారిజాత పుష్పమును రుక్మిణికే యొసంగుటకుఁ దనమనంబున నిశ్చయింపఁగాఁ దన్నిశ్చయచ్యుతి కాకుండునట్లు నారదుఁడును బుష్పమును రుక్మిణీదేవి కిమ్మని నయనసంజ్ఞ చేసి పురి కొల్పె నని భావము.

చెరివినన్—చెక్కుకొనఁగా; వలిగుబ్బలిముద్దుపట్టి—మంచుకొండ యను హిమవంతునికూఁతురు, పార్వతి; లేఁతనెలన్—బాలచంద్రుని.

అలంకారము—ఉపమ.

సీ. మగమీల నగఁజాలు తెగఁగీలుకొను వాలు
కనుఁగవ కొక వింతకాంతి యొదవె
వలిజక్కవల పెక్కువలు దక్కువగ నిక్కు
చనుదోయి కొక వింతచాయ దోఁచె
నెలతుమ్మెదలదిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము
గలవేణి కొక వింతనలుపు మీఱె
నల చెందొవలవిందు చెలు వెందు వెదచిందు
మొగమున కొక వింతజిగి దొలంకెఁ
తే. జక్కఁదనమున కొక వింత చక్కఁదనము
జవ్వనంబున కొక వింతజవ్వనంబు
విభ్రమంబున కొక వింతవిభ్రమంబు
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి. 56

ఈపద్యమునఁ బారిజాతకుసుమధారణమువలన రుక్మిణీదేవికిఁ గలిగిన సౌందర్యాతిశయము వర్ణింపఁబడినది.

(వ్యా) మగమీలన్—గండుఁజేపలను; నగఁజాలు—తిరస్కరించు; అనఁగా మిక్కిలి ప్రకాశమానమగు; వాలుకనుఁగవకున్—విశాలమైన నేత్రద్వయమునకు; వింత కాంతి—అపూర్వమగు శోభాతిశయము; వలిజక్కవల—గుండ్రములగు చక్రవాకపక్షుల

యొక్క; జక్కవయని రూపాంతరము; పెక్కువలు—అతిశయములను; తక్కువగన్—క్రిందుపఱచునట్లు; ఎలతుమ్మెదలదిమ్ము—లేఁదేఁటులగర్వమును; వెలిఁజిమ్ము—పోఁగొట్టు; చెందొవలవిందు—చంద్రునియొక్క; చెలువు—అందమును; ఎందున్—ఎచ్చటను; వెదచిందు—ప్రసరింపఁజేయు; విభ్రమము—విలాసము.

కాంతి—మన్మథాప్యాయనోజ్జ్వల మగు శోభ.

"రూపయౌవనలావణ్యభోగాదిసొబగు, సుందరులకెల్ల రసికులు శోభ యంద్రు
దనరుననోన్యతుల్యగాత్రములయందుఁ, గడఁగి పెట్టనితొడవయి కానఁబడుచు".
"ఆశోభయ రంజనగుణ, పేశలయై మించుగలిగి పెరసినవిద్యా
కౌశలులు కాంతియంద్రు ప్ర, కాశప్రతిభాప్తినెఱుఁగఁగాఁదగు బుద్ధిన్."

—అని కావ్యాలంకారచూడామణి.

చక్కఁదనము—సౌందర్యము—అనఁగా నన్నియవయవముల సంధిబంధములు లెస్సగాఁ గూర్పఁబడి యమర్పఁబడియుండుట.

"అంగప్రత్యంగకానాం య స్సన్నివేశో యథోచితం
సుశ్లిష్టం సంధిబంధస్స్యా త్తత్సౌందర్య ముదీర్యతే"

—అని రసార్ణవసుధాకరము.

జవ్వనంబు—యౌవనము; పదునాఱు సంవత్సరములు మొదలు ముప్పదిసంవత్సరములవఱకుఁ గల ప్రాయము యౌవన మనఁబడును. పదునాఱవసంవత్సరమువఱకు బాలయనియు ముప్పదియొకటవ సంవత్సరము మొదలు యేఁబదియేనుసంవత్సరములవఱకుఁ ప్రౌఢయనియు నంతకుఁ బైని వృద్ధ యనియుఁ జెప్పఁబడును.

"యావత్ షోడశసంఖ్య మబ్దముదితా బాలా తతస్త్రింశతం
తావ త్స్యా త్తరుణీతి బాణవిశిఖైస్సంఖ్యాతు యావద్భవేత్
సా ప్రౌఢేత్యభిధీయతే కవివరై ర్వృద్ధా తిమూర్ధ్వం స్మృతా
నింద్యా కామకలాకలాపవిధిషు త్యాజ్యా సదా కామిభిః"

—అని ప్రమాణము

"రతివ్యాయామసహనో మత్తేభస్యేవ మత్తతా।
విస్ఫీతేయాంగభావో య స్తద్యౌవనముదాహృతమ్"

అని యౌవనలక్షణము.

యౌవనము నాలుగువిధములు—అవి యలంకారశాస్త్రమువలనఁ దెలియనగు—గ్రంథవిస్తరభీతిచే నిచ్చట లిఖింపఁబడవయ్యె.

విభ్రమము—విలాసము—దీనిలక్షణము.

"బిట్టునిజప్రియునంగన, కట్టెదురం జూచి యంగకంబులమీఁదన్
బుట్టించినయొయ్యారము, చిట్టాడుల యని విలాసచిహ్నాంబరయన్"

—అని కావ్యాలంకారచూడామణి.

"ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః
తాత్కాలికోవిశేషోయ స్సవిలాస ఇతీరితః"

—అని రసార్ణవసుధాకరము.

ఈపద్యమున లలిత మను ననుభావము వర్ణింపఁబడినది.

లలితలక్షణము:—

"విన్యాసభంగిరంగానాం భ్రూవిలాసమనోహరా
సుకుమారాభవేద్యత్ర లలితం తదుదీరితం"

—అని రసార్ణవసుధాకరము.

ఇందుఁ గావ్యగుణములు— సమత-ప్రసాదము-మాధుర్యము - సౌకుమార్యము-కాంతి మున్నగునవి సుస్పష్టంబులు.

మఱియు శృంగారరసము-ద్రాక్షాపాకము-కైశికీవృత్తి-వైదర్భీరీతి. వీనింగాంచునది.

ఇవి ప్రాయికముగా నీకావ్యమునందంతటను గన్పట్టు. బుద్ధిమంతులందిందుఁ గాంచి యానందింతురుగాక.

(వి) శృంగారరసమును కైశికీవృత్తియు సామవేదోద్భవములు గాన గానయు క్తముగాఁ జదువుట కివి యనుకూలములుగా నుండును.

శృంగారరసము సామవేదజన్యమనుటకుఁ బ్రమాణము:—

"వరనవస్థాయిభావములలోఁ జెప్పిన రతియె విభావాదిగంజనముల
నయ్యెను శృంగారమది నీలవర్ణంబు నెన్నునిమెన సామవేదవంశ
వర్యంబు గను సౌకుమార్యంబు కైశికీవృత్తిని మధురతావిషమునందు
సుప్రసాదాభిధానప్రాణభణితిని విరచింపనొప్పుఁ గవిత్వమునను"

—అని యప్పకవీయము.

కైశికీవృత్తి సామవేదభవమనుటకుఁ బ్రమాణము:—

"భారతీసాత్వతీ చైవ కైశిక్యారభటీతిచ
చతస్రోవృత్తయ స్తాసాముత్పత్తిర్వక్ష్యతే స్ఫుటమ్,

ఋగ్వేదాచ్చ యజుర్వేదా త్సామవేదాదధర్వణః
భారత్యాద్యాః క్రమాజ్జాతా ఇత్యన్యేతు ప్రచక్షతే."

—అని రసార్ణవ సుధాకరము.

క. కలకంఠకంఠి యీగతిఁ
బులుగడిగిన ముత్తియంపుఁ బోలుపొందంగా
నెలనవ్వొలయఁగఁ బలికెను
జలజాసనుపట్టి కలహసంభ్రమపరుఁ డై. 57

(వ్యా) కలకంఠకంఠి—కోకిలస్వరముఁబంటికంఠధ్వని కలది; ఈగతిన్—ఇట్లు పులుగడిగిన ముత్తియము—పులు—మాలిన్యము (అనఁగా దోషము); కడిగినముత్తియము—పోఁగొట్టఁబడిన ముత్యము.

నారదుఁడు రుక్మిణికిఁ బారిజాతకుసుమప్రభావంబు సెప్పుట

సీ. జలజాక్షి యిది పారిజాతప్రసూనంబు
నరులకు ధరియింప నరిది సూవె
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు
హరిబహిఃప్రాణంబ వగుట నేఁ డెఱుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన
వెలఁదులు పదియాఱువేవురలో నెన్న
సరి లేదు సౌభాగ్యగరిమ నీకు

తే. నీవు దాల్చినకతన నీ పూవు నేఁడు
భాగ్యము వహించె నుచితోపయోగ్యవృత్తి
నీప్సితార్థంబు లొడఁగూర్చు నిది లతాంగి
దీనిమహిమంబు చెప్పెదఁ దెలియ వినుము. 58

ఈపద్యము మొద లఱువదిమూఁడవపద్యమునఱకుఁ బారిజాతప్రసూనమాహాత్మ్యము వర్ణింపఁబడియె.

(వ్యా) అరిది—దుర్లభము; పౌలోమి—శచీదేవి; పద్మ—లక్ష్మి; పద్మజు రాణి—సరస్వతి; హరిబహిఃప్రాణంబవు — కృష్ణునకు నీవు వెలుపల సంచరించు ప్రాణము వంటిదానవు; అనఁగాఁ బ్రాణసమానురాల వనుట.

గంగానదీతీరమునఁ బుట్టినదికావునఁ బారిజాతంబను పేరుగలిగె.

“పారేజాతో విష్ణుపద్యాః పారిజాత ఇతీరితః” అని హరివంశము.

ఇందుఁ గావ్యగుణములు—మాధుర్యము—ప్రసాదము—అర్థవ్యక్తి.

క. పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగభరభరితం బై
నిరతము జగదేకమనో
హర మగు నీ కుసుమరాజ మంబుజవదనా. 59

(వ్యా) పరువము—ప్రాయము.

కావ్యగుణములు—ప్రసాద సౌకుమార్యములు.

మ. అళినీలాలక నీవు నీపతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకుర మై రతిశ్రమ తనూసంజాతధారాళఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటి యై రంజిల్లు నిచ్ఛాగతిన్. 60

(వ్యా) లతాంతాయుధసంగరంబునకున్—రతిక్రీడకు; ఘర్మలవంబుల్—చెమట బొట్టులు; సురటి—విసనకఱ్ఱ.

కావ్యగుణము—ఔదార్యము.

చ. అడిగినయంతలోన సరసాన్నముల న్నమకూర్చు నాఁకట
న్నడలికఁ జెందనీక యశుభంబు లడంచు జగత్త్రియంబునం
బడయఁగరాని సర్వగుణభవ్యము సు మ్మిది దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావముల్. 61

(వ్యా) అడిగితయంత లోన—అడిగినయప్పుడే.

చ. కువలయపత్రనేత్ర నెఱిగొప్పున నీ కుసుమంబు దాల్చుటన్
సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింపఁగా
ధవుఁ డఱలేనికూర్మి జవదాఁటక నీ పలు కాదరింపఁగా
నవిరళభోగభాగ్యమహిమాన్విత వై విహరింతు గావుతన్. 62

(వ్యా) అఱలేని_అడ్డులేని; జవదాఁటక_హద్దు నతిక్రమింపక.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిం
గలిగించు నీ లతాంతము
కొలఁదులు చెప్పంగ నిచ్చక్రొత్తలు సుమ్మీ. 63

(వ్యా) కొలఁదులు_మహిమలు.

క. అలరుంబోఁడులలోపల
నలరుం బోఁడుములు నీకు నగ్గల మగుచున్
దలఁ పూవాడక యుండుము
తలపూవు ధరించి వికచతామరసాక్షీ. 64

(వ్యా.) పోఁడుములు—సౌభాగ్యములు; అగ్గలము—అతిశయము; తలఁపూవాడక సంకల్పము చలింపక (నిశ్చలురాలై); తలఁపు—ఊవాడక; ఊవాడక—ఊఁగాడక అను టకు రూపాంతరము; వికచ—వికసించిన.

శబ్దాలంకారము—యమకము.

ఉ. ఇన్ని దినంబులు న్నవతు లిందఱిలో నలసత్యభామ క
న్నన్నలఁ గ్రిమ్మరున్ హరి వశంవదుఁ డై యన విందుఁ గాని యో
కన్నియ నీమెడం గలుగుగారవ మెయ్యెడఁ జూచి కాన లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికి నైన నిచ్చెనే. 65

(వ్యా.) వశంవదుఁడు—వశవర్తి; స్వాధీనుఁ డనుట.

ఉ. చక్కనిదాన నంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కినదాన నంచుఁ బతి యెంతయు నా కనురక్తుఁ డంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
గ్రుక్కక యున్నె నీమహిమ సూచినబోటులు విన్నవించినన్. 66

(వ్యా.) గణింపదు_లక్ష్యపెట్టదు ; ఇంతకున్_నీ వీకుసుమధారణము చేసిన విష యము తెలిసెనేని; నీమహిమ.........విన్నవించినన్; అని చెప్పుటచే నీయిప్పటి

ప్రాభవము నిశ్చటఁ గనుంగొనినచేడియలు సత్యభామతో నీవృత్తాంతముఁ జెప్పవలయునని నారదుఁడు సూచించె ననుధ్వని స్ఫురియించెడిని.

సత్య—సత్యభామ-'నామైదేక శేనామగ్రహణమ్' అనిప్రమాణము.

(వి.) 61-వ పద్యములో నారదుఁడు "దీనిఁదాల్చి యిప్పఁడంతులలోఁ గనుంగొనుమపారమహోమహిమానుభావముల్" అనియు నీవీపసుమముం దాల్చుటచే 62వ పద్యములో "సవతులు వచ్చి నీచరణసారసయుగ్మము నాశ్రయింతు"రనియు 64-వ పద్యములో "అలరంబోఁడులలోపల నీపుఁ బోఁడుము లగ్గలముగనలరు"ననియు రుక్మిణీదేవితోఁ జెప్పి యాయువతి సవతులకందఱికిని నాసుందరిపై ననూయకలుగునట్లు చేసినదియుఁగాక 65 వ పద్యమునందును నీపద్యమునందును సత్యభామ కత్యంతకోపాసూయాదు లుదయించుటకై యామెసపత్ని యామెను దూషించి రుక్మిణిని భూషించి వర్ణించె నని యోజింపఁగునది.

క. ధరియించినమొద లొకవ
త్సరమాత్రము తావకీనధమ్మిల్లములో
నిరవుకొని మగుడ నివ్విరి
తరుణీ యలపారిజాతతరువున కరుగున్. 67

(వ్యా.) ధమ్మిల్లము_కొప్పు; ఇరవుకొని_ఉండి.

పారిజాతకుసుమవృత్తాంతమును జెలి సత్యభామ కెఱింగించుట

తే. అనుచు నారదుఁ డాడినయట్టిపలుకు
లచటివృత్తాంత మంతయు నరసి పోయి
వేఱువేఱన సఖులు దేవేరులకును
విన్నవించిన వారును జిన్నవోయి. 68.

(వ్యా.) దేవేరులు__మహిషులు.

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గానఁ బూవు గో
విందుఁడు దాని కిచ్చెఁ దగవే యని లక్షణ యోర్చెఁ బైఁ చెఁ గా
ళింది శమించె భద్ర యవు లెమ్మని యూఱడిలె న్సుదంత లోఁ
గుందుట మానె జాంబవతి కోప మడంచెను మిత్రవిందయున్. 79

(వ్యా.) తగవే — న్యాయమే.

కావ్యగుణము — మాధుర్యము.

తే. వారిలోపల సౌందర్యవతియు, మాన
వతియు, మహనీయసౌభాగ్యవతియు నైన,
సత్య యంతట నేమొకో శౌరికడకుఁ
బోయి రాదయ్యెఁ జెలి ప్రొద్దు వోయె ననుచు. 70

(వ్యా.) "మహనీయసౌభాగ్యవతి" అనుచోటఁ గర్మధారయసమాసముమీఁద మత్వర్థప్రత్యయము రాదను విధికి "సర్వధనీ" త్యాదిమహాభాష్యప్రయోగమున బాహుళకత్వము గావున నీప్రయోగము సాధు వని యెఱుంగునది. 'యద్యపినీలరూపవత్వరోయం' అని మనోరమయందుఁ బ్రయోగము. ప్రాశస్త్యార్థద్యోతకముగ మతుప్ప్రత్యయము ప్రయుక్తమనియుఁ జెప్పనగు.

మ. తనశృంగారవనంబులో నగిరిసాంతం జక్కఁగా దిద్ది తీ
ర్చినపూఁదేనియయేటికాలువదరిం, జెంగల్వపుప్పొళ్లు నిం
చిన చంద్రోపలవేదిపై, సరసగోష్ఠి న్బోటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణము ల్వాక్రుచ్చి వర్ణించుచున్. 71

(వ్యా.) సాంతన్ — సమీపమునందు; "లోనగిరిసాంతన్" అని పాఠాంతరము.

కావ్యగుణములు — అర్థవ్యక్తి-ప్రసాదము-సౌకుమార్యము.

చ. అలికులరావముల్ కిసలయాకుల కోకిలకాకు కాకలీ
కలకలనాదము ల్సెలఁగఁ గమ్మనితెమ్మెరలంకు తెమ్మెర
ల్వొలయఁగఁ దొంటిచందమున బుద్ధికి నేమియు నింపు గామికిం
గలఁగుచు సత్యభామ చెలిఁ గన్గొని యించుక సంశయించుచున్. 72

(వ్యా.) కిసలయాకుల......... నాదముల్ — కిసలయ-చిగుళ్లయందు; ఆకుల — ఆసక్తమైన; చిగుళ్లఁ దినుటయందు వ్యగ్రములయిన యని భావము; కోకిల-కోవెలల యొక్క; కాకు — స్వరభేదములతోడి; కాకలీ — అవ్యక్తమధురము లగు మృదుధ్వనుల యొక్క; కలకలనాదముల్ — కలకల మనెడుధ్వనులు.

ఇందునఁ బ్రసాదగుణముచూపట్టెడు.

చ. అకట యదేమియో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలి దక్షిణాంసచూ
చుకనయనప్రకంప గుణసూచన లేమియు వల్లగావు సా
రెకు మది జాలి వొంది యొక రీతిఁ దలంకెడుఁ బ్రాణనాథుఁ డొం
డొకచపలాక్షిఁ గూడి నను నొల్లనిచెయ్దము లేమి సేసెనో. 73

(వ్యా) చూచుక — స్తనాగ్రము; వల్లగావు — లెస్సగావు; తలంకెడుఁ — భయ మగుచున్నది; చెయ్దము–కార్యము; స్త్రీలకు దక్షిణనయన స్తనాగ్ర భుజాగ్రము లదరుట యశుభసూచకమని శకునశాస్త్రము. వామభాగంబున నీయంగములు స్ఫురించుట శుభ సూచకంబులు. పురుషున కివి విపరీతంబు లగు.

వామభాగస్తు నారీణాం పుంసాం శ్రేష్ఠస్తు దక్షిణః
దానే దేవాదిపూజాయాం స్పందేఽలంకరణేపి చ॥ అని నిమిత్తనిదానము.

క. అని సత్యభామ తనవిధ
మనుఁగుందొయ్యలికిఁ జెప్ప నవసరమునఁ జ
య్యన వచ్చి యొక్కనెచ్చెలి
కనుఁగవ నెఱసంజ వొడమఁగా నిట్లనియెన్. 74

(వ్యా.) ఎఱసంజ — ఎఱ్ఱనికాంతి; సంజ–సంధ్యాశబ్దభవము.

క. అమ్మా యే మని చెప్పుదు
నెమ్మి న్నీవిభుఁడు రుక్మిణీసతి మణిసౌ
ధమ్మున నుండఁగ సురముని
గ్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చటికిన్. 75

సుగమము.

క. చనుదెంచి యమ్మురారికి
ననఘు మ్మమరైకయోగ్య మతిసౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్కదివ్యకుసుమ మ్మొసఁగెన్. 76

(వ్యా.) అనితరసులభము—ఇతరులకు దుర్లభమైనది.
కావ్యగుణము—శ్లేషము.

క. మిన్నంది వేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసఁగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
వన్నెలఁతయుఁ గొప్పులోన నవ్విరిఁ దాల్చెన్. 77

(వ్యా.) మిన్నంది—మిన్ను - ఆకాశమును; అంది - తాఁకి; అనఁగా నత్యంత సంతోషముతో నుప్పొంగి.

తే. అంతలోనన యద్భుతం బావహిల్లఁ
గొలఁది యిడరాని యొకవింత చెలువు గలిగి
రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁ బట్టిన మకరాంకు శస్త్ర మనఁగ. 78

(వ్యా.) కొలఁది యిడరాని—అమితమైన; రాజబింబాస్య - చంద్రబింబమువంటి ముఖముగలది; మకరాంకు-మన్మథుని.

అలంకారము—ఉత్ప్రేక్ష.

ఉ. ఆకుసుమంబు దాల్చినమహామహిమంబునఁ దోడికామినీ
లోకము మచ్చరంబు మదిలోనఁ దొలంగి భజించుచుండ న
స్తోకనిజప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకముఁ దాన యేలుగతి లోలవిలోచన యేమి చెప్పుదున్. 79

(వ్యా.) మచ్చరంబు—మాత్సర్యము, ఈర్ష్య; గద్దియ—ఆసనము; ఇక్కడ సింహాసనము; 'లోలవిలోచన' యను విశేషణము సాభిప్రాయము.

ఉ. ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చు దాన నా
యంతటివారు లే రని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
వంతున వచ్చు సత్య గరువం బిఁకఁ జెల్ల దఁటంచు మానినీ. 80

(వ్యా.) ఎంతకు లేఁడు—ఎట్టిసాహసకార్యము చేయలేఁడు; అనఁగా నెట్టి గొప్పయాకృత్యములను జేయఁగలవాఁడనుట, నేను వినఁగాక—(నీసఖియగు) నేనువినఁగా నీ ఆబోటి తన్నును గొప్పగా భావించి చెప్పెనని యెఱుంగునది; ఎంతునవచ్చు—అతిక్రోధి మతో మెలఁగు; గరువము—గర్వము; "మానినీ" యని సత్యభామను సంబోధించుటచే నీవు (మానిని) మానవతి యగుదేని నీయవమానము నెట్లు సహింతువో యూహించికొనుమని భావము. మానము—చిత్తోన్నత్యము; 'ఎంతుమవచ్చు' అని యొకపాఠము గలదు. అదియసాధు వని తెలియునది.

క. ఆరణభోజనుమతకము
లారుక్మిణినటన లామురాంతకుచెయ్వుల్
చేరి కనుఁగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా. 81

(వ్యా.) ఆరణభోజను—నారదుని; మతకములు—మాయలు; నటనలు—కుటిలప్రవర్తనములు; చెయ్వుల్-కార్యములు; "ఎవ్వారికిఁ గోపంబు రా" దనుటచే నాకే కోపము వచ్చెనే యిఁకను నీకుఁ గోపము రాకుండునా యని భావము.

సత్యభామ శోకించుట

చ. అన విని ప్రేటు వడ్డ యురగాంగనయుంబలె నేయి వోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చినకనుదోయికెంపు దన చెక్కులఁ గుంకుమపత్త్రభంగసం
జనిత నవీనకాంతి వెదచల్లఁగ గద్గదభిన్నకంఠి యై. 82.

(వ్యా.) దరికొన్న—మండుచున్న; హుతాశనకీల—అగ్నిజ్వాల.
అలంకారములు—ఉపమ-ఉత్ప్రేక్ష.

"ప్రేటువడ్డయురగాంగన" యని చెప్పుటచే సత్యభామకు మానభంగము గలిగెనని యు "భీషణహుతాశనకీల" యని చెప్పుటచే నామెకుఁ గోపావేశము ప్రజ్వలించెననియు నూహించునది.

ఇందలి యుపమయే రామాయణమునందుఁ గన్పట్టెడు:—
"ఇతినరపతిజల్పనాద్ద్విజేంద్రం, కుశికసుతం సుమహాన్వివేశ మన్యుః
సుహుత ఇవ మఖేఽగ్నిరాజ్యసిక్తః, సమభవదుజ్జ్వలితో మహర్షివహ్నిః॥"
బాలకాండము-సర్గము. 20

శా. ఏ మేమీ కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాటల్ చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డే మే మాడెను రుక్మిణీసతియు నీ విం కేటికి న్దాఁచెదే
నీమోమోటలు మాని నీరజముఖీ నిక్కం బెఱింగింపవే. 83

(వ్యా) ఏ మేమీ—సంభ్రమంబున ద్విరుక్తము; అచటికై—అచటికిన్; మత్సమక్షమునఁ జెప్పకున్నను దాఁచినదానిని; ఇట్టి ప్రశ్నము లరుగు; "గోపికావల్లభుం"డనుటచేఁ గృష్ణుఁడు గొల్ల యిల్లాండ్రకు వల్లభుఁడుగావున నతనికి క్షత్రియుకాపు నీపనుల కుండఁదగిన యుదాత్తగుణంబులుండ నేరవని సత్యభామ తలంచెనని యూహించునది; ఈపదము సాభిప్రాయము.

మోమోటలు—దాక్షిణ్యములు, రూపాంతరము—మోమోటము.

అలంకారము—పరికరము.

చ. అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొకపెద్ద సేసి య
చ్యుతునకు నిచ్చకం బాదవ సూడిద యిచ్చిన నిచ్చెఁగాక తా
నతెఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ చేసినఁ జేసెఁ గాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్. 84

(వ్యా) ఒకపెద్దసేసి—ఒకగొప్పవస్తువుగా వర్ణించి; "ఒక" అనుపద మిచట వక్త యొక్క యలక్ష్యభావమును సూచించుచున్నది; ఇచ్చకము—ముఖస్తుతిచేఁ గల్గినప్రీతి; సూడిద—కానుక; ఇచ్చెఁగాక—ఇయ్యనిమ్ము; దానివలన నాకేమియుఁ జింత లేదని భావము; ప్రియంబుగల్గునెడన్—ప్రియమైనచోట; అనఁగా రుక్మిణీదేని కనుట. ఇక్కడ రుక్మిణి యను పేరును జెప్పక "ప్రియముగల్గునెడ" కని చెప్పుటచే సత్యభామకు సవతియగు రుక్మిణిపైఁ బొడమిన యీర్ష్యాతిరేకముచే నామె పేరు నుచ్చరించుట కిష్టము లేమి సూచితం బయ్యెను. ఇది నారీజనసహజమగుగుణము. మతకరి—టక్కులాఁడు, మాయావి; మమ్ముఁదలంపఁగనేల—ఇట "నన్ను"నుటకు "మమ్ము"నిచెప్పియుండుటచే స్వాభిమానాతిశయంబు సూచితంబు.



క. పలుదెఱఁగుముల్లమాటలఁ
గలహామె కల్యాణ మని జగంబుల వెంటన్
మెలఁగెడుమానికి సహజము
వల దని వారింప వలదె వల్లభుఁ డతనిన్



(వ్యా) మూళ్లమాటలు—ముళ్లు—ముడియనుశబ్దమునకు బహువచనము. శ్లేషజనకమని భావము; వెంటన్—చుట్టును.

క. ముని యేమి సేయు రుక్మిణిఁ
గోనఁ గారణ మేమి ధూర్తగోపాలుఁడు సే
సిన చెయిద మేమి చెప్పుదు
మన మెరియదె ప్రాణ మైనమగఁ డిట్లయినన్. 86

(వ్యా) మునియేమిచేయున్—మునినేమనఁ దప్పేమియనుట; కోనన్—దూషించుటకు; కోనఁగారణ మేమి—దూషింపనేల; ధూర్త-కుటిలుఁడగు; గోపాలుఁడు-కృష్ణుఁడూ ఈపదమును వెనుకటిదానివలెనే సాభిప్రాయమని యెఱుంగునది. పసులమేపరికి నూత్తమగుణంబు లుండనేర్చునేయని సత్యభామయభిప్రాయము; ప్రాణమైనమగఁడు—ప్రాణతుల్యుఁ డైనపతి.

క. పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగ దంద్రుు మదిన్
శరదంబుద చలచిత్తులు
పురుషులె పో వారి నమ్మఁ బోలునె చెలియా. 87

(వ్యా) తగులములు—చేరికలు; కూరుము లనుట.

ఉ. ఇన్ని దినంబులు న్నవతు లిందఱలోఁ గడుగారవంబునం
గన్నియ నన్ను వల్లభుఁడు గన్నులఁ గప్పుకొనంగ నుండి యూ
వన్నెయు వాసియుం దఱిఁగి వారు ననుం దల లెత్తి చూడఁగా
నన్నలఁ జాయలం బలుక నైతునె ప్రాణము లెంతతీపొకో. 88

(వ్యా) కన్నులఁ గప్పుకొనంగన్—కన్నులను గప్పుకొనినట్లు పదిలముగాను సులలితముగాను నరయుచుండెనని భావము; వాసి-ప్రాభవము; తలలెత్తిచూడఁగాన్—ఇంతకుఁ బూర్వము సవతులుఁ దన కణఁగియుండిరనియు నికను దన్నుఁ జులకనగాఁ జూతు రనియు భావము; నన్నలఁజాయలంబలుకన్—సమక్షమున జాడలతోను బరోక్షమునందు విచ్చలవిడిగాను నన్ను దూఱఁగా నని భావము; ప్రాణము లెంతతీపొకో—ఇది సాధారణముగా నాఁడువారాడుమాట.

ఉ. నా మొగమోటకై వలనివాటకము ల్గటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగు గౌరవమున్ గృపయుం బ్రియంబుఁ దా
నేమియుఁ గానసీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చె నో
తామరసాక్షి మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్. 89

(వ్యా) వలని-ఉపాయములగు; లేనిపోని యనుట; నాటకముల్—తంత్రములు; తేల్చెన్—ఉబ్బించెను.

ఉ. ఓచెలి శౌరి కిచ్చె నఁట యొక్కలతాంతము దెచ్చి నారదుం
డాచపలాక్షి కిచ్చె నఁట యాతఁడు నవ్విరి యిట్టిమాట లా
హా చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయి నున్నదాననో. 90

(వ్యా) ఇంతగా నోఁచితిన్—ఇంతపరిభవము గలుగునట్లు నేను నోము నోఁచితిని.

క. పూనుకొని వేలుగీళ్లకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో
యానరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదొకో. 91

(సుగమము)

ఉ. ఆసరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం
జేసి యొసంగెఁ బో తగవు చేకొని యొక్కలతాంత మింతలో
వాసియు వన్నెయుం దగవు వైభవముం జలము న్వివేకముల్
బోనవతుల్భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమి చెప్పదున్. 92

(వ్యా) ఒసంగెఁబో—ఇచ్చెఁగదా (ఇవ్యనిమ్ము); ఇదియర్థాంగీకారమును సూచించును; వివేకముపోన్—తెలివిచెడఁగా; సవతుల్భజియించుటకున్—సవతులను గౌరవించుటకు; పోన్—పోవుటకు; వెఱఁగయ్యెడున్—భయ మగుచున్నది.

క. కలకాల మొక్కగతిఁ బూ
సలలోఁ దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడుపురుషులు గలుగుట
దొలిజన్మమునోముఫలము తోయజనేత్రా. 93

(వ్యా) కలకాలము-ఎల్లప్పుడు; పూసలలో దారంబుమాడ్కిన్-సర్వదా యెడఁ బాయక చేరియుండుట యని భావము; సతిమదిలోన మెలఁగెడు-సతికి మిక్కిలి యనుకూలముగా నుండు.

సీ. కలలోన నైన నవ్వులకైన నామాట
జవదాఁట వెఱచునో చంద్రవదన
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁడో యిగురుఁబోఁడి
చెలులు నాతో నేమి చెప్పుదురో యని
లంచంబు లిచ్చునో చంచలాక్షి
తోడిచేడియలు నాతోడివంతుకు రా
సయిరింపఁజాలఁడో సన్నుతాంగి
తే. యరమరలు లేనికూరిమి ననఁగి పెనఁగి
కొదలు దీఱనికోర్కులఁ గూడి మాడి
కపట మెఱుఁగనిమమతలఁ గలసి మెలసి
యున్నవిభుఁ డిట్లు సేయునే యోలతాంగి. 94

(వ్యా) వంతులకున్-సమానప్రక్రియలకు; అరమరలు-భేదములు; కొదలుదీఱని-తృప్తిపొందని; చేయునే-చేసెనే యని సంతాపమును దెలియఁజేయుచున్నది;

అనఁగిపెనఁగి, కలసిమెలసి, కూడిమాడి, ఇవి యించుమించుగా సమానములగు నర్థములు గలవి. దేశీయములగు నీజంటలు చమత్కారపోషకములు.

సీ. కృతకాద్రి కందరా కేళీనిగూహన వేళా పరస్పరాన్వేషణములు
పోషిత మాధవీపున్నాగ పరిణయోత్సవకల్పితానేక సంభ్రమములు
చాతురీనిర్జిత ద్యూతపణాదాన కలిత చేలాంచలాకర్షణములు
సాయంసమారంభ చక్రవాకద్వంద్వ విరహావలోకన విభ్రమములు

తే. సాంద్రతర చంద్రికాకేళి చంక్రమములు
విధుశిలామయ వేదికా విశ్రమములు
ఫలక చిత్రిత నిజరూప భావనములు
మఱచెనో కాక రుక్మిణీమాయఁ దగిలి. 95

ఈపద్యమునందు సత్యభామ తొల్లి భర్తతోఁగూడఁ దా ననుభవించిన వేడ్కలను సర్మించుకొని యవి యికమీఁదసంభవింపవని దుఃఖించెనను రీతి వర్ణింపఁబడినది.

(వ్యా) కృతకాద్రి-విలాసార్థము క్రీడించుటకై కల్పింపఁబడినకొండలయొక్క; కందరా-గుహాలయందు; కేళీ-క్రీడార్థము; నిగూహన వేళా-దాఁగియుండినపుడు; పరస్పర-ఒకరొకరియొక్క (అనఁగా నొకరినొకరిని); అన్వేషణములు-వెదకుటలు. ఇచటఁ "బరస్పరావేల్లనములు" అనుపాఠాంతర మున్నిగ్రంథములలోఁ గానంబడుచున్నదిగాని దానికంటెను బరస్పరాన్వేషణము లనుపాఠమే సరసము. పోషిత.........సంభ్రమములు; పోషిత-పెంపఁబడిన; మాధవీ-బండిగురివెందతీఁగెలయొక్కయు; పున్నాగ-పొన్నచెట్టుయొక్కయు; పరిణయోత్సవ-పెండ్లివేడుకలయందు; కల్పిత-చేయఁబడిన; అనేకసంభ్రమములు-పలుదెఱంగుల వేగిరపాటులు (శీఘ్రముగాఁ జేయఁబడుకార్యము లని భావము); చాతురీ................కర్షణములు—చాతురీ-నేర్పుచేత; నిర్జిత-జయింపఁబడిన; ద్యూత-జూదమునందలి; పణ-పందెపుసొమ్మును; ఆదాన-గ్రహించుటయందు; కలిత-చేయఁబడిన; చేలాంచల-వస్త్రపుఁ గొంగులయొక్క; ఆకర్షణములు - లాఁగుటలు; సాయం.............విభ్రమములు—సాయంసమారంభ-సాయంకాలము మొదలు; చక్రవాకద్వంద్వ-చక్రవాకదంపతులయొక్క; విరహ-ఎడఁబాటులను; అవలోకన-చూచుటకై; విభ్రమములు-తిరుగుటలు; సాంద్రతర-అధికమైన; చంద్రికా-వెన్నెలలయందు; కేళి-విలాసార్థముగ; చంక్రమములు-వయ్యారపునడకలును; విధుశిలామయ-చంద్రకాంతమణినిర్మితమైన; వేదిక-తిన్నెలయందు; విశ్రమములు-కూర్చుండుటలును; ఫలకచిత్రిత......భావనములు—ఫలక-పలకలయందు; చిత్రిత-చిత్తరువుగా వ్రాయఁబడిన; నిజరూప-తనయొక్క బింబములను; భావనములును-చూచుటలును; తాత్పర్యము సుగమము.

ఈపద్యమున నోజస్సనెడు కావ్యగుణము.

'ఓజస్సమాసభూయస్త్వ' మని లక్షణము.

క. పతి ప్రాణసదృశబంధువు
పతి దైవం బేమగడయుఁ బతి సతులకు న

ప్పతియ కడు మేర దప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా. 96

(వ్యా) ఏడుగడ-రక్షకుఁడు (తల్లి, తండ్రి, పతి, దాత, విద్యాగురువు, దైవము, వీరలందును నరులకు నేడుగడలు) కడ-దిక్కు; ఏడుగడ-సప్తవిధము లయినదిక్కులు (అనఁగా రక్షకులు).

క. గురుఁడునుదల్లియుఁ దండ్రియుఁ, బురుషుఁడు విద్యయును దైవమును దాతయు నాఁ
బొరి నేడుగడయుఁ దానై హరి నను రక్షించుఁ గాత ననవరతంబున్.
—వాసిష్ఠరామాయణము, ఆ 1.

క. ధన మిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగ వచ్చు మగఁ డింతులకున్
జన విచ్చి పుచ్చుకొన్నను
మన వచ్చునె యింక నేటిమాటలు సెపుమా. 97

(వ్యా) చనవు - ప్రేమతోడిస్వాతంత్ర్యము.

క. అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్. 98

(వ్యా) పొగులుచున్-క్లేశపడుచు; 'నొగులుచున్' అనిపాఠాంతరము. దానికి నిదేయర్థము; జనితామర్షమునన్ - పుట్టినకోపముతో; హరిచందన కోటరమునకున్ - కల్పవృక్షము తొఱ్ఱలోనికి; నాగతరుణియుంబోలెన్ - ఉరగాంగనవలె; కోపసదనంబునకుం జనియెన్. రాజగృహంబులలోఁ గోపము వచ్చినప్పుడుండుటకై ప్రత్యేకముగా నొకగృహము నిర్ణయింపఁబడి యుండుట ప్రసిద్ధము.

"అథసామర్షితా దేవీ సమ్యక్కృత్వావినిశ్చయం
సంవివేశాబలా భూమౌ నివేశ్య భ్రుకుటీంముఖే
తత శ్చిత్రాణి మాల్యాని దివ్యాన్యాభరణానిచ
అపవిద్ధానికైకేయ్యా తాని భూమిం ప్రపేదిరే.

క్రోధాగారే నిపతితా సా బభౌ మలినాంబరా
ఏకవేణీం దృఢం బద్ధ్వా గతసత్త్వేవ కిన్నరీ.
—రామాయణము - అయోధ్యాకాండము, సర్గము 10.

ఈ పద్యమునందలి "హరిచందన కోటరమునకు నాగతరుణియుఁబోలెన్" అనుట వలనఁ బారిజాతవృక్షమును దీసికొనివచ్చుటకై నిజభర్తతోడ సత్యభామ యమరావతి కరిగి కడునుత్సాహముతో నందనోద్యానమును బ్రవేశించి పారిజాతవృక్షమునుడగ్గ ఱుట ధ్వనిత మయ్యెడి.

అలంకారము—ఉపమ

ఉ. మాసినచీర గట్టికొని మౌనముతోడ నిరస్తభూష యై
వాసెనకట్టు గట్టి నిడువాలికగస్తురిబొట్టు వెట్టి లో
గాసిలి చీకటింటికడ కంకటిపై జలదాంత చంద్రరే
ఖా సదృశాంగి యై పొరలె గాఢ మనోజవిషాదవేదనన్. 99

(వ్యా) నిరస్తభూష - త్రోసివేయఁబడిన సొమ్ములు గలదై; అనగా నాభరణముల నూడ్చిపాఱవైచి; వాసెనకట్టుగట్టి - తలచుట్టును గుడ్డకట్టి; నిడువాలిక - దీర్ఘమైన; కస్తురిబొట్టువెట్టి - (తలనొప్పి మొదలగు రోగములున్నవని సూచించుట కనుట); లోగాసిలి-మనసున క్లేశమఁజెంది; కంకటి-మంచము; జలదాంత...సదృశాంగియై— మేఘమధ్యమందలి (అనఁగా మేఘాచ్ఛాదితమైన) చంద్రరేఖవలెఁ గన్పట్టు దేహముకలదై.

ఈ పద్యమున మగలపై నలుకఁ జెందినలలనలు సలుపుఁబనులు వర్ణింపఁబడినవి. ఇది వారికి స్వాభావికము.

చ. బిసరుహపత్త్రలోచనకుఁ బెల్లగుమోహము సంఘటిల్లె వె
క్కస మగునెవ్వగ ల్వొడమెఁ గంపము వుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నఁబాటొదవె నాటెఁ గడుం బరితాపవేదనల్
మసకపుఁబాముకాటుగతి మచ్చర మన్విస మగ్గలింపఁగన్. 100

(వ్యా) కంపము పుట్టెన్ - వేపథువను సాత్త్వికభావము జనించెనని తెలియవగు; చెమర్చె మేను- స్వేదమను సాత్త్వికభావము; మసకపుఁబాము - కామమోహితమగుపాము; సాత్త్వికభావములు ముందు వివరింపఁబడు.

చ. వెడవెడ కన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూఁచుఁ బాన్పుపైఁ
బడు నుసు రంచు లేచుఁ దడఁబాటును దత్తఱముం జలంబు లో
న నొరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తిహస్తగత పద్మినియుంబలె సొంపు పెంపఱన్. 101

వెడవెడ - కొంచెము కొంచెముగా;

దీనికిఁ బ్రయోగము—

"వెడవెడ నిద్ర బొందె కను విచ్చిన పాంథులమీఁద దాడికోఁ
దడఁబడ నొండొరుం బిలుచు దర్పకు పంపు బలంబులో నియ
ల్కుడుకరణిం జెలంగె శుక కోకిల భృంగతతుల్ వనంబునం
దెడనెడఁ బల్కుఁ గూఁతలు సొగయింపఁగఁ బ్రోయఁగఁ దద్విరావముల్.
—భారతము - ఉద్యోగపర్వము.

తడఁబాటు - సంభ్రమము; మదహస్తి.........పద్మిని—మదహస్తి - మదపుటేనుఁగుయొక్క; హస్త - తొండమునందు; గత-చిక్కిన; పద్మినియుంబలెన్-తామరతీఁగవలె; సొంపుపెంపు - సౌందర్యాతిశయము; అఱన్ - చెడఁగా.

అలంకారము - విరహవేదనాతిశయద్యోతనార్థమై యీషత్కాలభేదగతకార్యములకు యుగపద్వర్ణనము చేయఁబడినది గాన సముచ్చయము.

క. ఈపగిదిన్ సాత్రాజితి
కోపోద్వేగమున వగలఁ గుందుచు ఘనసం
తాపంబువేర్మి నితర
వ్యాపారము మాని యుండె హరియును నచటన్. 102

(వ్యా) 'కోపోద్యోగమునన్' అని యున్ని ముద్రితగ్రంథములలోను గానంబడుచున్నను 'కోపోద్వేగమునన్' అనియుండుటయే సరసముగావున నట్లే కవి వ్రాసియుండునని యూహించి యట్లు సవరించితి. కోపోద్వేగమునన్ - కోపమువలనఁ గలిగిన తొట్రుపాటుతో.

సత్యభామకడకు శ్రీకృష్ణుఁడు వచ్చుట.

మ. ముని నా కిచ్చినపూవు చందమును నే మున్నాడి యాభోజనం
దన కర్పించినజాడయుం దెలియఁ జెంతం బొంచి వీక్షించి పో

యినసాత్రాజితిబోటి నావలనఁ దా నేమేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మానిదండ నిడి చింతాయత్తచిత్తంబునన్. 103

(వ్యా) మున్నాడి-మొదట (తొలుత); నావలనన్-నామీఁద; ప్రద్యుమ్నునిన్-తనకుమారుని; మానిదండన్-నారదునియొద్ద; ఇడి-అతనికిఁ బరిచర్యఁజేయ నియమించి.

చ. అరదము నెక్కి కేతనపటాంచల చంచలమైనతాల్మితోఁ
దురగజవంబు మున్నడవఁ ద్రోచి కడంగెడుతత్తఱంబుతోఁ
దిరిగెడు బండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్య సముదంచిత కాంచన సౌధవీథికిన్. 104

ఈ పద్యమునఁ గృష్ణునిరథగమనవేగంబును దదీయమానసోద్వేగంబును వర్ణింపఁబడియె;

(వ్యా) కేతన.........చంచలమైన—ధ్వజపటముయొక్క యంచులవలెఁజలించుచున్న; తాల్మి-స్థైర్యము; తురఁగజవంబున్—హయవేగమును; మున్నడవఁద్రోచి—వెనుకఁబడునట్లు చేసి; కడంగెడు - చెలంగుచున్న; తత్తఱంబుతోన్ — వేగిరపాటుతోను;

అనఁగా నతనిరథమునందలి ధ్వజపటమెంత యధికముగాఁ జలించుచుండెనో యంతపెల్లుగాఁ గృష్ణుని స్థైర్యమును జలించుచుండె ననియు హయవేగమునకంటె నతని తత్తఱపాటు హెచ్చుగా నుండెననియుఁ దనరథచక్రముయొక్క యాకు లెంత వేగముగాఁ దిరుగుచుండెనో యంత వేగముగాఁ దనమనంబును దిరుగుచుండె ననియు భావము. దీనిచే నాయరదం బతిత్వరితగతిం జనుచుండె నని ధ్వని స్ఫురించెను.

అలంకారము—ఉపమ. శబ్దశక్తిమూలవస్తుధ్వని.

తే. వచ్చి యారదంబు డిగ్గి తద్ద్వారసీమ
దారుకుని నుండ నియమించి తాన యొకఁడు
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలము లేనినగ రెల్ల నరసి చూచి. 105

(వ్యా) దారుకుఁడు-కృష్ణునిరథచోదకుఁడు; అలబలము-(సేవకులు మొదలగువారి) సందడి, కలకలము.

సీ. కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు
క్రొవ్వాఁడిగోళ్లఁ దంత్రులు మీటి వీణియ
ల్లాలింప రేలొకో భామ లిపుడు
కలికి రాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతు లిపుడు

తే. ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు
చిన్నఁబోయిన దీమేడ చెన్ను దఱఁగి
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిఁగింపఁ బోలు నొక్కొ. 106

(వ్యా) కలికి-సొగసైన; రాయంచబోదలన్-రాజహంసపక్షులకొదమలను; ఎలయించి-చేర్చి; పెల్లఁగాఁ (దామును జనుచుఁ) బిలుచుచునని యర్థముచేయవచ్చు; 'ధాతూనా మనేకార్థత్వాత్' అను ప్రమాణవచనమిచ్చట నూహ్యము.

(వి) ఈపద్యమునందలి వర్ణనమువలన సత్యభామా సఖీజనంబులు విద్యావతులనియు నాట్యవిచక్షణలనియు వీణావాదన ప్రవీణలనియు హంసగామినులనియు ధ్వనులూహ్యంబులు.

హంసగామినీ లక్షణము:—

గజేంద్రగమనా తన్వీ కోకిలాలాపసంయుతా
నితంబేగుర్వీణీయాస్యాత్ సాస్మృతా హంసగామినీ॥

క. అని యనుమానించుచు నొ
య్యనఁ గోపగృహంబు సేరి యాసత్రాజి
త్తనయ ముసుంగిడి యుండఁగ
ననువు మెఱయఁ జొచ్చి మాయ యచ్చుపడంగన్. 107

(వ్యా) అనువుమెఱయన్-ఉపాయముతో, మెలఁపుతో; అచ్చుపడంగన్-స్పష్టపడునట్లుగా (ప్రకటిత మగునట్లు).

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెన వాఁడిచూపులం
గొంద ఱఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచుఁ జేరఁ బోయి మ
ధ్యందినభానుమండలకరావళి హావళి వాడి యున్నతిం
గం దలఁపించునమ్మగువఁ గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై. 108

(వ్యా) మంతనంబులు-రహస్యపుఁబలుకులు, మృదూక్తులనుట; జంకెన-భయపఱచు; వాఁడిచూపులన్-క్రూరములైన చూపులచేత; తగుల్పడఁజేయుచున్-వశపఱచుకొనుచు; మధ్యందిన.........హావళి—మధ్యందిన - మధ్యాహ్నసమయమందలి; భానుమండల-సూర్యబింబముయొక్క; హావళిన్-ఉపద్రవముచేత (బాధచేత); 'హావడి, ఆవళి' అని రూపాంతములు.

ఉ. ఈ లలితాంగిచంద మొకయించుక చూచెద నంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుంద నుండి మం
దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలిత పంచసాయక శిఖిం దరికొల్పుచు నున్నకైవడిన్. 109

(వ్యా) ఒక యించుక-కొంచెము; 'ఒక' యనుపద మిక్కడ నఁర్దిష్టపూర్వతను జూపును; తాలవృంతము—విసనకఱ్ఱ; మందాలసలీలమై—మృదువుగాను (దిన్నగాను) జమత్కారముగాను; ఆదటన్- ప్రీతితో; తద్వపుః.........దరికొల్పుచున్—తద్వపుః—ఆసత్యభామశరీరమునందు, కీలిత—చేరియుండు; పంచసాయకశిఖిన్—మన్మథాగ్నిని; దరికొల్పుచున్—జ్వలింపఁజేయుచు;

అనఁగాఁ గృష్ణుఁడు విసరుటచే సత్యభామాశరీరకలితం బగు మన్మథాగ్ని యెక్కువగా మండె నని భావము.

అలంకారము - ఉత్ప్రేక్ష

(వి) ఇందుఁ 'గైవడిన్' అనెడు నుపమావాచకావ్యయము ప్రయోగింపఁబడి యుండుటచే నియ్యది యుపమాలంకార మని కొందఱు భ్రమింతురు. కాని 'మన్యేశంకే ధ్రువం ప్రాయోనూన మిత్యేవ మాదిభిః, ఉత్ప్రేక్షావ్యజ్యతే శబ్దైరివశబ్దోపి తాదృశః' అనెడు కావ్యాదర్శప్రమాణముచేత నిచట నుపమావాచకావ్యయ మున్నను నౌపమ్యంబు లేమిచే నుత్ప్రేక్ష యనియే యెఱుంగనగు.

పంచసాయకుఁడు - మన్మథుఁడు. అరవిందమశోకంచ చూతంచ నవమల్లికా నీలోత్పలంచ పంచైతే పంచబాణస్య సాయకాః. అని యమరుఁడు.

మన్మథునిపంచబాణములు సేయుకార్యము లిట్లు చెప్పఁబడినవి.

క. కూఁకు డిగించు నశోకము వాడించును మల్లెవిరి వివర్ణతసేయుం
జూడఁగఁ జూతము తెలఁపులు జోడించును దమ్మి చంపఁజూచుఁ గలువల్.

మదనుని పంచబాణములు ప్రకారాంతరముగా—

సమ్మోహనోన్మాదనౌచ శోషణ స్తాపన స్తథా
స్తంభనశ్చేతి కామస్య పంచబాణాః ప్రకీర్తితాః.

అని చెప్పఁబడియున్నది.

ఉ. అంతటఁ బారిజాతకుసుమాగత నూతన దివ్యవాసనల్
వింతలు సేయఁ దావి యది విస్మయ మంచు ముసుంగు ద్రోచి యా
క్కాంతగృహాంబున నల్గడలు గన్గొని సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి బాష్పకణికా తరళీకృత లోచనాంత యై. 110

(వ్యా) బాష్ప........లోచనాంతయై—బాష్పకణికా-కన్నీటిబొట్లచేత; తరళీకృత-తిరుగుడుపడునట్లు చేయఁబడిన; లోచనాంతయై-కనుఁగొలుకులు కలదియై.

(వి) "బాష్పకళికా" అని యన్నిపుస్తకములలోను పాఠము కానంబడుచున్నది. 'కళిక'యనఁగా మొగ్గ యని యర్థము. కావున బాష్పకళికయనఁగా మొగ్గలవంటి బాష్పములని క్లిష్టార్థకల్పనముఁ జేయవలసియుండును. కావున "బాష్పకణికా"యనియే కవి వ్రాసియుండనోపు.

ఈపద్యంబునఁ దృతీయపాదమందు 'నల్గడలు నారసి' యని యన్నిపుస్తకములలోను పాఠము కానంబడుచున్నది. అట్లయినచో యతిభంగము. 'కావున నల్గడలు గన్గొని' యని కవి వ్రాసియుండునని యూహించి యట్లు సవరించితిని.

క. తల వాంచి మగుడ మునుఁ గిడెఁ
గొలుకుల డిగజారి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళ పతిత మరంద బిందుతతిఁ బురుడింపన్. 111

(వ్యా) కొలుకులన్ — లోచనాంతములనుండి; జాలుకొను — ప్రవహించు; పలుచని చెమ్కులన్ — దుఃఖాతిశయముచేఁ జొత్తిల్లి సొంపు తఱిఁగినవని భావము; లవలీ......... ...తతి — లవలీవల్లీ-తమాలపుటాకువంటి యొకానొక యాకునందు; పతిత-పడిన; మకరంద బిందుతతిన్ - తేనెబొట్లగుంపును; పురుడింపన్ — పోలఁగా.

అలంకారము — ఉపమ

ఉ. ఓ ర్వొకయింత లేని వికచోత్పలలోచన చిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే చనుదెంచె నంచు గం
దర్పహుతాశను న్వెలికిఁ దార్పఁ సఖుండనుబోలె వేఁడి ని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంత మై. 112

(వ్యా) ఒకయింత-కొంచెము; ఇంత-పరిమాణార్థకము; కందర్పహుతాశనున్-మన్మథుఁడనునగ్నిని; వెలికిఁదార్చు-బయటికిఁదీయ; ఉన్నమితా......కాంతమై— ఉన్నమిత-ఎత్తఁబడిన; ఆవరణ-కప్పడమగు; అంశుకాంతమై-చీరచెఱఁగు కలదియై.

అనఁగా సత్యభామ వేఁడినిట్టూర్పులచేత నామె పైఁటచెఱఁగు పైకెగురుచున్నదనుట.

(వి) "నీలనీరద" యనువిశేషణము సాభిప్రాయము; నీలనీరదము-నల్ల మేఘము నల్లని మేఘము నిప్పును జల్లార్చును గావున నిక్కడ నీలనీరదశుభాంగుఁడగు శ్రీకృష్ణుఁడు సత్యహృదయమునందలి మన్మథాగ్నిని జల్లార్పవచ్చెనని యగ్నిసఖుండగు వాయువు తనమిత్రుని నాపదనుండి తప్పించుటకై యతనిని బయటఁ దీయుచున్నాఁడో యన్నట్లు సత్యభామ వేఁడినిట్టూర్పులు చెలఁగెనని భావము.

అలంకారములు — ఉత్ప్రేక్ష-పరికరము
అలంకారకృతవస్తుధ్వనియు నూహించునది.

చ. వనితకుచద్వయంబుపయి వ్రాసినకుంకుమపత్త్రిభంగముల్
జనిత నితాంత ఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్ల మె
ల్లన వెలిపట్టుపయ్యెద కెంబుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసము న్వెడఁగట్టుచు నున్న కైవడిన్. 113

(వ్యా) కుంకుమపత్త్రభంగము-మకరికాపత్త్రలేఖనము; క్రోధరసమును రక్తముగా చెప్పుట కవిసమయము.

అలంకారము — రూపకోత్థాపితోత్ప్రేక్ష.

(క్రోధమును రసముగాఁ జెప్పుటచే రూపకము).

కవిసమయములు:—

మాలిన్యంవ్యోమ్ని పాపే యశసి ధవళతా వర్ణ్యతే హాసకీర్త్యోః
రక్తౌచ క్రోధరాగౌ సరిదుదధిగతం పంకజేందీవరాది
తోయాధారేఽఖిలేపి ప్రసరతిచ మరాళాదికః పక్షిసంఘో
జ్యోత్స్నాపేయాచకోరైర్జలధరసమయే మానసం యాంతిహంసాః.

అని సాహిత్యదర్పణము.

క. మానవతి యిట్లు మానని
మానక్రోధములచేఁ గుమారిలి చింతా
దీనగతి నుండ మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్. 114

(వ్యా) మానక్రోధములచేతన్—"స్త్రీణా మీర్ష్యాకృతఃకోపోమానో ఽన్యాసంగిని ప్రియే" అని నిళరూపకము; కుమారిలి—దుఃఖించి.

మానలక్షణము ముందు విస్తరించి వివరింపఁబడును.

శ్రీకృష్ణుఁడు సత్యభామ ననునయించుట.

ఉ. ఇందునిభాస్య మైత్రోడవు లేల ధరింపవు నున్నగావు లీ
వెందును మాన లేవు తెలు పేటికిఁ గట్టితి వీటికారుచుల్
కెందలిరాకుమోవిఁ దులకింపఁగఁ జేయక యున్కి యేమి నీ
చందము వింత యయ్యెడు నిజంబుగ నా కెఱుఁగంగఁ జెప్పుమా. 115

ఈపద్యము మొదలు 123 వ పద్యమువఱకు శ్రీకృష్ణుఁడు సత్యభామ ననునయించుప్రకారము వర్ణింపఁబడినది.

(వ్యా) నున్నగావులు—నునుపైన (కోమలము లగు) కావిచీరలు; కావి—ఎఱ్ఱని రంగుగలచీర; ఎందును—ఎచటను (ఏసమయమునందు ననుట); మానలేవు—విడువఁజాలవు; వీటికారుచుల్—తాంబూలముయొక్క కాంతులు; తులకింపఁగన్—ప్రకాశింపఁగా.

చ. మన మరయం దలంచి యొకమార్గము వన్నితొ నవ్వుటాలకో
నను వెఱపించెదో యకట నాయెడ నిక్కము దప్పు గల్గెనో

వనజదళాయతాక్షి పగవాఁడనైన న్నిటు లేల చూడ వో
క్కనిమిష మైన నీవు దయఁ గన్గొనకుండిన నిల్వ నేర్తునే. 116

(వ్యా) నవ్వుటాల-పరిహాసము, వేడుక.

చ. పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁ డిది యేమి వాలుఁగ
న్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొన వేల యురఃస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌఁగిటఁ జేర్ప వేటికే
చిలుకలకొల్కి యెవ్వ రెడ సేసిరి నీ కిటు లేల చింతిలన్. 117

(వ్యా) ఉట్టిపడన్-చిందఁగా; నూల్కొనన్-చేరఁగా, ప్రకాశింపఁగా ననుట; ఎడసేసిరి-అపకార మొనరించిరి.

(వి) ఈపద్యమువలన సత్యభామ మధురవాణియనియు నుచితలజ్జాభూషితురాలనియు మధ్యమయావనస్థయనియు నూహించునది.

సర్వాసామపి నారీణాం యావనంతు చతుర్విధం,
అత్రశ్శృంగారయోగ్యత్వం సరసాహ్లాదకారణం।
ఆద్యద్వితీయయోరేవ నతృతీయచతుర్థయోః।
—అని రసార్ణవసుధాకరము.

చ. మనముల మాటలం గ్రియల మన్నన లీ నొకనాఁడు నెట్టికా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని పా
యని యనురక్తి నీయెడన యగ్గల మై కనుపట్టు నాకు నీ
పనిచిన పంపు సేయుటయ ప్రాభవ మా టది నీ వెఱుంగవే. 118

(వ్యా) ఈన్-ఇయ్యను; మెఱమెచ్చులకై-మిక్కిలి (నన్ను) మెచ్చుకొనుటకై; పచరింతున్-నటింతును; మనఃపూర్వకముగా వారిదెసం గారవంబుసేయ నని భావము.

మ. పడఁతీ నీమధురాధరామృతము నీబాహాపరీరంభముం
బడయం ధన్యుఁడఁ గాక యుండిన ననుం బాటించి యొక్కింత నీ
నిడువాలుం గడగంటఁ జూడు మనుచు న్నిల్లోపమిం బై చెఱం
గొడియం జే విరిదమ్మి వ్రేయుటకు నై యుంకించి జంకించినన్. 119

(వ్యా) నిలోప్పమిన్ - నిలుపలేకుండుటచేత (ఓర్వలేక); (కృష్ణుఁడను కర్తృపద మధ్యాహార్యము); ఒడియన్ - లాగఁగా; ఇక్కడనుండి సత్యభామకృత్యము చెప్పఁబడినది. చేవిరిదమ్మిన్ - హస్తకమలముతో; వేయుటకునై - కొట్టుటకై (కృష్ణునుట); ఊంకించి - ప్రయత్నించి; జంకించినన్ - బెదరింపఁగా. (సత్యభామయను కర్తృపదమధ్యాహార్యము.)

ముందటిపద్యముతో నన్వయము.

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవ కోమల తత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్. 120

(వ్యా) పాటిలు - కలిగియున్న; ఎప్పాటను - ఏవిధమునను; పాటుగామిన్ - శక్యము కాకుండుటచే; తత్పదద్వయీపాటలకాంతి - సత్యభామపాదయుగళమునందలి యారుణకాంతులు; మౌళిమణిపంక్తికిన్ - శిరోభూషణమునందలిమణులవరుసకు; వన్నియవెట్టన్ - రంగులొదవింపఁగా; అనఁగా సత్యభామపాదములను దనశిరము సోఁకునట్లు నమస్కరించెనని భావము; అర్మిలిన్ - ప్రేమతో; జగన్నాటకసూత్రధారి - ప్రపంచమను నాటకమును సూత్రధారునివలె నాడించెడువాఁడు.

శబ్దాలంకారము - ఛేకానుప్రాసము.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునం
దొలఁగం ద్రోచె లతాంగి యట్లు యగు నాథు ల్నేరము ల్సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే. 121

(వ్యా) పూజాభాజనంబు - పూజలకుఁ బాత్రమైనది; తొలఁగంద్రోచెన్ - త్రోసెను; "లతాంగి" యనుటచే సత్యభామపాదాహతి కృష్ణున కించుకయైన నొప్పును గలిగింపలేదని తెలియునది. ఈవిశేషణము సాభిప్రాయము. కృష్ణుఁడే "నను భవదీయదాసుని" అను పద్యమునం దీవిషయముం జెప్పెను. అట్లయగుట - అది యాయుక్తమే.

అలంకారములు — పరికరము, అర్థాంతరన్యాసము.

(వి) ఈప్రకరణమున భగవంతుండగు శ్రీకృష్ణుఁడు తనపడఁతియడుగులం బడి ప్రణమిల్లినట్లును నప్పుడాభామిని యతనిశిరంబును వామచరణంబుతోఁ దన్నినట్లును

గవి వర్ణించుట రసభంగమనియు నటు లొనర్చుట కృష్ణునికి గౌరవహానియే యనియుఁ గొందఱు వచియింతురు కాని యది రసికజనానుభవైకవేద్యమనియు గామశాస్త్ర సమ్మతంబనియుఁ దెలియవలయు.

దీనికిఁ బ్రమాణము:—

"వర్ధమానప్రణయా హి నాయికా సపత్న్యా నామగ్రహణం తదాశ్రయ మాలాపం వా గోత్రస్ఖలితం వా న మర్షయేత్, నాయకవ్యలీకం చ, తత్ర సుభృశః కలహః రుదితమాయాసః శిరోరుహాణా మవక్షోదనం ప్రహణన మాసనాచ్ఛయనాద్వా మహ్యాం పతనం మాల్యభూషణావమోక్షో భూమౌ శయ్యా చ, తత్ర యుక్తరూపేణ సామ్నా పాదపతనేన వా ప్రసన్నమనా స్తా మనునయ న్నుపక్రమ్య శయన మారోహయేత్".

—అని వాత్స్యాయనమహర్షి ప్రణీతమగు కామసూత్రము.

దీనికి—"క్రోధవశా త్తస్య శిరసి పాదతాడనమపి న దోషాయ సౌభాగ్యచిహ్నం తదితి నాగరకవృద్ధాః"—అని జయమంగళుఁడు వ్యాఖ్యానము చేసియున్నాఁడు.

గురుమానముచేఁ గోపించిన నాయికను బాదప్రణామమే యనునయప్రకారం బనుట కాలంకారిక సమ్మతియుంగలదు. దానిని వివరించెద:—

మానమనగాఁ బ్రియుఁడపరాధము చేయుటచే నాయికకుఁ గలుగు కోపరూప చిత్తక్షోభము.

"ప్రియాపరాధావగమాత్సంజాతో మాన ఇష్యతే"

—అని మానలక్షణము.

అది ప్రణయమానమనియు నీర్ష్యామానమనియు రెండు విధములు. కారణము లేకయే నాయికానాయకుల ప్రేమకల్పిత కపటనిద్రాదికుటిలవ్యాపారములచేఁ గలుగు కోపము ప్రణయమానము. అది స్వయంగ్రాహస్మితావధియై స్వయముగా శమించును. ప్రియుని యన్యకాంతాసంగమాదులచేఁ గలుగు కోప మీర్ష్యామానము.

"ఈర్ష్యామానస్తు యః కోపః ప్రియేజ్ఞాతాన్యసంగమే
అభాషణముపాలంభో భర్త్సనం తాడనం తథా
వైముఖ్య మశ్రు చామర్ష ఇత్యాద్యైరనుభావ్యతే"

—అని యీర్ష్యామానలక్షణము.

అది లఘుమానమని మధ్యమానమని గురుమానమని మూడువిధములు.

అన్యస్త్రీదర్శనాదిభ్యో లఘుమానః ప్రజాయతే
వాగాద్యల్పైరసౌ మానస్త్వపనేయః ప్రకీర్తితః

మధ్యమానస్తథాన్యస్యా నామగ్రహణతో భవేత్
ఏషమానోపనేతవ్యైశ్చపథాద్యనువర్తనైః
అన్యాసంగమచిహ్నైర్వైర్గురుమానః ప్రజాయతే
పాదప్రణామానునయైరపనేయో భవేదసౌ.

—అనితల్లక్షణములు.

ఇచట వామపాదంబునం దొలఁగంద్రోచెనని కవివర్ణించుట యనుచితమని కొందఱందురు కాని యిక్కడఁ గవియధీరాప్రగల్భానాయికనుగా సత్యభామను వర్ణించినాఁడనియు నిదిరసపోషకమే యనియు రసాలంకారమర్మజ్ఞు లంగీకరింతురు.

అధీరాప్రగల్భాలక్షణము:—

"సతర్జనైనిష్ఠురం రోషా దధీరా తాడయేద్దృఢం"

—అనిరసార్ణవసుధాకరము.

ఇఁకను మహాకవిప్రయోగములం జూపెద:—

దశరథమహామహీపతి నిజసతియగు కైకేయి ననునయింప నద్దేవిపాదంబులకు నమస్కరించినట్లు కేవలమహర్షియుఁ గవిమార్గదర్శియు నగువాల్మీకి వర్ణించియున్నాఁడు:

"నజీవితం మేఽస్తి కుతః పునస్సుఖం వినాత్మజే నాత్మవతః కుతో రతిః
మమాహితం దేవి నకర్తు మర్హసి స్పృశామి పాదా వపి తే ప్రసీద మే.
"సభూమిపాలో విలపన్ననాథవత్ స్త్రియా గృహీతో హృదయేఽతిమాత్రయా
పపాత దేవ్యాశ్చరణౌ ప్రసారితా వుభావసంస్పృశ్య యథాతురస్తథా

—రామాయణము–అయోధ్యాకాండము – సర్గము 12

"ఏవ ముక్త్వా తతో రాజా కైకేయీం సంయతాంజలిః
ప్రసాదయామాస పునః కైకేయీం చేద మబ్రవీత్"

—అయోధ్యాకాండము, సర్గము 13

దశరథుఁడు కౌసల్యకును మ్రొక్కెనని వాల్మీకిమహర్షి చెప్పియున్నాఁడు:—

"దహ్యమాన స్సశోకాభ్యాం కౌసల్యామాహ భూపతిః
వేపమానోఽంజలిం కృత్వా ప్రసాదార్థ మవాఙ్ముఖః
ప్రసాదయే త్వాం కౌసల్యే రచితోయం మయాంజలిః
వత్సలా చానృశంసా చ త్వం హి నిత్యం పరేష్వపి"

—అయోధ్యా కాండము. సర్గము 62.

వృద్ధుండగు దశరథమహారాజే యిట్లు తనభార్యపాదంబులకు నమస్కరింపఁగా లీలామానుషవిగ్రహుండై రసికశిఖామణి యగు కృష్ణుఁడంతిపురంబున నేకాంతంబునఁ

బ్రణయకోపంబును నణంప దన ప్రణయినికిఁ బ్రణమిల్లుటయు నత్తఱి నత్తన్వంగిచే నతండు మూర్ధంబునఁ జరణాహతిం బొరయుటయు రసవంతములే యగు.

కవిలోకచూడామణియగు కాళిదాసుఁడు శాకుంతలమున దుష్యంతుడు శకుంలనుఁ బ్రణమిల్లినట్లు వర్ణించియున్నాఁడు.

"(రాజా) శకుంతలాయాః పాదయోః ప్రణిపత్య—
సుతనుహృదయాత్ప్రత్యాదేశవ్యలీకమపైతు తే
కిమపిమనసస్సమ్మోహో మేతదాబలవానభూత్
ప్రబలతమసామేవం ప్రాయాశ్శుభేషుహివృత్తయః
స్రజమపి శిరస్యంధఃక్షిప్తాంధునోత్యహిశంకయా
(శకుంతలా) ఉత్తిష్ఠతూత్తిష్ఠత్వార్యపుత్త్రి)" —శాకుంతలము-అం-7.

అమరుకమహాకవియు నిట్లువర్ణించియున్నాఁడు:—

"పరిమ్లానేమానేముఖ శశిని తస్యాః కరధృతే
మయిక్షీణోపాపాయే ప్రణిపతనమాత్రైకశరణే
త్వయా పక్ష్మప్రాంతవ్రజపుటనిరుద్ధేనసహసా
ప్రసాదో బాష్పేణ స్తనతటవిశీర్ణేనకథితః"
"సాలక్తకేననవపల్లవకోమలేన, పాదేననూపురవతా మదలాలసేన
యస్తాడ్యతేదయితయాప్రణయాపరాధాత్, సోంగీకృతో భగవతామకరధ్వజేన."

ఈ ప్రకరణంబున శాస్త్రపరిజ్ఞాతయు సరసకవితానిర్మాతయు నగు నంది తిమ్మ కవీశ్వరుం డిమ్మెయి వర్ణించుట సముచితంబును శృంగారరసపోషకంబును సహృదయ హృదయంగమంబునునై యలరారెడు.

ఇఁక దీనిని విస్తరించి వ్రాయనేల?

క. కోపన పదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపిత మన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలు పడంగన్. 122

(వ్యా) కోపన—"కోపనా" యను సంస్కృత స్త్రీలింగశబ్దమునకు నిది తత్సమరూపము; కోపముగల యాఁడుదియని యర్థము. దీనికిఁ బ్రయోగము—

శ్లో. కయాసికామిన్ సురతాపరాధాత్ పాదానతః కోపనయా వధూతః.

—కుమారసంభవము 3. 8

కుహనాగోపాలుఁడు-వంచకుఁ డగు గోపాలుఁడు; గగుర్పొడువఁగన్-రోమాంచ ముదయింపఁగా; గగురు+పొడువఁగన్.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగు నీపదపల్లవంబు మ
త్తను పులకాగ్రకంటకవితానము దాఁకిన నొచ్చు నంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁక నైన నరాళకుంతలా. 123

ఈ పద్యమునఁ గృష్ణునికాపట్య మతని నయగారపుఁబలుకులచేఁ దెలియవచ్చెడు.

(వ్యా) నెయ్యపుఁగిన్క-ప్రణయకలహము; తాఁచినయది-తన్నుట; మన్ననయ-గౌరవమే; మత్తను........వితానము.—మత్తను-నాశరీరమునం దుదయించిన; పులకాగ్ర-రోమాంచములకొనలనెడు; కంటకవితానము-ముండ్లగుంపులు; ఇట సత్యభామాపాదాహతిచేఁ గృష్ణునకు రోమాంచమనెడు సాత్త్వికభావ ముదయించెనని భావము; మానవుగదా-మానవే; విడిచిపెట్టుమా; ఇది ప్రార్థనార్థకము; అరాళకుంతలా-వంకరలగు ముంగురులు గలదానా; ఈపదము సాభిప్రాయము. సత్యభామ కుంతలములు వక్రములుగ నుండునట్లు లామెయుఁ గుటిలస్వభావురా లని కృష్ణుని యభిప్రాయ మని ధ్వనించెడు.

(వి) సాత్త్వికభావములు వనితలకే కాక పురుషులకును గలుగు ననుటకుఁ బ్రమాణము:—

"ఆసీద్వరః కంటకితప్రకోష్ఠః స్విన్నాంగుళిః సంవవృతే కుమారీ
తస్మిన్ ద్వయే తత్క్షణ మాత్మవృత్తిః సమం విభక్తేవ మనోభవేన."
అని రఘువంశమునందును;

"రోమోద్గమః ప్రాదురభూదుమాయాః స్విన్నాంగుళిః పుంగవకేతు రాసీత్"
అని కుమారసంభవమునందును; గాళిదాసుఁడు వర్ణించియున్నాఁడు.

సత్యభామ కృష్ణుని దూఱుట.

చ. అన విని మానినీతిలక మప్పుడు మే యఱ దోఁప నిక్కి వీ
డిన కచపంక్తిఁ బల్మఱు ముడి న్వెడ దోపుచుఁ బైచెఱంగు ప్ర
క్కనఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ రంకురింప జూ
కెన నెఱిచూపు చూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై. 124

పే-పై, మెయి-శరీరము; నిక్కి-కోపావేశముతో ననుట; కచపంక్తిని బల్మిఱుముడి స్వేద దోఁపుటయుఁ, బైచెఱఁగును జనుదోయిం జేర్చుటయు, సంభ్రమపరవశలగు నారీజనముల లక్షణములు; వెడ-క్రొంచెము; జంకెన-బెదరింపు. 'చలితాధరపల్లవాగ్ర'- ఇది కోపసూచకము.

ఉ. ఈ నయగారవుం బ్రియము లీపన లీమొగ మిచ్చుమాట లే
లా నిను నమ్మియుండిన ఫలం బిదె తోడనె కల్గె నాకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఁ ఉడిపెట్టిన నవ్వు వారలం
గాన వెఱుంగునే పసులకాపరి భావజ మర్మకర్మముల్. 125

(వ్యా) నయగారము-పైకి మెత్తనగాఁ గన్పడునది; పసలు-చమత్కారములు; మొగమిచ్చుమాటలు-ముఖస్తుతిపలుకులు; తోడనె-వెంటనే; ఆఱడిపెట్టినట్టి-గేలిచేసిన; పసులకాపరి-పశువుల మేపుకొను గొల్లవాఁడు; మూఢుఁడని భావము; భావజ మర్మకర్మముల్-మన్మథునియొక్క గూఢములగు వ్యాపారములను.

ఉ. ఇం కిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకము గాని యీవలనిబొంకులు మాచవి గావు రుక్మిణీ
పంకజపత్త్రినేత్రకును బ్రాణపదంబులు గాని వల్లవీ
కింకర చాలుఁ జాలు నుడికింపకు నింపకు లేనికూరుముల్. 126

(వ్యా) కెరలించెదు-పరిహాసముచేసెదవు; పొంకముగాని-రుచింపని; వలని-కపటమగు, నిరుపయోగమైన, వట్టి; మాచవికావు-మాకు రుచింపవు; 'మా' యను బహువచనపదము స్వకీయమానాతిశయ భావమును దెల్పును; ప్రాణపదంబులు-ప్రాణతుల్యంబులు; ప్రియము లగునవి; వల్లవీ కింకర-గొల్లయిల్లాండ్ర సేవకుఁడా; ఉడికింపకు-హింసింపకుము; 'ఉడికింపకు' అనుటకు మాఱుగా నన్నిముద్రితాదర్శంబులలోను 'నడికింపకు' అని యున్నదిగాని దీని కర్థము పొసఁగని కారణమున 'నుడికింపకు' అని యుండ వచ్చునని యూహించి యట్లు పాఠమును దిద్దినాఁడను; 'నడికింపకు' అనఁగా భయపెట్టకుమని భావము.

నాయిక—ప్రౌఢ-ధీరాధీర.

ఉ. గట్టివచేతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందు లేని పలుఁబోకలమాయలు నీకు వెన్నతోఁ

బెట్టిన వౌ టెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోయితి నేమి సేయుదున్. 127

(వ్యా) గట్టివచేతలు-(గట్టి + వా, గట్టినోరు గల) అనఁగా ధూర్తచర్యలు; పలుఁబోకలమాయలు-నానాప్రకారము లగు టక్కులు; నీకు వెన్నతోఁ బెట్టినవి-నీకు శైశవావస్థయందుఁ దల్లి వెన్న దినిపించునపుడే వీనిని (నానాప్రకారములగు టక్కులనుం) దినిపించెననుట; అనఁగాఁ జిన్నప్పటినుండియే స్వభావసిద్ధ మనుట; బేలతనంబునన్-నిష్కాపట్యముచే; గుట్టును-మానమును; తేజము - ప్రాభవము; కోల్పడిపోయితిన్-పోఁగొట్టుకొంటిని.

చ. మునిపతి వచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినిన వీనుల మాచవిగానిమాటల
న్వినవలసెం గదా యిపుడు నీ విట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె చెప్పుమా. 128

(వ్యా) “భవత్ప్రియాంగన” ననుటచే సత్యభామకు రుక్మిణిమీఁదఁ బొడమిన యీర్ష్యాతిరేకము స్పష్టమగుచున్నది. భవత్ప్రియాంగన-తమయొక్క ప్రేయసి; ‘భవత్’ అను గౌరవసూచకశబ్దముచే కృష్ణునిమీఁద సత్యభామకుఁ గల కోపము సువ్యక్త మయ్యెడు; మాచవిగానిమాటలు-నా నీరసపుఁ బలుకులు; ఎకసక్కెము-పరిహాసము.

క. మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిల స
న్మానములకు మూలం బగు
మానరహిత మయినబ్రదుకు మానిని కేలా. 129

(వ్యా) తొడవు-భూషణము.

తే. తనదు కోడండ్రలోనఁ బెద్దయుఁగ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁ జేసి యాసాధ్వి సేవ
సేయఁ బోవంగ నా కింక సిగ్గు గాదె. 130

(వ్యా) పెద్దయుఁగన్-పెద్దదానినిగా; ‘యున్’ అనుపద మిచట వాక్యాలంకారార్థము; సాధ్వి-పతివ్రత.

సీ. ఉవిద యెవ్వతె నోఁచి యున్నదో యీశమం
తకరత్న మింక నొందల ధరింప
నీరైవతకశైలచారుకూటవిటంక
కేలి కిం కెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీ వసంతారామ
కర్పూరకదళికాగారవసతి
లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడఁ గలదొ
తే. యకట నేఁ బెంపఁ బెరిఁగిన శుక మయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ
నన్ను నాఁకోడినవతులు నగక మున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ గాన. 131

(వ్యా) శమంతకరత్నము-శమంతక మను పేరు గల మణి; దీనిని కృష్ణుఁడు జాంబవంతుని యొద్దనుండి తెచ్చి సత్యభామ కిచ్చెనని భాగవతము నుడువుచున్నది; ధరింపన్—'నోఁచియున్నదో' యను పదముతో నన్వయము; రైవతకశైల-రైవతక మను పర్వతముయొక్క; చారు-మనోజ్ఞమైన; కూట-శిఖరములయొక్క; విటంక-అగ్రభాగముల యందలి; కేళికిన్-విహారమునకు; పాలుపడునొ-పూనుకొనునో (అదృష్టము చేసియున్నదో;) జాలకంబులన్-గవాక్షములయందు; వార్ధి-సముద్రమును; పంతము-ప్రతిజ్ఞ (మనోనిశ్చయము); ఇఁకను నేను ప్రాణత్యాగము చేయుదానఁ గావునఁ బూర్వోక్తవైభవము లిఁకను నెవ్వతె నీతోఁ గూడి యనుభవింపఁగలదోయని సత్యభామ చెప్పె నని భావము. ఇందు నిర్వేద మను వ్యభిచారిభావమును మరణోద్యోగ మను మన్మథావస్థయును వర్ణితములు.

క. నను నెవ్వతెఁగాఁ జూచితి
వని యంతర్బాష్ప యగుచు నవనతముఖి యై
ఘనతర గద్గదికా ని
స్వనమున మఱి మాటలాడ శక్యము గామిన్. 132

(వ్యా) గద్గదిక-డగ్గుత్తిక; ఇట వైస్వర్యమను సాత్త్వికభావము నరయునది.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ కలకంఠ వధూ కలకాకలీధ్వనిన్. 133

(వ్యా) చేలచెఱంగు-ఇచటఁ జేల మనుటకుఁ జేల యని ప్రయోగింపఁబడినది. చరితాదులలోఁ జేరినట్లు భావింపనగు. బాలపల్లవ............ధ్వనిన్- బాలపల్లవ-లేఁజిగుళ్లను; గ్రాస-తినుటచేత; కషాయకంఠ-రంజకమైన గొంతుగల (అనగా మధుర స్వనయుక్తమైన); కలకంఠవధూ-ఆఁడుకోయిలయొక్క; కలకాకలీధ్వనిన్-అవ్యక్త మధురమైన సూక్ష్మరుతముతో.

(వి) ఈ పద్యమును గూర్చియే కృష్ణరాయలసభలోఁ దెనాలిరామకృష్ణకవి యల్లసానిపెద్దన ముక్కుతిమ్మన భట్టుమూర్తి యీ కవివరేణ్యుల కవితాతారతమ్య ములఁ బరికించుచో ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా నేడ్చె నని వ్రాక్రుచ్చినటు లొక్క పుక్కిటిపురాణకథ వినంబడియెడు.

ఈ పద్యమునఁ బ్రళయ మను సాత్త్వికభావము.

ఉ. ఆరమణీలలామ మది నంటినకోపభరంబు నిల్వఁగా
నేరక నెవ్వగం బొగుల నీరజనాభుఁడు నిండుఁ గౌఁగిటం
జేరిచి బుజ్జగించి నునుఁజెక్కులఁ జాలుకొనంగ జాఱు క
న్నీరు కరంబునం దుడిచి నెయ్యముఁ దియ్యముఁ దోఁప నిట్లనున్.

సుగమము.

ఉ. ఓ లలితేంద్ర నీలశకలోపమ కైశిక! యింతవంత నీ
కేలకిలతాంతమాత్రమున కేఁ గలుగ న్వను నీకు దేవతా
కేలివనంబు సొచ్చి యనికి న్బలసూదనుఁ జెత్తి వచ్చినన్
దీలుపడంగఁ దోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్. 135

(వ్యా) లలితేంద్రనీలశకలోపమ-మనోజ్ఞము లగు నింద్రనీలమణుల తుని యలకు సమానమగు; కైశిక-వెండ్రుకలముడి గలదానా.

'తద్భ్రూందే కైశికం కైశ్యం' అని యమరుఁడు.

లతాంత మాత్రము-మాత్రశబ్ద మల్పత్వసౌలభ్యద్యోతకము; అనికిన్-యుద్ధమునకు; బలసూదనుఁడు - ఇంద్రుఁడు; ఎత్తి - ఎదిరించి; దీలుపడంగన్ - భయపడునటులు; అనికిన్.........తోలి—ఈ వాక్యములు కృష్ణునిపై నింద్రుఁడు యుద్ధసన్నద్ధుఁడై వచ్చుటయు నతనిం గృష్ణుఁ డోడించుటయు మున్నగు జరుగఁబోవు వృత్తాంతములను సూచించుచున్నవి.

తే. వామలోచన నీ కేలివనములోనఁ
జలువ వెదచల్లు చెంగల్వకొలని కెలన
సరస కర్పూరకదళికాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ బెంపు గనుము. 136

(వ్యా) వామలోచన-సుందరములగు కన్నులు గలదానా; కెలనన్-పార్శ్వమునందు; కెలనుశబ్దమున కిది సప్తమ్యేకవచనము.

క. అని పలుకు నంబుదశ్యా
ముని గర్జితమధురవాక్యముల సత్యామా
నిని నీపలతికవోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్. 137

(వ్యా) నీపలతికవోలెన్-కడిమితీఁగెవలె; కొన్నివృక్షములను లతలుగా వర్ణించుట కవిసమయము; సఖీమయూరికలు-చెలికత్తె లనెడు నాఁడు నెమిళ్లు.

అలంకారములు—సావయవరూపకము-పరికరము-కావ్యలింగము.

కృష్ణుని మేఘముగను నతని పలుకులు గర్జనములుగను సత్యభామ కడిమివృక్షముగను జెలికత్తె లాఁడునెమిళులుగను బోల్పఁబడియె.

"అంబుదశ్యాముని" అనునది సాభిప్రాయవిశేషణము. వర్షాకాలమునందు మేఘములు గర్జించుటచేఁ గడిమిమ్రాఁకులు పూఁచుటయు నెమిళులు సంతసంబున నృత్యంబులు కావించుటయు సహజములు. "నీపలతికవోలెం గనుపట్టె" నని చెప్పుటచేఁ గృష్ణుఁడు పారిజాతవృక్షమును దెచ్చి తనయింటఁ బెట్టెద నని చెప్పినంతమాత్రాననే సత్యభామ దుఃఖమంతయుఁ బోయి సంతోషాతిశయమున నొప్పారె నని భావము. అల్పకారణము

వకే స్త్రీలు కోపాసూయాదులం బొరయుటయు వెండియు నల్పకారణముల చేతనే యొక్క-నిముసంబునన సంతోషాతిశయముఁ బొందుటయు వారికి నైజగుణంబులౌ.

ఈ పద్యమునందుఁ గవి సత్యభామను నుత్తమనాయికనుగా వర్ణించినాఁడు.

"అభిజాతై ర్భోగదృప్తై ర్గుణిభి ర్యావ కామ్యతే
గృహ్ణాతికారణే కోప మనునీతా ప్రసీదతి."

అని యుత్తమనాయికా లక్షణము.

మ. దయమానాక్షి విలోక లోకహితకృ త్ప్రారంభ రంభా కుచ
ద్వయ దుర్గాధిపతి ద్విషత్పతిత గాథా వ్యక్తదోస్సార సా
రయశస్సాంద్రదిశాంత శాంతహృదయా రజ్యన్నయాచార చా
రయుతోపాయవిచార చారణగణ ప్రస్తూయమానోదయా. 138

దయమానాక్షివిలోక_దయమాన-దయను జేయుచున్న (దయారసముతోఁ [illegible]); అక్షివిలోక-కంటిచూపుగలవాఁడా; లోకహితకృత్ప్రారంభ_లోకహితకృత్—లోకము నకు మేలుచేసెడు; ప్రారంభ-ప్రయత్నములు గలవాఁడా; రంభాకుచ......... దోస్సార-రంభాకుచద్వయ-రంభయొక్క స్తనయుగళము నెడు; దుర్గ-కోటలకు; అధిపతి-ప్రభువులైన; ద్విషత్_శత్రువులచేత; పతిత-చదువఁబడిన (కీర్తింపఁబడిన); గాథా-గానములచేత; వ్యక్త-బయలుపఱుపఁబడిన; దోస్సార-బాహుబలముగలవాఁడా; అనఁగాఁ గృష్ణరాయఁడు నిజబాహుబలముచే శత్రువులఁ జంపి స్వర్గమునకుఁ బంపఁగా వా[illegible] రంభాసంభోగలోలురై యతని బాహుబలంబును గీర్తించుచుందు రని భావము.

సారయశస్సాంద్రదిశాంత-దిశాశబ్ద మాకారాంతస్త్రీలింగము; "వష్టిభాగురి [illegible] మావాప్యోరుపసర్గయోః ఆపంచైవ హలంతానాం యథావాచా దిశానిశా" అను [illegible] వచనముచే నీరూపముసాధువు; సార-శ్రేష్ఠమైన (విస్తారమైన);యశః-కీర్తిచేత; [illegible] నిబిడీకృతమైన (పూరితమైన); దిశాంత-దిగంతములుగలవాఁడా; శాంతహృదయా[illegible] న్నయాచార_శాంత-శమగుణయుక్తమైన; హృదయ-మనస్సునందు; ఆరజ్యత్—[illegible] సంబంధించిన (అనఁగా మిక్కిలి వ్యాపించిన); నయాచార-నీతియు నాచార[illegible] వాఁడా; 'ఆరంగత్' అని కొన్నిపుస్తకములలోను, 'ఆరంజత్' అని కొన్ని[illegible]ను, బాఠముకానంబడుచున్నది. 'ఆరంగత్' అనుపాఠమున నర్థముపొసఁగదు. 'ఆరంజత్' అను రూపము వ్యాకరణదుష్టము. కావున 'ఆరజ్యత్' అని సవరించి యాపాఠమును స్వీకరించితి; చారయుతోపాయవిచార—చార-గూఢచారులతో; యుత-కూడికగల; [illegible]పాయ

విచార-సామాద్యుపాయము లను విచారించువాఁడా; చారణ.........దయా—చారణగణ-చారణు లను దేవతావిశేషములయొక్క గుంపులచేత; ప్రస్తూయమాన-మిక్కిలిపొగడఁబడుచున్న; ఉదయా—అతిశయము గలవాఁడా.

శబ్దాలంకారము—ముక్తపదగ్రస్తము.

క. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికర గుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూ ప్రసాదనరసికా. 139

(వ్యా) ఈ పద్యమంతయు నొకటే సమాసము. ప్రతివర్ష-ప్రతివత్సరంబును; వసంతోత్సవ-వసంతకాలపు (వినోదములయందలి); కుతుక-తమిచేత; ఆగత-వచ్చిన; సుకవినికర-సత్కవీశ్వరసమూహములచేత; గుంభిత-కూర్పఁబడిన; కావ్య-ప్రబంధములయొక్క; స్మృతి-స్మరణముచేతఁ గలిగిన; రోమాంచ-గగుర్పాటులచేత; విశంకిత-సందియము నొందిన; చతుర-రసికురాండ్రగు; అంతఃపురవధూ-రాణివాసపు స్త్రీలను; ప్రసాదన-ప్రసన్నలనుగాఁ జేయుటయందు (వారి సందియములఁ దొలఁగించి సుప్రసన్నలఁగాఁ జేయుటయని భావము); రసికా-నేర్పుగలవాఁడా. అనఁగాఁ బ్రతిసంవత్సరమునను కృష్ణరాయ లొనరించు వసంతోత్సవము వేడుకలఁ జూడ ననేకులు కవీశ్వరు లరుదెంతురనియు వారి యుత్తమకావ్యముల సారస్య మా నృపాలుఁ డంతఃపురమున నుండు నపుడు తలఁపునకు రాఁగా నాశ్చర్యసంతోషాతిశయములచే నతనికిఁ బులకము లుదయించుటను గాంచి యచటనుండు రసికురాండ్రగు వనితాశిరోమణులు తమ విభున కన్యనారీస్మరణంబుచే రోమాంచములు గలిగెనని శంకింతురనియుఁ గృష్ణరాయఁడు చమత్కారముగా వారి డెందముల సందడించు సందియములఁ దొలఁగించి వారిని దనయెడఁ బ్రసన్నచిత్తలఁ గావించు ననియు భావము.

(వి) ఈ పద్యమునందలి యభిప్రాయముచేఁ బ్రథమాశ్వాసమునందు వర్ణింపఁబడిన సత్యభామామానంబునఁ గృష్ణునిపై నీర్ష్యాదులు పొడముటయు నద్దేవిని గృష్ణుఁ డనయంబు నయంబున ననునయంబు గావించుటయు వ్యజ్యమానంబులయ్యెడు. ఆశ్వాసాంతపద్యములు కథాభాగమునకు సంబంధింపని కేవలకృతిపతిస్తుతి కథనంబులయ్యును నిట్టి వ్యంగ్యములు స్ఫురించునట్లు సరసకవితాధౌరేయుండగు నందితిమ్మన వ్రాసి యునికి సహృదయహృదయంగమం బగు చమత్కారవిలసితంబై తద్దయు ముద్దు నేసెడు.

నర్కుటము

ప్రసృతివిలోచనాకుసుమబాణ దిశాలలనా
ఘుసృణపటీరలేపకృతికోవిద బాహుతటీ
విస్మరకీర్తిజాల రణవిక్షత వైరినృప
త్యసృగతిపంకిలాసిముఖ యాదవవంశమణీ. 140

(వ్యా) ప్రసృతివిలోచనా కుసుమబాణ—ప్రసృతి—చేరెడు; విలోచనా—నేత్రములు కలది; ప్రసృతివిలోచనా—చేరెడు కన్నులు గల వారు; అనఁగా విశాలనేత్రములు గల యుత్తమాంగన లని యర్థము; ప్రసృతివిలోచనాకుసుమబాణ—స్త్రీలకు మన్మథుఁడా; దిశా.........జాల—దిశాలలనా - దిగంగనలకు; ఘుసృణపటీర—కుంకుమపువ్వుతోఁ గూడినచందనమును; లేపకృతి—పూయుకార్యమునందు; కోవిద—సమర్థమైన; బాహుతటీ—బాహుప్రదేశమునుండి; విస్మర—వ్యాపించునట్టి; కీర్తిజాల—కీర్తిసమూహము గలవాఁడా; అనఁగాఁ గృష్ణరాయఁడు తనవిజయపరంపరలచే నిజకీర్తిని దిగంతములయందు వ్యాపింపఁజేయువాఁడని తాత్పర్యము; రణ.....ముఖ—రణ—యుద్ధమునందు; విక్షత—హతులైన; వైరినృపతి—శత్రురాజులయొక్క; అసృక్—నెత్తురులచేత; అతిపంకిల—మిక్కిలి కలుషితముగాఁ జేయఁబడిన; అసిముఖ—కత్తియంచులు కలవాఁడా; యాదవవంశమణీ—చంద్రవంశపురాజులలో శ్రేష్ఠుఁడా; 'రణవీక్షిత' అని యన్నిగ్రంథముల లోను పాఠము కానంబడుచున్నది. 'వీక్షిత' యనుట కిచ్చట సరియగునర్థము పొసఁగదు కావున 'విక్షత' అనుపాఠము కవిహృదయ మని భావించి యిట్లు సవరించితి.

ఇది నర్కుటవృత్తము. న జ భ జ జ వ గణంబులును బదునొకొండవ యక్షరము యతిస్థానమును గలది. ఈపద్యమునకుఁ గోకిలకాక మనియుఁ బేరుగలదు.

గద్య

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంద
నందిసింగయామాత్యపుత్త్ర కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ
తిమ్మయనామధేయ ప్రణీతం బైన పారిజాతాపహరణం
బను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

(వ్యా) సారసారస్వత — శ్రేష్ఠమగు విద్యచేత; అభినంది—సంతోషించువాఁడును; నందిసింగయామాత్యపుత్త్రి—నందివా రని కవియింటిపేరు; అమాత్యశబ్దముచే నితఁడు నియోగిబ్రాహ్మణుఁ డని తెలియనయ్యెడు.

దీనియందు శబ్దాలంకారము—ఛేకానుప్రాసము.

## వ్యాఖ్యాతృ గద్యము

ఇది శ్రీ పరమేశ్వరీసనాథ నిరంతరభజన నాగపూడి గ్రామాభిజన
భారద్వాజగోత్ర సామగద్రాహ్యాయణసూత్ర పవిత్రచరిత్ర
యజ్ఞేశ్వరార్యపుత్త్రి సూక్తిపరితోషితార్య కుప్పుస్వా
మ్యార్యప్రణీతంబైన పారిజాతాపహరణ
మహాకావ్య వ్యాఖ్యావికాసం బగు
పరిమళోల్లాసంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# పా రి జా తా ప హ ర ణ ము



## ద్వి తీ యా శ్వా స ము

శ్రీసదన లోచనాబ్జద
యాసారమరంద పోషితార్థిభ్రమ రో
ల్లాసగుణ మలయకూట
ప్రాసాదనివేశ కృష్ణరాయమహీశా. 1

(వ్యా) శ్రీసదన...నివేశ—శ్రీసదన – లక్ష్మికి నివాసమైన; అనఁగా సౌభాగ్యవిశిష్టములగు; లోచనాబ్జ – నేత్రము లనెడు తామరలయొక్క; దయాసార – కృపావర్ష మనెడు; మరంద—తేనెలచేత; పోషిత—పెంపఁబడిన; అర్థిభ్రమర—యాచకు లనెడు తుమ్మెదలయొక్క; ఉల్లాసగుణ – విలాసగుణములతోఁగూడిన; మలయకూట – మలయకూటమను పేరుగల; ప్రాసాద – మేడ; నివేశ—వాసస్థానముగాఁ గలవాఁడా; 'ధారాసంపాత ఆసారః' అని యమరుఁడు. అనఁగాఁ గృష్ణరాయలలోచనములు సౌభాగ్యకలితము లగు తామరలవలె నున్నవనియు; నందుండి మకరందమువలె దయారసము వర్షించుచుననియు, నాదయారసమనెడు మకరందముచేత యాచకులనెడు తుమ్మెదలఁ బోషించుచున్నాఁడనియు, నట్టియాచకులచే నిండిన మలయకూటప్రాసాదమునందు నివసించుచున్నాఁడనియు భావము.

యాచకు లనఁగా నిచ్చటఁ గళాప్రవీణు లగు కవిగాయకులు మొదలగువా రని తెలియవలయు.

అలంకారము–సావయవరూపకము.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నవ్వ్యాసివల్లభుండు
పారిజాతంబు దే నిట్లు ప్రతిన వట్టి
చంద్రశాలకు నేతెంచి చక్రధరుఁడు.

(వ్యా) అవధరింపుము_వినుము; చంద్రశాల—సౌధోపరిగృహము; "చంద్రశాలా శిరోగృహం" అని యమరుఁడు.

మ. సరసాలాపముల న్వినోదకథల న్సాత్రాజితీదేవిఁ బ్రే
మరసాంభోనిధి నోలలార్చి కడుసమ్మానంబు గావించి ని
ర్భరకౌతూహలవృత్తి నుండ ఘటికాపర్యాప్తి ఘంటారవాం
తర నిర్ణీతము లై వినంగఁబడియె న్మధ్యాహ్న శంఖధ్వనుల్. 3

(వ్యా) ఘటికా...నిర్ణీతములై — ఘటికాపర్యాప్తి – గడియలు పూర్తి యగుటచేఁ గలిగిన; ఘంటారవ – గంటలశబ్దములయొక్క; అంతర_మధ్యమునందు; నిర్ణీతములై_నిర్ణయింపఁబడినవై; అనఁగా గడియ లగుటను దెల్పు గంటలశబ్దముల నడుమ శంఖారావములు మధ్యాహ్నకాల మగుటను దెల్పె నని భావము.

తే. సమయకృత్యంబు లెప్పుడు సలుపఁ దలఁచు
నలిననాభునిచిత్తంబు దెలిసి సత్య
భామ కనుసన్న నుడిగంపుఁబద్మముఖులు
నిలిచి రంతంత వినయంబు దొలఁక నెదుట. 4

(వ్యా) ఉడిగంపుఁ బద్మముఖులు_సేవకురాండ్రు; అంతంతన్_అచ్చటచ్చట.

క. తలిరాకుఁబోఁడి యొక్కతి
జలకమునకు వేళ యనుచు శౌరికి వీణా
కలకలములఁ గలకల నగు
పలుకుల మెల పొలయ విన్నపము గావించెన్. 5

(వ్యా) జలకము_స్నానము; మెలపొలయన్_మృదుత్వ మొప్పునట్లుగా; సులలితముగా. ఈపద్యములోని సందర్భము సురుచిరలలితపదకలితములై విలసిలుటం జేసి యింపులి కవిపలుకులును వీణాకలకలములఁ గలకల నగుపొలుపున వెలసెడు నని తెలియవలయు నది.

శబ్దాలంకారము—వృత్త్యనుప్రాసము.

కావ్యగుణములు—ప్రసాదము_మాధుర్యము_సౌకుమార్యము.

ఉ. ఇంచినవేడ్క నాత్మహృదయేశ్వరిఁ గన్గొని శౌరి మందహా
సాంచితనేత్రుఁ డై జలక మాడఁగ లెమ్మని పైఁడిచేలకొం

గించుక జాఱ నొక్కతెరలేకుణ హస్తముఁ గేల నూఁదుచుం
గంచుకిసంచయంబు సముఖా యన గద్దియ డిగ్గె డిగ్గినన్. 6

(వ్యా) ఇంచినవేడ్కన్—సమగ్రమైనకుతూహలముతో; కంచుకిసంచయంబు—పెద్దల గుంపులు; సముఖా + అనన్—సముఖా యని పరాకు చెప్పఁగా.

క. ప్రామినుకుల పూఁబోఁడుల
సీమంతపుఁ జెందిరంబుచే బలె నరుణ
శ్రీ మించు నతనిపదముల
భామామణి యోర్తు పయిఁడిపావలు దొడిగెన్. 7

(వ్యా) ప్రామినుకుల—వేదము లనెడు; పూఁబోఁడుల—స్త్రీలయొక్క; అనఁగా నుపనిషత్తులయొక్క; సీమంతపు—పాపటలయందలి; చెందిరంబుచేబలెన్ – సిందూరపుఁ బొట్టువలనఁ గలిగెనో యన్నట్లు;—అనఁగా భగవంతుని పాదారవిందముల నుపనిషత్తు లనెడుస్త్రీ లాశ్రయించియున్నారనియు, వారిపాపటలందలి సిందూరపుఁ దిలకముల చేతఁ గృష్ణునిపాదము లరుణకాంతిం బొరసెనోయన్నట్లుండె ననియు భావము; పయిఁడి పావలు—బంగరుపావుకోళ్లు.

అలంకారము—హేతూత్ప్రేక్ష.

కావ్యగుణములు—ప్రసాదము—శ్లేషము—సౌకుమార్యము.

తే. కేళిగతి మీఱ మజ్జనశాల కరిగి
శాతమన్యవమణిమయాసనమునందుఁ
గౌస్తుభాది విభూషణోత్కరము నెల్ల
నొయ్య నొయ్యన సడలించి యున్నయంత. 8

(వ్యా) కేళిగతిమీఱన్—విలాసగమనముతో; మజ్జనశాల—స్నానముచేయు గది; శాతమన్యవ—ఇంద్రనీలరత్నమయమైన (శతమన్యుర్దివస్పతిః' అని యమరుఁడు);

ఇంద్రనీలమణిలక్షణము:—

"క్షీరమధ్యే క్షిపేన్నీలం క్షీరంచే న్నీలతాం వ్రజేత్
స ఇంద్రనీలో విజ్ఞేయ స్సర్వసౌఖ్యకరశ్శుభః" —అని రత్నశాస్త్రము.

సడలించి—ఊడ్చి.

ఉ. కంపనలీలమై నసదుఁగౌ నసియాడఁ గుచద్వయంబు న
ర్తింప లలాటరేఖ చెమరింపఁగ హారలతాగుళుచ్ఛముల్
తుంపెసలాడఁ గంకణమృదుధ్వని తాళగతిం జెలంగఁగా
సంపెఁగనూనె యంటె నొకచంద్రనిభానన కంసవైరికిన్. 9

(వ్యా) కంపనలీలమైన్—కదలుటయొక్క విలాసముచేత; అసదుఁగౌను—సన్నని నడుము; అసియాడన్—మిక్కిలి వడఁకగా; తుంపెసలాడన్—నర్తనము చేయుఁగా.

"కొఱనెలపైఁదోఁచు నిరులునాఁ జెలువొంది
నొసలిపైఁ గురులు తుంపెసలు గునియ"
—భాగవతము, స్కంధము 10.

అలంకారములు—స్వభావోక్తి—సముచ్చయము.

కావ్యగుణములు—సౌకుమార్యము—ప్రసాదము—మాధుర్యము.

ఉ. తామరదోయిలోఁ దగిలి దాఁటెడు తేఁటులఁ బోలఁ బెన్నెఱుల్
వేమఱు చేతులం బిడిచి విప్పి విదిర్చి నఖాంకురంబులం
గోమలలీల దువ్వి తెలిగొజ్జఁగినీ రెడఁ జల్లి చల్లి గం
ధామలకంబు వెట్టె నొకయంగన కాళియనాగభేదికిన్. 10

(వ్యా) గొజ్జఁగినీరు—పన్నీరు; ఎడన్—నడుమ (నడుమ నడుమ ననుట); గంధామలకంబు—వాసనలతోఁ జేర్చి నూరిన యుసిరికవడియపుముద్ద; శైత్యసౌరభ్యసంపాదనమునకై దీనిని స్నానసమయంబునఁ బ్రభువులు శిరముపై నుంచికొందురు.

అలంకారము—ఉపమ. కావ్యగుణములు: సౌకుమార్యము—ప్రసాదము.

మ. చెలువల్గొందఱు హేమకుంభములతోఁ జేసే నొసంగ న్విని
ర్మలదోర్మూలరుచుల్ వెలిం బొలయఁ దోరంబైన చన్దోయి సం
దోలయ న్వేనలి జాఱ నిక్కి యరమే నొయ్యారమై వ్రాలఁగా
జలకం బార్చె లతాంగి యొర్తు యదువంశస్వామికి న్వేడుకన్. 11

(వ్యా) చేసేన్—ఒకరిచేతినుండి మఱియొకరుగాఁ బుచ్చుకొనుట; దోర్మూలరుచులు—బాహుమూలకాంతులు; వెలిం బొలయన్—బయటవ్యాపింపఁగా; తోరంబు—(స్థూలశబ్దభవము); వేనలి—కొప్పు.

అలంకారము:—స్వభావోక్తి.

ఇందు లలితయను శృంగారచేష్టను దెలియవలయు.

సీ. చంద్రికపూవన్నె జిలుఁగుదువ్వలువను
దడి యొత్తె నొక్కకాంతాలలామ
కొసగోళ్ల నెఱులు సిక్కులు వాపి మెలపున
శిర సార్చె నొక్కలేఁజిగురుఁబోఁడి
వన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు
లం దిచ్చె నొక్కపూర్ణేందువదన
నవరత్నమయభూషణవ్రజంబులు మేనఁ
గీలించె నొకరాజకీరవాణి
తే. విరులసరు లిచ్చె నొక యరవిందగంధి
యలఁదెఁ జందన మొక ధవళాయతాక్షి
సుదతి యొక్కతె కపురంపుసురఁటి విసరె
నిలువుటద్దంబు నొక యింతి నిలిపె నెదుట. 12

(వ్యా) చంద్రిక పూవన్నె—కుసుమపువ్వుయొక్క వర్ణము కలిగిన (అనఁగా నెఱుపును బసుపును గలిసినవర్ణము); జిలుఁగు దువ్వలువను—సన్నని సెల్లా(వస్త్రము)తో నెఱులు—వెండ్రుకలు.

(వి) ఈపద్యంబునఁ గాంతాలలామ, లేఁజిగురుఁబోఁడి, పూర్ణేందువదన, ధవళాయతాక్షి, మున్నగుపదంబులు తత్తత్కృత్యోపచారానురూప రూపవిశేషవిలాసద్యోతకంబులై సాభిప్రాయంబులై చమత్కారపోషకంబులై యొప్పారెడు.

అలంకారము : పరికరము.

కావ్యగుణములు : ప్రసాదము-మాధుర్యము—సౌకుమార్యము మున్నగునవి.

ఇటులు వీని నాయాపద్యంబులలో బుద్ధిమంతులు కావ్యగుణంబులఁ గాంచునది.

క. కలికినిడువాలుఁగన్నుల
తళుకులు మణిదీపశిఖలుఁ దశఁబడ లక్ష్మి

నిలయున కిచ్చిరి కొందఱు
నెలఁతలు మౌక్తికవిచిత్ర నీరాజనముల్. 13

(వ్యా) నీరాజనముల్—హారతులు.

మ. జలకం బాడి మడుంగు గట్టి మణిభూషాదీప్యమానాంగి యై
కలపం బెంతయు వింతగా నలఁది చెంగల్వ ల్నెఱి న్మించ వే
నలిఁ గీలొల్పి పసిండియందె రవళి న్రాయంచ లంతంత రాఁ
జెలులుం దానును సత్యభామ సనుదెంచె న్నాథుఁ డుప్పొంగఁగన్.

(వ్యా) కలపము—మైపూఁత; నెఱిన్—అందముతో; మించన్—ప్రకాశించునట్లు; వేనలిన్—కొప్పునందు; కీలొల్పి—తుఱిమి; పసిండియందెరవళిన్—బంగారునూపురములధ్వనులచేతి; రాయంచలు—రాజహంసలు; అంతంతన్—దగ్గఱదగ్గఱకు; రాన్—రాఁగా.

(వి) ఈపద్యమునందు సత్యభామనడక తిన్నఁదనంబును నొయ్యారంబును వ్యజ్యమానంబులు. ఆప్రమదగమనము హంసగమనముం బోలియున్నదను నుపమానమును ధ్వనిత మయ్యెడు. ఇది యర్థశక్తిమూలాలంకారధ్వని. ఇందు విచ్ఛిత్తి, లలితము, అను శృంగారచేష్టలను నెఱుంగునది.

సీ. మాత్సర్య ఘన మేఘమాలి కాపగమ ప్ర
కాశిత హిమధామకళ యనంగ
విరహనిశీథినీ విరమ సంప్రాపితో
న్మీలనామోద పద్మిని యనంగఁ
గ్రోధదంతావళ క్షోభవిభ్రమ పున
స్సంజాత నైర్మల్య సరసి యనఁగ
సంతాపనైదాఘసమయ నిర్గమకోర
కిత నవమాలతీలతిక యనఁగఁ

తే. గాంతిఁ జెన్నారి వికసితస్వాంత యగుచుఁ
గలఁక యెంతయు దిగఁ ద్రోచి చెలువ మెసఁగఁ
జేర వచ్చిన ప్రియభామ గారవించి
యున్న యత్తఱి మురవైరి సన్నిధికిని. 15

ఈపద్యమున సత్యభామ యపగతమనఃకాలుష్యయై సంప్రీతితో భర్తృసన్నిధానంబునకు వచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) మాత్సర్య.........కళ యనంగన్—

మాత్సర్య—ఈర్ష్య యనెడు ; ఘనమేఘమాలికా—గొప్ప మేఘములవరుసయొక్క ; అపగమ—తొలఁగుటచేత ; ప్రకాశిత—ప్రకాశింపఁ జేయఁబడిన ; హిమధామకళ యనంగన్—చంద్రకళయో యన్నట్లు ;

విరహ.........పద్మిని—విరహ—వియోగ మనెడు ; నిశీథినీ—రాత్రియొక్క ; విరమ—తెగువలచేత ; సంప్రాపిత—పొందఁబడిన ; ఉన్మీలనామోద—వికాసపరిమళములుగల ; పద్మిని యనంగన్—తామరతీఁగయో యనునట్లు ;

క్రోధ...సరసి—క్రోధ—కోప మనెడు ; దంతావళ—ఏనుఁగుచేతనైన ; క్షోభవిశ్రమ—కలఁతయొక్క విశ్రాంతిచేత ; అనఁగాఁ గలఁత తొలఁగుటచేత ; పునస్సంజాత—మరలఁ బుట్టిన ; నైర్మల్య—నిర్మలత్వము గల ; సరసి—కొలనో యనునట్లు ;

సంతాప...లతిక—సంతాప—(కోప) సంజ్వర మనెడు ; నైదాఘ సమయ—గ్రీష్మకాలముయొక్క ; నిర్గమ—పోవుటచేత; కోరకిత—మొగ్గలెత్తిన ; నవమాలతీ లతిక—నూతనమగు జాజితీఁగయో యనునట్లు ; కాంతిఁ జెన్నారి—కలఁక—కాలుష్యము ;

అనఁగా సత్యభామ మనస్సంతాపమును విడిచి సంతోషసమాక్రాంతస్వాంతయై తనపతిచెంతకు వచ్చునపుడు మేఘావృతుఁడై నిస్తేజుఁడై యుండి మేఘము తొలఁగిన పిదపఁ జంద్రుఁడు ప్రకాశించునట్లును, రాత్రి కడచినపిమ్మటఁ దమ్మితీఁగ కమ్మని తావులు గ్రుమ్మరింప వికసించునట్లును, గజక్షోభముచేఁ గలఁత నొంది యది యణఁగినపిదప నిర్మలమై యొప్పు సరోవరముచందమునను, గ్రీష్మకాలమునం దెండలచేఁ దపించి వాడియుండిన జాజితీఁగ వేసవి సన్నయనంతరము వర్షాకాల ప్రాదుర్భావమున మొగ్గలెత్తి నవకంపు టెలర్పునఁ గ్రాలునట్లును జెలువారె ననుట.

అలంకారములు—రూపకానుప్రాణితమగు స్వరూపోత్ప్రేక్ష—ఉల్లేఖము—యథాసంఖ్యము—కావ్యలింగము.

ఇందు మూఁడవపాదమున నన్నిగ్రంథములలోను 'విభ్రమ' యనియు నాలుగవ పాదంబున 'నిర్గత' యనియుఁ బాఠములు కానఁబడుచున్నవి. కాని వర్ణనాప్రక్రమమును బట్టి యాపాఠములు సమంజసార్థవిధురంబులై యునికిం జేసి 'విశ్రమ' యనియు, 'నిర్గమ' యనియుఁ గవి వ్రాసియుండనోపు నని యూహించి యట్లు సవరించితి.

అపగమ, విరమ, విశ్రమ, నిర్గమ, అనునీపదములు సమానార్థకములు.

## సత్యభామకడకు నారదుఁడు వచ్చుట

క. చనుదెంచెఁ గలహభోజన
మునిరుక్మిణి వీడుకొల్ప మున్నీటిజలం
బున మజ్జనాదిమాధ్యం
దినకృత్యము లాచరించి నిష్ఠాపరుఁడై. 16

(వ్యా) వీడుకొల్పన్—పంపఁగా; మున్నీటిజలంబునన్—సముద్రజలమునందు; మాధ్యందినకృత్యములు—మధ్యాహ్నసమయమందుఁ జేయవలసిన యాహ్నికములు.

(వి) ఇంతకుమునుపు గడియలోపలనే నారదుఁడు రుక్మిణియింట సత్యభామను విచ్చలవిడిం దూలనాడి యావెంటనే సత్యభామయింట భుక్తి సలుపుటయుఁ, బలుదెఱంగుల నయ్యంగనం బొగడుటయు, "ననిశైనం బతి నిన్నుఁబాసి చనునో" యని కృష్ణుని తదీయవశంవదత్వమును వినుతించినట్లు నుడివి భావికార్యబీజావాపముం జేయుంటయు, నమ్మునినాథుని గుణాతిశయమును వ్యక్తీకరించెడు. ఇతఁడిట్లు సూచింపకున్నఁ గృష్ణుఁడు స్వర్గమునకుఁ బోవునపుడు సత్యభామ తన్నును దోడ్కొనిపొమ్మని భర్తను బ్రార్థింపకుండునేమో.

చ. అతనికి సత్యభామయు మురాసురవైరియు నాతిథేయ స
త్కృతు లొనరించి యుండఁగ సతీమణు లిద్దఱు పళ్లెరంబు వె
ట్టితి మని విన్నవించినఁ దటిల్లతయు న్జలదంబు యామినీ
పతి వెనుకొన్నకైవడిఁ దపస్వియుఁ దామును భుక్తిశాలకున్. 17

(వ్యా) ఆతిథేయసత్కృతులు—ప్రత్యుత్థానాభివాదనార్ఘ్యపాద్యాది సత్కారంబులు; పళ్లెరంబు—భోజనపాత్ర; పళ్లెరంబు వెట్టితిమి—భోజనమునకుఁ బాత్రములసిద్ధముగాఁ బఱచియుంచితిమని తాత్పర్యము; తటిల్లతయున్...కైవడిన్—అనునదొక వాక్యము—తటిల్లత—మెఱుపుఁదీఁగయును; జలదము—మేఘమును; యామినీపతిన్—చంద్రుని; వెనుకొన్నకైవడిన్—వెంబడించినట్లు;

అనఁగా నారదుఁడు ధవళశరీరుఁడై చంద్రునివలె మున్నుగా భోజనశాలకుఁ జనుచుండెననియు, నతనిపిఱుందఁ జనిన సత్యభామ మెఱుపుఁదీఁగవలెను, కృష్ణుఁడు మేఘమువలెను, దనరారిరనియు భావము.

అలంకారము—ఉపమ.

## భోజనము

మ. చని గారుత్మతరత్నపాత్రికలఁ గంసద్వేషి సాంబాది నం
దనులు న్సాత్యకి ముఖ్యసోదరులు నానాబంధుసంతానముం
దనప్రేమోాల న్వసియింప మానిపతిచెంతం దాను న్హ్వాసనం
బున నుండె న్భుజియింప వీవనల సంభోజేక్షుణ ల్వీవఁగన్. 18

(వ్యా) గారుత్మత రత్నపాత్రికలన్—గరుడపచ్చలచే నిర్మింపఁబడిన పాత్రములయందు; వీవనలన్—విసనకఱ్ఱలచేత.

సీ. శాకపాకంబులచవులు వక్కాణించు
గతిఁ గంకణంబులు గల్లు మనఁగ
నతివేగ మిడుఁడు మీా రనుమాడ్కి మేఖలా
కీలితరత్న కింకిణులు మొరయఁ
గలమాన్నరుచితోడఁ గలహించుజాడ దు
వ్వాలువపింజలు ఫెళఫెళ యనంగ
నారగింపుఁడు మీార లని ప్రియం బాడెడు
పోలుపున మెట్టియ ల్గులకరింప

తే. నలరుఁబోఁడులు వడ్డింప నచటఁ గలహ
భోజియును దాను బహు భక్ష్య భోజ్య లేహ్య
చోష్య పానీయముల మధుసూదనుండు
సారెఁ గొనియాడుచును వేడ్క నారగించె. 19

(వ్యా) మేఖల—ఒడ్డాణము; కలమాన్నరుచి—శాల్యన్నపుఁగాంతి; దువ్వలువలు—సన్ననిచీరలు; పింజలు—కుచ్చులు; భక్ష్య—కొఱికి తినఁదగినవి, పిండివంటలు (గారెలు మొదలగునవి); భోజ్య—భుజింపఁదగినవి (అన్నాదులు); లేహ్య—నాలుకతో నాకి రుచి చూడఁదగినవి (పచ్చళ్లు); చోష్య—పీల్చఁదగినవి (ఫలరసాదులు); పానీయములు—త్రాగఁదగినవి (పాయసాదులు).

అలంకారములు—ఉత్ప్రేక్షలు నాలుగు.

తే. వామనేత్రాకరాంచలావర్జ్యమాన
కనకభృంగారకర్కరికాముఖాగ్ర

గళితగంధోదకంబులఁ గంసవైరి
చేతులను దేల్చె బాంధవశ్రేణితోడ. 20

(వ్యా) వామనేత్రా—(పరిచారికలగు) స్త్రీలయొక్క; (వామ—సుందరమగు); కరాంచల—హస్తాగ్రములనుండి; ఆవర్జ్యమాన—పోయఁబడుచున్న; 'ఆవర్జితాష్టాపదకుంభతోయైః.' అని కుమారసంభవము; కనకభృంగార—బంగారు గిండిచెంబుల యొక్క; భృంగార మనఁగా బంగారు గిండియని యర్థము; కనకశబ్ద మిచ్చట స్పష్టార్థము; కర్కరికాముఖాగ్ర—ద్వారముగల ముఖముకొననుండి; 'కర్కర్యాళూగళంతికా'—అని యమరుఁడు; గళిత—జారిన; గంధోదకంబులన్—పరిమళజలములచే; చేతులను దేల్చెన్—చేతులఁ గడిగికొనెను.

ఈపద్యమునందు "చేతులకు వార్చె" అని కొన్ని గ్రంథములలోను, "చేతులకుఁ దార్చె" అని కొన్నిటిలోను పాఠములు గానంబడుచున్నవి. వాని కర్థము పొసంగ లేదని "చేతులను దేల్చెన్" అని సీతారామాచార్యులు తన పొత్తమున సవరించి యున్నారు. ఆపాఠము గైకొనఁదగియున్నది.

చేతులకు వార్చెన్ — అనఁగాఁ జేతులను గడిగికొనె నని యర్థము చెప్పవచ్చునని తోఁచెడు.

క. అప్పుడు తాంబూలంబులు
గప్పురమును జాలవల్లికలఁ బడఁతులచే
నిప్పించె బంధుకోటికి
నప్పద్మదళాయతాక్షుఁ డంతట సతియున్. 21

(వ్యా) కప్పురమును—ఘనసారమును; జాలవల్లికలన్—చిత్రపుఁబనిచేసిన తమల పాకుల పళ్లెములయందు.

తే. అంతిపురమున నుచితకృత్యములు దీర్చి
చంద్రశాలాస్థితుం డైనశౌరికడకు
సంతసంబున వచ్చి యా సంయమీంద్రు
నడుగులకు నెఱఁగుడు నతఁ డాదరమున. 22

(వ్యా) ఎఱఁగుడున్—నమస్కరింపఁగా; 'ఎరఁగుడు'నని లఘురేఫమును గలదు.

వ. ఇట్లనియె. 23

## నారదుని దీవనలు

మ. పతి నీవై విహరింపఁగా జనము సంభావింపఁగా బంధుసం
తతి నిన్నుం గొనియాడఁగా సవతికాంత ల్గాంచి లజ్జింపఁగా
నతులప్రాభవవైభవోన్నతుల ప్రోవై యిట్లు వర్తించు నీ
కితరస్త్రీజనబుద్ధి దీవనలు నే నేమిచ్చెద న్మానినీ. 24

(వ్యా) ఇతరస్త్రీజనబుద్ధిన్—సామాన్యస్త్రీజన మను తలంపుతో; నే నేమిచ్చెదన్—నేనేమియ్యఁగలను; అనఁగా నన్నిట ధన్యురాలవగు నిన్ను నేను క్రొత్తగా నేమని దీవింతు ననుట.

మ. అని కైనం బతి నిన్నుఁ బాసి చనునో ప్రాణంబు ప్రాణంబుగా
నిను మన్నింపఁడొ నీమనోరథముల న్నెయ్యంబుతోఁ జేయఁడో
చనవు ల్నీవల నెవ్వరేఁ గనిరొ నీసౌభాగ్య మింతంతయే
నినుఁ బోలంగల రబ్జగంధు లన వింతే యెందు సాత్రాజితీ. 25

(వ్యా) అని...చనునో—ఈవాక్యము భవిష్యత్కార్యమును సూచించును. కృష్ణుఁడు పారిజాతవృక్షమును దెచ్చుటకై స్వర్గమునకుఁ బోయి దేవేంద్రునితో యుద్ధముఁ జేయునపుడును సత్యభామను దనవెంటఁ దోడ్కొని పోయెను.

ఈపద్యమునఁ బ్రాసము పాదంబునఁ బ్రాదియతి. ప్రాణ మనుచోట 'ప్ర+అనము' అని పదవిభాగము.

క. అటులైనను గాని మో
కుటిలాలక నీకు మగఁడు గోరినకోర్కుల్
ఘటియించుఁ గాక తా నెం
తటికార్యం బైన నొడంచి నాదీవనలన్. 26

(వ్యా) ఈపద్యమువలన నారదమహర్షి సత్యభామను దీవించు వ్యాజమునఁ బారిజాతవృక్షమును దెచ్చియిత్తునని శ్రీకృష్ణుఁడు సత్యభామతోఁ జేసినప్రతిజ్ఞను నెఱవేర్చు సంకల్పమును దృఢీకరణము చేసె నని యెఱుంగునది.

క. అని పలికి శౌరిఁ గనుఁగొని
దనుజాంతక పోయివచ్చెదను మఱవకుమీ

నను నావుడు గోపవధూ
జనవంచకుఁ డనియెఁ గార్యసంఘటనేచ్ఛన్. 27

(వ్యా) కార్యసంఘటనేచ్ఛన్ — తా నుద్దేశించినకార్యమును నెఱవేర్చుతలంపుతో.

చ. అదితి మొఱంగి కుండలము లానరకుండు హరించె వాని నేఁ
గదనములోనఁ ద్రుంచి యవి గైకొని దాఁచితి నాఁటనుండియుం
బదిలముగాఁగ న న్నడుగఁ బంపనికారణ మేమి లాఁతినే
యిదె చనుదెంచి యిత్తు ననుమీ శతమన్యునితోడ సంయమీ.

ఈపద్యమునందుఁ గృష్ణుఁ డమరావతికిఁ జనుట కొకవ్యాజమును గల్పించి దేవేంద్రునకుఁ దనరాక నెఱింగించి పుచ్చుట దెలుపఁబడినది.

(వ్యా) మొఱంగి—వంచించి; కుండలములు—కమ్మలు; లాఁతినే—అన్యుఁడనా; నే నుపేంద్రుఁడనుగదా యనుట; ఇదె—త్వరితముగానే; ఇటుఁ గృష్ణుఁడు దేవేంద్రునకీసందేశవార్తను నారదమహర్షితోఁ జెప్పిపంచుట యమ్మానికత్యంతసంతోషదాయకంబని తెలియునది.

## సాయంకాలవర్ణనము

చ. చని వినయంబుతోడఁ గలహాశనసంయమి వీడుకొల్పి యం
గనయును దాను నచ్చట జగత్పతి జూదపువేడ్క నున్నచో
దినకరమండలం బపరదిగ్గిరికూటముఁ జేరె యాదవీ
జన మదిరారసారుణ విశాలదృగంచల వంచకచ్ఛవిన్. 29

ఈపద్యము మొదలుగ మూఁడుపద్యములలో సాయంకాలవర్ణనము చేయఁబడినది.

(వ్యా) యాదవీజన............ఛవిన్ — యాదవీజన - యదువంశస్త్రీల యొక్క; మదిరారస—మద్య(పాన)ముచేత; అరుణ—ఎఱ్ఱని; విశాల—వెడ ల్పైన; దృగంచల—కనుగొలుకులను; వంచక—మోసగించు, తిరస్కరించు; అనఁగా వానికి సమాన మైన యనుట; ఛవిన్—కాంతితో.

అలంకారము—ఉపమ.

ఉ. ఆయతతేజము ల్దఱిఁగి యంబుజబాంధవుఁ డస్తసీమకుం
బోయినఁ జూచి వేచిన తమోవిభుఁ డంప దినాంతయోధుఁ డి

చాయఁ దదీయపత్నిఁ బెలుచం బడనీడిచికొంచుఁ బోయెడుం
గో యనుమాడ్కి నంతట శకుంతరవంబు సెలంగె నెల్లెడన్. 30

ఈపద్యమున సాయంకాలమందలి పక్షులకలకలారావములు వర్ణింపఁబడినవి.

(వ్యా) ఆయతతేజముల్—అధికమైన కాంతులు; తఱిఁగి—తగ్గి, నశించి; వేచిన—కాచికొనియుండిన; (సూర్యుఁడెప్పుడు గ్రుంకునాయని పొంచియుండిన); తమోవిభుఁడు చీఁకటియనురాజు; అంపన్—ఆజ్ఞాపింపఁగా; దినాంతయోధుఁడు—సాయంకాలమనెడు వీరభటుఁడు; తదీయపత్నిన్—అతనిభార్యయగు; ఈచాయన్ - ఈఛాయాదేవిని (నీడ ననుట); పెలుచన్—క్రూరముగా; పడనీడిచికొంచున్—భూమిపైఁ బడఁద్రోసి లాగికొనుచు; గో యనుమాడ్కిన్—కుయ్యో అనుచందమున.

అలంకారము—స్వరూపోత్ప్రేక్ష—రూపకోత్థాపితము.

'చాయ' అనుచో శ్లేషమూలకము.

చ. ఇనుదెసఁ జూడ నోడి తల లెత్తక నీటఁ దదీయబింబముం
గని వగ జక్కవ ల్మొగమొగంబులు సూచుచుఁ గుంది మూర్ఛఁ జెం
దినపుదెసఁ జూడ లేక జలదేవత హో యని కన్ను మోడ్చె నా
వనరుహము ల్ముడింగె సహవాసులదుఃఖము నెయ్యు రోర్తురే. 31

ఈపద్యమునఁ జక్రవాకపక్షులదుఃఖమును దామరసపుష్పములు ముకుళించుటయు వర్ణింపఁబడియె.

(వ్యా) జక్కవలు—చక్రవాకపక్షులు; మొగమొగంబులు సూచుచున్—ఒండొరులముఖంబులఁ గనుఁగొనుచు; (తమహితుఁడగుసూర్యుఁడస్తమించెనే యని దుఃఖముతోననుట); ఇచటఁ దామరలు జలదేవతలయొక్క నేత్రములుగాఁ జెప్పఁబడియె.

ఇంతవఱకును హేతూత్ప్రేక్షాలంకారము.

"సహవాసుల దుఃఖము నెయ్యురోర్తురే"—ఇచట నర్థాంతరన్యాసము—వీనికి సంకరము.

## అంధకారవర్ణనము

చ. తనువున నంధకారపుమదం బలమి న్ననుభద్రదంతికి
న్మొనసినఁ జిందరేఁగి తపనుం డనుమావుతుఁ గ్రుంకుమెట్టులో

య నురల వైచిన నొగిలి యచ్చట నెత్తురు గ్రక్కెనో యనం
గనుఁగవ గోరగింపఁ బొడకట్టె సముజ్జ్వలసాంధ్యరాగముల్. 32

ఇచట సాంధ్యరాగము వర్ణింపఁబడినది.

(వ్యా) తనువునన్ - (ఏనుఁగు) శరీరమునందు; అంధకారపుమదంబు—చీఁకటి యనెడుమదము; అలమి న్నభభద్రదంతికిన్ - ప్రసిద్ధమైన యాకాశ మనెడుభద్రజాతి యేనుఁగునకు; ఏనుఁగుజాతులు మూఁడు:—భద్రము, మంద్రము, మృగము; మొనసినన్—అతిశయింపఁగా; చిందరేఁగి - విజృంభించి; తపనుం డను మావుతున్ - సూర్యుఁ డనెడుమావటివానిని; క్రుంకుమెట్టలోయన్—అస్తాద్రియొక్క—కోనలో; ఉరలవైచినన్— 'ఉరుల' అనిరూపాంతరము—దొర్లునట్లుపడఁద్రోయఁగా; నొగిలి—నొచ్చి; కోరగింపన్—మిఱుమిట్లుగొలుపునట్లు; సముజ్జ్వల—ప్రకాశించెడు; సాంధ్యరాగముల్—సంజకెంజాయలు.

అలంకారము—రూపకోత్థాపిత మగు స్వరూపోత్ప్రేక్ష.

'మావుతున్' అను పదమును సీతారామాచార్యులు 'మావటిన్' అని సవరించియున్నారు. 'మావుతున్' అనుపదము సరియైన దనియే తెలియునది.

మ. ఒకభృంగంబు పరాళినీమదనతంత్రోన్మాది ప్రాణేశ్వరిన్
మకరందాసవమత్త నబ్జగృహసీమం బెట్టి తాఁ బోయి సం
జకడ న్వచ్చి తదాననమ్ముకుళ మేజాడం జొర న్రాక యా
మికుఁడో నాఁ దిరిగెం గొలంకురమకు న్మే లెంతహీనంబొకో. 33

(వ్యా) పరాళినీమదనతంత్రోన్మాది - పరకీయ యగు నాఁడుతుమ్మెదతోడి మన్మథక్రీడలయందు వెఱ్ఱిపట్టినదగు; ఒకభృంగము - ఒకమగతుమ్మెద; మకరందాసవమత్తన్ - తేనెయనెడుకల్లును త్రావుటచేమదించిన; ప్రాణేశ్వరిన్—భార్యను; అబ్జగృహసీమం బెట్టి - తమ్మియనెడు తనగృహమునం దుంచి; తాఁబోయి - (అన్యభృంగాంగనా సంగమలోలుఁడై) చని; సంజకడన్ వచ్చి - సాయంకాలమునందువచ్చి; తదాననమ్ముకుళము - ఆవంగియున్న తామరమొగ్గను; ఏజాడన్ - ఏవిధముచేతను; చొరన్ రాక— చొచ్చుటకువీలు లేక; యామికుఁడో నాన్ - రాత్రియందుఁ దిరుగుతలవరిగాఁబోలు నన— జాముకావలివాఁ డనుట; తిరిగెన్ - చుట్టెను; కొలంకురమకున్ - సరోలక్ష్మికి; మే లెంతహీనంబొకో—అభ్యుదయ మెంత తగ్గినదో. సరోవరలక్ష్మియం దట్టి భృంగము వసియించుట యామె యభ్యుదయమునకుఁ గొఱంత గదా యని భావము.

ఇచటఁ "బరాళినీ.....న్మాది" యనుటచే భృంగంబునందు దక్షిణనాయకత్వ మారోపింపఁబడియె.

అర్థాంతరము. 'కొలంకురమకున్' అనుమాటలను 'యామికుఁడో నాఁదిరిగెన్'- అనుదానితోఁజేర్చి యన్వయించుకొని యిట్లర్థము చెప్పనగు:—కొలంకురమకున్—సరోలక్ష్మికి; యామికుఁడో నాఁదిరిగెన్—తలవరిగో యనునట్లు చుట్టు తిరిగెను. మేలెంతహీనం బౌనో—సుఖమును బడయఁ గోరినవాఁ డెంత హీనస్థితికి వచ్చెనో యని భావము.

అలంకారములు—ఉత్ప్రేక్ష-అర్థాంతరన్యాసము. వీనికి సంసృష్టి.

సీ. దినవారిరాశి మా పనుమాని గ్రోలంగ
నడుగునఁ గనుపట్టునసలనంగఁ
గ్రుంకుమెట్టడవిఁ గార్కొనిన సంధ్యావహ్నిఁ
బొడమిన దట్టంపుఁబొగ యనంగఁ
దనమణి పడిపోవ ధరణీతలంబున
నెమకంగ వచ్చిన నింగి యనఁగ
నలచుక్క లనియెడి వలరాజు గెలుపు వ్రా
ల్దెలియఁ బూసినమషీలేప మనఁగ
తే. వృద్ధవారవిలాసినీవిసరమునకు
నపలితంకరణౌషధం బనఁగ జార
నలినముఖుల కదృశ్యాంజనం బనంగ
నంధకారంబు జగ మెల్ల నాక్రమించె. 34

ఈపద్యమునను పై రెండుపద్యములందును నంధకారవ్యాప్తి వర్ణింపఁబడియె.

(వ్యా) దినవారిరాశిన్—పగలను సముద్రమును; మాపనుమాని—రాత్రి యను ముని(అగస్త్యుఁ డనుట); గ్రోలంగన్—పానముచేయఁగా; అసలు—బురద; గ్రుంకుమెట్టవిడన్—అస్తాద్రియందలి వనమునందు; కార్కొనిన—సందడించిన - క్రమ్మిన; సంధ్యావహ్నిన్—సంధ్యయనెడు నగ్నియందు; తనమణి—ఆకాశముయొక్క మణి—నభోమణి యగు సూర్యుఁడనుట; పడిపోవన్—రాలిపోవఁగా (అస్తమింపఁగా నని భావము);

నెమకంగన్—వెదకుటకు; నింగి—ఆకాశము; ఆకాశమును నీలవర్ణముగా వర్ణించుట కవిసంప్రదాయము; వలరాజు గెలుపు వ్రాల్—మన్మథుని యొక్క విజయాక్షరములను; తెల్లియన్—ప్రకాశమగుటకై; మషీలేపము—నల్లనిమసిపూఁత; అనఁగా దాటియాకుల మీఁదనైనను శిలాఫలకములనైనను వ్రాయఁబడియుండు నక్షరములు లెస్సగా దెలియుటకై వానిమీఁద మసిపూయుట లోకప్రసిద్ధము; వృద్ధవార.....విసరమునకున్—ముసలిభోగమువారి సమూహమునకు; అపలితంకరణౌషధం బనఁగన్—అపలితంకరణ—నెరయకుండునట్లు చేయునట్టి; ఔషధంబనఁగన్—మందో యనునట్లు; జారవళినముఖులకున్—వ్యభిచారిణులకు; అదృశ్యాంజనము—ఇతరులకుఁ దాము కనఁబడకుండఁ జేయు కాటుకయో యనునట్లు.

అలంకారములు—రూపకోత్థాపితస్వరూపోత్ప్రేక్షలాఱు; ఇది మాలోత్ప్రేక్ష యనంబడును; ఉల్లేఖము—వీని కంగాంగిభావము లేమిచే సంసృష్టి.

ఈపద్యమున వర్ణింపఁబడిన క్రమమువలనఁ గ్రమముగా నంధకారము సాంద్రమయ్యె ననుట గమ్యము.

సీ. చిలుకతేరును నల్లచెఱకువిల్లును గల్వ
విరితూపు నిత్తుము మరుఁడ నీకు
వనమాలికయు నూత్నవంశనాళమును బిం
ఛము సమర్పింతుము శౌరి నీకుఁ
గప్పుఁగప్పడమును గస్తూరియును గాటు
కయు నివేదింతుము కాళి నీకు
నేరేడుఁబండ్లు విసీలచామరలు దూ
ర్వలు నొసంగుద మిభవక్త్ర నీకు
తే. నిట్టిలోకోపకారికి నిరులుదొరకుఁ
జంద్రసూర్యాదిదుర్దోషశాంతి వొదలి
నిత్యత వహింపఁ జేయంగ నేర్తురేని
యనుచుఁ బ్రార్థించి రభిసారికాబ్జముఖులు. 35

(వ్యా) చిలుక, చెఱకు, నల్లఁగలువపువ్వు, ఇవి మన్మథునకు రథమును, విల్లును, బాణమును నగుటచే నతనికిఁ బ్రియమైన వస్తువులనే యుపాయనములుగా సమర్పింతు మని యభిసారికలు వేఁడుకొని రని భావము. ఇట్టులే కడవఱకు నరయునది.

వంశనాళము_పిల్లనఁగ్రోవి; పింఛము_నెమలియీఁకలకుంచె; కప్పుఁగప్పడము_నీలవస్త్రము; చామరలు_చామరములు; ఈపదము కంసరాదులలోఁ జేరినది; ఇరులు దొరకున్ _ చీఁకటి యనెడు ప్రభువునకు; చంద్రసూర్యాదిదుర్దోషశాంతి _ సూర్య చంద్రాదు లనెడు దోషముల నివారణము; పాదలి_పుటిల్లి; నిత్యతవహింపన్_శాశ్వత స్థితి యొనరునట్లు; అనఁగా సూర్యచంద్రప్రకాశము లేక యెల్లప్పుడును నంధకారమే యుండునట్లు మీ రనుగ్రహింతురేని యని భావము; అభిసారికాబ్జముఖులు_అభిసారిక లగుస్త్రీలు; అభిసారిక లనఁగాఁ బ్రియునిఁగూర్చి సంకేతస్థలంబున కరుగువనితలు.

"కామార్తాభిసరేత్కాంతం సారయేద్వాభిసారికా" అని లక్షణము.

ఇక్కడఁ దమోభిసారిక లని యెఱుంగునది.

(వి) ఇట మన్మథుఁడు మొదలగుదేవతల కుపహారముగా సమర్పింతుమని యభిసారికలు చెప్పినవస్తువులన్నియు నల్లనివనియు నాయాదేవతల కుండు వస్తువులనే వారి వారి కర్పింతు మని వేఁడిరని రనియుఁ దెలియునది.

నల్లనివస్తువులనే దేవతలకు సమర్పింతుమనియు వారును దమ కనుగ్రహించి నల్లని చీఁకటినే దయసేయుఁడనియు నభిసారికలు కోరుట సరసము.

చిలుక పచ్చనిరంగు గలదైనను బచ్చనిరంగులను నల్లనివిగా వర్ణించుట కవిసమయము.

"మాతా మరకతశ్యామా మాతంగీ మదశాలినీ,
కుర్యా త్కటాక్షం కల్యాణీ కదంబవనవాసినీ."

—అని కాళిదాసుని దేవీస్తవము.

'శుకాంగనీలోపలనిర్మితానాం'

—అని మాఘుఁడు.

'సూర్యచంద్ర' అనుటకు యతిలాభార్థము 'చంద్రసూర్య' అని ప్రయుక్తము. అలంకారము—సమము.

## దీపవర్ణన

చ. మొనసిన చీఁకటినికరము గ్రమ్మ మహాకార్యగతాభిసారికా
వనితలు పూర్ణుగాద్పులు నెవంబునఁ గంపము నొంద నోడకుం

డని తిమిరంబు తా నభయహస్తము లిచ్చె ననంగ వానిపైఁ
గనుఁగొనఁ బొల్చె నంకురితకజ్జలవన్నవధూమమాలికల్. 36

(వ్యా) గృహకార్య.....వనితల—గృహకార్యగత—ఇంటి పనులయందుఁ బ్రవర్తించిన; అభిసారికావనితల—అభిసారికలగు స్త్రీలయొక్క; ఊర్పుగాడ్పుల—శ్వాస వాయువు లనెడు (అనఁగా నిశ్వాసవాయుప్రసరణముచే ననెడు); నెవంబునన్—నెపమున, వ్యాజముచేత; కంపమునొందన్—చలింపఁగా; ఓడకుం డని—భయపడకుఁడని; అంకురిత.....మాలికల్—అంకురిత—మొలచిన; కజ్జలవత్—కాటుకతోఁగూడిన; నవధూమమాలికల్—క్రొంబొగల వరుసలు; పొల్చెన్—ప్రకాశించెను.

'అంకురితకజ్జలముల్ నవధూమమాలికల్'—అని ముద్రితగ్రంథములలోఁ బాఠము కానంబడుచున్నది. అప్పుడును బైయట్లులే యర్థము.

అనఁగా గృహకార్యములయందు వ్యగ్ర లగు నభిసారికలు నాయకుల చెంతకుఁ బోవ వీలుగామిచేఁ జింతాకులస్వాంతలై నిట్టూర్పులు విడువ వానిచే దీపములు కదలఁగా నంధకారము దీపములను గని భయపడకుఁడని యభయహస్తము లిచ్చెనో యన్నట్లు దీపములపై నల్లనిధూమమాలికలు ప్రకాశించె నని భావము.

అలంకారము—స్వరూపోత్ప్రేక్ష, అపహ్నవానుప్రాణితము.

(వి) 'నెవము'—నెపమునకు రూపాంతరము; దీనికిఁ బ్రయోగము:

“చివురుఁగెమ్మోవి చిలుఁగాటు నెవము గాఁగ”

—శృంగారనైషధము ఆ. 8.

ప, వ, లకు యతి చెల్లునని కొందఱిమతమైనను నిక్కడఁ బ్రాస యతి యగుటచే శ్రీనాథుఁడు నెవ మని వకారమధ్యముగానే ప్రయోగించెనని తెలియవలయుం. కావున నందితిమ్మన తనకావ్యమునం దెచ్చటను 'పవ'లకు యతి గూర్పని కారణముచే నిక్కడ నెవ మనియే ప్రయోగించె నని యెఱుంగునది.

అంధకార మభిసారికావనితలకు నభయహస్తము లిచ్చెనను భావము గమ్యము.

## నక్షత్రములు

సీ. కార్కొన్న కటికిచీఁకటిమొగుల్మొత్తంబు
గురిసిన వడగండ్లగుంపు లనఁగఁ

గవజక్కవలు వాయఁ గరనాళముఁ జందు
　　రుం డూఁదుపటికంపు టుండ లనఁగ
నెల్లెడ మిన్నేటియిసుమున నచ్చర
　　కొమ లిడ్డ వెన్నెలకుప్ప లనఁగఁ
దెలివి వెన్నెల వెండితీవెలు నిగిడించు
　　చదలుకమ్మచ్చు బెజ్జము లనంగ
తే. జగము గెల్వంగ దండెత్తు మగనిమీఁద
లీల రతి చల్లుదీవనఁ బ్రా లనంగ
వేఁడివెలుఁ గెండఁ గ్రాఁగిన విన్ను మేన
నెక్కొను చెమటబొట్లనాఁ జుక్క లమరె. 37

ఈపద్యమునందు నక్షత్రములు వర్ణింపఁబడినవి.

(వ్యా) కారొక్కన్న—క్రమ్మకొనిన, దట్టమైన; కటికిచీఁకటి—గాఢాంధకార మనెడు; ముగులొత్తంబు—మేఘబృందము; కురిసిన—వర్షించిన; కవజక్కవలు—చక్ర వాకమిథునములు; పాయక—జతవిచ్చుటకై; కరనాళములక—కిరణము లనెడు గొట్ట ములనాలమున; చందురుండు—చంద్రుఁడు; ఊఁదు—వెలికిఁజిమ్మ, ప్రయోగించు; పటి కంపుటుండలు—స్ఫటికపుగుండ్లు;

అనఁగా సాయంకాలము రాఁగాఁ జక్రవాకమిథునము లొండొంటి నెడఁబాసిరే యొల్లను విరహంబునఁ బరితపించును గావున నమ్మిథునములు విచ్చుటకై చంద్రుఁడు తనకిరణము లనెడుగొట్టములచేత వానిపైఁ బ్రయోగించిన చిన్నస్ఫటికపుగుండులో యనఁ నట్లు నక్షత్రములు ప్రకాశించె నని భావము.

ఎల్లెడక—అంతటను; మిన్నేటియిసుమునక—ఆకాశగంగాసైకతమున; అచ్చర కొమలు—అప్సరోవనితలు; ఇడ్డ—ఉంచిన; వెన్నెలకుప్పలు—బాలక్రీడావిశేషము;

బాలికలు వెన్నెలరేలు సైకతస్థలమునఁ గుమిగూడి వెన్నెలకుప్ప లను బాల్యక్రీడ లాడుచుండి యచ్చటచ్చటఁ బోసిన యిసుకకుప్పలో యన్నట్లు నక్షత్రములు ప్రకాశించె నని భావము.

తెలివివెన్నెల—స్వచ్ఛమైన వెన్నెల యను; వెండితీవెలు—వెండితీఁగలను; నిగి డించు—సాగఁజేయు; చదలుకమ్మచ్చుబెజ్జములు—ఆకాశ మనెడు కమ్మచ్చునందలి సన్న

రంధ్రములు; కమ్మచ్చు-(కమ్మి+అచ్చు)—స్వర్ణకారులు వెండి బంగారు తీఁగలను దీయుటకై యుపయోగించెడు సన్నని రంధ్రములు గల యినుపపట్టము.

చంద్రకిరణము లనెడి వెండితీఁగలను సాగించుటకై యుపయోగించెడు నాకాశ మనెడు కమ్మచ్చుబెజ్జములో యనునట్లు నక్షత్రములు ప్రకాశించె నని భావము.

దీవనఁబ్రాలు—ఆశీర్వాదాక్షతలు; వేఁడివెలుఁగొంటన్—సూర్యాతపముచేత; క్రాఁగిన—తపించిన; విన్నుమేనన్—ఆకాశముయొక్క శరీరమునందు; సెక్కొను—పొడమెడు; పొడుకొను.

అలంకారము—రూపకోత్థాపితము లగు స్వరూపోత్ప్రేక్ష లాఱు; ఈ శ్లేషము; వీనికి సంసృష్టి.

## చంద్రోదయము

ఉ. యామవతీకళత్రు నుదయావసరంబునకంటెఁ బాండిమ
శ్రీ మును దోఁచెఁ దూర్పుదెస సిద్ధము కృష్ణుఁడు పారిజాతమున్
భామినికై హరించు నని పాయనినెవ్వగ నింద్రరాజ్యల
క్ష్మీముఖమండలంబున వసించిన వెల్లఁదనంబుకైవడిన్. 38

ఈ పద్యమునందుఁ జంద్రోదయమునకుఁ బూర్వము తూర్పుదిశ తెల్లనగుట వర్ణింపఁబడినది.

(వ్యా) సిద్ధము—నిశ్చయముగా; హరించునని—తీసికొనునని (తలఁచి); పాయని నెవ్వగన్—విడువని మహాదుఃఖముతో; ఇంద్రరాజ్యలక్ష్మీముఖమండలంబునన్—ఇంద్రుని రాజ్యలక్ష్మియొక్క ముఖమండలమునందు; వసించిన—కూడిన; వెల్లఁదనంబుకైవడిన్—పాండురవర్ణమోయనునట్లు; యామవతీ...సరంబునకంటెన్—యామవతీకళత్రు—చంద్రునియొక్క; ఉదయావసరంబునకంటెన్—ఉదయకాలమునకంటెను; 'కంటెు' వర్ణకమునకు ముందు నగాగమము వచ్చినది. 'తత్క్రితుశతంబునకంటె సుతుండు మేలు' అని యాదిపర్వమున నన్నయభట్టు ప్రయోగము. మును—ముందుగా; తూర్పుదెసన్—ప్రాగ్దిశయందు; పాండిమశ్రీ—తెల్లనికాంతిసంపద; తోఁచెన్—కానంబడెను.

స్వరూపోత్ప్రేక్షాలంకారము. "కైవడిన్" అనునది యుపమావాచకశబ్దమైనను నిది యుత్ప్రేక్షాద్యోతక మని తెలియవలయు. దీనికిఁ బ్రమాణము 1 ఆ. 109 పద్యముక్రింద వ్రాయఁబడియున్నది.

సీ. కెరలి చీఁకటిమ్రాను గెడపంగ నిక్కిన
సమయగజంబు దంతము లనంగఁ
జదలుగేదఁగితూర్పుతుదకొమ్మ నరవిరి
యై కానిపించు పూరేకు లనఁగఁ
బొడుపుగుబ్బలి నెలపురిటింటి యిడుపునఁ
జఱచిన గంధంపుఁ జట్టు లనఁగ
మరునిముందఱ బరాబరి సేయుకంచుకి
కులముచేతుల వెండిగుదె లనంగఁ
తే. కైరవములకు వెన్నెలనీరు వఱపఁ
బూని చేర్చిన పటికంపుదోను లనఁగఁ
గ్రమముతో శీతకరమయూఖములు గగన
భాగమునఁ గొన్ని యల్లనఁ బ్రాఁకుదెంచె. 39

ఈ పద్యమునందుఁ జంద్రోదయమునకు బూర్వము చంద్రకిరణము లుదయించుట వర్ణింపఁబడినది.

(వ్యా) కెరలి_విజృంభించి; చీఁకటిమ్రానున్_అంధకారమనెడు వృక్షమును; గెడపంగన్_పడఁద్రోయుటకై (నశింపఁజేయుటకై యనుట); నిక్కిన_(ఆగ్రహముతోఁ) జాఁచిన; సమయగజంబు_కాలమనెడు గజముయొక్క; దంతము లనంగన్_దంతములో యనునట్లు.

చీఁకటియనుమ్రాఁకును బడఁద్రోయుటకై కాలమనెడు గజము నిక్కఁబొడిచిన దంతములో యనునట్లు చంద్రకిరణము లొప్పెనని భావము.

చదలుగేదఁగి_ఆకాశమనెడు మొగలిచెట్టు; తూర్పుతుదకొమ్మన్_ప్రాగ్దిశయందలి కొనకొమ్మయందు; అరవిరియై_సగము వికసించినదై; కానిపించు_కనఁబడుచున్న; పూరేకు లనఁగన్ _ కుసుమదళములో యనునట్లు.

అనఁగా నాకాశము మొగిలిచెట్టువలె నుండెననియు నందుఁ బూర్వదిశయందలి కొనకొమ్మలో సగము వికసించిన పూలరేకులవలెఁ జంద్రకిరణము లొప్పెననియు భావము.

పొడుపుగుబ్బలి—ఉదయాద్రి యనెడు; నెలపురుటింటి—చంద్రప్రసూతిగృహము యొక్క; ఇడుపునన్—గోడలపార్శ్వములందు; ఱచిన—పూసిన; గంధంపుజట్టిం—చందనపుఁబూఁతలు.

అనఁగా నుదయాచలము చంద్రునిఁ బ్రసవించు గృహమువలె నొప్పె ననియు నందలి గోడలపైఁ బూయఁబడిన చందనచర్చలో యన్నట్లు చంద్రకిరణములు ప్రకాశించె ననియు భావము.

మరునిముందఱన్ - మన్మథునియెదుట; బరాబరిసేయు—హెచ్చరికసేయుచున్న; కంచుకికులము - హెగ్గళ్లసమూహముయొక్క (హెగ్గడి - అంతఃపురపుఁ గావలివాఁడు); చేతుల - హస్తములయందు ధరించియుండు; వెండిగుదెలనంగన్ - వెండికఱ్ఱలో యనునట్లు.

అనఁగాఁ జంద్రోదయసమయమున శేలుజనులను మోహపరవశులఁగాఁ జేయుటకై మన్మథుఁ డనురాజు వెడలివచ్చుచున్నాఁడనియుఁ దదాగమనసమయంబున జనులకు హెచ్చరికలు చేయు కంచుకులు చేతులందు ధరించినవెండికఱ్ఱలో యనునట్లు చంద్రకిరణము లొప్పారె ననియు భావము.

కైరవములకున్—కలువలకు; వెన్నెలనీరు—వెన్నెలయనెడుజలమును; పఱపన్—(కట్టుటకై) - ప్రవహింపఁజేయుటకై; పూని చేర్చిన—ప్రయత్నముతోఁ గల్పించిన; పటికంపుదోనులనఁగన్—స్ఫటికమయము లగుకాలువగొట్టములో యన; దోని—తూము కాలువ; ఇక్కడ గొట్టమని భావము.

అనఁగాఁ గలువతీఁగలకు వెన్నెలయను జలములఁ గట్టుటకై యేర్పఱచిన స్ఫటికమయ మగు దోనులో యనునట్లు చంద్రకిరణము లొప్పారె నని భావము.

శీతకరమయూఖములు - చంద్రకిరణములు; అల్లనన్ — మెల్లఁగా, తిన్నగా; ప్రాఁకుఁడెంచెన్ — పైకి వచ్చెను; "ప్రాఁకుఁడెంచు" అను శబ్దమునఁ డెంచుధాతువు స్వార్థమున వచ్చినది; ఇది శబ్దపల్లవ మనంబడును; ఇట్లు ఏగుడెంచు, చనుడెంచు, పోవుడెంచు, అరుడెంచు, మొలతెంచు మొదలగుశబ్దంబు లరయునది.

అలంకారము—రూపకోజ్జీవితము లగు స్వరూపోత్ప్రేక్షలైదు; ఉల్లేఖము—వీనికి సంసృష్టి.

తే. అమరు లమృతాంబునిధిలోని యమృతరసము
వెండిచేరులఁ బటికంపుఁగుండ కట్టి

చేఁదుకొనియెదరో నాఁగ శీతరోచి
మెఱుఁగుమెయితోన యల్లన మిన్నుఁ బ్రాఁకె. 40

ఈపద్యము మొదలాఱుపద్యములలోఁ జంద్రోదయము వర్ణింపఁబడియె.

(వ్యా) అమరులు - దేవతాస్త్రీలు; అమృతాంబునిధిలోని - అమృతసముద్రమునందలి; అమృతరసముఁ - అమృత మనునీటిని; వెండిచేరులఁ - వెండిత్రాళ్లచేత; పటికంపుఁగుండఁ - స్ఫాటికభాండమును; కట్టి - (వెండిత్రాళులకుఁ గట్టియనుట); చేదుకొనియెదరో నాఁగ - పైకిలాగుచున్నారో యనునట్లు; శీతరోచి - చల్లనికిరణములు గలవాఁడు, చంద్రుఁడు; మెఱుఁగుమెయితోన - తళతళలాడు శరీరముతోడనే; అల్లనఁ - మెల్లఁగా; మిన్నుఁ బ్రాఁకెఁ - మిన్ను + ప్రాఁకెఁ; ఆకాశమునందుఁ బైకివచ్చెను.

అనఁగా నమృతసముద్రమునందుండి యమృతరసమును దేవతాస్త్రీలు చేఁదుటకై యుపయోగించిన వెండిత్రాళులవలెఁ గిరణము లొప్పె ననియు, వానికిఁ గట్టిన స్ఫటికపుఁ గుండ యోయన్నట్లు చంద్రబింబము చెలువారె ననియు భావము.

(వి) 'అమరులు' అనుపదమున కేకవచనరూపము "అమరుఁడు" అని యైనను, "అమరి" యని యైన నుండవచ్చును. లోకమున నీళ్లు చేఁదువ్యాపారము స్త్రీలదే కావున నీపద్యమందు 'అమరులు' అనుపదమునకు దేవతాస్త్రీ లని యర్థముచెప్పుటయే చమత్కారమనియు, గవిహృదయ మనియుఁ దెలియునది.

రూపకోత్థాపితసుగు ణోత్ప్రేక్షాలంకారము.

చ. అమరులబోనపుట్టిక సహస్రమయూఖుని జోడుకోడె సం
తమసము వేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ
సమితికిఁ జుక్కవాలు నవసారసలక్ష్మి దొలంగుబావ కో
కముల కుఁ గుండెతల్లడము కైరవమిత్రుఁడు దోఁచెఁ దూర్పునన్. 41

(వ్యా) అమరుల - దేవతలయొక్క; బోనపుట్టిక - ఆహారముంచెడుగంప; (బోనము - భోజనశబ్దభవము); సహస్రమయూఖుని - సూర్యుని; (జోడుకోడె - ఉద్దియగుదూడ) - జత; సంతమసము - అంధకారముయొక్క; వేరువిత్తు - నిర్మూలముచేయువాఁడు, నాశకుఁడు; కుముదంబుల - కలువలయొక్క (కలువలననుట); చక్కిలిగింత - నవ్వఁజేయువాఁడు; అనఁగా సంతోషపఱచువాఁడు; పుంశ్చలీసమితికిన్ - జారిణులసమూహమునకు; చుక్కవాలు - చుక్కయెదురు; అనఁగా నరిష్టసూచకమని భావము; నవసారసలక్ష్మి - క్రొత్తయగు తమ్మి

సిరియొక్క; తొలంగుబావ-తొలఁగుచున్నది. బావ వచ్చినప్పుడు వదినె సంకోచముతోఁ దొలఁగుట యాచారము గావునఁ దొలంగుబావ యనఁగా దవ్వుగాఁ జనఁజేయు బావ యని యర్థము - ఇక్కడ శత్రు వని భావము; అనఁగాఁ గమలలక్ష్మిని సంకోచింపఁజేయు నుఱఁకినలెఁ జంద్రుఁడున్నాఁ డని భావము; కోకములకున్ - చక్రవాకపక్షులకు; గుండెతల్లడము-గుండెదిగులు.

ఈపద్యమునఁ బ్రసాదమను కావ్యగుణము.

ఉ. పొందుగఁ బశ్చిమాబ్ధితటభూస్థలి నంశుమదంశుమత్ఫలా
కందము వాసరాంతహాలికప్రవరుం డిడ సాంధ్యవారిభృ
త్కందళము ల్తమోదళయుతంబులు నై గెల పండి ప్రాలెఁ బూ
ర్ణేందునిపేరఁ బ్రాచి నది హేతువు వెన్నెల కల్మికల్మికిన్. 42

(వ్యా) పొందుగన్-చక్కఁగా; పశ్చిమాబ్ధితటభూస్థలిన్ - పడమటిసముద్రతీరప్రదేశమందు; వాసరాంతహాలికప్రవరుండు - సాయంకాల మనెడికాఁపువాఁడు;

'హాలిక' అనియే ప్రసిద్ధరూపము; 'హాలిక' అనురూపమును హాలముగలవాఁడు హాలీ-చక్రీ.-అనురూపమువంటిది; హాల్యేవ హాలికః-స్వార్థేకప్రత్యయః-అని సాధింపనగు. అంశుమ......కందమున్ — అంశుమత్ - సూర్యుఁడనెడు; అంశుమత్ఫలాకందమున్-అరఁటిగడ్డను; "కదళీవారణబుసారంభామోచాంశుమత్ఫలా" అనియమరుఁడు; ఇడన్ - ఉంచఁగా (నాటఁగా); సాంధ్యవారిభృత్కందళముల్ — సంధ్యాకాలపు మేఘములనెడిమొలకలును (మోసులును); తమోదళయుతంబులు నై-చీఁకటియనెడు పర్ణములును గలదై; పూర్ణేందునిపేరన్ —పూర్ణచంద్రుఁడనెడు పేరుతో; ప్రాచిన్ - తూర్పుదిశయందు; గెల పండి-గెలవేసిపండినదై; ప్రాలెన్—ఒఱగెను; వెన్నెలకల్మి-వెన్నెల యను సంపద; కల్మికిన్ - కలుగుటకు; అది - తూర్పుదిక్కునం దరఁటిచెట్టు గెలవేయుట; హేతువు - కారణము.

అనఁగా నరఁటిచెట్టు తూర్పుదిక్కునందు గెలవేయుట భాగ్యమునకు హేతువని లోకప్రసిద్ధి కావున నిక్కడఁ బశ్చిమసముద్రతీరము వ్యవసాయభూమివలె నుండెననియు, సాయంకాలము కాఁపువానివలె నొప్పె ననియు, నస్తమించునట్టి సూర్యుఁడరుణకాంతిం బొలుచుటచే నరఁటిగడ్డవలె నుండెననియు, సూర్యుఁ డస్తమించుట కాఁపువాఁ డరఁటిగడ్డను భూమియందు నాటిన ట్లుండెననియు, సూర్యాస్తమయానంతరము గగనంబునఁ బశ్చిమదిశయందుఁ గన్పట్టు మేఘములు రవికిరణస్పర్శనంబుచే యరుణ

నక్షత్రంబులై యలరుటంజేసి యవి యరఁటిమోసులవలెఁ జనరారెననియు, ననంతరము చీఁకటు లలముటంజేసి యవి యరఁటియాకులవలె నొప్పెననియు నాపిదప నెఱ్ఱని కాంతులతోఁ జంద్రోదయమగుటచే నాచంద్రబింబము పండిన యరఁటిగెలవలె నొప్పె ననియు, నది తూర్పుదిక్కునందుఁ బొడమటచే వెన్నెల యనెడుసంపద గలుగుటకుఁ గారణ మాయెననియు భావము.

అలంకారము — సావయవరూపకోత్థాపిత మగు నుత్ప్రేక్ష; కావ్యలింగముచే నుజ్జీవితము.

చ. సమయయవిలాసి శోణమణిసంగతమౌక్తికచారుహారముం
గ్రమమునఁ గూర్చుచోఁ నరుణరత్నముఁ దా మును సాంధ్యరశ్మిసూ
త్రమునఁ బాసంగ గ్రుచ్చి యెడతప్పునఁ ద్రోచి పిఱుందఁ జేర్చుము
క్తైముక్రియఁ దోఁచె నయ్యమృతదీధితి లాంఛనరంధ్రసంగతిన్. 43

(వ్యా) సమయవిలాసి-కాలమనెడు రసికుఁడు; శోణమణి...హారమున్ — శోణమణి - ఎఱ్ఱనిమణులతో, అనఁగాఁ గెంపులతో; సంగత - కూడిన; మౌక్తికచారుహారమున్ - సుందరమైన ముత్యాలహారమును; క్రమమునన్ - వరుసగా; కూర్చుచోన్ - గ్రుచ్చుచుండఁగా; తాన్-తాను (ఇది వాక్యాలంకారార్థము); మును-మొదట; సాంధ్యరశ్మిసూత్రమునన్ - సంధ్యాకాలపుఁగిరణము లనెడు దారమునందు; అరుణరత్నమున్ - సూర్యుఁ డనెడు నెఱ్ఱనికెంపును; పాసంగన్, గ్రుచ్చి - చక్కఁగాఁ జేర్చి; ఎడతప్పునన్ -సగమ తప్పుటచేత; త్రోచి - ఆకెంపును దీసివైచి; పిఱుందన్ - వెనుక; చేర్చు - కూర్చునట్టి; ముక్తైముక్రియన్ - ముత్యమువలె; అయ్యమృతదీధితి - ఆప్రసిద్ధుఁడగుచంద్రుఁడు; లాంఛనరంధ్రసంగతిన్ - చిహ్నమనెడు బెజ్జముతోఁ గూడినవాఁడై; తోఁచెన్ - కనుపట్టెను; అనఁగాఁ బ్రకాశించెను.

అనఁగాఁ గాలమను రసిక విలాసపురుషుఁడు కెంపులతోను ముత్యములతోను నొకసరమును గ్రుచ్చుచుండ సాంధ్యకిరణవిశిష్టుఁడైన సూర్యుఁడు సూత్రమునందు గ్రుచ్చఁబడిన కెంపువలె నుండెననియు, సూర్యాస్తసమయము కాలమనెడు రసికుఁడు తాను మొదటఁ గెంపుగ్రుచ్చినది తప్పని భావించి తీసివైచినట్లుండెననియుఁ, బిదపఁ గళంకముతోఁ గూడిన చంద్రుఁడు కిరణములతో నొప్పుచుండ నారసికుఁడు బెజ్జముతోఁగూడిన ముత్యమును దారముతోఁ గూర్చిన ట్లుండె ననియు భావము.

అరుణరత్నము — శ్లిష్టపరంపరితరూపకము; అరుణుఁ డనెడు అరుణరత్న మని భావము.

ఉత్ప్రేక్షాలంకారము; రూపకానుప్రాణితము.

చ. దినపరిణామలక్ష్మికిఁ బ్రతీచి తగం గయిసేయు వేడుక
న్వనరుహమిత్రబింబ మనువర్తులలాక్షికపట్టికం బయో
ధినడుమఁ దోఁచి సాంధ్యనవదీప్తిరసంబు హరించి పాఱవై
చిన వెలిదూదియో యనఁగ శీతకరుం డుదయించె నత్తఱిన్. 44

(వ్యా) దినపరిణామలక్ష్మికిన్- సాయంకాల మనెడుసిరికి (పరిణామము-అవసానము); ప్రతీచి-పశ్చిమదిశాంగన; కయిసేయువేడుకన్ - అలంకరింపవలయు ననెడు కుతూహలముతో; వనరుహమిత్రబింబ మను-సూర్యబింబమనెడు; వర్తులలాక్షిక పట్టికన్— వర్తుల-సుంద్రమైన; లాక్షికపట్టికన్-లత్తుకతో నద్దినదూదిపట్టెను; పయోధినడుమన్— సముద్రమధ్యమునందు; తోఁచి-ముంచి (తోఁగుధాతువు ప్రేరణార్థకరూపము); సాంధ్య...రసంబున్—సాంధ్య-సంధ్యాకాలమందలి; నవదీప్తి - క్రొత్తకాంతు లనెడి; (అనఁగా నెఱ్ఱనికాంతులు); రసంబున్ - జలమును; హరించి - తీసికొని; పాఱవైచిన వెలిదూదియో యనఁగన్—వెలిదూది-తెల్లనిపత్తి.

అనఁగా నస్తమయసమయమునందలిసూర్యుఁడు సాయంకాలాధిదేవతకుఁ బశ్చిమదిశాంగన యలంకరించుటకై గ్రహించిన సుంద్రమైన లత్తుకపట్టెవలె నుండెననియు, సూర్యుఁడు గ్రుంకుట యాలత్తుకపట్టెను సముద్రమున ముంచిన ట్లుండెననియు, సంధ్యాకాలమందలియెఱ్ఱనికాంతులు లత్తుకపట్టెలోనుండిపిండినయెఱ్ఱనినీరువలె నుండెననియు, నుదయించుచంద్రుఁడు లత్తుకలో నుండిన నీటినిబిండినపిదప శేషించిన తెల్లనిదూదివలె నుండె ననియు భావము.

'పాఱవైచిన' యనుటచేఁ బ్రతీచియిఁకను నుపయోగింపని వెలిదూదిని దవ్వుగాఁ దూర్పుదెసను బాఱవైచినట్లుండెనని భావము. సాంధ్యనవదీప్తిరసంబుచేఁ బ్రతీచి దినపరిణామలక్ష్మికిఁగై సేసెనని భావము.

అలంకారము—రూపకోత్థాపితస్వరూపోత్ప్రేక్ష.

చంద్రుఁడు

మ. కడఁక న్రేచలిగట్టుపట్టిఁ దను వేడ్కం గూర్పనే తెంచి పై
జడిగాఁ జుక్కలతూపు లేయఁ గినుక న్జాబిల్లి ముక్కంటి దాఁ

పొడుపుం గెంపను వేఁడికంట నిరు లన్పూవిల్తు మే నేర్చి చొ
ప్పడఁ దద్భూతి యలందె నా నపుడు బింబం బొప్పెఁ బాండుద్యుతిన్. 45

(వ్యా) కడఁకన్—పూనికతో; రేచలిగట్టుపట్టిన్—రాత్రి యనెడి (హిమవంతుని కూఁతురగు) పార్వతీదేవిని; తనున్—తన్నును (ఇది శివుఁ డనుకొనుమాట గావున శివునిన్ అని యర్థము); వేడ్కం గూర్ప నేతెంచి—వేడుకతోఁ జేర్చుటకై వచ్చి; పైన్—తనమీఁద; జడిగాన్—దట్టముగా (అనఁగా వర్షముగురిసినట్లు); చుక్కలతూపులు—నక్షత్రము లనెడి బాణములను; ఏయన్—ప్రయోగింపఁగా; (ఇరు లను కర్తృపదము నిక్కడఁ దెచ్చుకొనవలయు); కినుకన్—కోపముతో; జాబిల్లిముక్కంటి—చంద్రుఁ డను శివుఁడు — (కర్తృపదము); పొడుపుంగెంపు—ఉదయరాగము (రక్తిమ); అనువేఁడికంటన్—అనెడు తీక్ష్ణమైనకంటితో (ఫాలాక్షముతో); ఇరులు—చీఁకటి; అన్పూవిల్తుమేను—అనెడు మన్మథునియొక్క శరీరమును; ఏర్చి—దహించి.

“ఇంధ యుండితి మేని తా నేర్చునగ్ని” భారతము, ఆదిపర్వము (ఆ. 8.)

చొప్పడన్—అనువుగా; తద్భూతి—ఆబూడిదను; అలందె నాన్—పూసికొనెనో యనునట్లు; బింబము—చంద్రబింబము; పాండుద్యుతిన్—తెల్లనికాంతితో; ఒప్పెన్—ప్రకాశించెను;

అనఁగాఁ జంద్రుఁ డుదయకాలారుణద్యుతిని విడిచి ధవళకాంతితోఁ బొలుపారుట, శివుఁడు మన్మథుని దహించి యాభస్మమును బూసికొనినట్లుండెననియు, రాత్రి పార్వతివలెను, జంద్రుఁడు శివునివలెను, జీఁకటి మన్మథునివలెను, నక్షత్రములు మన్మథుఁడు చంద్రుఁడనెడు శివుని రాత్రి యనెడు పార్వతితోఁ గూర్చుటకై యేసిన పుష్పబాణములవలెను, దిక్కులయందుఁ గన్పట్టిన చంద్రుని యుదయరాగము శివునిఫాలానలమువలెను, జీఁకటులు నశించుట మన్మథుఁడు దగ్ధుఁడగుటవలెను, జంద్రకిరణములు దగ్ధుఁడైన మన్మథుని బూడిదవలెను, నాధవళకిరణములతోఁ జంద్రుఁ డొప్పుట శివుఁడు భస్మానులిప్తగాత్రుఁడై యుండుటవలెను నొప్పెనని భావము.

ఇట నుపమానోపమేయములు సవర్ణములుగా నుండుటచే నౌపమ్యము సరసము.

ఈపద్యమునందుఁ గవి మొదటి మూఁడుపాదముల నచ్చతెనుఁగుమాటలచేఁ గూర్చియున్నాఁడు.

అలంకారము—రూపకోత్థాపిత మగు నుత్ప్రేక్ష.

(వి) శివుఁడు కామదహనము చేసి తద్భస్మమును బూసికొనె నని చెప్పుటచే శివుఁడు కామమును జయించి కేవలసత్త్వగుణముతోఁ బ్రకాశించుచున్నాఁడను కవిహృ

దయరూపచమత్కార మూహ్య మనియు నిది యర్థశక్తిమూలవస్తుధ్వని యనియు నెఱుఁగునది.

చ. తొలుమలజాతితో నొరయు తూరుపుఁదొయ్యలి ముత్తియంపుఁగుం
డలమున మానికంబు పడినం గనుపట్టెడులక్కగూఁడు నాఁ
జలువలఱేని యప్పాడుపుఁజాయఁ దొఱంగినకందు దోఁచె రే
చెలువ కనుంగవం గమియఁ జెందినకాటుకకప్పుకైవడిన్. 46

ఈ పద్యమునందుఁ జంద్రుని కళంకము వర్ణింపఁబడెను.

(వ్యా) తొలుమలజాతితోన్ — తూర్పుకొండయందలి శిలతో; ఒరయు — రాచుకొనుచున్న; తూరుపుఁదొయ్యలి — ప్రాగ్దిశాంగనయొక్క; ముత్తియంపుఁ గుండలమునన్ — ముత్తెములచేఁ జేయఁబడిన కర్ణాభరణమునందలి; మానికంబు — కెంపు; మాణిక్యశబ్దభవము; పడినన్ — జాఱిపడిపోవఁగా; కనుపట్టెడు — (శేషించినదై) కానఁబడెడు; లక్కగూడు నాన్ — రత్నములు పొదిగియుండిన లక్కగూఁడో యనునట్లు; చలువలఱేని — చంద్రునియొక్క; అప్పాడుపుఁజాయ దొఱంగిన కందు — అరుణోదయ రాగము పోయినపిదపఁ గానఁబడు కళంకము; రేచెలువ — రాత్రి యనెడుసతి; కనుంగవన్ — నేత్రద్వయమునందు; కమియఁజెందిన — పూసికొనిన; కాటుకకప్పుకైవడిన్ — నల్లనికాటుకవలె; తోఁచెన్ — కన్పట్టెను.

అనఁగాఁ బ్రాగ్దిశాసతి ధరించిన కెంపుముత్యములు గల కర్ణాభరణము ప్రాగ్గిరియందలి శిలలపై నొరయుటచేత నాకర్ణాభరణమునందలి యొకమాణిక్యము పడిపోఁగాఁ బిదపఁ గనుపట్టు లక్కగూఁడువలెను, రాత్రియనెడుసతి నేత్రములయం దుంచుకొనిన నల్లనికాటుకవలెను జంద్రునికళంక మొప్పారె నని భావము.

(వి) ఇది యచ్చ తెలుఁగుపద్యము.

అలంకారము — ఉత్ప్రేక్షాద్వయసంసృష్టి; రూపకోత్థాపితము — చంద్రునియందుఁ బ్రాగ్వనితాకర్ణాభరణత్వారోపణమును, దదీయోదయరాగమునందు మాణిక్యత్వారోపణమును బ్రతీయమానంబు లగుటచే రూపకము గమ్యము.

మ. అమృతం బాసవ మంగరాగ ముదయోద్యత్కాంతి చేలంబు చి
హ్నమునుం గా శశి రేవతీరమణుఁ డున్మాదంబు మీఱం దమో
యమున న్భంగము నొంది పాఱఁ గరసీరాలోడితం జేయ వ
చ్చె మరుద్వాహిని దానిఁ దేర్చ నన మించెం జంద్రికాపూరముల్. 47

ఈ పద్యమున వెన్నెలకాంతులు వర్ణింపఁబడినవి.

(వ్యా) అమృతంబు—సుధ; ఆసవము_కల్లుగాను; ఉదయోద్యత్కాంతి_ఉదయకాలమందలి ప్రకాశించునెఱ్ఱనికాంతి; అంగరాగము—మైపూఁతగాను; చిహ్నము_కళంకము; చేలంబు_వస్త్రముగాను; కాఁ—ఒప్పఁగా; శశిరేవతీరమణుఁడు_చంద్రుఁ డనెడు బలరాముఁడు; ఉన్మాదంబుమీఱఁ—కైపు హెచ్చఁగా; తమోయమునఁ—చీఁకటియనెడుయమునానదిని; భంగమునొందిపాఱఁ—పరాజితయైపరుగెత్తునట్లు; అని చీఁకటిపరమైన యర్థము; అలలను గలిగి పాఱునట్లు అని యమునానదిపరమైనయర్థము; కరసీరాలోడితఁ—కర – కిరణముల నెడు; సీర_హలాయుధముచేత; ఆలోడితం జేయఁ _ కలఁతపెట్టఁబడినదానినిగాఁ జేయఁగా; అని చీఁకటిపరమైన యర్థము; కర_చేతియందలి; సీర_మడక చేత; ఆలోడితఁ—కలఁతఁ జెందింపఁబడినదానినిగా_అని బలరామపరమైన యర్థము; దానిఁదేర్పఁ—ఆచీఁకటియనెడు యమునానది నూఱడించుటకై; మరుద్వాహిని_గంగానది; వచ్చెననఁ—వచ్చెనోయనునట్లు; చంద్రికాపూరములు_వెన్నెలయనెడు ప్రవాహములు; మించెఁ—అతిశయించెను.

అనఁగాఁ జంద్రుఁడు బలరామునివలెను, నతనియమృతము మద్యమువలెను, నతని యుదయకాలమునందలి యెఱ్ఱనికాంతి బలరాముని మైపూఁతవలెను, నతఁడు విచ్చలవిడిఁ జీఁకట్లను భంగమునొంది పరువెత్తునట్లు తనకిరణములతోఁ గలఁచుట బలరాముఁడు యమునానదిని నలలతోఁ జలించుచుఁ బ్రవహించునట్లు తనచేతియందలిహలాయుధముతో లేవనెత్తుటవలెను, జీఁకట్లు పొలిసినయనంతరము వెన్నెలలు వ్యాపించుట యమునానదికిఁ గలిగిన కష్టముం గాంచి యామె నోదార్చుటకై దానిచెచ్చెలి యగు గంగానది వచ్చుటవలెను నొప్పె నని భావము.

చంద్రికాపూరములు గంగానదీప్రవాహములవలె ధవళములై యొప్పారె నని భావము.

అలంకారము_రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్ష.

'భంగము నొంది' కరసీరాలోడిత' అనుచోట శ్లేష.

బలరాముఁడు శ్వేతవర్ణుఁ డనుటకుఁ బ్రమాణము:—

"సూర్యేందుకాంతకర్పూరకరకంభారజతంహాలీ
నిర్మోకభస్మహిండీరచందనంకరకాహిమం"

—అని కవికల్పలతయందు.

బలరాముఁడు మదిరాపానలోలుఁ డనుటకుఁ బ్రమాణము.

'ఘూర్ణయన్మదిరాస్వాదమదపాటలితద్యుతీ
రేవతీవదనోచ్ఛిష్టపరిపూతపుటేదృశౌ'

అని మాఘుఁడు వర్ణించియున్నాఁడు.

మంచు

తే. తారకాధీశు కిరణకదంబకంబు
చిలికెఁ బలుచని వలిపంపు జిలుఁగు మంచు
కైరవశ్రీవధూ కరగ్రహణవేళ
వెలికిఁ గ్రమ్మిన సాత్త్వికస్వేద మనఁగ. 48

(వ్యా) కైరవ......వేళన్—కైరవశ్రీవధూ—కుముదలక్ష్మియనెడు పెండ్లి కూఁతురియొక్క; "వధూస్స్నుషానవోఢా స్త్రీ భార్యా స్వేష్టాంగనాసుచ"
—అని విశ్వనిఘంటువు;

కరగ్రహణవేళన్ — పాణిగ్రహణకాలమందు; వెలికిన్—వెలుపటికి; క్రమ్మిన—వ్యాపించిన; సాత్త్వికస్వేదమనఁగన్—సాత్త్వికభావమగు చెమ్మటయోయన్నట్లు; తారకాధీశు—చంద్రునియొక్క; కిరణకదంబకంబు—కాంతులసమూహము; పలుచని—సన్నని; వలిపెంపు—తెల్లని; జిలుఁగుమంచున్—సూక్ష్మమైనమంచును; చిలికెన్—చల్లెను

అలంకారము—ఉత్ప్రేక్ష.

చకోరముల లీలలు

సీ. విరహులమై సోఁకి వేఁడి యగు వెన్నెలఁ
బచ్చివెన్నెల నులివెచ్చఁ జేసి
కలువపుప్పొళ్లచేఁ గసటైనవెన్నెల
వలిపవెన్నెలలోన వడిచి తేర్చి
చంద్రకాంతపుసీట జాలైనవెన్నెల
ముదురువెన్నెల జుట్టుఁ బదను చేసి
సతులమైపూఁతం బిసాళించువెన్నెలఁ
దనుపువెన్నెలరసాయనము గూర్చి
తే. చిగురువిలుకానిజాతర సేయఁ బూని
కొలముసాముల నందఱఁ గూడఁబెట్టి
వంతు గలయంగ బువ్వంపుబంతివిందు
పెట్టి రెలమిఁ జకోరపుఁబేరఁటాండ్రు. 49

ఈపద్యమునందు వెన్నెలలోఁ జకోరపక్షు లొనర్చు లీలలు వర్ణింపఁబడియె.

(వ్యా) చకోరపుఁ బేరఁటాండ్రు_చకోరగృహిణులు; పేరఁటాలు_శుభకార్యమునకుఁ బిలువఁబడివచ్చిన ముత్తయిదువ; ఇక్కడ గృహిణులని భావము; చిగురువిలుకాని జాతర సేయఁబూని- మన్మథోత్సవము చేయుటకుఁ బ్రయత్నించి; విరహ...వెన్నెలన్_వియోగుల శరీరస్పర్శనముచే వేఁడియైన వెన్నెలను; పచ్చివెన్నెలన్_శీతలమగు వెన్నెలతో(కలిపి); నులివెచ్చఁజేసి___సుఖోష్ణమగునట్లు చేసి; ఇచట విరహులశరీరములు విరహతాపముచే నుడికె నని భావము;___ తద్గుణాలంకారము;

కలువ.........వెన్నెలన్___కలువపుప్పొళ్ల చేన్_కైరవపరాగములచేత; కసరైన వెన్నెలన్_కలుషితమైనవెన్నెలను; వరిపెవెన్నెలలోనన్_సన్నని వెన్నెలలోనుండి; వడిచి_వడియఁగట్టి; తేర్చి_తేటపఱిచి _ (కల్మషరహితముగాఁ జేసి యనుట); ఇక్కడ "కలువపుప్పొళ్ల చేఁ గసరైనవెన్నెల" యనుటచేత రేలు కలువలు పూఁచెననియు దాని పుప్పొళ్ల చే వెన్నెలలు కలుషితము లయ్యెననియుఁ దెలియనగు;

చంద్ర.........వెన్నెల___చంద్రకాంతపునీటన్_చంద్రకాంతమణులు కరఁగి ప్రవహించునీటిచేత; జాలైన_ప్రవాహమైన; అనఁగా మిక్కిలి పలుచనైన; వెన్నెలన్_అనఁగాఁ జంద్రకాంతమణులు చంద్రకిరణములు సోఁకి నీరుగాఁ గరఁగె నని భావము; ముదుగు వెన్నెలన్_గట్టిపడిన వెన్నెలచేత; జొత్తఁబదనుజేసి_త్రావుట కనువుగాఁ జేసి;

సఖుల...............వెన్నెలన్___సఖులమైపూఁతన్ _ స్త్రీలశరీరమందలి చందనాదిచర్చలచేత; పిసాళించువెన్నెలన్_మిక్కిలిపరిమళించువెన్నెలను; తనుపువెన్నెలన్-తనివిఁజేయువెన్నెలతో; రసాయనముఁగూర్చి_జరావ్యాధులను బోఁగొట్టునట్టియౌషధముగాఁగూర్చి; చకోరాంగనలు వెన్నెలలో నిన్నివిధములగు భక్ష్యపదార్థములను సిద్ధపఱిచి రని భావము.

చకోరపక్షులు వెన్నెలనుదప్ప నితరవస్తువులను భక్షింపవని కవిసమయము. కవిసమయమునుగూర్చి ఆ 1. ప 52 వ్యాఖ్యానముం జూచునది; కొలముసాములనందఱన్_తమవంశమునందలిపురుషుల నందఱిని; కూడఁబెట్టి—చేర్చి; వంతుగలయంగన్—బంతులుగాఁ గూర్చుండఁబెట్టి; చుప్పుంపుబంతివిందు పెట్టిరి;—

అలంకారము_స్వభావోక్తి

(వి) ఇట్టిమనోహరమగు చంద్రికావర్ణనముగల రెండుపద్యము లితరకావ్యముల నుండి యీక్రిందఁ జదువరులకు ముదముగూర్ప నుదాహరింపఁబడుచున్నవి.

సీ. "నునులేఁతవెన్నెలకొనలు మెల్లనఁ ద్రుంచి పిల్లతండములకుఁ బెట్టునవియుఁ
జవిమైనవెన్నెల చంచులఁ గబళించి యింపారఁ బ్రియుల కందిచ్చునవియుఁ
గడఁగి యింతటఁగాని కడఁదేరదనుభంగిఁ దనర వెన్నెలవెల్లి మునుఁగునవియుఁ
బగలింటి యాఁకలిపాయఁ బైపైఁబడి ముదురువెన్నెలఁ గ్రోలి పొదలునవియుఁ
తే. గడుపునిండినఁ గసికాటు కఱచునవియుఁ, గూడియుండొంటితోఁ జెరలాడునవియు
నగుచువెన్నెల తమసొమ్మ యనినయట్లు, కోరి చరియించెఁ జవలఁ జకోరచయము."

—అని యనంతామాత్యవిభోజరాజీయమునందు.

సీ. "పసగలవెన్నెల మిసిమిపుక్కిటఁ బట్టి పొసఁగఁ బిల్లలనోళ్లఁ బోసి పోసి
నున్ననిక్రీయనుక్క వెన్నెలతుంపరల్ హుమ్మని చెలులపై నుమిసి యుమిసి
కమ్మనివెన్నెలఁ గడుపునిండఁగ గ్రోలి తెలివెక్క గఱ్ఱునఁ ద్రేన్చి త్రేన్చి
కన్నెప్పులకువచ్చు వెన్నెలక్రొన్నురు వేఱె వేఱె ప్రియురాండ్ర కిచ్చి యిచ్చి;
తే. తఱచువెన్నెలసంపులఁ దాఁటి తాఁటి, యీఱసుగువెన్నెలలలోనఁ దూఁటి తూఁటి
పలుచనగువెన్నెలలలోనఁ బాఁటిపాఁటి, మెలఁగెఁ జెక్కుచకోరంపుఁబులుఁగుగములు."

—అని జక్కనవిక్రమార్కచరిత్రమునందు.

సీ. కామినీమానమేఘశ్రేణి విరియంగఁ
దొగతెల్లుగుంపులు దొంగలింప
సాంధ్యరాగావిల చంద్రికాంబులు దేఱ
నిరులుమొత్తపుటన లివురఁ బాఱ
యువజనరాగపయోరాసు లుప్పొంగ
వెలిదమ్మి జాజిపువ్వులు ముడుంగ
మదచకోరమరాళమండలి చెలరేఁగఁ
బఱచుచేడియ లనుమెఱుపు లడఁగ
తే. నభినవశరత్సమాగమం బనఁగ మించు
నట్టి రాకానిశావేళ నలరువింట
గొనయ మెక్కించి వలరాజు కినుక మీఱ
విరహిజనములపై దండువెడలె నపుడు. 50

ఈపద్యమునందుఁ జంద్రయుక్తమగురాత్రి శరత్కాలాగమమని వర్ణింపఁబడినది.

(వ్యా) కామినీమాన—కామోద్రేకముగల స్త్రీలయొక్క మాన మనెడు; మేఘశ్రేణి—మేఘములవరుస; విరియంగన్—తొలఁగఁగా; తొగ కెల్లుగుంపులు—కలువల నెడు తెల్లుపూలగములు; తొంగలింపన్—ప్రకాశింపఁగా; సాంధ్యరాగ—సంజకెంజాయచేత; ఆవిల—కలుషమైన; చంద్రిక—వెన్నెలయనెడు; అంబులు—నీళ్లు; తేఱన్—ప్రసన్నములు కాఁగా; ఇరుల మొత్తపుటసలు—చీఁకటులసమూహమనెడు బురద; ఇవురఁబాఱన్—ఇంకిపోఁగా; యువజనరాగ—యౌవనవంతులగు పురుషులయొక్క యనురాగము లనెడు; పయోరాసులు—సముద్రములు; ఉప్పొంగన్—అతిశయింపఁగా; వెలిదమ్మి—తెల్లదామర లనెడు; జాజిపూవులు—జాతీకుసుమములు; ముడుఁగన్—ముకుళింపఁగా;

అనఁగాఁ జంద్రికావిశిష్టరాత్రులందుఁ దెల్లదామరలు ముకుళించుట స్వభావముగాన నవి ముకుళించుటను నట్టిరాత్రులందుఁ గవి శరత్కాలాతిదేశముచేసియుండుటచే శరదాగమలక్షణం బగు జాతీకుసుమముకుళనముగా నిందు వర్ణించెను. జాజిపూవులు వర్షాకాలమునందే పూచునని కవిసమయము. 'వర్షాసు ఘనశిఖిస్మయ హంసగమాః పంకకందళోద్భేదాః। జాతీకదంబకేతకఝంఝానిలనిమ్నగాహలిప్రీతిః'—అని ప్రమాణము. కావున జాజిపూవులు వర్షాకాలమున హేరాళముగాఁ బుష్పించి వర్షాత్యయశరదాగమములందు ముడుఁగునని కవిసమయ మాటచే నీపద్యమునందుఁ గవి కవిసమయమును బోషించుచుఁ జంద్రికాయుతరాత్రులందు జాజిపూవులు ముకుళించెనని చమత్కారముగాఁ జెప్పినాఁడు.

గ్రంథాంతరములందుఁ గాజిపూవు లని కానంబడుచున్నది. కాజిపూవులు—ఒకానొకపుష్పము. ఇదిసరసమగుపాఠముకాదు.

మదచకోర—మదించిన చకోరములనెడు; మరాళమండలి—అంచలపిండు; చెలరేఁగన్—విజృంభింపఁగా; పఱచుచేడియలు—పరువిడు స్త్రీలు; (అభిసారికలనుట); అనుమెఱుపులడఁగన్—అనెడు మెఱుపుఁదీఁగెలు అణఁగిపోవఁగా; ('మెఱుపులు' అనిరూపాంతరము); అభినవశరత్సమాగమంబనఁగన్—క్రొత్తగావచ్చినశరత్కాలమోయన్నట్లు; మించు—ప్రకాశించెను; ఇట్టిరాకానిశావేళన్—ఆపున్నమనాఁటిరాత్రులయందు; అలరువింటన్—పుష్పధనుస్సునందు; గొనయమెక్కించి—అల్లెత్రాటినెక్కువెట్టి; వలరాజు—మన్మథుఁడు; కినుకవిరాజిలన్—కోపముతో; దండువెడలెన్—యుద్ధమునకుఁ బోయెను.

చంద్రోదయధర్మములు శరత్కాలధర్మములతోఁ బోల్పఁబడినవి. శరత్కాలమునందు మేఘములు తొలఁగుటయు, తెల్లుగొదలు ప్రబలుటయు, జలము నిర్మలమగుటయు, బురదలిగురుటయు, సముద్రము లుప్పొంగుటయు, జాజిపువ్వులు ముకుళించుటయు, హంసలు హర్షోత్కర్షముం బొరయుటయు, మెఱుములు లేకుండుటయు స్వభావసిద్ధములు.

అలంకారము:—రూపకోత్థాపితోత్ప్రేక్ష.

ఉ. ఆనలినాయతాక్షు గడియారమునం దభిసారికా జిఘాం
సానిరతప్రసూనశరచాపగుణధ్వనులో యనంగ ఘం
టానినదంబు లయ్యెడ వినంబడియెం గుపితాబ్జలోచనా
మానసముల్ చలింపఁ బ్రథమప్రహరాపగమప్రశంసులై. 51

(వ్యా) అయ్యెడన్—అప్పుడు, గడియారమునందున్—కాలసూచకయంత్రము నందు; ఘంటానినదంబులు-గంటలయొక్క శబ్దములు; అభి............ధ్వనులో—— అభిసారికా—అభిసారికాస్త్రీలయొక్క; (స్త్రీలననుట); జిఘాంసా—హింసించు నిచ్ఛ యందు; (జిఘాంసా—హంతుమిచ్ఛా-సన్నంతము) నిరత—ఆసక్తుఁడైన; ప్రసూనశర—మన్మ థునియొక్క; చాప—వింటియొక్క; గుణధ్వనులో—అల్లెత్రాటిశబ్దములో; అనంగన్— అనునట్లు; కుపితా.........మానసముల్——కుపిత—కోపించిన; అబ్జలోచనా—స్త్రీల యొక్క; మానసముల్--హృదయములు; చలింపన్-అల్లాడఁగా; ప్రథమ.......... ప్రశంసులై—ప్రథమప్రహర-మొదటియామముయొక్క; ('ద్వౌయామ ప్రహరౌసమౌ' అని యమరుఁడు); అపగమ-పోవుటను; ప్రశంసులై-తెలియఁజెప్పునవియై; వినంబడి యెన్—వినవచ్చెను.

అనఁగా శ్రీకృష్ణునిగడియారమునం దొకజాము గడచెనని తెలిపెడు గంటలు మ్రోఁగెననియు,నాశబ్దములు మన్మథుఁడభిసారికాంగనలను హింసింపఁబూనిటంకారముఁ జేసినవింటియల్లెత్రాటిశబ్దములో యనునట్లుండెననియు, (వెన్నెలలప్రకాశమునం దభి సారికలుతమకాంతులచెంతకుఁ బోవుటకు వీలులేనికారణముచే వారిని మన్మథుఁడు హిం సించుచున్నాఁడనిభావము) నందాఁక మగలపైఁ బ్రణయకలహమును బూనియుండిన మాని నులు రాత్రియొకజాముగడచెనని తెలుపు గంటలుకొట్టఁగానే యిఁకనుబిగువుగానుండినఁ గార్యము తప్పునని భయపడి వారు కోపమును విడిచిపెట్టి తమప్రియుల ననుసరింపఁ బూని రనియు భావము.

జా ర కాం త లు

చ. వలిపము గట్టి హారములు వైచి పటీరము మైనలంది జా
దులు నెఱిగొప్పునం దుఱిమి త్రోవనె పోయితి మేని తాఁకియుం
దలఁచెడువారు లే రని మనంబుకలంకలు దేర్చి జారకాం
తల సమయస్థలంబులకుఁ దార్చిరి దూతిక లట్టివెన్నెలన్. 52

ఈపద్యమునందు జ్యోత్స్నాభిసారికలు వర్ణింపఁబడిరి.

(వ్యా) వలిపముఁగట్టి—సన్నని తెల్లనిచీరలు గట్టి; హారములు వైచి—ముత్యాల పేరులు ధరించి; పటీరము—చందనము; మైనలంది—దేహమునఁ బూసికొని; జాదులు—జాజి పువ్వులను; నెతిఁగొప్పునన్—(జాత్యేకవచనము)—నిండుఁగొప్పులందు;తుఱిమి—దూర్చి (ధరించుకొని); త్రోవనె—దారియందే; పోయిరి మేని—పోయినయెడల; తాఁకియుం దలఁచెడువారు లేరని—మనలను స్పృశించువారును స్మరించువారును నుండరని; దూతికలు—కాముకీకాముకులకు సందేశవార్తలఁ గొనిపోవుచెలికత్తెలు; మనంబుకలంకలు దేర్చి—మనసునందలి సంశయములను మాన్పి; జారకాంతలన్—అభిసారికలగు జారస్త్రీలను; అట్టి వెన్నెలన్—(ప్రకాశమానమగు) నావెన్నెలయందు; సమయస్థలంబులకున్—సంకేతస్థలముల యొద్దకు; తార్చిరి—తీసికొనిపోయిరి.

అనఁగా నీపద్యమునందుఁ జెప్పఁబడినయలంకారములన్నియు ధవళములు గావున నవి ధరించి యభిసారికలు వెన్నెలలో సంచరింతురేని నావెన్నెలకాంతులలో వీరిప్రకాశములు నైక్యమగుటచేఁ గామినులు ఘంటాపథముననె చనుచుండినను నితరులకు వారిం గనుఁగొనుట యశక్యమని భావము.

జ్యోత్స్నాభిసారికాలక్షణము.

శ్లో. మల్లికామాల్యధారిణ్య స్సర్వాంగీణార్ద్రచందనాః
క్షౌమవత్యో వలక్ష్యంతే జ్యోత్స్నాయామభిసారికాః
—అని కావ్యాదర్శమునందు దండి.

అలంకారము—మీలితము (అప్పయ్యదీక్షితులమతమున); అతిశయోక్తి (దండిమతమున).

## చం ద్రి కా వి హా ర ము లు

వ. వెండియుం దుహినకరమండలంబునం గురియు నప్పండువెన్నెలలు సాయంతనసంటనటుల మహానట వికటాట్టహాసభాసంబుల కనుప్రాసంబు లై, పూర్వపారావార పులినతల విహారమాణై రావణ కర పుష్కరోద్ధూత వాలుకాధూళిపాళికలకుం బ్రత్యాదేశంబు లై, యంధకారబలీంద్ర నిర్బంధనధురంధర సమయమధుమథన చరణాంగుష్ఠనిష్ఠ్యూత గగనసరిదంబుపూరంబుల కనుబింబంబు లై, చంద్రకాంతమణి నిర్మిత హార్మ్య హిమవన్మహీధర శృంగ పతితంబు లగు

చుం బెనువెల్లువలు గట్టి యతివిషమ మానినీమానప్రతీరంబు లురలం ద్రోయుచు, వియోగవేదనాభరాక్రంద ద్రథాంగ కంఠగుహాకుహరముఖంబుల ముంపుకొని మెఱయుచు, నరవిరిచెందొగ వెుుగడలం బడి సుడియుచుఁ, దనుకరువలిం గదలువిరులం దొరఁగుపుప్పొడితిప్పలం బొరలి తెట్టువ గొంచుఁ గనకడోలా విహార లీలాయత్త మత్తకాశినీ కపోలధాళధళ్యంబుల పెల్లునం గడలుకొని యుప్పొంగుచుఁ, గటికిజీఁకటితెరలం దెరలం జేయుచు, సకలభువన తలాప్లావనంబు గావించి, యజాండకరండంబు వెండిజలపోఁత గావించిన తెఱంగు నంగీకరించె;నప్పుడు తమయందు నెప్పుడెప్పుడు నింతురో యనుచు నువ్విళ్లూరుచందంబునఁ జంద్రికాకిరణకందళికలం గరంగు రేవెలుంగు రాచిప్పలం గప్పురంపుఁ గుప్పలం గొప్పరించిన సరస మధురసంబులు నించి యించిన వేడ్కల నొండొరువులకెం జిగురాకు మోవినంజలం జవిగొనుచుఁ గ్రోలి సోలి పూఁజవికలఁ బొంపిరివోవు కామినీ కాముకులును, వలరాచ కేలి సలుపునెడల నంగంబుల చకచకలు వెలివోవకుండ నిండార లేపంబులు సేయుచొప్పునఁ గర్పూర కస్తూరికా సంకుమద మిళిత చందనపంకంబు లొకొ ళ్లొకొళ్ల మేనులం గలయ నలందుకొని చలువచప్పరంబులం దీర్చిన పుప్పొడి తిన్నెల విశ్రమించు సతీపతులును, బ్రోడలగు నెచ్చెలులు జీరాడు సిగ్గుల నీడిగిలంబడ నెట్టకేలకుఁ ద్రోపు త్రోపాడుచుం దార్చి కూర్చి చనుటయు మరుం డొనర్పఁగల కోర్తలకుం దివురు తమకపుముంగలి పోఁజులు నిగిడించు క్రొవ్వాఁడి తూపులరూపున నొండొరువుల మఱుపెట్టి చూచు నెలగోలుచూపుల నితరేతరధైర్యంబులు గంటివడ నొంటిం బచ్చెనయోవరుల వసియించు వధూవరులును, చేరు కొనుకోరికలు దారుకొన డాయునెడం బొంగిన యంగంబులం బరస్పర బాహుపాశంబుల బిగియారం గౌఁగిలించుకొని కరంగిన డెందంబుల

రెంటి నొక్కటిగ నర్తించుపోలిక నర్తమిల్లి పగలు తమపాసిన యెడలం బొడము మనోజవికారంబుల నవిరళంబుగాఁ జెప్పికొనుచు హంసతూలికాతల్పంబుల నల్పేతరానందంబులం బొరలు తరుణీ తరుణులును, దొలుతటిపాలయలుకయెడలం జనించిన వియోగ శిఖి నిండారు రేయెండవేఁడిమి నగ్గలించినం దాలిమి దెమలం దమక తామ తమకించి కలసికొని నెచ్చెలులఁ జేలువెట్టి తొట్టినవేడ్క లం బొదరిండ్ల కందువలం బొదలు రమణీరమణులును, మబ్బుకొను వయసుగుబ్బల నిబ్బరంబుగ నివుడుతివుటలం బెచ్చుపెరుఁగు మచ్చ రంబుల నొకరొకరి మెచ్చక పచ్చవిలుతుండు విచ్చలవిడిం దన కైదువులు ముప్పదిరెంటం దోడుసూపె నన బహువిధ కరణాసన భేదంబులం బెనఁగుచు మణిసౌధంబులం గ్రీడించు యువతీయువజనం బులును, గ్రిక్కిఱిసినమక్కువల నిక్కువలఁ గమియం జిక్కుల చెయ్వులఁ ద్రొక్కుడు వడి రతిశాస్త్రరహస్యతత్త్వానుభవంబున వెలి మఱచిన వలరాచ తపసుల పోలికం దెలిరాకట్టు నెలవులం బవ్వళించియున్న నాయికానాయకులును, నెడ పడని వేడుకపనుల నలసి జడియు నవయవంబులపై సొలయు నెమ్మనంబులతో నొయ్య నొయ్యనం గదలు తూఁగుటుయ్యెలలం గన్ను మొగిచి యున్న విలాసినీవిలాసులునుం, గలిగి యన్నగరంబు శంబరాంతకు సామ్రా జ్యంబు ననుకరించె; నయ్యెడ నయ్యదువల్లభుండు సత్యయుం దాను ననర్ఘ్యమణిదీపదీపితంబును విమలదుకూలవితాన సందానితంబును బ్రాలంబ ముక్తాగుళుచ్ఛచ్ఛవిచ్ఛాదిత వలభి విలసితంబును వివిధ విచిత్రపట ఘటిత స్ఫటికభిత్తిభాగ భాసురంబును మృదులహంస తూలికా కల్పిత తల్ప సంఛన్న మణిమంచ కాంచితంబును ధవళ ఫణిలతాదళ క్రముకఖండ మండిత మరకతమణి భాజన విభ్రాజితం బును మృగమదమిళితపటీరపంకాంకిత మౌక్తికశుక్తి పరికల్పితంబును

దరవికచ లతాంత తాలవృంతకాంతంబును గోమలబిసతంతు సంతాన నిబద్ధ కుసుమదామ రమణీయంబును సురభి కృష్ణాగరుధూప ధూపితంబును బరిమళ మిళిత శిశిర సలిల పూర్ణ కనక గళంతికా సమంచితంబును మంజుగుంజ త్పారావత పతంగ గళరవ భరితంబును మాణిక్యసమున్నతాదర్శ దర్శనీయంబును నగు శయనాగారంబున వినోదకేలిం దేలి నిద్రాముద్రితనేత్రుండై శయనించె నయ్యవసంబున. 53

ఈ పెద్దవచనమందు వెన్నెలలో జరుగు వేడుకలు వర్ణింపఁబడినవి. దీనిని వెన్నెలవచన మందురు.

(వ్యా) వెండియుఁన్—మఱియు; దీనికి మొదటిరూపము 'వెండి'; దీనికిఁ బ్రయోగము.

"నాయాఁకలి కోర్వ వెపుడు వేయైనను నేఁగొనంగ వెండి యనుభవిం, తాయాస పడుటఁ గనుఁగొని కూయుదు ననుఁ బాసిచనుటకుం దగవగునే."

—భారతము-శాంతిపర్వము-ఆ 3.

1. తుహినకర......ప్రాసంబులై—

తుహినకర మండలంబునన్—చంద్రమండలంబునం దుండి; అప్పండువెన్నెలలు—ఆముదిరిన వెన్నెలలు; అనఁగాఁ బూర్ణచంద్రచంద్రిక లనుట. ఇది మొదలు "అంగీకరించె" నగుపదమువఱకు నొక పెద్దవాక్యము. దీనిలో నుపవాక్యములు పెక్కులు గలవు. సాయంతన—సాయంకాలమందలి; నటన—నృత్యమునందు; చటుల—(ఇటునటు) కదలుచున్న; మహానట—పరమశివునియొక్క; వికట—అధికములగు (భయంకరములగు); అట్టహాస—కేకరింపులతోడి నవ్వులయొక్క; భాసంబులకున్—ప్రకాశములకు; అను ప్రాసంబులై—సవర్ణములై (సమానములై యనుట); వర్ణసామ్య నిమిత్తమైన శబ్దాలంకారమును బోధించు నీ యనుప్రాసశబ్దమిచ్చట గౌణవృత్తిచేత సమానార్థకముగాఁ బ్రయోగింపఁబడియె. అనఁగా సంధ్యాతాండవ కేళీ సమయంబునఁ బరమశివుని భయంకరములగు నట్టహాస ప్రకాశములకు సమానములై (అతి ధవళములైన వనుట.)

అలంకారము—ఉపమ—వృత్త్యనుప్రాసము.

2. పూర్వ......దేశములై......పూర్వపారావార—తూర్పుసముద్రమునందలి; పులినతల—ఇసుక నేలలయందు; విహరమాణ—క్రీడించు స్వభావముగల; తాచ్ఛీల్యార్థము

నందు 'చానశ్' ప్రత్యయము ప్రయుక్తము. 'తాచ్ఛీల్య వయో వచన శక్తిషు చానశ్' అని వ్యాకరణసూత్రము; ఐరావణ—దేవేంద్రుని పట్టపుటేనుఁగుయొక్క; కరపుష్కర—హస్తాగ్రముచేత; 'పుష్కర' మనుశబ్దము కరిహస్తాగ్రవాచక మైనను 'కర' శబ్దప్రయోగము స్పష్టార్థము.

ఇట్టి ప్రయోగములు మహాకవుల గ్రంథములలోఁ గానఁబడు చుండుటచే వీనిని పునరుక్తి యని చెప్ప నొప్పదు.

'అనిర్వ్యపేవంశకరీర నీలైః' అని శిశుపాలవధ మహాకావ్యమునందు మాఘుఁడును;

'క్వచిత్కాంచీ దామా కరికలభకుంభ స్తన నతా,' అని సౌందర్యలహరియందు శ్రీ శంకర భగవత్పాదులును బ్రయోగించి యున్నారు.

'అయ మేవహి పంథాః మహాకవీనామ్.' (అనఁగా మహాకవుల మార్గ మిదియే) అని మహామహోపాధ్యాయ మల్లినాథసూరి వ్రాసియున్నాఁడు.

ఉద్ధూత—ఎగఁ జిమ్మఁబడిన; వాలుకా—ఇసుకయొక్క; ధూళిపాళికలను—సుమారముల (దుమ్ముల) గుంపులను; ప్రత్యాదేశంబులై—తిరస్కరించునవి యై (అనఁగా వానికంటెను నతిధవళములై యనుట; సమానములై యని భావము); అనఁగాఁ దూర్పు సముద్రమునందలి యిసుకయందు విహరించు దేవేంద్రుని యైరావతము హస్తాగ్రముచేత నెగఁ జిమ్మఁబడిన యిసుకదుమ్ముల గుంపులను దిరస్కరించునవియై (యతిధవళము లై యనుట) యని భావము. ఇటఁ జంద్రికలు తూర్పుదిశయందుండి పొడముటచే నా దిశయందలి సముద్రతీరమునందు నాదిక్కున కధిపతి యగు నింద్రుని వెల్లగజమును నుపమానముగాఁ దెచ్చుట చమత్కారము.

అలంకారము—ఉపమ.

(వి) 'ప్రత్యాదేశము' మున్నగు శబ్దములు సాదృశ్యవాచకంబు లని యెఱుంగ నగును. దీనికిఁ బ్రమాణము:—

స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి ।
ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిందతి ॥

తమన్వే త్యనుబధ్నాతి తచ్ఛీలం తన్నిషేధతి ।
తస్యానుకరోతీతి శబ్దాస్సాదృశ్యవాచకాః ॥

ఉపమానాని మే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః॥"

—అని యాచార్య దండియనుశాసనము.

3. అంధకారబలీంద్ర.........కనుబింబంబులై —

అంధకార—చీఁకటియనెడు; బలీంద్ర—బలిచక్రవర్తి యొక్క; నిర్బంధన—చెఱఁబెట్టుకార్యమునందు; ధురంధర—భారవాహియగు (ముఖ్యుఁడైన యనుట); సమయ—కాలమనెడు; మధుమథన — (మధుసూదనుఁడగు) విష్ణువుయొక్క; చరణాంగుష్ఠ—పాదముయొక్క బొటనవ్రేలినుండి; నిష్ఠ్యూత—విడువఁబడిన; గగనసరిత్—ఆకాశగంగ యొక్క; అంబుపూరంబులకున్—నీటి వెల్లువలకు; అనుబింబంబులై—సదృశములై; అనఁగాఁ గాలమనెడు విష్ణువు చీఁకటి యను బలిచక్రవర్తిని నణఁగఁ ద్రొక్కినటు లొప్పెననియుఁ దత్కాలమునందుఁ బ్రసరించిన వెన్నెలలు విష్ణుపాదమునుండి పొడమిన గంగానది వెల్లువవలె నొప్పెననియుఁ దాత్పర్యము.

(వి) 'నిష్ఠ్యూత' అనఁగా 'నుమియఁబడిన' యని యర్థము. ఇది యశ్లీలద్యోతకమైనను గౌణవృత్తిచే 'విడువఁబడిన' యను సరసార్థము నిచ్చుచున్నది. దీనికిఁ బ్రమాణము.

"నిష్ఠ్యూతోద్గీర్ణ వాంతాది గౌణవృత్తి వ్యపాశ్రయం ।
అతిసుందర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే ॥"

అని కావ్యాదర్శమున నాచార్యదండివచనము.

"దివాపి నిష్ఠ్యూత మరీచి భాసా బాల్యాదనావిష్కృత లాంఛనేన ।
చంద్రేణ నిత్యం ప్రతిభిన్నమౌళే శ్చూడామణే కిం గ్రహణం హరస్య ॥"

కుమారసంభవము 7-35.

ఆలోకమార్గం సహసా వ్రజం త్యా కయాచిదుద్వేష్టనవాంతమాల్యః ।
బద్ధుం నసంభావిత ఏవతావత్కరేణ రుద్ధోపిచ కేశపాశః ॥"

రఘువంశము.

ఈమూడుసమాసములందుఁ గావ్యగుణ మోజస్సు.

దీర్ఘ సమాసములు గద్యములందు బ్రయోగింపవచ్చును.

'ఓజస్సమాస భూయస్త్వ మేతద్గద్యస్య జీవితమ్' అని కావ్యాదర్శము.

4. చంద్రకాంత......టురలం ద్రోయుచున్ —

చంద్రకాంతమణి—చంద్రకాంతమణులచేత; నిర్మిత—కట్టఁబడిన; హర్మ్య—మేడలనెడు; హిమవన్మహీధర—హిమవత్పర్వతముయొక్క; శృంగ—కొనలయందుండి; పతితంబు లగుచున్—పడుచున్నవై; పెనువెల్లువలు గట్టి—గొప్పప్రవాహములుగా నేర్పడి; అతివిషమ—మిక్కిలి కఠోరములగు; మానినీ—మానవతులగు స్త్రీలయొక్క; మాన—

అహంకార మనెడు ; ప్రతీరంబులు—గట్టులను ; ఉరలంద్రోయుచున్—క్రింద దొర్లునట్లు పడఁద్రోయుచు ; "ఉరులం" అని యుత్వమధ్యముగాఁ బెక్కు ముద్రితగ్రంథములలోఁ గానంబడుచున్నది. అది రూపాంతరముగా గ్రాహ్యము ;

అనఁగా మేడలు చంద్రకాంతమణులచే నిర్మితములై హిమాచలశృంగముల వడువునఁ గనఁ బొడవులగుటచేఁ జంద్రకాంతమణులు వెన్నెల సోఁకుటచేఁ గరఁగి యత్యున్నతస్థలంబునుండి క్రిందికి జాఱుటవలన వేగవంతంబులై పెనుప్రవాహములుగా నేర్పడిన వనినను వెల్లువలు గట్టులను బెల్లగించి త్రోయునట్లు వెన్నెలవెల్లువలు మానవతులగర్వములనెడు గట్టులను బడఁద్రోసె ననియు భావము. అనఁగా నిట్టిసకలజనాహ్లాదకరమగు వెన్నెలయందును మానవతులగు యువతులు తమయభిమానములను మాని కాంతులపై మనసు పెట్టిరి యని తాత్పర్యము.

5. విరహాంగ......మెఱయుచున్—(ఇంతవఱ కొకవాక్యము)

విరహవేదనాభర—అధికమగు విరహవేదనచేత ; ఆక్రందత్—శోకముతో బిగ్గరఁగా నేడ్చుచున్న ; రథాంగ—చక్రవాకపక్షులయొక్క ; కంఠగుహాకుహర—కంఠములనెడు గుహాప్రదేశముల యగ్రములందు ; ముంపుగొని—నిండి ; మెఱయుచున్—ప్రకాశించుచు ; అనఁగా వెన్నెలయందు రథాంగదంపతు లొండొంటిం బాసి విరహవేదనలచేఁ గుంది యేడ్వఁదొడఁగిరని భావము.

'మొరయుచున్' అని పాఠాంతరము—శబ్దించుచు నని యర్థము.

6. అలరవిరి......సుడియుచున్—(ఇంతవఱ కొకవాక్యము)

అలరవిరి—సగమువికసించిన ; 'అఱ' యని రూపాంతరము ; చెందొవమొగడలన్—ఎఱ్ఱనిగలువమొగ్గలయందు ; పడి—ప్రవేశించి ; సుడియుచున్—తిరుగుచు ; అనఁగాఁ గలువపూవుల నాహ్లాదింపఁ జేయుచు నని భావము.

7. తనుకరువలి......తెట్టువఁగొంచున్—(ఇంతవఱ కొకవాక్యము)

తనుకరువలిన్—మందమారుతముచేత (తనుపు+కరువలి—తనుపుశబ్దమునకు వృత్తియం దుకారలోపము) ; తనుపు—తృప్తిపొందించుట ; కదలు—చలించుచున్న ; విరులన్—పుష్పములందుండి ; తొరఁగు—రాలుచున్న ; పుప్పొడితిప్పలన్—పరాగములరాసులందును ; పొరలి—సంచరించి ; తెట్టువఁగొంచు—గుంపులుగూడుచు ; (రాసు లగుచు) ; ఈవాక్యమునం దన్ని తెనుఁగుపదములే పొందుపఱుపఁబడినవి.

8. కనకదోలా......యూఁగుచున్—(ఇంతవఱ కొకవాక్యము)

కనకడోలా—బంగారపు టుయ్యేలలయందు; విహారలీలా—విహరించు క్రీడలకు; ఆయత్త—అధీనలైన; మత్తకాశినీ—మదించిన యుత్తమస్త్రీలయొక్క; కపోల—చెక్కిళ్లయందలి; ధాళధళ్యంబుల—తళతళ యను కాంతులయొక్క; పెల్లునన్—అతిశయము చేత; కడలుకొని—వ్యాప్తములయి; ఉప్పొంగుచున్—వృద్ధిఁబొందుచు; అనఁగా మదవతులగు నుత్తమాంగనలు బంగారపుటుయ్యేలలలో వేడుకగా నూఁగుచుండ వారిచెక్కిళ్లయందలి తళతళమను మెఱుఁగులతోఁ గలిసి వెన్నెలలు మఱియుఁ బ్రకాశమానంబులయ్యె నని భావము.

9. కటికి......జేయుచున్—(ఇంతవఱ కొకవాక్యము)

కటికిచీఁకటి—గాఢాంధకారమనెడు; తరులన్—వృక్షములను; తెరలం జేయుచున్—పడఁద్రోయుచు (నశింపఁజేయుచు); సకలభువనతలాప్లావనంబు—సమస్త భూప్రదేశములను ముంచుటను; కావించి—చేసి; అజాండకరండంబున్—బ్రహ్మాండభాండమును; వెండిజలపోఁత గావించిన తెఱంగున్—వెండినీటి మొలాము చేసిన విధమును; అంగీకరించెన్—కైకొనెను; అనఁగా వెన్నెల సమస్తభువనప్రదేశంబులను ముంచుటచే బ్రహ్మాండ మనెడు భాండమునకు వెండినీటిమొలాము వేసినట్లు భువనమంతయుఁ దెల్లఁగాఁ బ్రకాశించె నని భావము. జలపోఁత—జలము+పోఁత, వెండి బంగారు నీటితో మొలాముచేయుట; ఈపదమునకు 'జలపోసనం' బని కొన్నిపుస్తకములలోను 'జలపూఁత' యని కొన్నిగ్రంథములలోను రూపాంతరములు గానంబడుచున్నవి.

ఇదివఱకు మహావాక్యము పూర్తియాయెను. ఇచ్చటనుండి సామ్రాజ్యంబు ననుకరించె ననువఱకు రెండవమహావాక్యము.

"అప్పుడు తమయందు.........కాముకులును" వఱకు నొక యుపవాక్యము.

అప్పుడు—ఆవెన్నెలసమయమందు; తమయందున్—(ముందు చెప్పఁబోవు రేవెలుంగు ఱాచిప్పలందు; ఎప్పుడెప్పుడు నింతురో యనుచున్—ఎప్పుడు నిండింతురో యనుచు; ఉవ్విళ్లూరుచందంబునన్—మిక్కిలి యాశతోఁ దర్వరపడురీతిని; చంద్రికాకిరణకందళికలన్—వెన్నెలయొక్క మొలకలవంటి కిరణములచేత; కరంగు—స్రవించుచున్న; రేవెలుంగు ఱాచిప్పలన్—రేవెలుంగు—చంద్రుఁడు; రేవెలుంగుఱా—చంద్రకాంతమణి; రేవెలుంగు ఱాచిప్పలన్—చంద్రకాంతమణి నిర్మితములైన పాత్రములందు; కప్పురంపుఁగుప్పెలన్—ఘనసారపరిమళమిళితంబు లగు గిన్నెలయందు; కుప్పె—మెడనిడుపుగాఁగల కాచపాత్రవిశేషము; అనఁగా సీసాయని యర్థము; కొప్పరించిన—అతిశయించిన; సరస మధురసంబులు—రుచ్యములగు మద్యములను; నించి—నిండించి; ఇంచినవేడ్కలన్—అధికములగు విలాసములతో; ఒండొరువుల—ఒకరొకరి; కెంజిగురాకుమోవి—ఎఱ్ఱనిచిగు

కుటాకువలెనుండు నగరములనెడు; నంజలన్—నంజాకొను వస్తువులను; చవిగొనుమన్—రుచిచూచుచు; క్రోలి—త్రాగి; సోలి—సొక్కి (పరవశలై); పూఁజవికెలన్—పువ్వుల నప్పరములయందు (మండపములందు); పొంపిరివోవు—ఉల్లాసముతో నతిశయించు (సంతసించు); కామినీకాముకులును—విలాసినీవిలాసులును;

2. నలరాసకేలి.........సతీపతులును—(ఇది యొక యుపవాక్యము);

నలరాసకేలి—మన్మథక్రీడ; సలుపు నెడలన్—చేయు సమయములందు; (ఎడ—సమయము); సకసకలు—శోభా విశేషములు; ఇది సంస్కృతపదము. 'మంజుఘోషా ... కంజాతి సకసక స్తబకిత చంపకకుజ్మరుహంబు' అని యీ కావ్యమునందు చతుర్థాశ్వాసమున ప్రయోగము. లేపనంబులు—పూఁతలు; సంకుమదము—జవ్వాజి;

3. ప్రౌఢలగు......వధూవరులును—(ఇది యొక యుపవాక్యము);

ప్రౌఢలగు—ప్రౌఢలగు; నెచ్చెలులు—చెలికత్తెలు; జీరాడు—మట్టాడు; ఈడిగిలంబడి—వెనుకకీడుదుకఁగా; దీనికిఁ గర్తృపదము వధూవరులు; త్రోపుత్రోపాడు నాన్—బలసంపన్నముగాఁ ద్రోయుచు; తార్చి—డగ్గఱించి; కొల్లలకున్—యుద్ధసన్నాహములకు; తెమకొపు—త్వరగల; ముంగలి పోఁజులు—ముందు నడచు సేనలబారులు; నిగిడించు—ప్రయోగించు; రూపునన్—విధమున; మఱపెట్టి—మఱుఁగుపెట్టి; ఎలగోలు—ముందుగాఁ బ్రసరించు; గంటివడన్—గాయపడఁగా; ఒంటిన్—నిస్సహాయముగా; ... గొంగులు వేయఁబడిన లోపలిగదులందు;

4. మీఁగుగొను......తరుణీతరుణులును—(ఇది యొక యుపవాక్యము.);

మీఁగుగొను—అధికమైన; తారుకొనన్—కదియునట్లు; డాయునెడన్—చేరు సమయమున; అతిగించు పోలికన్—అతికించు విధమున; అత్తమిల్లి—ఓటి, శయనించి; హంసతూలికా తల్పంబులన్—హంసములకడుపుక్రింది భాగమునం దున్న మృదురోమములచే నిర్మింపఁబడిన శయ్యలందు; అల్పేతరానందంబులన్—అధికసంతోషములచేత, హంసతూలికాతల్పమునకుఁ బ్రమాణము.

"శ్లో॥ మం...శజపక్షోద్భూతైః మృదుభిః పించ గుచ్ఛకైః।
శ్లక్ష్ణేన చర్మణానద్ధా శయ్యా హంసో మహీభుజాం॥"

'మసంతే హంసజా శయ్యా.' —అని తత్త్వరత్నాకరము.

శయ్యలు సప్తవిధములు:—

"హంసపించమయీ కాపి శాల్మలీతూలజాపరా।
కార్పాసరచితా చాన్యా కేసరై రితరాకృతా।

పల్లవైః కల్పితా కాచి త్కాచిత్కుసుమనిర్మితా,
పానీయపూరితా కాచి చ్ఛయ్యైవం సప్తధాస్మృతా॥"

—అని తత్త్వరత్నాకరము.

ఈ యుపవాక్యమునందు శబ్దాలంకారము ఛేకానుప్రాసము.

5. తొలుతటి...రమణీరమణులును—(ఇది యొకయుపవాక్యము);

పొలయలుకయెడలన్ - ప్రణయకలహపువేళలందు; వియోగశిఖి—విరహానలము; అగ్గలించినన్—అధికముకాఁగా; తాలిమి—ధైర్యము; తెనులన్—చలింపఁగా; తమకించి—త్వరపడి; బేలువెట్టి—మోసపుచ్చి; తొట్టిన—అతిశయించిన; కందువలన్—సంకేతస్థలములందు; పొదలు—ఆనందించు;

6. మబ్బుకొను...యువజనంబులును—(ఇది యొకయుపవాక్యము.);

మబ్బుకొను—మదించిన; వయసుగుబ్బల—లేఁబ్రాయపు స్తనములయందు; నిబ్బరంబుగ నివుడుతివుటలన్—నిబ్బరంబుగన్—సాంద్రముగా; నివుడు—(నిగుడు) అతిశయించు; తివుటలన్—కోర్కెలచేత; పెచ్చుపెరుఁగు—పైపై నతిశయించు; మచ్చరంబులన్—స్పర్ధలతో; కైదువులు—ఆయుధములు; ముప్పదిరెంటన్—మన్మథుని కైదు బాణములని ప్రసిద్ధిగలదు గాని ముప్పదిరెం డున్నట్లులేదు. పరశు, భిండివాల, పట్టిస, తోమర, కుంతాదులు ముప్పదిరెం డాయుధవిశేషంబులు గలవు; వానినే మన్మథుఁడిచ్చటఁ దాల్చినట్లు కవి చెప్పినాఁడు; బహువిధకరణాసనభేదంబులన్—నానాప్రకారము లగు రతిబంధాసనములచేత; ఇవి కామశాస్త్రమునందుఁ జెప్పఁబడిన రతిక్రీడావిశేషములు;

7. క్రిక్కిఱిసిన......నాయకులును—(ఇది యొకయుపవాక్యము);

క్రిక్కిఱిసిన - సాంద్రమైన; మక్కువలన్—ప్రేమలచేత; ఇక్కువలన్—సంకేతస్థలములందు; కమియన్—చేరఁగా; ఈధాతువున కీయర్థమే యిచ్చట సరిపడుచున్నది; 'ధాతూనా మనేకార్థత్వాత్' అను ప్రమాణము శరణము. చిక్కులచెయువులన్—కఠినములగు క్రీడలయందు; త్రొక్కుడువడి—నలఁగి; వెలిమఱచిన-వెలి - తమకంటె నన్యమును; అనఁగా బాహ్యవ్యాపారమును; మఱచిన—; వలరాచతపసులపోలికన్ - వలరాజు—మన్మథుఁడు; తపసులు—తపముచేయువారు అనఁగా ఋషులు; వలరాచతపసులు—మన్మథశాస్త్రనిరతు లగు తపోధనులు; పోలికన్—వలె; తెలిరాకట్టునెలవులన్—తెలిరా—వజ్రములచేత; కట్టు—నిర్మింపఁబడిన; నెలవులన్—ప్రదేశములందు;

8. ఎడపడని............విలాసులును—(ఇది యొక యుపవాక్యము);

ఎడపడని-నడుమనడుమనంతరములేని (నిరంతరముగు); వేడుకపనులకు—వినోద కార్యములచేత; అలసి-బడలికఁజెంది; జడియు-వడఁకు. సొలయు-సోలు; ఒయ్యనొయ్యన - మెల్లమెల్లగా; శంబరాంతకుసామ్రాజ్యంబుకు - మన్మథునిరాజ్యమును; అనుకరించెను—పోలెను; ఇచ్చో రెండవమహావాక్యము పూర్తియగుచున్నది.

"అరవిరి" యనువాక్యము మొదలింతవఱకుఁ బ్రాయికముగా నచ్చతెనుఁగుపదములే యుపయోగింపఁబడినవి.

"అనర్ఘ్య" మొదలీవచనముకడవఱకు నొకటే వాక్యముగ శ్రీకృష్ణుని శయనాగారము వర్ణింపఁబడియె. ఇందు సంస్కృతసమాసములే కానంబడియెడు.

అనర్ఘ్యమణిదీపదీపితంబును—

అనర్ఘ్య—వెలయిడరాని; మణిదీప—మణులచే నిర్మింపఁబడిన దివ్వియలచేత; దీపితంబును—ప్రకాశింపఁబడినదియు;

విమల.........సంధానితంబును—

విమల—స్వచ్ఛమైన; దుకూల—తెల్లపట్టుతోఁ జేయఁబడిన; వితాన—మేల్కట్లచేత; సంధానితంబును—కట్టఁబడినదియు;

ప్రలంబ.........విలసితంబును—ప్రాలంబ—సరిగా వ్రేలుచున్న; 'ప్రాలంబమృజులంబిస్యాత్కంఠాద్వైకక్షికంచతత్' అని యమరుఁడు; ముక్తాగుళుచ్ఛ—ముత్తెములగుచ్ఛములయొక్క; ఛవి—కాంతులచే; ఛాదిత—కప్పఁబడిన; వలభి—కొణిగలచేత; విలసితంబును—ప్రకాశించుచున్నదియు;

వివిధ.........భాసురంబును—

వివిధ—నానాప్రకారములైన; విచిత్రపట—చిత్తరువులు వ్రాయఁబడిన పటములచేత; ఘటిత—కూర్పఁబడిన; స్ఫటిక—స్ఫటికమయమైన; భిత్తిభాగ—గోడలప్రదేశములచేత; భాసురంబును—ప్రకాశించుచున్నదియు;

మృదుల.........కాంచితమును—

మృదుల-(మృదు) మెత్తని; ఇట్టిశబ్దములు శిత, శితల; మంజు; మంజుల; మొదలగునవి; హంసతూలికాకల్పిత—హంసరోమములచేఁ జేయఁబడిన; తల్ప—పాన్పులచే; సంఛన్న—కప్పఁబడిన; మణిమంచక—మణిఖచితములైన మంచములచేత; అంచితంబును—ఒప్పినదియు;

ధవళ.........విభ్రాజితంబును—

ధవళ—తెల్లని; ఫణిలతాదళ—నాగవల్లీదళములు (అనఁగాఁ దమలపుటాకులు); క్రముకఖండ—పోఁకచెక్కలు (వీనిచేత); మండిత—అలంకరింపఁబడిన; మరకతమణిభాజన—పచ్చలచేఁ జేయఁబడిన పళ్లెములచేత; విభ్రాజితంబును—ప్రకాశింపఁబడినదియు;

మృగమద.........కల్పితంబును—

మృగమద—కస్తూరితోఁ; మిళిత—చేర్పఁబడిన; పటీరపంక — చందనపుగుజ్జుచేత అంకిత—ఒప్పుచుండు; మౌక్తికశుక్తి—ముత్తెపుఁ జిప్పలచేత; 'శుక్తి'శబ్దముచేతనే ముత్తెపు జిప్పలను నర్థము గలిగినను 'మౌక్తిక'శబ్దము స్పష్టార్థము. పరికల్పితంబును—అలంకరింపబడినదియును;

దరవికచ.........కాంతంబును—

దరవికచ—ఇంచుక వికసించిన; లతాంత—పుష్పమయమైన; అనఁగాఁ బూలచే నిర్మితమైన; తాలవృంత—విసనకఱ్ఱలచేత; కాంతంబును—రమణీయమైనదియు;

కోమల............రమణీయంబును—

కోమల—సుకుమారమైన; బిసతంతు—తామరతూండ్లదారములయొక్క; సంతాన-సమూహముచేత; నిబద్ధ—కూర్పఁబడిన; కుసుమదామ—పూలదండలచేత; రమణీయంబును-మనోహరమైనదియు;

సురభి.........ధూపితంబును—

సురభి—పరిమళవంతమైన; కృష్ణాగరు—నల్లనియగరుచెక్కయొక్క; ధూప — పొగ చేత; ధూపితంబును—వాసనఁగలుగఁజేయఁబడినదియును;

పరిమళ.............సమంచితంబును—

పరిమళ—సువాసనతోఁ; మిళిత—కూడిన; శిశిరసలిల—చల్లనినీరుచేత (పన్నీరుచే ననుట); పూర్ణ—నిండింపఁబడిన; కనక—బంగారుమయమైన; గళంతికా—చెంబులచేత సమంచితంబును—ఒప్పియున్నదియును;

మంజు.........భరితంబును—

మంజు—మనోహరముగా; గుంజత్—కూయుచున్న; పారావతపతంగ—పావురాళ్లనెడుపక్షులయొక్క;పారావత—పావురాళ్లు. పతంగ—ఇతరశుకాదిపక్షులు(వీనియొక్క అనియు నర్థముచెప్పవచ్చును; గళరవ—కంఠధ్వనులచేత; భరితంబును—నిండినదియును;

(వి) 'పారావతగళరవ' అనుపదములచే మణితము ధ్వనితమయ్యెడునని రసికులకుఁ దలంపునకు వచ్చునేమో.

మాణిక్య............దర్శనీయంబును—

మాణిక్య—రత్నమయమైన; సమున్నత—పొడవైన; ఆదర్శ—అద్దములచేత; దర్శనీయంబును—చూడఁదగినదియును; అనఁగా నాశయనాగారంబు రత్నఖచితమగుపొడవైన నిలువుటద్దములచేఁ బ్రకాశించెనని భావము; అగు శయనాగారంబునకు—అగు పడకటింటి యందు.

అలంకారము—ఉదాత్తము.

## శుక్రోదయము

మ. నలినాప్తుండు మదీయబంధు లని తా నక్షత్రసంఘంబులం
గలఁప న్వచ్చుచునున్నవాఁ డనుచు ము న్గల్గంగ నాత్మీయ శి
ష్యుల మందేహులఁ బోరొనర్పఁ జనుఁడంచుం బంప నేతెంచె నాఁ
బొడమె న్వేగురుఁజుక్క కాలఫణభృద్భోగోల్లసద్రత్నమై. 54

ఈపద్యమున శుక్రోదయము వర్ణింపఁబడినది.

(వ్యా) మదీయబంధు లని—నక్షత్రములు శుక్రునకు బంధువు లగుటచేత నని భావము; శుక్రుఁడును నొకనక్షత్ర మగుటచే నితరనక్షత్రము లతనికి బంధువులనియెఱుంగు నది; ఆత్మీయశిష్యులన్—తన (శుక్రునియొక్క) శిష్యులను; మందేహులన్—మందేహులను రాక్షసులను; పోరొనర్పన్ + చనుఁడనుచున్—సూర్యునితో యుద్ధము సేయఁబొండని; పంపన్—ఆజ్ఞాపించుటకై; మున్గల్గంగన్—మున్నుగా; ఏతెంచె నాన్—(శుక్రుఁడు)వచ్చె నో యన్నట్లు; వేగురుఁజుక్క—ప్రాతఃకాలమున నుదయించునక్షత్రము; అనఁగా శుక్రుఁడు; కాల.........రత్నమై—కాల—కాలమనెడు; ఫణభృత్—సర్పముయొక్క; భోగ—పడగయందు; ఉల్లసత్—ప్రకాశించునట్టి; రత్నమై—మాణిక్యమై (అనఁగా మాణిక్యమో యన్నట్లు); పొడమెన్—పుట్టెను.

అలంకారము—హేతూత్ప్రేక్ష; కాల......రత్నమై—ఇచట రూపకము. వీనికి సంసృష్టి.

## మేలుకొలుపులు

క. వైతాళికు లప్పుడు మృదు
గీతామృతవచనరచన గీలుకొన యశో
దాతనయు మేల్కొలుపఁ బ్రా
భాతికరమణీయరాగభణితులు సెలఁగెన్. 55

(వ్యా) వైతాళికులు—ప్రాతఃకాలమునఁ బ్రభువులను మేలుకొలుపుపాఠకులు; "వైతాళికా బోధకరాః" అని యమరుఁడు; కీలుకొనన్—అతిశయింపఁగా, ఒప్పఁగా; ప్రాభాతిక.........భణితులు—ప్రాభాతిక—ప్రభాతకాలోచిత మగు; రమణీయ—; మనోజ్ఞమైన; రాగభణితులు—(భూపాలాది) రాగములయొక్క వాక్యములు; చెలఁగెన్—ప్రకాశించెను.

మ. జయ గోవింద ముకుంద చక్రధర కంసద్వేషి సాత్రాజితీ
ప్రియ నారాయణ కౌస్తుభాభరణ కుంభిత్రాణపారీణ కా
ళియదర్పఘ్న పతంగవాహ వనమాలీ కృష్ణ వైకుంఠ శౌ
రి యశోదాత్మజ భక్తవత్సల మురారీ గోపికావల్లభా. 56

(వ్యా) కుంభిత్రాణపారీణ—కుంభి—ఏనుఁగుయొక్క (ఏనుఁగు ననుట); త్రాణ—రక్షించుటయందు; పారీణ—పారగమునుముట్టినవాఁడా; అనఁగా సమర్థుఁడాయనుట; ఇది గజేంద్రమోక్షకథను దెలుపును; పతంగవాహ—పక్షివాహనుఁడా; అనఁగా గరుత్మంతుని వాహనముగాఁ గలవాఁడా.

గు ణి త క్ర మ ము

మ. శరధిక్రోడనివేశ శార్ఙ్గధర శిష్టధ్యేయ శీతాంశు భా
స్కరనేత్రద్వయ శుభ్రపంకరుహభాస్వన్నాభ శూరాన్వయా
భరణా శేషశయాన శైలధర శోభారమ్యసర్వాంగ శౌ
ర్యరసోదంచిత శంఖచక్రధర శర్వాణీసహాయప్రియా. 57

(వ్యా) శరధిక్రోడనివేశ — శరధి—సముద్రముయొక్క; క్రోడ—మధ్యభాగము; నివేశ—ఉనికిపట్టుగాఁ గలవాఁడా; అనఁగా క్షీరాబ్ధిమధ్యమున వసించువాఁడనుట; శార్ఙ్గధర—శార్ఙ్గ—శార్ఙ్గమనువింటిని; విష్ణువుచేతియందు ధరించెడు వింటికి 'శార్ఙ్గ'మని పేరు; ధర—ధరించినవాఁడా; శిష్టధ్యేయ—శిష్ట—సజ్జనులచేత; ధ్యేయ—ధ్యానింపఁదగినవాఁడా; శుభ్రపంకరుహ......నాభ—శుభ్రపంకరుహ—తెల్లదామరచేత; భాస్వత్—ప్రకాశించుచున్న; నాభ—నాభికలవాఁడా; బహువ్రీహి సమాసమందు 'నాభి' యను శబ్దము 'నాభ' యని మాఱును; శైలధర—పర్వతమును ధరించినవాఁడా; అనఁగా గోవర్ధనగిరి నెత్తినవాఁ డనుట; శోభారమ్య సర్వాంగ—శోభా—మంచికాంతిచేత; రమ్య—మనోజ్ఞమైన; సర్వాంగ—సకలావయవములు గలవాఁడా; శర్వాణీ సహాయప్రియా—పరమశివునకు హితుఁడైనవాఁడా; ఈపద్యమునందుఁ బ్రతిసమాసాదివర్ణములు గుణితక్రమమునఁ బ్రయోగింపఁబడి యున్నవి.

క. మేల్కనుము దేవ యివె రా
చిల్కలు కను మొగిచియున్న చెలువలఁ దమకుం

బిబ్బోకములు నేర్పఁగ ముద్దులు
గులుకుచు పలుకులను మేలుకొలిపెడుఁ గృష్ణా. 58

సుగమము.

సీ. చరమాద్రి దావాగ్ని సంప్లుష్ట సురసౌర
భేయీకరీషైకపిండ మనఁగ
బహుచకోరదంశ పరిపీత చంద్రికా
క్షౌద్ర నీరస మధుచ్ఛత్ర మనఁగఁ
బ్రత్యూషముఖోచ్చల ద్రాత్రివర్షీయసీ
పలిత పాండుర కేశబంధ మనఁగ
గగనసౌధాలేపకర కాలశిల్పి ని
ర్ముక్తసుధావస్త్రముష్టి యనఁగ
తే. సుమహితజ్యోత్స్నికాలతా సుమగుళుచ్ఛ
మనఁగ నతిధూసరచ్ఛాయ నబ్జవైరి
చెలువు వీడి బింబావశిష్టుఁ డగుచు
నల్లనల్లన వ్రాలెడు నంబుజాక్షి. 59

ఈపద్యంబున నస్తమయసమయచంద్రుఁడు ధూసరకాంతిచే నొప్పుట వర్ణింపఁ
బడినది.

(వ్యా) చరమాద్రి.........పిండ మనఁగన్—
చరమాద్రి—పడమటికొండయందలి; దావాగ్ని—కార్చిచ్చుచేత; సంప్లుష్ట—చక్కఁ
గాఁ గాల్పఁబడిన; సురసౌరభేయీ—కామధేనువుయొక్క; కరీషైకపిండము—పేడముద్ద;
అనఁగన్—అనునట్లు;

బహుచకోర.........చ్ఛత్ర మనఁగన్—
బహుచకోరక—అనేకచకోరపక్షులచేతను; దంశ—తేనెటీఁగలచేత; పరిపీత—త్రాగఁ
బడిన; చంద్రికా—వెన్నెలయనెడు; క్షౌద్ర—తేనెగలదగుటచే; క్షుద్రాః, (ఆఁడు) తేనెటీఁ
గలు—వానిచే సంగ్రహింపఁబడునది కాన క్షౌద్రమని తేనెకుఁ బేరు; 'క్షుద్రా వ్యంగానటీ
వేశ్యా సరఘా కంటకారికా?—అనియమరుఁడు; నీరస—నిస్సారముగాఁ జేయఁబడిన;

మధుచ్ఛత్ర మనఁగన్ – తేనెపెర యనునట్లు; "మధుకోశో మధుచ్ఛత్రమ్".—అని నిఘంటువు.

అనఁగాఁ దేనెటీఁగలు తేనియ నంతయుఁ ద్రాగినపిదపఁ దేనెపెర శోభాహీనమై ధూసరముగాఁ గన్పడునట్లు చకోరములు వెన్నెలను ద్రాఁగుటచేతఁ జంద్రుఁడు నిస్సారుఁ డయ్యెనో యనునట్లు ధూసరవర్ణముతో నొప్పెనని భావము;

ప్రత్య.........బంధ మనఁగన్—

ప్రత్యఙ్ముఖ—పడమటి దిక్కునుగూర్చి; ఉచ్చలత్—చనుచున్న; రాత్రిపల్లి యసీ—రాత్రియనెడు ముసలిదానియొక్క; పలిత—నెరసిన; పాండుర—తెల్లని; కేశబంధమనఁగన్—తలవెండ్రుకలముడియో యనునట్లు;

అనఁగా రాత్రి యంతమగుటచే రాత్రి యను ముసలిస్త్రీ పడమటిదిక్కునుగూర్చి చనునట్లుండెననియు నామెయొక్క తెల్లగా నెరసినతలవెండ్రుకల ముడియోయన్నట్లు చంద్రుఁ డొప్పె ననియు భావము.

గగనసౌధా లేప.........ముష్టి యనఁగన్—

గగన—ఆకాశ మనెడు; సౌధ—మేడకు; ఆలేపకర – పూఁతపూయువాఁడైన; కాల శిల్పి—కాల మను శిల్పిచేత; నిర్ముక్త—విడువఁబడిన; సుధావస్త్రముష్టి యనఁగన్—సున్నపునీటియం దద్ది పిండిన గుడ్డముద్దయో యనునట్లు;

అనఁగా నాకాశమను మేడకుఁ గాలమనుశిల్పి గుడ్డతో సున్నపుఁబూఁతఁ బూసి పిమ్మట నావస్త్రమును బిడిచి ముద్దగావైచినప్పటిచందమునఁ జంద్రుఁడుండెనని భావము.

సుమహిత............గుళుచ్ఛ మనఁగన్—సుమహిత – మిక్కిలి పూజ్యమైన (శ్రేష్ఠమైన); జ్యోత్స్నా కాలతా—వెన్నెలయ నెడుతీఁగయొక్క; సుమగుళుచ్ఛమనఁగన్—పూవుగుత్తియో యనునట్లు; అబ్జవైరి—చంద్రుఁడు; అతిధూసరచ్ఛాయన్—మిక్కిలిశోభాహీనమైన యించుక తెల్లని కాంతితో; చెలువు వోనాడి—అందము చెడి; ("పోకాడి" అను పాఠమునకును నిదియే యర్థము); బింబావశిష్టుఁడగుచున్—నిస్తేజ సుఁడగుటచేత గుండ్రని యాకృతిమాత్రము గలవాఁడై; అల్లనల్లన వ్రాలెడున్—మెల్ల మెల్లనన స్తమించుచున్నాఁడు.

అలంకారములు—రూపకోత్థాపితోత్ప్రేక్షలేను గలవు.

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటిబందెకానికిం
గలఁగుచు వీనిలోన నిడి కైకొన నమ్మికకాఁపు లంచుఁ జు

క్కలదొర యెండదాడి విని గ్రక్కునఁ దానును గాంతి వీనిలోఁ
పల నెలకొల్పె నాఁ బలుకఁబాఱె నిశాంత నిశాంత దీపముల్. 60

ఈపద్యమునందుఁ బ్రభాతకాలమునందలి దీపములు శోభావిహీనంబు లగుట వర్ణింపఁబడినది.

(వ్యా) జలరుహమిత్రుఁడు_సూర్యుఁడు; ఆత్మరుచిసంపదన్_తనకిరణములనెడు ధనమును; చీఁకటిబందికానికిన్ _ చీఁకటి యనెడు దొంగకు; కలఁగుచున్_భయపడి; వీనిలోన నిడి_నిశాంతదీపములయందు (అనఁగా గృహములలోనిదీపములయం దుంచి); కైకొనన్ _ మఱలఁ బుచ్చుకొనఁగా; అనఁగా నస్తమించునపుడు సూర్యుఁడు తనకిరణములను గృహములయందలిదీపములం దుంచి మఱల నుదయకాలమునందు వానిం బుచ్చుకొనె నని భావము; (ఈవిషయమును జూచి) _ చుక్కలదొర_చంద్రుఁడు; ఎండదాడివిని_ సూర్యకాంతియొక్క యాటోపమునకు భయపడి; నమ్మికకాఁపు లంచున్_ఈనిశాంత దీపములు నమ్మఁదగినకాఁపువాండ్రనితలంచి, గ్రక్కునన్_వేగముతో; తానును_(చంద్రుఁడునుట); కాంతిన్_తనయొక్కకిరణములను; వీనిలోపలన్_నిశాంతదీపములయందు; నెలకొల్పెనాన్_ఉంచెనోయనునట్లు; నిశాంతనిశాంతదీపముల్ — నిశాంత _ రాత్ర్యంతమునందలి; నిశాంతదీపముల్_గృహదీపములు; నిశా + అంత_రాత్ర్యంతము; నిశాంత_ఇల్లు; పలుకఁబాఱెన్_ఇంచుక తెల్లవర్ణము గలవి యాయెను.

అనఁగా సాయంకాలము మొదలు రేయంతయు గృహములయందలిదీపము లెట్టి కాంతులతోఁ బ్రకాశించుట సూర్యుఁడస్తమయసమయమందుఁ జీఁకటియనుదొంగ తనకిరణములనెడు సంపద నపహరించునేమో యని భయపడి వానిని దీపములం దుంచుటచేతనో యన్నట్లు దీపము లరుణములై ప్రకాశించె ననియు, రాత్రియంతమై యుదయకాలమున గృహములందలిదీపములయొట్టికాంతులు చెడి నిస్తేజస్కములై యించుక తెల్లఁబాఱుట చంద్రుఁడు తానస్తమించుసమయమగుటచే సూర్యాతపమునకుభయపడి తనకాంతియనెడు ధనమును నీదీపములయందుంచినచో మఱలఁ దానడిగినప్పుడు మునుపు సూర్యుఁ డుంచిన యర్థమును నతనికిచ్చినట్లు తనకును దనధనము నిత్తురనునమ్మకముతోఁ దనకిరణములనెడు ధనమును దీపంబులలో నుంచెననుటు లొప్పెననియు భావము.

(వి) ఇక్కడ సూర్యుఁ డస్తమించునపుడు తన తేజము నగ్నియం దుంచి చనునని యు మఱల నుదయకాలంబున నగ్నియందుండి కైకొనుననియు శ్రుతి నుడువుచున్నది.

"అగ్నిం వా వాదిత్య స్సాయం ప్రవిశతి, తస్మాదగ్నిర్దూరా న్నక్తం దదృశే, ఉభే హి తేజసీ సంపద్యేతే, ఉద్యంతం వావాదిత్యమగ్నిరనుసమారోహతి, తస్మాద్ధూమ ఏవాగ్నేర్దివా దదృశే"

"ఆదిత్యోవా అస్తమయన్నగ్ని మనుప్రవిశతి".

అలంకారములు — హేతూత్ప్రేక్ష — కావ్యలింగము.

మ. దరమీలన్నయనంబులై గృహబహిర్ద్వారంబుల న్యామకుం
జరము ల్గండమద భ్రమ ద్భ్రమరికా ఝుంకార సంగీత వి
స్ఫురణ ల్చూపుచుఁ గర్ణతాళనినదంబు ల్మించ నీమాగధో
త్కరముం బోలుచుఁజూడనొప్పె నివె హస్తన్యాసము ల్మీఱఁగన్. 61

ఈ పద్యమునందుఁ బ్రాతఃకాలమునందలి యేనుఁగులవిన్యాసము వర్ణింపఁబడినది.

(వ్యా) దరమీలత్ — కొంచెముగా మూయఁబడిన; నయనంబులై — కన్నులుగల వియై; గృహబహిర్ద్వారంబులన్ — ఇంటివెలుపటి వాకిళ్లయందు; యామకుంజరముల్ — జాములవంతునఁ గావలియుండు నేనుఁగులు; గండ....... విస్ఫురణల్ — గండ మద — చెక్కిళ్ల మదజలములకై; భ్రమత్ — తిరుగుచున్న; భ్రమరికా — ఆఁడుతుమ్మెదలయొక్క; ఝుంకార — మ్రోఁతయనెడు; సంగీతవిస్ఫురణల్ — గానవైఖరులను; చూపుచున్ — కనఁబఱచుచు; కర్ణతాళనినదంబు ల్మించన్ — చెవులు కదలించునప్పుడు పుట్టుచప్పుళ్లనెడు తాళశబ్దము లతిశయింపఁగా; హస్తన్యాసముల్మీఱఁగన్ — తొండములను ద్రిప్పుట యతిశయింపఁగా; నీమాగధోత్కరముంబోలుచున్ — నీస్తుతిపాఠకుల సమూహమువలె; ఇవె — ఇవ్వియే (ఈముందట ననుట); చూడనొప్పెన్ — కానంబడియెడు.

అలంకారము — రూపకోత్థాపిత మగు నుత్ప్రేక్ష.

మ. సమయాభీరకుమారుఁ డేపునఁ దమిస్రారూపనక్తంచరిం
గమలారిస్తనమండలాంక విష సంక్రాంత ప్రభాదుగ్ధపూ
రముతో రూపఱఁ జేయ శోషిలుచుఁ దార లోసల నిట్టూర్పు సాం
ద్రముగా నూర్చె ననంగఁ బెల్లెసఁగెఁ బ్రాతఃకాలవాతూలముల్. 62

ఈపద్యమునందుఁ బ్రాతఃకాలవాయువులు వర్ణింపఁబడినవి.

(వ్యా) సమయాభీరకుమారుఁడు — సమయ — కాలమనెడు; ఆభీరకుమారుఁడు — గొల్లబిడ్డఁడు (బాలకృష్ణుఁడనుట); ఏపునన్ — విజృంభణముతో; తమిస్రారూపనక్తంచరిన్ — తమిస్రారూప — చీఁకటి యాకారము గల; నక్తంచరిన్ — రాక్షసస్త్రీని (పూతన ననుట); కమలారి.............పూరముతోన్ — కమలారి — చంద్రుఁడనెడు; స్తనమండల — కుచప్రదేశమందలి; అంక — చిహ్నమనెడు; 'మండలాంత' అని కొన్ని ముద్రితగ్రంథములలోఁ

భావము కనఁబడుచున్నది–దానికంటె 'మండలాంక' అనుపాఠమే సరసము; విష–విషముతోఁ; సంక్రాంత – కూడుకొనిన; ప్రభా – కాంతియనెడు; దుగ్ధపూరముతోన్–పాలవెల్లువతోడ; రూపఱఁజేయన్ – నాశమునొందింపఁగా; శోషిలుచున్–మూర్ఛనొందుచు; తారల్ – నక్షత్రములు (కనుగ్రుడ్డులని పూతనపరమైనయర్థము); (ఇచట శ్లిష్టపరంపరితము); సోలన్ – చొక్కి–మఱుఁగుపడఁగా; సాంద్రముగాన్–అధికముగా; నిట్టూర్పున్–నిశ్వాసమును; (నిడు+ఊర్పు); ఊర్చెననంగన్ – శ్వాసము విడిచెనోయను నట్లు; ప్రాతఃకాల వాతూలముల్–ప్రభాతవాతములు; పెల్లెసఁగెన్–(పెల్లు+ఎసఁగెన్) మిక్కిలి యతిశయించెను.

అనఁగాఁ గాలము కృష్ణునివలెను, జీఁకటి పూతనవలెను, జంద్రుఁడు పూతన స్తనము వలెను, గళంకముతోఁడి తెల్లనిచంద్రకిరణప్రసరణంబులు పూతనయొక్క విషముతోఁ గూడినచనుఁబాలు గురియుటవలెను, జీఁకటి నశించుట కృష్ణునిచేఁ బూతన మరణించుట వలెను, నక్షత్రములు మఱుఁగువడి యస్తమించుట కృష్ణుఁడు చనుఁబాలుఁ గ్రోలఁగాఁ బూతన కనుగ్రుడ్డులు సొక్కువడుటవలెను, ప్రాతఃకాలవాయువులు పూతనమరణసమయమందు విడిచిన శ్వాసవాయువులవలెను, నొప్పె నని భావము.

అలంకారము—రూపకోత్థాపితోత్ప్రేక్ష.

క. మంచునఁ దోఁగిన పల్లవ
సంచయము భవద్వియోగ సంతాప రుద
చ్చంచలనయనా బాష్పక
ణాంచిత బింబోష్ఠ లీల నలరె నుపేంద్రా. 63

(వ్యా) తోఁగిన – తడిసిన; పల్లవసంచయము–చిగుళ్లగుంపు; భవ...లీలన్— భవద్వియోగ–నిన్నెడఁబాయుటవలని; సంతాప–వేదనచేత; రుదత్–ఏడ్చుచున్న–చంచలనయనా–స్త్రీలయొక్క; బాష్పకణ–కన్నీటిబొట్లచేత; అంచిత–ఒప్పిన; బింబోష్ఠ–దొండపండువంటి యధరములయొక్క; లీలన్–విలాసముతో; అలరెన్–ఒప్పెను.

అలంకారము–నిదర్శనము–(పదార్థవృత్తినిదర్శన మని తెలియవలయు.)

తే. కమ్మకస్తురిగుళికలు తమ్మిలేమ
నిదురమంపునఁ బుక్కిట నించు మేలు
కాంచి వేకువ నుమిసె నాఁ గమలముకుళ
కోటరంబుల నెలదేఁటికొదమ లెగసె. 64

(వ్యా) తమ్మిలేమ-తామరయనెడు స్త్రీ; కమ్మకస్తురిగుళికలు - సువాసన గల కస్తూరిమాత్రలను; నిదురమంపునన్-నిద్రమైకముచేత; పుక్కిటన్-పుక్కిలియందు;నించి-పెట్టుకొనియుండి; వేకువన్-ప్రాతఃకాలమందు; మేలుకాంచి-మేలుకొని;ఉమిసె నాన్-వెడలఁగ్రక్కెనో యనునట్లు;కమలముకుళకోటరంబులన్-ముకుళించినకమలములయంతర్భాగములనుండి; కోటరము-తొఱ్ఱ; ఎలదేఁటికొదమలు-ప్రాయపుఁదుమ్మెదలు; ఎగసెన్-వెలువడెను.

అలంకారము-స్వరూపోత్ప్రేక్ష-'తమ్మిలేమ' అనుచోట రూపకము.

మ. వినవయ్యెం గృకవాకుకూజితము లుద్వేలంబులై సూరసూ
తనవోద్యత్కరకుంచికా విఘటితధ్వాంతారరక్రక్రియా
స్వనములై కైరవిణీప్రసూనపృథుకస్వాపక్రియాలోలిక
ల్దినకృన్మార్గనివారణత్వరితమందేహోగ్రసింహధ్వనుల్. 65

ఈపద్యమునందుఁ బ్రాతఃకాలమునఁ గుక్కుటములు కూయుట వర్ణింపఁబడియె.

(వ్యా) సూరసూత............స్వనముల్ —

సూరసూత-అనూరునియొక్క (సూర్యసారథియొక్క); నవోద్యత్-క్రొత్తగాఁ బుట్టుచున్న; కర-కిరణములనెడు హస్తములయందలి; కుంచికా-తాళపుఁజెవిచేత; విఘటిత-తెఱవఁబడిన; ధ్వాంత-చీఁకటియనెడు; అరర—తలుపుగడియయొక్క; క్రక్రియా-స్వనముల్-కఱకఱయనుశబ్దములు; (ధ్వన్యనుకరణము); అనఁగా సూర్యునిసారథి యగు ననూరుఁడు తనకిరణములనెడు చేతియందలి తాళపుఁజెవితోఁ దలుపనెడు చీఁకటిని దెఱచునపుడు పొడము కఱకఱయను శబ్దములో యనునట్లు కోడికూఁతలొప్పెనని భావము.

కైరవిణీ............లోలికల్ —

కైరవిణీ-కలువతీఁగలయొక్క; ప్రసూన-పుష్పములనెడు; పృథుక-బిడ్డలను; స్వాప క్రియా-నిద్రఁబుచ్చుకార్యమునందలి; ఆలోలికల్ —"ఉళుఉవాయి" అనియెడు దవుడల నుండి పుట్టుధ్వనులు; అనఁగా గలువపువ్వు లుదయకాలమునందు ముకుళించుట స్వభావము గావున నాపువ్వులనెడుబిడ్డలను నిద్రపుచ్చుటకై పాటలఁ బాడునెడఁ జేయఁబడిన "ఉళుఉవాయి" యను జోలరవములో యన్నట్లు కోడికూఁతలొప్పె నని భావము.

దినకృత్............సింహధ్వనుల్ —

దినకృత్-సూర్యునియొక్క; మార్గ-త్రోవను; నివారణ - అడ్డగించుటయందు; త్వరిత-వేగముగల; మందేహ-మందేహులనెడు రాక్షసులయొక్క; ఉగ్ర-భయంకరమైన;

సింహధ్వనుల్—సింహనాదములు; అనఁగా సూర్యునడ్డగించు మందేహులను రాక్షసుల యొక్క సింహనాదములో యనఁ గోడికూఁత లొప్పె నని భావము.

అలంకారము—అభేదరూపకము.

(వి) ఈపద్యమునందు 'స్వాపక్రియాలోలికల్' అనునెడ ముద్రిత గ్రంథములయం దన్నిటను 'స్వాపక్రియాడోలికల్' అను పాఠము గానంబడుచున్నది. 'డోలికల్' అనఁగా నుయ్యాలలని యర్థమే కాని శబ్దమునకు నర్థము లేదు. 'ఆలోలికల్' అనఁగా 'ఆలోలిక స్తాలురవః' అను నిఘంటు ప్రమాణముచే స్త్రీలు బిడ్డలను నిద్రపుచ్చునపుడు వేడుకతో తమ తాలువులచేఁ బుట్టించు 'ఉలులుహాయి' అను శబ్దమని యర్థమగుటచే నీపాఠమే సాధువనియుఁ గవిహృదయమనియు నూహించి యిట్లు సవరించితి.

తే. రాజు వీడెత్తి చనినఁ దారకభటాలి
యంబరాభోగ నిజ శిబిరాంగణమునఁ
గాలుకొల్పిన పావకజ్వాల లనఁగఁ
బ్రాచిఁ గనుపట్టె నవసాంధ్యరాగరుచులు. 66

ఈ పద్యమునందుఁ బ్రాతఃకాల సాంధ్యరాగము వర్ణింపఁబడినది.

(వ్యా) రాజు—చంద్రుఁడు; వీడెత్తి—శిబిరమెత్తి (వీడు—దండు విడిసినచోటు); దండెత్తియనుట; చనినన్—పోఁగా; తారకభటాళి—నక్షత్రములనెడు సేనలవరుస; అంబరాభోగనిజ శిబిరాంగణమునన్—అంబర—ఆకాశముయొక్క; ఆభోగ—వైశాల్యమనెడు; నిజ శిబిరాంగణమునన్—తనయొక్క విడిదిలప్రదేశములయందు; కాలుకొల్పిన-ప్రజ్వలింపఁ జేసిన; పావకజ్వాల లనఁగన్—అగ్నిజ్వాలలో యన్నట్లు; నవసాంధ్యరాగరుచులు—క్రొత్త సంజకెంజాయలు; ప్రాచిన్—తూర్పుదిశయందు; కనుపట్టెన్—కానఁబడెను.

అలంకారము—ఉత్ప్రేక్ష.

తే. కమలినీజృంభికలకు దిక్కాంత లెల్ల
హస్తతాళంబు లొనరించి రనఁగఁ జెలఁగె
విరిసి కాసార కూల కులాయ చలిత
శకున నిజ పటపటస్వనము లధిప. 67

(వ్యా) కమలినీ—తమ్మితీఁగయనెడు స్త్రీయొక్క; జృంభికలకున్—ఆవులింతలకు (వికాసములకని భావము); దిక్కాంతలెల్లన్—దశాంగనలందఱును; హస్తతాళంబు లొన

రించిరనఁగన్ — కరతాళధ్వనులు చేసిరోయనునట్లు; లలిత...స్వనములు — లలిత — మనోజ్ఞమైన; కాసార — కొలంకులయొక్క; కూల — గట్టులందలి; కులాయ — గూఁడులందు; చలిత — తిరుగుచున్న; శకున — పక్షులయొక్క; పక్షజ — ఱెక్కలనుండి పుట్టిన; పటపట స్వనములు — పటపటయనుధ్వనులు; చెలఁగెన్ — ఒప్పెను.

అనఁగా గొప్పపదవియందుండు (రాణులు) వనిత లావులించునపుడు చెలికత్తెలు మున్నగు చేడియలు చిటికెలువేయుట వాడుకగావున నిచట సరోవరలక్ష్మి వికసించుట యావులించినట్లుండెననియు దానికి దిగంగనలు కరతాళధ్వనులు చేసిరోయనునట్లు సరోవరతీరములందలిగూఁడులయందుఁ దిరుగుపక్షుల ఱెక్కలచప్పుడు లొప్పారెననియు భావము.

అలంకారము — ఉత్ప్రేక్ష.

సీ. యామినీసమయంబు నాశాతటప్రదే
  శంబుఁ బ్రసన్నభావంబు నొందెఁ
బ్రియచుంబితాంగనా బింబాధరంబులు
  నుడురాజు నపరాగయుక్తిఁ దోఁచె
నఖిలవస్తువులుఁ బ్రాగచలకూటవిటంక
  తలములు నతిరోహితంబు లయ్యె
నుత్తుంగపురగోపురోపరిస్థలులు సా
  రసములు నాత్తసౌరభము లయ్యెఁ
తే. దరుణగోతర్ణకంబులు సురపథాంత
రంబులును విచ్యుతగ్రహంబు లయ్యె
నియమపరతంత్రభూదేవచయముఁ గౌశి
కవ్రజంబు సమాధియోగమునఁ బరఁగె. 68

ఈ పద్యమునందుదయకాలపు శోభాతిశయము వర్ణింపఁబడినది.

(వ్యా) యామినీ...భావంబునొందెన్ — యామినీసమయంబున్ — రాత్రివేళయు; ఆశాతటప్రదేశంబున్ — దిక్ప్రదేశంబును; ప్రసన్నభావంబున్ — ప్ర + సన్నభావము — వినాశభావమును; అని రాత్రిపరమైన యర్థము; సన్న — షద్లు — విశరణగత్యవసాదనేషు అనుధాతువు — క్త ప్రత్యయాంత రూపము; ప్రకాశమును, అని దిక్పరమైన యర్థము; ఒందెన్ — చెందెను.

అనఁగా నుదయకాలమునందు రాత్రివేళకు వినాశభావము గలిగెననియు దిక్తట ప్రదేశము ప్రకాశమానం బాయె ననియు భావము.

ప్రియచుంబిత...యుక్తిఁదోఁచెన్ —

ప్రియచుంబిత—ప్రియులచే ముద్దుపెట్టుకొనఁబడిన (పానముచేయఁబడిన); అంగనా—స్త్రీలయొక్క; బింబాధరంబులున్—దొండపండువంటి పెదవులును; ఉడురాజున్—(నక్షత్రముల కధిపతియగు) చంద్రుఁడును; అపరాగయుక్తిన్—అప + రాగయుక్తిన్, పోయినరక్తిగల యని యధరపరమైన యర్థము; అపర + అగయుక్తిన్—పశ్చిమాద్రిని జేరుటతోన్, అని చంద్రపరమైన యర్థము; తోఁచెన్—కానంబడియెను.

అనఁగా నంగనల యధరములు ప్రియులచేఁ బీతంబులయి యరుణకాంతివిహీనంబు లయి పలుకఁబాఱెననియుఁ జంద్రుఁడు పశ్చిమాచలముఁ జేరె ననియు భావము.

అఖిల...నతిరోహితంబు లయ్యెన్ —

అఖిలవస్తువులున్—అన్నివస్తువులును; ప్రాగచల......తలములున్—ప్రాగచల—పూర్వాద్రియొక్క; కూట—శిఖరముల యంచలి; విటంకతలములున్—అగ్రప్రదేశములును, అతిరోహితంబు లయ్యెన్—అ + తిరోహితంబులు, మఱుఁగు పడినవిగాక యుండెను, అనఁగా స్పష్టముగాఁ గానంబడెనని యఖిలవస్తుపరమైనయర్థము; అతి + రోహితంబు లయ్యెన్—మిక్కిలి యెఱ్ఱని కాంతులు గలవి యాయెనని యచలకూట విటంకముల పరమైనయర్థము;

అనఁగా నెల్లవస్తువులును వెలుతురుచే స్పష్టముగాఁ గానఁబడియె ననియుఁ బూర్వగిరియొక్క యగ్రప్రదేశము (సూర్యకిరణముల సోఁకుడులచేత) నెఱ్ఱని కాంతులఁ బొలిచెననియు భావము;

ఉత్తుంగ...సౌరభము లయ్యెన్ —

ఉత్తుంగ—పొడవులైన; పురగోపుర—పట్టణప్రాకారములయొక్క; ఉపరిస్థలులున్—పైభాగములును; సారసములున్—తామరపువ్వులును; ఆత్తసౌరభములయ్యెన్—ఆత్త—పొందఁబడిన; సౌర + భములు—సూరసంబంధములయిన కాంతులు గలవి.

“సూరసూర్యార్యమాదిత్యద్వాదశాత్మదివాకరాః” అని యమరసింహుఁడు; ఇది పురగోపురోపరిస్థలులపరమైన యర్థము; ఆత్తసౌరభములు—ఆత్త + సౌరభములు, పొందఁబడిన పరిమళముఁ గలవి యని సారసపరమైన యర్థము;

అనఁగాఁ బట్టణ ప్రాకారముల పైభాగములయందు సూర్యకాంతులు ప్రసరించె ననియుఁ దామరలు వికసించి పరిమళవంతము లయ్యెననియు భావము.

తరుణ.........ప్రగ్రహంబు లయ్యెన్—

తరుణ—లేఁతయైన; గోత్రకర్ణకంబులున్—ఆవుదూడలును; 'సద్యోజాతస్తు తర్ణకః' అని యమరుఁడు; సురపథాంతరంబులును—సురపథ—ఆకాశముయొక్క; అంతరంబులును—మధ్యభాగములును; విచ్యుత—విడువఁబడిన; ప్రగ్రహంబులయ్యెన్—పలుపులుంగలవి యాయెను; అని గోతకర్ణకములపర మైనయర్థము; విచ్యుత—మిక్కిలిజాఱిన (అనఁగా మఱుఁగుపడిన); ప్రగ్రహంబులయ్యెన్—గొప్పగ్రహములు గలవి యాయెను;

అనఁగా సుదయకాలమునందుఁ బాలుపిదుకుటకై (జనులు) పలుపులు విచ్చి దూడలను విడిచినారనియు నాకాశమధ్యమునందు గ్రహములు గానఁబడకపోయిన వనియు భావము;

నియమ.........బరఁగెన్—

నియమ — శాస్త్రవిధులందు (శౌచస్నానతపోదానాదులయందు); పరతంత్ర—శ్రద్ధాళువు లైన; భూదేవచయమున్—బ్రాహ్మణులసమూహమును; కౌశికవ్రజంబున్—గుడ్లగూబలగుంపులును; సమాధియోగమునఁ బరఁగెన్—మనోలయరూపమగుధ్యాననిష్ఠ చేనొప్పెనని భూదేవపర మగు నర్థము; నిశ్చలభావమునొందెను; అనఁగా నిద్దురఁ జెందె నని కౌశికపర మైనయర్థము;

నియామ మనుటకు—

శ్లో. శౌచంస్నానంతపోదానం మౌనేజ్యాధ్యయనంవ్రతం
ఉపోషణోపస్థదండా దశైతే నియమా స్మృతాః.

—అని కాశీఖండము.

అనఁగా బ్రాహ్మణు లుదయకాలమందు శాస్త్రవిహితములగు ననుష్ఠానాదులను జేయుచుఁ జిత్తైకాగ్ర్యముతో నీశ్వరధ్యానముఁ జేసిరనియు గుడ్లగూబలు నిద్దురఁజొందె ననియు భావము.

ఈపద్యమునందు శ్లేషానుప్రాణితతుల్యయోగితాలంకారము.

మ. కమలాప్తోన్నమదంశుజాలములు దిగ్భాగంబులం గ్రమ్మినం
గుముదాంతఃస్థిత లక్ష్మి యెండవడ సోఁకు లైన్యపఁగాలేక ప
త్త్రిముల న్మాటుగఁ జేసి కప్పుకొనియెం దత్కాలసంకోచన
క్రమదంభంబున రాజవల్లభ లసూర్యంపశ్య లౌదు గ్గదా. 69

ఈ పద్యమునందు సూర్యోదయకాలమునందుఁ గలువలు ముకుళించుట వర్ణింపఁబడినది.

(వ్యా) కమలాప్త...జాలములు — కమలాప్త — సూర్యునియొక్క; ఉన్నమత్ — పొడవుగాఁ బ్రసరించుచున్న; అంశుజాలములు — కిరణసమూహములు; దిగ్భాగంబులన్ — దిక్ప్రదేశములయందు (నలుదెసలయందు); క్రమ్మినన్ — వ్యాపింపఁగా; కుముద...... లక్ష్మి — కుముద — కలువలయొక్క; అంతస్స్థిత — నడుమనుండు; లక్ష్మి — (అధిదేవత); ఎండవడసోఁకుల్ — తీక్ష్ణమగు సూర్యాతపప్రసరణములను; సైఁపఁగాలేక — ఓర్వఁజాలక; తత్కాల......దంభంబునన్ — తత్కాల — ఆసమయమందు; సంకోచనక్రియ — ముకుళించు కార్యమనెడు; దంభంబునన్ — వ్యాజముచేత; పత్రములన్ — దళములను; మాటుగఁ జేసి — ఎండకడ్డముగాఁ బూని; కప్పుకొనియెన్ — మఱుఁగుపఱచుకొనెను; అనఁగా ముకుళించెను.

అనఁగా నుదయకాలమునందు సూర్యకిరణములు నలుదెసలు వ్యాపింపఁగాఁ గలువలు ముకుళించుట కుముదములయం దుండులక్ష్మీదేవి యెండతాఁకుడుల కోర్వఁజాలక ముకుళించుట యనువ్యాజముతోఁ దనదళముల నెండకడ్డముగనుంచి కప్పుకొనినట్లుండెనని భావము.

రాజవల్లభ.........లౌదుర్గదా —

రాజవల్లభలు — రాజస్త్రీలు (రాణులు); అసూర్యంపశ్య లౌదుర్గదా — సూర్యునిఁ జూడనోడుదురుగదా యని యొక యర్థము; రాజవల్లభలు — చంద్రునికిఁ బ్రియులగు కుముదములు — సూర్యునిఁ జూడఁజాలక ముకుళించునుగదా యని మఱియొక యర్థము.

ఈపద్యమునఁ గైతవాపహ్నుతియు శ్లేషోత్థాపిత మగు నర్థాంతరన్యాసమును నలంకారములు.

చ. కొలకొల మంచు మేఁతలకు గూఁడులు వెల్వడుపక్షిరావము
లలమ్మృదువాక్యవైఖరులుగా నలవేకువపూవుఁబోఁడి వే
డ్కలు దళుకొత్త దోహద మిడం దొలుగుబ్బలికొండగోఁగు పూ
గొల యలరించె నాఁ బొడిచెఁ గోకనదాప్తుఁడు పాటలద్యుతిన్. 70

ఈపద్యమునందు సూర్యోదయము వర్ణింపఁబడినది.

(వ్యా) కొలకొలమంచున్ — (ధ్వన్యనుకరణము); వేకువపూవుఁబోఁడి — ప్రాతఃకాలమనెడు కుసుమసుకుమారాంగియగునంగన; దోహదమిడన్ — దోహదముచేయఁగా; దోహదమనఁగా నకాలమునందుఁ దరులతాదులను బుష్పింపఁజేయుక్రియలకును వస్తువుల

కును చేరు. అట్టిక్రియలు వేర్వేఱువృక్షములకు వేర్వేఱుగానుండును. ఇది సవిస్తరముగా 3-వ యాశ్వాసము 44-వ పద్యములోను 4-వ యాశ్వాసము 9, 10-వ పద్యములలోను జెప్పఁబడియున్నది.

దీనికి లక్షణము:—

శ్లో. తరుగుల్మలతాదీనా మకాలే కుశలైః కృతం
పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తుతత్ర్కియా
అశోకశ్చరణాహత్యా వకుళో ముఖసీధునా
ఆలింగనా త్కురవక స్తిలకో వీక్షణేనచ
కరస్పర్శేన మాకందో ముఖరాగేణ చంపకః
సల్లాపతః కర్ణికార స్సిందువారో ముఖానిలాత్
గీత్యాప్రియాళుర్నితరాం నమేరు ర్హాసితేనచ. అని

తొలిగుబ్బలికొండగోఁగు — పూర్వాద్రియనెడు కర్ణికారవృక్షము; పూఁగోల యలరించెనా — పుష్పగుచ్ఛమును బ్రకాశింపఁజేసెనో యనునట్లు; కోకనదాప్తుఁడు — (తామరలకు మిత్రుఁడగు) సూర్యుఁడు; పాటలద్యుతిన్ — ఈషదరుణకాంతితో; పొడిచెన్ — ఉదయించెను.

'సల్లాపతఃకర్ణికారః' (కొండగోఁగువృక్షము తరుణులసల్లాపమనెడుదోహదక్రియచే నకాలమునందుఁ బుష్పించు నని యర్థము) అని దోహదశాస్త్రమునందుఁ జెప్పఁబడియుండుటచే నిక్కడఁ బ్రాతఃకాలమనెడుతరుణి పక్షిరావములనెడు మృదువచనసల్లాపరూపదోహదక్రియను సలుపఁగాఁ బూర్వాద్రి యను కొండగోఁగుచెట్టు పూఁచినపూఁగుత్తియో యన్నట్లు పాటలకాంతితో సూర్యుఁ డుదయించెనని భావము.

అలంకారము. రూపకానుప్రాణితమగు నుత్ప్రేక్ష.

(వి) 'గూఁడులు వెల్వడు' అనుపదములను 'పక్షిరావముల్' అను సమాసమునం దేకదేశమైన 'పక్షి' శబ్దమునకు విశేషణముగా నన్వయించునట్లు కవి ప్రయోగించియున్నాఁడు. ఇది యేకదేశాన్వయదోషముగా వైయాకరణులు గణించియున్నను మహాకవిప్రయోగము లుండుటంబట్టి యిది దోషము గాదని యెఱుంగునది.

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్.

—భగవద్గీత.

'నిరంకుశాఃకవయః' అని పెద్దలు వక్కాణించియున్నారు.

## శ్రీకృష్ణుని ప్రయాణసన్నాహము

వ. అని యివ్విధంబునం బలుకుమాగధులమధురవాక్యంబు లాకర్ణించుచు మేలుకాంచి యప్పంచశరగురుం డహర్ముఖోచిత కృత్యంబులు నిర్వర్తించి పురోహిత వృద్ధామాత్య సహితంబుగా నాస్థానమంటపంబున కరిగి యుగ్రసేనవసుదేవబలభద్రాదిగురుజనంబులకు నమస్కరించి సాత్యకిసారణప్రభృతిసోదరుల నాదరించి ప్రద్యుమ్నసాంబానిరుద్ధాదికుమారవర్గంబు ప్రొక్కులు గైకొని యదువృష్ణికురుభోజాంధకప్రముఖు లగు బంధుసందోహంబుల సంభావించి సింహాసనాసీనుం డై తగువారి నుచితాసనంబుల నుండ నియమించి పేరోలగం బుండి కార్యత్వరాసముత్సాహదోహలితాంతరంగుం డై పతంగపుంగవుం దలంచుటయును. 71

(వ్యా) పంచశరగురుండు—మన్మథునితండ్రియగు కృష్ణుఁడు; అహర్ముఖోచిత కృత్యంబులు—ప్రభాతకాలోచితకార్యములు; 'ప్రత్యూషోఽహర్ముఖం కల్యం' అని యమరుఁడు; దోహలిత—సంభ్రమింపఁబడిన; పతంగపుంగవున్—గరుత్మంతుని.

సీ. వజ్రంబునకు నీఁక వైచినబలశాలి
గజకచ్ఛపాశనఘాతుకుండు
జననిదాస్యంబు నీఁగిన కులశ్రేష్ఠుండు
దుర్లభామృత పశ్యతోహరుండు
కమలాప్తుసారథి గారాబుఁదమ్ముండు
గశ్యపకృత పుణ్యకర్మ ఫలము
సకలశకుంతౌఘసామ్రాజ్యధౌరేయుఁ
డహిమృగయావ్యసనాకులుండు
తే. మింటిపాళెంబు లేర్చు ముక్కంటితూపు
గఱి నిపాతితరోహిణస్కంధుఁ డనిల
మానసాతీతవేగసంపద్ఘనుండు
తార్క్ష్యుఁ డేతెంచె దానవధ్వంసికడకు. 72

(వ్యా) వజ్ర............బలశాలి—గరుత్మంతుఁ డమృతంబుఁ గొనివచ్చు నపుడు దేవేంద్రుఁ డతనితో యుద్ధముచేసి వజ్రాయుధముఁ బ్రయోగింపఁగా దానికిఁ బ్రహ్మాస్త్రముగాఁ దనయీఁక నొకటిం బెటికివైచి దాని జనియించెనను నాదిపర్వమందలి కథ యిక్కడ ననుసంధేయము.

గజ.....ఘాతుకుండు—గరుత్మంతు డమృతంబుఁ గొనివచ్చుటకై స్వర్గమున కేగునప్పు డతనితండ్రి చెప్పినచొప్పున శాపగ్రస్తులై గజకచ్ఛపరూపంబులఁ దాల్చియుండిన తపస్వులు నిరువురి నాహారముగాఁ గొనిగొనెనను నాదిపర్వకథ యిట ననుసంధేయము. ఘాతుకుండు—క్రూరుఁడు—భయంకరుఁడై చంపువాఁడు.

జననిదాస్యంబు........శ్రేష్ఠుండు—జననిదాస్యంబున్—తల్లి యొక్క దానిసతనమును; ఈఁగిన—విమోచనముఁ జేయించిన;

దుర్లభ.....హరుండు—అమృత—అమృతమును; పశ్యతోహరుండు—ఇతరులు చూచుచుండఁగనె యపహరించినవాఁడు; అనఁగా నందఱికిఁ దెలియునట్లు శౌర్యముతో నపహరించినవాఁడనుట; అనూరునిశాపంబువలనఁ దల్లియగు వినతకు సవతియగు కద్రువ యొద్ద దానిసతనంబు ప్రాపింప గరుత్మంతుండు స్వర్గమునకుఁ బోయి యింద్రునితో యుద్ధముచేసి జయించి యమృతమును దెచ్చియిచ్చి తల్లి శాపమును బోఁగొట్టెనని యాదిపర్వమునఁ గల కథ నిట నరయునది.

కమలాప్త.....తమ్ముండు—కమలాప్తసారథి—అనూరునియొక్క; గారాబుఁ దమ్ముండు—ప్రియానుజుఁడు;

కశ్యప.....ఫలము—కశ్యపప్రజాపతిచేసిన పుణ్యకర్మముల ఫలముగా గరుత్మంతుఁడు పుట్టెనని భావము.

సకల.....ధౌరేయుఁడు;—సకలశకుంతౌఘ—సమస్తపక్షిసమూహముయొక్క; సామ్రాజ్య—ఆధిపత్యముయొక్క; ధౌరేయుఁడు—భారమును వహించినవాఁడు;

అహి.....కులుండు—అహిమృగయా—పాములవేఁటాడుట యనెడు; వ్యాసన—దోషకార్యమునందు; ఆకులుండు—లోలుఁడు (అనఁగాఁ బాములఁ జంపువాఁడనుట);

మింటి.....గతి—మింటిపాళెంబులు—ఆకాశమందలి పట్టణములను (అనఁగాఁ ద్రిపురాసురులను); ఏర్చు—కాల్చెడు; ముక్కంటితూపు—శివుని బాణముయొక్క (బాణరూపవిష్ణువుయొక్క); గతి—తెక్కు; అనఁగా శివుఁడు త్రిపురాసురసంహారము చేయునప్పుడు విష్ణుఁ డతని బాణముగా నేర్పడెననియు గరుత్మంతుఁ డాబాణమున తెక్కగా నుండెననియుఁ బురాణములు నుడువుచున్నవి.

నిపాతితరోహిణస్కంధుఁడు—నిపాతిత—పడఁద్రోయఁబడిన; రోహిణస్కంధుఁడు—రోహిణ మను పేరుగల వృక్షముయొక్క మొద్దు (శాఖ) గలవాఁడు; గరుత్మంతుఁ డమృత మును దేఁబోవునపుడు గజకచ్ఛపముల భుజించుటకై రోహిణవృక్షముమీఁదఁ గూర్చుం డఁగా నది యతనిబలమున కోర్వఁజాలక విఱిగిపడె నని భారతము నుడువుచున్నది.

మానసాతీత—మనస్సుకంటె మించిన; వేగసంపత్—వేగాతిశయముచేత; ఘనుఁడు—గొప్పవాఁడు; తార్క్ష్యుఁడు—గరుత్మంతుఁడు.

క. మిన్నున నుండి భరంబునఁ
బన్నగపతి తలలు చదియఁబడ ధారిణిమీఁ
ద న్నిలిచి వైనతేయుఁడు
వెన్నుని పదములకు వినయ వినతి యొనర్చెన్. 73

(వ్యా) భరంబునన్—బరువుచేత; పన్నగపతితలలు (భూమిని మోఁచియుండు) శేషునివేయితలలు; చదియఁబడన్—అదుమఁబడునట్లు; ధారిణిమీఁదన్—భూమిమీఁద; వైనతేయుఁడు—గరుత్మంతుఁడు; వెన్నుని—విష్ణుని;

(వి) 'హారిణి' యని గ్రంథములలోఁ గానంబడుచున్నది. ఆరూపము వ్యాక రణసాధ్యముకాదు. నిఘంటువులలోను గానంబడదు. ఆంధ్రకవు లీశబ్దము నత్వమధ్య ముగాఁ బ్రయోగించుట కాకర మేమియో తెలియకున్నది. 'ధారణి' యని యొక నిఘంటువులోఁ గానంబడుచున్నది. అదియును వ్యాకరణసమ్మతము కాదు.

చ. మునిపతిరాకయుం గుసుమముం దన కిచ్చినలాగు రుక్మిణీ
వనితకుఁ దా నొసంగుటయు వంచనఁ బొంచినపోటి సత్యకున్
మన మెరియంగఁ జెప్పుటయు మానినికోపము వేఁడుకొంటయుం
దనదుప్రతిజ్ఞయుం దెలిపెఁ దార్క్ష్యున కెంతయు నాదరంబునన్. 74

ఇంతు జరిగిన వృత్తాంతమంతయు సంగ్రహముగాఁ దేటగాను జెప్పఁబడినది.

సుగమము.

ఉ. సంతత మంది జాదులు ప్రసాదము నయ్యె నఁటంచు బొంగి నా
గాంతకుఁ డంబుజోదర బలాసురవైరి మదీయపక్షముం
బంతముగొన్నవాఁ డశనిపాతమున న్వీను నాఁటనుండియు
న్వంత మనంబులోఁ జనదు నా పగ నీఁగెద నేఁడు నీక్రుపన్. 75

(వ్యా) జాదులఁ బ్రసాదము నయ్యెన్ — ఇక్కడ 'జాదుల'ను పదమున కర్థమేమియో తెలియలేదు. 'జాదుల'నఁగా జాజిపూవులని యొకయర్థము గలదుగాని యాయర్థ మిచ్చుటఁ బొసఁగదు-విచార్యము. ప్రసాదము—అనుగ్రహము; అశనిపాతమునన్—వజ్రాయుధమును వేయుటచేత; పంతము గొన్నవాఁడు—పౌరుషముచేఁ దీసికొనినవాఁడు; ఈఁగెదన్—తీర్చుకొనెదను.

చ. అనుటయు నంతవాఁడవె కదా యని మిక్కిలి గారవించి య
వ్వనరుహలోచనుండు దగువారి సుహృజ్జనబంధుకోటి రాఁ
బనిచి నిజప్రయాణమును బట్టణరక్షయుఁ జెప్పి వారిచే
ననుమతిగాంచి యెక్కె విహగాధిపుఁ దానును సత్యభామయున్. 76

(వ్యా) అంతవాఁడవె కదా—ఇది గరుత్మంతున కుత్సాహంబు గలిగించు పొగడ్తమాట.

పయనము

ఉ. ఆ విహగావతంసము నిజాంసముపైఁ బ్రియభామతోడ నిం
ద్రావరజుండు నిల్చుటయు నాతతపక్షమహానిలంబు లం
భోవహపంక్తిఁ దూలములపోలికఁ దూల్పఁగఁ దద్దిశాముఖుం
డై వినువీథికి న్నెగసె నద్భుతకారి మనోజవంబునన్. 77

(వ్యా) విహగావతంసము—పక్షిశ్రేష్ఠుఁడగు గరుత్మంతుఁడు; నిజాంసముపైన్—తనమూఁపుమీఁద; ఇంద్రావరజుండు—ఇంద్రునికిఁ బిదపఁ బుట్టినవాఁడు (ఉపేంద్రుఁడు); ఆతతపక్షమహానిలంబులు—విస్తృతమైన తనఱెక్కలవలనఁ బొడమినగొప్పవాయువులు; అంభోవహపంక్తిన్—మేఘములవరుసను; తూలములపోలికన్—దూదులనువలె; తూల్పఁగన్—ఎగురఁగొట్టఁగా; తద్దిశాముఖుండై—ఇంద్రునిదిక్కుమొగంబై; అనఁగాఁ దూర్పుదిక్కునుగూర్చి; అద్భుతకారిమనోజవంబునన్ — ఆశ్చర్యమును గలుగఁజేయు మనోవేగముతో; వినువీథికిన్—ఆకాశమార్గమునుగుఱించి; నెగసెన్—ఎగసెను; "నెగసెన్" అను రూపమునకుఁ బ్రయోగము.

"నీరిలోననుండి నెగయుదెంచె" —భారతము—ఆదిపర్వము.

"నెగసినకొనలేచి నింగియంతంతకు నవలఁద్రోవఁగఁ దనరారుదాని."

—భారతము—విరాటపర్వము.

క. ఇరుగ్రేవల నందక శా
ర్ఙ్గ రథాంగ గదాయుధములు రాఁ దోడఁగ ఖగే
శ్వరపక్షజనిత వాతాం
కురపూర్తిని శంఖ మపుడు ఘుమఘుమ మ్రోసెన్. 78

(వ్యా) ఇరుగ్రేవలన్—ఉభయపార్శ్వములందును; ఖగేశ్వర...పూర్తిని—ఖగేశ్వర—గరుత్మంతునియొక్క; పక్షజనిత—ఱెక్కలనుండి పుట్టిన; వాతాంకుర—పిల్లగాలియొక్క; పూర్తిని—పూరించుటచేత; ఘుమఘుమ—శంఖధ్వనియం దనుకరణము; శంఖము మ్రోసెన్—శంఖారావము కలిగెను.

తే. అంబుధరజాలముక్తంబు లయిన జలక
ణములు సాత్రాజితీ కైశికమునఁ బొలిచె
గగనతలలక్ష్మి పొరచి గాఁగ నిడినఁ
జాల నొప్పారు మౌక్తికస్తబక మనఁగ. 79

(వ్యా) అంబుధరజాలముక్తంబు లయిన—మేఘసమూహములందుండి విడువఁబడిన; జలకణములు—నీటిబొట్లు; సాత్రాజితీకైశికమునన్—సత్యభామ కేశబంధము మీఁద; 'తద్బృందే కైశికం కైశ్యమ్' అని యమరుఁడు; పొరచిగాఁగన్—కానుకఁగా; మౌక్తికస్తబకము—ముత్తియములగుత్తి;

అనఁగాఁ గృష్ణుఁడు సత్యభామతో గగనమార్గమునఁ జనునప్పుడు మేఘములందుండి యద్దేవి కేశబంధంబుపైఁ బడిన నీటిబిందువు లాకాశలక్ష్మి యామెతలమీఁదఁ గానుకగా సమర్పించిన ముత్తియముల గుత్తులో యనున ట్లొప్పె నని భావము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. తళతళని మెఱుఁగుఁదీఁగలు
గలుగు ఘనాఘనచయంబు గనుఁగొనఁగా నిం
పొలయించెఁ బసిఁడికామల
నలరెడు నీలముల గొడుగు లనఁగా హరికిన్. 80

(వ్యా) ఘనాఘన—వర్షాకాల మేఘములయొక్క; చయము—సమూహము; పసిఁడికామలన్—బంగారుకాడలతో; అలరెడు—ఒప్పుచున్న; నీలముల—ఇంద్రనీలమణు

లచే నిర్మితము లయిన; అనఁగాఁ దళతళమని ప్రకాశించు మెఱుపుఁదీఁగెలతోఁ గూడిన నల్లని మేఘములు కృష్ణునకు బంగారుకాసెలు గల నల్లనిగోదుగుల్లో యనునటు లొప్పెనని భావము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. కమలదళాక్షుని దేహో
ద్వమదతిసాంద్రచ్ఛవిప్రవాహము వొలిచెం
దమతండ్రి భానుఁ గనుఁగొన
యమునానది గగనవీథి కరిగెడు ననఁగన్. 81

(వ్యా) కమలదళాక్షుని — కృష్ణునియొక్క; దేహ......ప్రవాహము— దేహ—శరీరమునుండి; ఉద్వమత్—వెడలి బయటికివచ్చుచున్న; అతిసాంద్ర—మిక్కిలి దట్టమైన; ఛవిప్రవాహము—కాంతియనెడు వెల్లువ; తమతండ్రి—యమునానది తండ్రి యగు; గౌరవార్థము బహువచనప్రయోగము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

(వి) ఉద్వమత్—ఈపదమును గుఱించి వెన్నెలవచనంబునందలి 'నిష్ఠ్యూత' యనుపదమునకు వ్రాయఁబడియుండు విశేషముం గాంచునది.

చ. ఖగకులనాథుపక్షముల గాడ్పు సహింపఁగ లేక రజ్జుప
న్నగములు దేరిక్రిందికిఁ జన న్సరసీరుహమిత్రు రథ్యముల్
నొగలఁ దొలంగి నిల్వ నరుణుండు రయంబునఁ జక్కఁ గట్టుచున్
గగనపథంబునం దటమటం గాలవిలంబన మందకుండఁగన్. 82

(వ్యా) గాడ్పు—వాయువు; రజ్జుపన్నగములు—(సూర్యునిరథమునకుఁ) త్రాళ్లుగాఁ గట్టఁబడియుండు పాములు; రథ్యముల్—గుఱ్ఱములు; నొగలన్—మెడమీఁదనుంచి కట్టెడుకొయ్యలను; తొలంగి—వదలి; అరుణుండు—సూర్యునిసారథి యగు నసూరుఁడు; "సూరసూతోఽరుణోఽనూరుః" అని యమరుఁడు; చక్కన్—సరిగా.

క. నతి సేసె వైనతేయుఁడు
గతిభేదములోన నన్నుఁ గనుఁగొని యతఁడున్
గతిలోనన దీవించినఁ
జతురతకు న్మెచ్చి రపుడు సత్యయు హరియున్. 83

(వ్యా) గతిభేదములోనన్—గమనవైఖరిచే; అనఁగా గరుడుఁడు నానావిధ గమనవైఖరులం జూపుచుఁ దనయన్న యగు నసూరునకు నమస్కరించునట్లు లొకర్కతూరి క్రిందికి వ్రాలి పైకెగసె నని భావము; చతురతకున్—నేర్పునకు;



అలంకారము — సూక్ష్మము.

క. మురమర్దనుఁ డివ్విధమున
గరుడునిపై గగనపథము గడచి యరుగుచుం
దరళాయతాక్షి కిట్లను
సరసస్మితవచనరచనచాతురి మెఱయన్. 84

(వ్యా) స్మిత—మందహాసము; హాస మాఱువిధములు—స్మితము, హసితము, విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము, అని.

'స్మితము వికాసికపోలము, మితదర్శనరదన మైన మెఱయు హసితమై.'
—అని లక్షణము.

తక్కినవాని లక్షణంబులు కావ్యాలంకారచూడామణియందుఁ గాంచునది.

శ్రీకృష్ణుఁడు సత్యభామకు మేరువును వర్ణించుట

చ. కువలయపత్త్రనేత్ర కనుఁ గొంటివె కన్నులపండు వయ్యె రెం
డవ వినతాతనూభవుని యందమునం గమనీయ కాంచన
చ్ఛవికవచీకృతంబు కులిశక్షతపక్షము నైన రత్నసా
నువు నిజయామికీకృతివినోదపరాయణచంద్రభానువున్. 85

ఈ పద్యమునుండి 88 వ వచనముకడవఱకు మేరుపర్వతము వర్ణింపఁబడినది.

(వ్యా) కువలయపత్త్రనేత్ర—కలువ ఱేకులవంటికన్నులు గలదానా; రెండవవినతాతనూభవునియందమునన్ — రెండవ గరుత్మంతునివలె; కమనీయ...కృతంబున్—కమనీయ—మనోహరమైన; కాంచనచ్ఛవి—బంగారు కాంతులచే; కవచీకృతంబున్—కవచముగాఁ జేయఁబడినదియు, (అనఁగాఁ గప్పఁబడినదియు); కులిశక్షతపక్షమున్—కులిశ—వజ్రాయుధముచేత; క్షత—నఱుకఁబడిన; పక్షమున్— ఱెక్కలు గలదియును; ఐన—; నిజయామికీకృతి ...... చంద్రభానువున్—నిజ—తనయొక్క (చంద్రభానువులయొక్కయనుట); యామికీకృతి—జాముకావలికార్య మనెడు (తలవరిపనియనుట); వినోద—వేడుకయందు; పరాయణా—ఆసక్తిగల; చంద్రభానువున్—చంద్రసూర్యులు గలిగిన; రత్నసానువున్—మేరుపర్వతమును;

'మేరు స్సుమేరు ర్హేమాద్రీ రత్నసాను స్సురాలయః'— అని యమరుఁడు.

సూర్యచంద్రులని చెప్పవలసియుండఁగా నిచ్చట నంత్యప్రాసలాభమునకై చంద్రభానువు లని చెప్పఁబడియె.

అనఁగా నీమేరుపర్వతమును సూర్యచంద్రులు చుట్టుఁ దిరుగుచుండుటచే బంగారుకొండ యగుదానిం గావలిగాచు తలవరులవలె సూర్యచంద్రు లొప్పుదు రని భావము. 'కన్నులపండు వయ్యెన్' 'కనుఁగొంటివే' అనుపదములతో నన్వయము.

సీ. జీర్ణపర్ణద్రుసంకీర్ణాహిమణివిభా
మాయాకిసల వంచ్యమానపికము
శశికాంతరుచి మృషాసలిల సంస్ఫాలన
శ్లథ విషాణోద్విగ్న సైరిభంబు
గోమేధిక ప్రభాంకూర మిథ్యామధు
ద్రవ లిలిక్షా మిళ ద్భల్లుకంబు
సీలగండ ప్రస్తరాళీకగజ భేద
శీర్య న్నఖ క్షుబ్ధ సింహకులము
తే. గారుడాశ్మ చ్ఛవి చ్ఛటా కపటయవస
పూలికా చర్వణ వ్యగ్ర బాలమృగ వి
లంఘ్యమానాబ్జరాగ శిలావితాన
కూట దావాగ్ని యీ మరుత్కుధర మబల. 86

(వ్యా) జీర్ణపర్ణద్రు............పికము—

జీర్ణపర్ణద్రు—పండిరాలినయాకులు గలవృక్షములయందు; సంకీర్ణ—చేరిన; అహి—పాములయొక్క—; మణివిభా—రత్నములకాంతు లనెడు; మాయాకిసల—మాయాకల్పితములగు చిగుళ్లచేత (అనఁగా నసత్యములగుచిగుళ్లచే ననుట); వంచ్యమాన—మోసపుచ్చఁబడుచున్న; పికము—కోయిలలు గలిగినదియు; 'కిసాలయం కిసలయం కిసాలం కిసలం క్లిసలం' అని ద్విరూపాదికోశము.

అనఁగా మేరుపర్వతమునందలి యాకులురాలిన వృక్షములందుఁ గూడిన పాముల యొక్క—తలలయందలి రత్నములం గాంచి యవి యెఱ్ఱనిచిగుళ్లని భ్రమసి కోయిలలు మోసపోయి వానిం దినుటకై వానిం జేర నరుగుచుండె నని భావము;

శశికాంత......సైరిభంబు—

శశికాంత—చంద్రకాంతమణులయొక్క; రుచి—కాంతులనెడు; మృషాసలిల—అసత్యముగు నీటియందు; సంప్రాలన—చక్కఁగాఁ గొట్టుటచేత; శ్లథ—కదలిన; విషాణ—కొమ్ములు గలుగుటచే; ఉద్విగ్న—కలఁత నొందిన; సైరిభంబు—ఎనుబోతులు గలిగినది;

అనఁగా నామేరుపర్వతమునందలి చంద్రకాంతమణులకాంతులం గని జలము లని భ్రమించి జలావగాహాలోలుపము లగు మహిషములు వానిం దమకొమ్ములఁ గ్రుమ్మి కోరాడుటచే నవి శిథిలము లైనకతంబున మహిషములు కలఁతఁ జెందె నని భావము;

గోమేధిక............భల్లుకంబు—

గోమేధికప్రభ—గోమేధికరత్నకాంతులయొక్క; అంకూర—మొలక లనెడు; మిథ్యామధుద్రవ—అసత్య మగు తేనియను; లిలిక్షా—నాకుటయం దిచ్ఛతో; మిళత్—కూడుకొన్న; భల్లుకంబు—ఎలుఁగుబంట్లు గలది.

'అంకూర స్త్వంకుర స్తుల్యౌ' అని యాదవనిఘంటువు.

లిలిక్షా—(లేఢుం+ఇచ్ఛా—సన్నంతము).

అనఁగా నామేరుపర్వతమందలి గోమేధికకాంతులం జూచి తేనియ లని భ్రమించి తేనియఁ ద్రాగుటయం దత్యంతౌత్సుక్యముగల యెలుఁగుబంట్లు వానిని నాకుటకై సమీపించె నని భావము;

నీలగండ......సింహాకులము—

నీలగండప్రస్తర—నల్లని గొప్పగుండురాళ్లనెడు; అళీకగజ—అసత్యములగు నేనుఁగులను; భేద—చంపుటకై; శీర్యత్—జాఱుచున్న, (అనఁగాఁ బ్రసరించుచున్న); నఖ—గోళ్లచేత; క్షుబ్ధ—కలఁతనొందిన; సింహాకులము—సింహసమూహముగలది;

అనఁగా నామేరుపర్వతమునందలి గొప్పగుండుఱాళ్లను జూచి యవి యేనుఁగులని భ్రమసి వానిం జంపుటకై యందున్న సింహములు తమగోళ్లతో వానిం గొట్టఁగా ఱాళ్లగుటచే దెబ్బతగిలి నొచ్చెనని భావము;

గారుడాశ్మ......దావాగ్ని—

గారుడాశ్మ—గరుడపచ్చలయొక్క; ఛవిచ్ఛటా—కాంతుల సమూహమనెడు; కపటయవస—అసత్యములైన తృణములయొక్క; పూలికా—కట్టలను; (పూల-సంచయే అని ధాతువు); చర్వణ—తినుటయందు; వ్యగ్ర—ఆసక్తములయిన; బాలమృగ—జింకపిల్లలచేత; విలంఘ్యమాన—దాఁటఁబడుచున్న; అబ్జరాగశిలా—పద్మరాగమణులయొక్క; వితాన—సమూహము లనెడు; కూటదావాగ్ని—అసత్యమైన దవానలము గలది.

‘మాయానిశ్చలయంత్రేషు కైతవానృతరాశిషు, అయోఘనే శైలశృంగే సీరాంగే కూట మస్త్రీయామ్’ అని యమరుఁడు.

అనఁగా నా మేరుపర్వతమునందలి మరకతమణులు పచ్చనికాంతులఁ బ్రకాశించుచుండుటచే వానిం జూచి జింకపిల్లలు పచ్చనిపచ్చికలవరుసలని భ్రమించి వానిం దినవలయు నని కుతూహలపడి యాసమీపముననుండు పద్మరాగమణులం గాంచి యవి దవానలం బని భ్రమించి వానిం దాఁటుచుండె నని భావము.

(వి) ఈ మేరుపర్వతమునందు నవరత్నము లున్న వనియు, నానావిధంబు లగు నడవి మృగంబులును, పక్షులును, లతలును, తేనెలును గలవనియుఁ దెలియునది.

అలంకారములు—ఉదాత్తము-రూపకము-భ్రాంతిమంతము, గమ్యము.

‘యవసపాలికా’ అని యొకపాఠము గలదుగాని యది సరసముకాదు.

ఉ. వంచనఁ బొంచి చేరువకు వచ్చినచంద్రునిజింక నేసి హ
ర్షించియుఁ దత్సుధారస నిషేచనచే నది చావ కున్కి వీ
క్షించియు నేటు దప్పె నని చే విలు నమ్ములుఁ బాఱవైచి ల
జ్జించి చరించుచుండుదురు చెంచెత లగ్గిరిసానుభూములన్. 87

(వ్యా) చంద్రునిజింకన్ — చంద్రునికళంకమును జింకఁగా వర్ణించుట కలదు; ‘గ్లౌ ర్మృగాంకః కలానిధిః’ అని యమరుఁడు; ఏసి—బాణము ప్రయోగించి; తత్సుధారసనిషేచనచేన్—చంద్రునియమృతరసమునఁ దడుపుటచేత.

వ. వెండియు నప్పసిండికొండ గండశిలామండలంబుల నుద్దండవేదండంబులొండొండ గండతలంబు లొరసికొన నిండినమదజలాంజనమషిం గొని వనదేవతోపభుక్తతాటంకతాళీదళంబులం బ్రియసందేశంబులు లిఖియించు గంధర్వసౌగంధికగంధులవలన, నత్యంతనిర్మలస్ఫటికాధిత్యకలం గానవచ్చు పాతాళవాతాశిప్రతిబింబంబులం గని మును తమకఱచిన యురగంబులం బాఱవిడిచి వానిం దమ చంచుపుటంబులం బొడిచియు గరుదంచలంబుల నడిచియుఁ బదంబులం దాఁచియు నేచినకోపంబుల విఫలప్రయత్నంబు లగు బాలశిఖావళంబులం గని తమవరులకుం జూపి పరిహాసించు గరుడతరుణీ

నివహంబులవలన, సెలయేటి చిలుపచిలుపనీరు పగలు గగనమణి ధగధగని కిరణముల మిగుల సెగ లెగయు రవికాంతశిలాతలం బులం దెగఁ దేక నుడుకెత్తి జాలువాఱఁ గరంగిన కజ్జలజవ్యాది కోలంకులం బడి కెలంకులం దేలి తెట్టువలు గట్టి చపలకపికుల చలితతటతరుపతితకుసుమవిసరపరిమళపరంపరావాసితం బై ఘుమ ఘుమం బిసాళింప నలందుకొని రతిశ్రమంబు లపనయించు యక్షు పక్ష్మలాక్షులవలనఁ, గేసరికిశోర నఖముఖ విదారిత కుంభంబైన వనగజంబును వనగజదంతఘాతయాతనాభ్రాంతవరాహంబును వరాహ దంష్ట్రాటంక ఖండిత కీచకనిచయంబును గీచకశిఖా జర్జరిత పర్జన్యంబును బర్జన్యోదర పరిచ్యుత శంఖశుక్తిసంఘంబును నొక్క యెడన పడఁ దత్తదుత్పన్నంబు లగు మౌక్తికంబుల వేఱువేఱ నేఱి పేరులు గ్రుచ్చు సాధ్యమిథ్యామధ్యలవలనను, నభిరామం బై; మఱియు నొక్కొక-చోట సురపతి తఱుచుమెఱుఁగు లడరు కఱకు భిదురముఁ గొని తఱిమి యెఱకలు విఱుఁగ నఱికినయెడల సెలలకు నిడినజలగల పొలుపునం జఱుల నెర గొని పొరలు జర దజగర నికరం బులును, ఖచరగణ గోష్ఠీస్థానంబులం బఱిచిన రత్నకంబళంబుల విధంబున విశాలశిలాతలంబుల నిద్రించు శార్దూలంబులును, మృ గాంకమండలంబు సగము కబళించిన రాహుగ్రహాభూమికల చందం బున సందంద తిరుగు బొల్లిమోర భల్లూకంబులును గలిగి; సుధర్మా ప్రదేశంబునుం బోలె శక్రపురమహిళాలికుచచందనసుగంధాగురు వాతపోత మేదురంబును, జలనిధియునుంబోలె నీల నల పనస కీలిత తుంగసేతు సహితంబును, వల్లకియునుంబోలె లలిత ప్రవాళ కకు భంబును, భారతంబునుంబోలె శతపర్వ చమత్కృతంబును, సమర తలంబునుంబోలెఁ గలితానేకపాటనంబును, శబ్దశాస్త్రంబునుంబోలె ధాతుగణ విద్యోతితంబును, సంగీతంబునుంబోలె నిషాదభరితంబు

నయి, గ్రావ నిబద్ధ ఘ నౌఘం బయ్యును నగ్రావని బద్ధ ఘ నౌఘం
బై, గవయస్థానం బయ్యును నగవయస్థానం బై, వైణవారావాసి
తం బయ్యు నవైణవారావాసితంబై, మెఱయు నిది; మఱియును. ౮౮

(వ్యా) 'అప్పసిండికొండ' మొదలు 'సౌగంధికగంధులవలనన్' అనుపదముల వఱకు నొక వాక్యము.

అప్పసిండికొండ-ఆ మేరుపర్వతముయొక్క; గండశిలామండలంబులన్—గొప్ప చట్రాళ్లయందు; ఉద్దండ వేదండంబులు—విజృంభించుచున్న యేనుఁగులు; (వేదండ శబ్దము సామాన్యముగా నాంధ్రగ్రంథములలో దకారమధ్యముగా నున్నను సంస్కృతమునందు 'వేతండ' యనురూపమే బహుళముగాఁ బ్రయోగములందుఁ గానంబడు చున్నది;) ఒండొండన్—ఒకటితో నొకటి; గండతలంబులు—చెక్కిళ్లప్రదేశములు; ఒరసికొనన్—రాచుకొనఁగా; నిండిన; (గండశిలామండలంబులయందు నిండిన యని యన్వయము;) మదజల—దానమను పేరుగల మదజలమనెడు; అంజనమషిన్—నల్లని కాటుకను; కొని—తీసికొని; వన.....దళంబులన్—వనదేవతా—వనదేవతలచేత; ఉపభుక్త—వాడఁబడిన; తాటంక—చెవికమ్మలకు; తాళీగళంబులన్—తాటియాకులయందు; ప్రియసందేశంబులు—ప్రియులకుఁ బంపఁబడు వార్తలను; లిఖియించు—వ్రాయుచున్న; గంధర్వ సౌగంధికగంధులవలనన్—గంధర్వస్త్రీలవలన; 'అభిరామం బై' అను పదముతో నన్వయము; సౌగంధికగంధి—చెంగల్వపూలయొక్క వాసనవంటి వాసన గలది; (ఉత్తమాంగన); 'సౌగంధికం తు కల్హారమ్' అని యమరుఁడు.

అనఁగా నా మేరుపర్వతమునందు మదించిన యేనుఁగులు చెక్కిళ్ల నొకటి నొకటి నొరయుటచేత మదజలంబులు స్రవించి యప్పర్వతమునందలి చట్టురాళ్లపైఁ బడఁగా నవి నల్లని కాటుకవలె నొప్పుటచేత నామసితో గంధర్వస్త్రీలు వనదేవతల చెవికమ్మల కుపయోగించిన తాటియాకులమీఁదఁ దమప్రియులకు రహస్యవార్తలు వ్రాసి పంపుదు రని భావము.

2. 'అత్యంతనిర్మల'.....మొదలు 'గరుడతరుణీనివహంబులవలనన్' అను పదముల వఱ కొకవాక్యము.

అత్యంత—మిక్కిలి; నిర్మల—స్వచ్ఛమైన; స్ఫటికాధిత్యకలన్—స్ఫటికమయము లగు నూర్ధ్వప్రదేశములందు; 'ఉపత్యకాద్రే రాసన్నా భూమి రూర్ధ్వ మధిత్యకా' అని యమరుఁడు. కానవచ్చు—పొడసూపు; పాతాళవాతాశి—పాతాళమందలి సర్పములయొక్క; ప్రతిబింబంబులన్—ప్రతిరూపములను; కని;—మును తమ కఱచిన యాంగ

గఱచియుండిన పాములను బొఱవిడిచి_ముందు తమనోటితో గ్రహించుకొనియుండిన పాములను విడిచి పెట్టి ; వానిన్_ఆపాతాళవాతాళి ప్రతిబింబములను ; తమచంచుపుటంబులన్_తమ యొక్క ముక్కులచేత (దొప్పలవంటి ముక్కులచేత నని యవయవార్థము) ; పొడిచియున్_గ్రుచ్చియు ; గరుదంచలంబులన్_ఱెక్కలకొనలచేత ; అడిచియున్_కొట్టియు ; పదంబులన్_కాళ్లతో ; తాఁచియున్_తన్నియు ; ఏచినకోపంబునన్_అధికమగు కోపముతో ; విఫలప్రయత్నంబు లగు_వ్యర్థములగు ప్రయత్నములు గల ; బాలశిఖావళంబులన్_చిన్న నెమిళ్లను ; కని తమవరులకుం జూపి—; పరిహసించు—నవ్వు; గరుడతరుణీనివహంబులవలనన్_గరుడస్త్రీలసమూహములచేత ; 'అభిరామంబై' యను దానితో నన్వయము.

అనఁగా నప్పర్వతమునందు మిక్కిలి స్వచ్ఛమైన స్ఫటికమయోన్నతప్రదేశంబులందుఁ బాతాళమందలి సర్పములు ప్రతిఫలింపఁగా నవి యచ్చట నుండు నిజమైనసర్పములని భ్రమసి యందలి బాలమయూరము లంతకుమున్న తమనోళ్లం గఱచియుండిన పాములను విడిచిపెట్టి వీనిం బట్టుకొనఁ గమకించి ముక్కులతోఁ బొడిచి ఱెక్కలతోఁ గొట్టి కాళ్లతోఁ దన్ని విఫలమనోరథము లగుటం జూచి గరుడస్త్రీలు తమపతులకుఁ జూపుచుఁ బరిహసింతు రని భావము.

3. 'సెలయేటి—' మొదలు 'పక్ష్మలాక్షులవలనన్' అనుపదములవఱ కొక వాక్యము.

సెలయేటి_నిర్ఝరములయొక్క; చిలుప_సన్నకాల్వలయందలి; చిలుపనీరు_స్వల్పమగుజలము; పగలు_మధ్యాహ్నసమయమందు; గగనమణి_సూర్యునియొక్క; ధగధగని_ధగధగమనియుండుచున్న (యుండుటయం దనుకరణము); కిరణములన్_కాంతులచేత; మిగులన్_మిక్కిలి; సెగలెగయు_జ్వాలలుపుట్టుచున్న; రవికాంతశిలాతలంబులన్_సూర్యకాంతశిలలచేత; తెకతెకన్_సలసల మని; ఉడుకెత్తి_వేఁడియెక్కి; జాలువాఱఁగన్_ప్రవహించునట్లు; కరంగిన_కరఁగిన; కజ్జజవ్వాదికొలంకులన్_నల్లనిజవ్వాది యనెడు పరిమళద్రవ్యముయొక్క గుంటలలో; పడి_జాఱి; (సెలయేటిచిలుపనీరు పడి యని యన్వయము); కెలంకులం దేలి_పార్శ్వములయందు మఱల నుద్భవించి; తెట్టుగట్టి_గుంపులుగాఁ జేరి; చపల...వాసితంబై—చపల_చేష్టచేయుస్వభావముగల_కపికుల_కోఁతులసమూహముచేత; చలిత_కదల్పఁబడిన; తట_తీరమునందు; తరు; వృక్షములనుండి; పతిత_పడిన; కుసుమవిసర_పూలసమూహముయొక్క; పరిమళ_వాసనయొక్క; పరంపరా_వరుసలచేత; వాసితంబై_సురభిళముగాఁ జేయఁబడినదై (సువాసనగలదియై); ఘుమఘుమన్_గుప్పుగుప్పు మని (వాసన వీచుటయం దనుకరణము); పరిమళింపన్_పరిమళింపఁగా; అలందుకొని_పూసికొని రతిశ్రమంబులు _ కలయికలబడలి;

కలను; అపనయించు—పోఁగొట్టుచున్న; యక్షపక్ష్మలాక్షులవలనన్—యక్షవనితలవలనను; 'అభిరామంబై' అనుపదముతో నన్వయము; పక్ష్మలాక్షి—అందమగు ఱెప్పవెండ్రుకలతో నొప్పునది—అనఁగా నొప్పులకుప్ప;

అనఁగాఁ బట్టపగలింటి యెండవేడిమిచేత సూర్యకాంతశిలలు తప్తము లయ్యె ననియు, నవి సోఁకుటచే నం దంటుకొనియుండు జవ్వాది కరఁగి పల్లములందు గుంటలుగా నేర్పడెననియు, వానియందు సెలయేటినీళ్లుపడి యాజవ్వాదితోఁ జేరి పరిమళవంతములై మఱలఁ బ్రవహించెననియు, నందు వానరములచేఁ గదల్పఁబడిన చెట్లలలో నుండి పువ్వులురాలి వానివాసనలతోడనుం గూడి యా నీరు మఱియుఁ బరిమళవంతము లయ్యె ననియు, సౌరభములచేఁ దనరారు నానీరంబులను బూసికొని యక్షరమణీమణులు తమరతిశ్రమంబులఁ బోఁగొట్టుకొందు రనియు భావము.

(వి) ఈ వాక్యమునందు లఘ్వక్షరరచనలు మెండయి సొంపుగా నున్నవి.

4. 'కేసరి' మొదలు 'మిథ్యామధ్యలవలనన్' అనుపదములవఱ కొకవాక్యము.

కేసరికిశోర—సింహపుఁబిల్లలయొక్క; నఖముఖ—గోళ్లకొనలచేత; విదారిత—చీల్పఁబడిన; కుంభంబైన—కుంభములు కలవియగు; వనగజంబును—అడవియేనుఁగులును; 'గజంబును'—ఇక్కడ జాత్యేకవచనము; వనగజదంత—అడవియేనుఁగు కొమ్ములయొక్క; ఘాత—దెబ్బవలని; యాతనా—బాధచేత; భ్రాంత—తిరుగుడుఁబడిన (కలఁగిన); వరాహంబును—అడవిపందులును; వరాహదంష్ట్రా—పందికోఱలనెడు; టంక—ఉలులచేత; 'టంకఃపాషాణదారణః' అని యమరుఁడు. ఖండిత—నఱుకఁబడిన; కీచకనిచయంబును—వెదుళ్లగుంపును; కీచకశిఖా—వెదుళ్లపైకొనలచేత; జర్జరిత—కలఁపబడిన; పర్జన్యంబును—మేఘములును; పర్జన్యోదర—మేఘమధ్యమునుండి; పరిచ్యుత—జాఱిన; శంఖశుక్తిసంఘంబును—శంఖములు ముత్తెపుఁజిప్పలు వీని సమూహములును; ఒక్కయెడన—ఒకచోటనే; పడన్; తత్తదుత్పన్నంబులగు—గజకుంభ, వరాహ, కీచక, పర్జన్య, శంఖ, శుక్తుల యందుండి పుట్టిన; మౌక్తికంబులన్—ముత్యములను; వేఱువేఱన్—ప్రత్యేకముగా; ఏఱి—ఏర్పఱచి; పేరులుగుచ్చు—హారములుగా కూర్చుచున్న; సాధ్యమిథ్యామధ్యలవలనన్—సాధ్యయువతులచేతను; 'అభిరామంబై' యనుదానితో నన్వయము. మిథ్యామధ్య—అసత్యమగు నడుము గలది; అనఁగా మిక్కిలిసన్నమగునడుము కలదని భావము. తరుణి యని యర్థము.

అనఁగా నాపర్వతమందు సింగపుఁబిల్లలు తమగోళ్లతోఁ గుంభములను జీల్చి చంపినయేనుఁగులును, నేనుఁగులు తమదంతములతోఁ బొడిచిచంపిన యడవిపందులును, నడవిపందులు కత్తులం బోలినతమకోఱలచే నఱికివైచిన వెదుళ్లును, వెదురుమ్రాఁకులపైకొనలచే ఛేదింపఁబడిన మేఘంబులును, మేఘములనుండి జాఱిపడిన శంఖంబులును ముత్తెపుఁ

జిప్పలును, నొక్కచోటఁ గుప్పలుగాఁ గూలిన, నాయావస్తువులనుండి పుట్టెడు ముత్తియంబులను సాధ్యాంగనలు వేర్వేఱుగా నేర్పఱచి వానితో సరంబులు గ్రుచ్చుచుందురని భావము.

గజకుంభ, వరాహ, కీచక, పర్జన్య, శంఖ, శుక్తి, ప్రముఖస్థలంబులలో ముత్తెములు పుట్టు నని ప్రథమాశ్వాసమున నిరువదినాల్గవపద్యము వ్యాఖ్యయందు వివరింపఁబడినది.

ఈవాక్యమునందు ముక్తపదగ్రస్త మను శబ్దాలంకారము.

అభిరామంబై—రమణీయమై; అనఁగా మేరుపర్వతము పైఁ జెప్పిన వినోదముల చేత రమ్యమై యొప్పె నని భావము.

'మఱియు......భల్లూకంబులను గలిగి' అనువఱకును నొకవాక్యము.

సురపతి—ఇంద్రుఁడు; తెఱచు—దట్టమైన; మెఱుఁగులు—కాంతులు; అడరు—ఒప్పుచున్న; అనఁగా జాజ్వల్యమానముగాఁ బ్రకాశించుచున్న యనుట; కఱకు—తీక్ష్ణమైన; భిదురమున్—వజ్రాయుధమును; 'కులిశం భిదురంపవిః' అని యమరుఁడు; కొని—పుచ్చుకొని; అనఁగా వజ్రాయుధముచేత; తటిమి—పాఱద్రోలి; ఱెకలు—ఱెక్కలు; విఱుగన్—ఛేదించునట్లు; నఱికినయెడలన్—నఱికినస్థానములందు; సెలలకున్—వ్రణరంధ్రముల యందు; ఇడిన—పెట్టిన; జలగలపోలుపునన్—జలగలవలె; జలగ—జలూకాశబ్దభవము; ఇక్కడఁ గొన్నియాదర్శములలో "జెలగ"యని యెత్వవిశిష్టముగాఁ గానంబడుచున్నది. ఇదియును సాధురూపమే. జలగయనుటకు:—"జలగఁదెగిచినట్లు గొనఁగఁజనునిల సొమ్ముల్" అని భారతము- శాంతిపర్వమునఁ బ్రయోగము. చఱులన్—పర్వతపార్శ్వ ప్రాంతముల యందు; ఎరఁగొని — ఆహారమును భుజించి; పొరలు—క్రిందుమీఁదుగాఁ దిరుగుచున్న; జరత్—ముసలివైన; అజగర—కొండచిలువలయొక్క; నికరంబులు—సమూహములును; (కలిగియనుపదముతో నన్వయము);

అనఁగా నామేరుపర్వతమునందుఁ గొన్నియెడల దేవేంద్రుఁడు తనవజ్రాయుధముచే ఱెక్కలునఱికి వైవ నావ్రణరంధ్రములందు రక్తమును బీల్చుటకై యందుంచిన జలగలో యన్నట్లు కొండచిలువ లెరలుదని పొరలుచుండెననిభావము.

ఇట నుత్ప్రేక్షాలంకారము.

ఈవాక్యము ప్రాయికముగా నచ్చతెనుఁగు పదములతోను లఘ్వక్షరములతోను గూర్పఁబడినది.

అలంకారము—వృత్త్యనుప్రాసము.

ఖచర.........శార్దూలంబులును—

ఖచరగణ—ఖచరు లను దేవతావిశేషముల సమూహములయొక్క; గోష్ఠీస్థానంబులన్—సభాప్రదేశములయందు; పఱచిన—విస్తరింపఁబడిన; రత్నకంబళంబులవిధంబునన్—తివాసులవలె; విశాలశిలాతలంబులన్—పఱపైన చాఁపఱాళ్లపై; నిద్రించు—నిద్దురఁబోవుచున్న; శార్దూలంబులును—బెబ్బులులును; 'కలిగి' యనుపదముతో నన్వయము.

మృగాంక.........భల్లూకంబులును—

మృగాంకమండలంబున్—చంద్రమండలమును; సగముకబళించిన—సగముమ్రింగిన; రాహుగ్రహభూమికలచందంబునన్—రాహుగ్రహముయొక్క వేషములవలె; 'భూమికా రచనాయాం స్యా న్మూర్త్యంతరపరిగ్రహే' — అని శాశ్వతనిఘంటువు.

అందందలిరుకు—చిచ్చులవిడిగా సంచరించుచున్న; బొల్లిమోర—కొంచెము తెల్లని మూతులుగల; భల్లూకంబులును—ఎలుఁగుబంట్లును; 'కలిగి' యను పదముతో నన్వయము.

అనఁగా నా పర్వతమునందలి బొల్లిమోరల నొప్పారు నెలుఁగుబంట్లు చంద్రమండలము సగము మ్రింగిన రాహుగ్రహముల వేషములవలె నుండె నని భావము.

అలంకారము—ఉపమ.

కలిగి—;

సుధర్మా...మేదురంబును—

సుధర్మాప్రదేశంబునుంబోలెన్—దేవేంద్రుని సభవలె; దేవేంద్రుని సభను 'సుధర్మ' యని పేరు; "స్యా త్సుధర్మా దేవసభా" అని యమరుఁడు; శక్రపుర—ఇంద్రపట్టణమునందలి; మహిళాలి—స్త్రీలసమూహముయొక్క; కుచ—స్తనములందలి; చందన—గంధము; సుగంధాగురు—వాసనగల యగరుద్రవ్యము; (వీనితోఁగూడిన); వాతపోత—గాలిపిల్లలచేత; మేదురంబును—దట్టమైనదియు; అని ఇంద్రసభాపర మైనయర్థము.

శక్ర—కుటజవృక్షములు; 'జయా కుటజశ్శక్రో వత్సకో గిరిమల్లికా' అని యమరుఁడు. (అర్జునవృక్షమనియు నర్థము కలదు); పుర—గుగ్గిలపుఁజెట్లు; 'కాళికో గుగ్గులుః పురః' అని యమరుఁడు; సువాసనగల గరికపోఁచలనియు నర్థముకలదు; (దీనికి నాగరముస్త యని సంస్కృతమునఁ బేరు;) మహిళా—ప్రేంకణపుఁజెట్టులు (ప్రియంగులతలు); లికుచ—గజనిమ్మచెట్లు; చందన—శ్రీగంధవృక్షములు; సుగంధాగురు—సువాసన గల యగరుచెట్టులు; (వీనియందలి)—వాతపోత—మలయమారుతములచేత; మేదురంబును—దట్టమైనదియు; అని మేరుపర్వతపర మగు నర్థము.

జలనిధియుంబోలెన్ — సముద్రమువలె; నీల నల పనస—నీలుఁడు, నలుఁడు, పనసుఁడు అను వానరవీరులచేత; కీలిత—నిర్మింపఁబడిన; తుంగ—గొప్పదైన; సేతు—అన

కట్టుతోడ; సహితంబును—కూడినదియు; అని సముద్రపరమైన యర్థము. (రామాయణము యుద్ధకాండము-అధ్యాయము 22 నందుఁ గాంచునది);

నీల—నల్లని; నల—అవురుగడ్డి యను తృణవిశేషములు; పనస—పనసచెట్లు; (వీనితోడ); కీలిత—కూడిన; తుంగ—చిన్నగుట్టలు; సేతు—భూప్రదేశములు; (కొండల నడుమ నిలుకగు త్రోవయనియు నర్థముగలదు); (వీనితోడ)—సహితంబును—కూడినదియు; అని మేరుపర్వతపరమగు నర్థము.

వల్లకియుంబోలెఁ—వీణవలె; లలిత—మనోహరమగు; ప్రవాళ—వీణాదండమును; కకుభంబును—వీణాముఖమును గలదియు; (కరివెయను వీణాదండముయొక్క వంపఁబడియుండు ముఖము); అని వీణాపరమగు నర్థము. 'వీణాదండః ప్రవాళ స్స్యాత్ కకుభస్తు ప్రసేవకః' అని యమరుఁడు.

లలిత—మనోజ్ఞమైన; ప్రవాళ—చిగుళ్లుగలిగిన; కకుభంబును—అర్జునవృక్షములుఁ గలదియు; అని మేరుపర్వతపర మగునర్థము.

'ఇంద్రద్రుః కకుభోఽర్జునః' అని యమరుఁడు

భారతంబునుంబోలెఁ—మహాభారతమువలె; శతపర్వచమత్కృతంబును—నూఱు పర్వములచేత, అనఁగా విభాగములచేత, రమ్యమైనదియు; అని భారతపరమగు నర్థము.

శతపర్వ—వెదుళ్లచేత; చమత్కృతంబును—మనోజ్ఞమైనట్టిదియు; అని మేరుపర్వతపరమైనయర్థము; 'శతపర్వా యవఫలో వేణుమస్కరతేజనాః' అని యమరుఁడు,

సమరతలంబునుంబోలెఁ—యుద్ధరంగమువలె; కలితానేకపాటనంబును—కలిత—కూడుకొన్న; అనేక—రథగజతురగ పదాతుల సేనాబలములనెడు పెక్కండ్రయొక్క; పాటనంబును—విదళనము గలదియును; అని యుద్ధరంగపర మగునర్థము.

కలిత—కూడుకొనిన; అనేకప—ఏనుఁగులయొక్క; అటనంబును—సంచారము గలదియును; 'ద్విరదోఽనేకపో ద్విపః' అని యమరుఁడు; (అనేకప—అనఁగా నోటటికంటె నెక్కుడవయవములతో నీటిని ద్రాగునది అనఁగా నోటితోను దొండముతోను నీటిని ద్రాగునదనుట; అనఁగా నేనుఁగు); అని మేరుపర్వతపర మగు నర్థము.

శబ్దశాస్త్రంబునుంబోలెఁ—వ్యాకరణశాస్త్రమువలె; ధాతుగణవిద్యోతితంబును—ధాతుగణ—భ్వాదిధాతుసముదయముచేత; విద్యోతితంబును—ప్రకాశింపఁబడినదియును; అని వ్యాకరణశాస్త్రపర మైనయర్థము.

ధాతుగణ—ధాతు—గైరికాది ధాతువులయొక్క; గణ—సమూహముచేత; విద్యోతితంబును—ప్రకాశింపఁబడినదియు; అని మేరుపర్వతపర మగు నర్థము.

సంగీతంబునుంబోలెన్_గానమువలె; నిషాద_నిషాదమను స్వరభేదముచేత; భరితంబును_నిండినదియును; అని గానపరమగు నర్థము.

నిషాద_బోయవాండ్రచేత; భరితంబును_నిండినదియును; అని మేరుపర్వతపరమగు నర్థము.

'సుధర్మాప్రదేశంబునుంబోలెన్' అను వాక్యము మొదలు 'నిషాదభరితంబునయి' అను వాక్యమునకుకు సభంగా భంగశ్లేషమూలక మగు నభేదాధ్యవసాయప్రయుక్తమైన సాధారణధర్మముచేత నిష్పన్నమగు నుపమాలంకారము.

గ్రావనిబద్ధ......ఘనౌఘుంబై_

గ్రావ_ఱాళ్లచేత (చిన్నకొండలు అనఁగా శృంగము లనుట); నిబద్ధ_కట్టఁబడిన (అడ్డగింపఁబడిన); ఘన_మేఘములయొక్క; ఓఘుం బయ్యును_సమూహము కలదియైనను; అగ్ర_పురోభాగమందలి; అవని_భూమియందు; బద్ధ_కట్టఁబడిన(కూడుకొనిన); ఘన_గొప్ప; ఓఘుంబై_(నదీ) ప్రవాహములు కలదై;

ఇక్కడ గ్రావనిబద్ధఘనౌఘుం బయ్యును నగ్రావనిబద్ధఘనౌఘుంబై యుండుట విరోధముగాఁ గనఁబడుచున్నను రెండవసమాసమున కర్థాంతరకల్పనముచేత నావిరోధమునకుఁ బరిహారము చేయఁబడియె. ఇదియే విరోధాభాసాలంకారం బనంబడును.

గవయస్థానం బయ్యును__గవయ_గురుపోతు అను మృగవిశేషములకు; స్థానం బయ్యును_చోటుగా నున్నను; నగవయస్థానంబై__నగ_వృక్షములకును; వయః_పక్షులకును; స్థానంబై_ఉనికిపట్టయి;

"స్మరణీయాః స్సమయే వఃఘుంవయః'__నైషధము.

"మృగవయో గవయోపచితం వనమ్"__రఘువంశము.

అలంకారము పైయట్లు.

వైణవారావాసితంబయ్యున్__వైణవ_వేణుసంబంధమైన - (అనఁగా వెదుళ్ల యొక్క); ఆరావ_శబ్దములకు; ఆసితంబయ్యున్_స్థానంబుగానున్నను; నవైణవారావాసితంబై__నవ_పసి (చిన్నవియగు); ఏణవార_జింకలగుంపులకు; ఆవాసితంబై_ఉనికిపట్టై; అలంకారముపైయట్లు; ఒప్పున్_ప్రకాశించును.

ఈవచనమునందంతటను నుదాత్తాలంకారము.

ఉ. కిన్నరకంఠి చూచితివె కిన్నరులం గలధౌతభూధరా
భ్యున్నతశృంగభాగముల నుత్పలగంధులుఁ దాముఁ గల్పకో

త్పన్నమధుప్రసంగతులఁ బాడెద రింద్రునిమీఁది గీతముల్
కిన్నర లొయ్య నొయ్యఁ బలికించుచుఁ దారతర స్వనంబులన్. 89

ఈపద్యమునఁ గిన్నరీగానములు వర్ణింపఁబడియె.

(వ్యా) కిన్నరకంఠి—కిన్నరస్త్రీల కంఠధ్వనివంటి కంఠస్వరముగలదానా; అని సత్యభామకు సంబోధనము; కలధౌత.....భాగములన్—కలధౌతభూధర—బంగారు కొండయొక్క (అనఁగా మేరుపర్వతముయొక్క): అభ్యున్నత—మిక్కిలిపొడవైన; శృంగభాగములన్—శిఖరప్రదేశములందు; ఉత్పలగంధులు—స్త్రీలు(కలువలవలె సువాసనగలవారనుట); కల్పకో.....సంగతులన్—కల్పక—పారిజాతవృక్షమునందు; ఉత్పన్న—పుట్టిన; మధు—మద్యముయొక్క; ప్రసంగతులన్—కూడికలచేత (అనఁగా నాస్వాదించుటచేత); కిన్నరలు—కిన్నరయను వాద్యవిశేషములను (తంబురవంటివి); ఒయ్య నొయ్యన్—మెల్లమెల్లగా; పలికించుచున్—స్వరములు మీటుచు; తారతరస్వనంబులన్—గాంధారమను పేరుగల హెచ్చుస్థాయి స్వరములతో; ఇంద్రునిమీది గీతముల్—తమకుఁ బ్రభువగునింద్రునిమీఁదిపాటలను; పాడెదరు—పాడుచున్నారు.

గానమునందు స్వరములు మూఁడువిధములు 'మంద్రము, మధ్యము, తారము.' అని. తారస్వరమునకు గాంధార మనియుఁ బేరు.

దీనికి లక్షణము—

శ్లో. షడ్జగ్రామోభవే దాదౌ, మధ్యమగ్రామఏవచ
గాంధారగ్రామ ఇత్యేత, ద్గ్రామత్రయ ముదాహృతమ్.
షడ్జమధ్యమనామానౌ, గ్రామౌ గాయంతి మానవాః
నతు గాంధారనామానం, సలభ్యో దేవయోనిభిః.
—అని నారదప్రోక్తసంగీతశాస్త్రము.

అలంకారము—స్వభావోక్తి.

ఉ. ఆయతభూర్జపత్త్రముల నామరధేనుదధిప్రయుక్తపా
థేయము లారగించి వడ దేఱఁగ శీతల కల్పకద్రుమ
చ్ఛాయల నిల్చినిల్చి సరసంబులు వల్కుచు వెండికొండకుం
బాయక కూడి యేగెదరు భామిని చూడుము సిద్ధపాంథులన్. 90

ఈపద్యమునందు సిద్ధపాంథులు వర్ణితులు.

(వ్యా) ఆయత – విశాలములయిన; భూర్జపత్రములన్ – భుజపత్రము లనెడి వెడల్పయిన పర్ణములయందు; ఇది యొకవిశాలమగు పర్ణము–అనంగలేఖక్రియలకు విద్యాధరాంగన లుపయోగింతు రని కాళిదాసుఁడు వర్ణించియున్నాఁడు.

"న్యస్తాక్షరా ధాతురసేన యత్ర భూర్జత్వచః కుంజరబిందుశోణాః
వ్రజంతి విద్యాధరసుందరీణా మనంగలేఖక్రియయోపయోగమ్"

—కుమారసంభవము.

'భుజపత్రో భుజో భూర్జో మృదుత్వక్చర్మికాలపి.'—అని యాదవ నిఘంటువు;

అమర......పాథేయములు—అమరధేను–దేవతలయావుయొక్క– (కామధేనువుయొక్క–); దధి–పెరుగుతో; ప్రయుక్త–కలుపఁబడిన; పాథేయములు–చలిదియన్నములను (పథిసాధు–పాథేయం–అనఁగా, త్రోవనడచునప్పుడు మేలుచేయునది); ఆరగించి–భుజించి; వడదేఱఁగన్–శ్రమతీర్చుకొనుటకై; శీతల–చల్లని; కల్పకద్రుమ – పారిజాతవృక్షముయొక్క; ఛాయలన్–నీడలయందు; నిల్చినిల్చి–పలుమాఱులు నిల్చియనుట (వీప్సయందు ద్విరుక్తి); వెండికొండకున్–కైలాసమునొద్దకు (పరమశివసందర్శన సంపూజన సంకీర్తనార్థమనుట); పాయకకూడి–గుంపులుగాననుట; వీగెదరు–చనుచున్నారు.

'వీగు' అనుపదము సార్ధబిందుకముగా నిప్పటివారు కొందఱు భావించి యట్లుకొన్ని పుస్తకములలో సవరించియున్నారు కాని ప్రాచీన గ్రంథములలో నిది నిర్బిందుకముగానే కానంబడుచున్నది. ఇదియే సాధువని యొఱుంగునది.

'సిద్ధపాంథులు'ను కర్తృపదమును 'సిద్ధపాంథులన్' అను ద్వితీయాంతమునుండి గ్రహింపవలయును. అట్లు చనుచున్న సిద్ధపాంథులన్ చూడుమని యన్వయము.

అలంకారము–స్వభావోక్తి.

శా. ఏణీశాబవిలోలనేత్ర కనుఁగొంటే వీరు విద్యాధరు
ల్మాణిక్యోజ్జ్వలరత్నకుండలులు సమ్బద్ధాసిధేనుల్రణ
ద్వీణాపాణులు చంద్రికామలశిరోవేష్టుల్ త్రిపుండ్రాంకితు
ల్నాణీయస్తరతారహారులు శివధ్యానైక నిష్ఠాపరుల్. 91

ఈపద్యమునందు విద్యాధరులు వర్ణింపఁబడిరి.

(వ్యా) ఏణీశాబవిలోలనేత్ర – జింకపిల్లలకన్నులవలె సుందరముగాఁ జలించుచున్న కన్నులు గలదానా; ఇది సత్యభామకు సంబోధనము; 'పోతః పాకోర్భకో డింభః

పృథుకశ్యాబకశ్శిశుః'_అని యమరుఁడు; కనుఁగొంటే_చూచితివా; వీరు_ఇప్పుడు మనకుఁగనఁబడుచుండువారు; విద్యాధరుల్ _ విద్యాధరు లను పేరుగల దేవయోనివిశేషములు; మాణిక్య.........కుండలులు— మాణిక్య_కెంపులచేత; ఉజ్జ్వల_ప్రకాశించుచున్న; రత్నకుండలులు_మణికుండలములుగలవారు; సంబద్ధాసిధేనుల్ _సంబద్ధ_కట్టఁబడిన (ధరించుకొనిన); అసిధేనుల్ _చూరకత్తులుగలవారు; "స్యాచ్ఛస్త్రీచాసిపుత్రీచ చ్ఛురికాచాసిధేనుకా" అని యమరుఁడు; రణద్వీణాపాణులు_రణత్ _ శబ్దించుచున్న; వీణా_వీణలు; పాణులు_హస్తమునందుఁగలవారు (అనఁగా వీణవాయించుచున్నవా రనుట); చంద్రికా......వేష్టుల్ —చంద్రికా_వెన్నెలవలె; అమల_స్వచ్ఛమైన; శిరోవేష్టుల్ _తలపాగలు గలవారు; త్రిపుండ్రాంకితుల్ _భస్మమును మూఁడురేఖలుగా (నొసట) ధరించినవారు; నాణీయ.........హారులు—నాణీయస్తర_(న+అణీయస్+తర); మిక్కిలి చిన్నదైన యనునర్థమందు 'అణు' అను పదమునకు 'అణీయస్' అని తరప్రత్యయార్థరూపము; 'తర' అనునదియుఁ దరప్రత్యయార్థమే; 'అణీయస్తర' అనఁగా నత్యంత సూక్ష్మము లని భావము; న+అణీయస్తర _ మిక్కిలిసూక్ష్మములుకానివి; అనఁగా గొప్పవనుట; తరప్రత్యయాంతముమీఁద మఱియొక తరప్రత్యయము చేర్పఁబడినది. ఇట్టిప్రయోగములు మహాకవులు చేసియున్నారు. కావున దీనిని పౌనరుక్త్య మనం జనదు. 'నిరంకుశాః కవయః' అను నభియుక్తోక్తియే శరణము.

'శ్రేష్ఠతమాయ కర్మణే'—అని శ్రుతి; ఇచ్చటఁ దమప్రత్యయముమీఁదఁ దమ ప్రత్యయము.

'నస్త్రీభ్యః కించిదన్యద్వై పాపీయస్తరమస్తివై
స్త్రియో మూలంచ దోషాణాం తథా త్వమపి వేత్థహ.'

—మహాభారతము_ఆనుశాసనికపర్వము. 38_12.

'జ్వలన్మహోమహీయస్తర మాయుధం దధత్'

—కుమారసంభవము 14_6.

'భూయస్తరాణియదమూని తమస్వినీషు'

—అనర్ఘరాఘవము. 2_81.

'శ్రేయస్తరం హంతగుణాగుణానాం పరీక్షణమ్'

—నలోదయము. 1_37

తారహారులు_ముత్యాలహారములుగలవారు; 'తార' యనఁగా గొప్పముత్యమని యర్థము కావున 'నాణీయస్తర'యనువిశేషణము ప్రయోగింపఁబడియె;

ఇచ్చటఁ 'దారహారములు' అనుటచే మేఘములందుండి పుట్టిన గొప్పముత్యములని తెలియునది. వానినే విద్యాధరులు ధరింతురు.

"ఘనోపలవజ్జాతం వాయుస్కంధాచ్చ సప్తమాద్భ్రష్టమ్
హ్రియతే కిలఖాద్దివ్యైస్తటిత్ప్రభం మేఘసంభూతమ్."
—అని బృహత్సంహిత.

శివధ్యానైకనిష్ఠాపరుల్—పరమశివుని ధ్యానించుట యనెడు ముఖ్యమగు నను్ష్ఠానమునం దాసక్తిగలవారు.

అలంకారము—స్వభావోక్తి.

మ. కనుఁగొంటే సకలేందుబింబముఖి యీగంధర్వులం బంకజా
సనగేహిన్యుపదిష్టగీతరచనాసర్వంకషప్రజ్ఞులం
గనదుత్తుంగవిమానచారులఁ దురంగగ్రీవుల న్నిర్జరీ
జనతానృత్తసహాయలాలసుల యక్షగ్రామవాస్తవ్యులన్. 92

ఈ పద్యమునందు గంధర్వులు వర్ణింపఁబడిరి.

(వ్యా) సకలేందుబింబముఖి—సకల—అన్నికళలతోఁగూడిన (అనఁగా సంపూర్ణమైన); ఇందుబింబ—చంద్రబింబమువంటి; ముఖీ—వదనముగలదానా; పంక...ప్రజ్ఞులన్—పంకజాసనగేహినీ—బ్రహ్మపత్నియగు సరస్వతీదేవిచేత; ఉపదిష్ట—ఉపదేశము చేయఁబడిన (నేర్పఁబడిన); గీత—గానములను; రచన—చేయుటయందు; (అనఁగా పాడుటయందు); సర్వంకష—సంపూర్ణమైన; ప్రజ్ఞులన్—బుద్ధివిశేషము గలవారును; కన...చారులన్—కనత్—ప్రకాశించుచున్న; ఉత్తుంగ—పొడవులగు; విమాన—విమానములయందు; చారులన్—తిరుగుచున్నవారును; తురంగగ్రీవులన్ — హయవాదనులును; నిర్జరీ...లాలసులన్—నిర్జరీజనతా—దేవతాస్త్రీల సమూహముయొక్క; నృత్త—నాట్యములకు; సహాయ—తోడ్పాటుచేయువారై; లాలసులన్—ఆసక్తిగలవారును; యక్షగ్రామవాస్తవ్యులన్—యక్షులసమూహములతో వసించువారును; (అగు)—గంధర్వులన్—కనుఁగొంటే యని యన్వయము.

నృత్తి, నృత్యము, నాట్యము, లాస్యము, తాండవము—వీనికిఁ బరస్పరభేదములు గలవు.

"నాట్యం నృత్తం నృత్య మితి మునిభిఃపరికీర్తితం।
నాట్యం తన్నాటకేష్వేవ యోజ్యం పూర్వకథాయుతం।

రసభావవిహీనంతు నృత్త మిత్యభిధీయతే ।
రసభావవ్యంజకాదియుతం నృత్యమితీర్యతే ।
ఏత త్త్రియం ద్వధా భిన్నం లాస్యం తాండవసంజ్ఞకం ।
సుకుమారం తు తల్లాస్య ముద్ధతం తాండవం విదుః॥”

—అని భరతశాస్త్రము.

అయినను నీమొదటి నాలుగింటిని సమానార్థకములుగాఁ గవులు ప్రయోగింతురు.

సీ. యక్షులు వీర లోయతివ మేళము గూడి
పాడుచుండుదురు దిక్పాలసభల
గుహ్యకు లీర లోకొమ్మ హాస్యరసాధి
నాయకు ల్భృంగీశనర్మసఖులు
గరుడులు వీర లోతరుణి విష్వక్సేన
పరిచితు ల్నాగారిపరమహితులు
చారణు లీర లోసతి విచిత్రకథేతి
హాసజ్ఞు లఖిలలోకాధ్వనీను
తే. లమరపతిఁ గొల్వఁ జనువార లతివ యెపుడు
నుబుసుపుత్తురు వివిధోపయోగ్యకళల
మనలఁ జూచెద రాశ్చర్యమగ్న లగుచు
వీరిఁ గనుఁగొంటె గంభీరవేదిగమన. 93

ఈ పద్యమునందు యక్షగుహ్యకగరుడచారణులు వర్ణింపఁబడిరి.

(వ్యా) మేళముగూడి—జతలుగూడి; హాస్యరసాధినాయకుల్—హాస్యములు చేయువారనుట, విదూషకులవంటివారు; ‘శృంగారో విష్ణుదైవత్యో హాస్యః ప్రమథదైవతః’ అని ప్రమాణము. భృంగీశనర్మసఖులు—భృంగీశ — పరమశివునియొక్క—; ‘భృంగి’ యనునతఁడు పరమశివుని సేవకులలో నొకఁడు; నర్మసఖులు—ప్రియమిత్రులు; విష్వక్సేనపరిచితుల్—విష్ణుసేవకప్రధానుఁడగు విష్వక్సేనునకు సఖులు; నాగారి—గరుత్మంతునకు; పరమహితులు—ప్రియమిత్రులు; అఖిలలోకాధ్వనీనులు—అఖిలలోక—సమస్తభువనములయందు; అధ్వనీనులు—సంచరించువారు; ‘అధ్వనీనోఽధ్వగోఽధ్వన్యః పాంథః పథిక ఇత్యపి’ అని యమరుఁడు. వివిధోపయోగ్యకళలన్—పలుదెఱఁగుల నుపయోగకరము

లగు విద్యలచేత; ఉబుసువుత్తురు—వినోదముగాఁ గాలముఁ గడపుదురు; ఆశ్చర్యమ-న్నులు—ఇట 'మన్న' లనుటకుఁ బూర్వము 'రస' అనుపదముగాని 'సాగర' అను పదముగాని యధ్యాహార్యము. అపుడు రూపకము గమ్యము.

సంబంధాతిశయోక్త్యలంకారము.

గంభీరవేదిగమన—మదగజమునడకవంటినడక గలదానా;

గంభీరవేదిలక్షణము—

శ్లో॥ త్వగ్భేదా చ్ఛోణిత స్రావాత్ మాంసస్య చ్యవనా దపి।
ఆత్మానం యోనజానాతి సస్యా ద్గంభీరవేదికః॥
—అని రాజపుత్త్రీయమునందు;

శ్లో॥ చిరకాలేన యో వేత్తి శిక్షాం పరిచితామపి।
గంభీరవేదీ విజ్ఞేయ స్సగజో గజవేదిభిః॥
—అని మృగచర్మీయమునందు.

లయగ్రాహి.

అంగన గనుంగొను మనంగహరమౌళితట
రంగనటి జహ్నుమునిపుంగవ విశాలో
త్సంగశిశువుం గపిలునింగలపుఁజూపు సెక
లం గలయునానగరువంగడము మోక్షో
త్తుంగమణిసౌధమునకుం గడపుతావ గగ
నాంగణమహీతలభుజంగనిలయంబుల్
జంగగొను నేర్పరిఁ బతంగజయనుంగుఁ జెలి
యం గనఖిలాచలయుగంగ సురగంగన్. 94

ఈ పద్యమునం దాకాశగంగానది వర్ణింపఁబడినది.

(వ్యా) అనంగ...నటిన్—అనంగహర—(మన్మథునిఁ జంపిన) పరమశివుని యొక్క; మౌళితట—శిరఃప్రదేశమనెడు; రంగ—నాట్యస్థలమందలి; నటిన్—నృత్యము చేయునాఁడుదానిని; జహ్ను...శిశువున్—జహ్నుమునిపుంగవ—జహ్నుఁడను మునివరునియొక్క; విశాల—వెడల్పయిన; ఉత్సంగ—తొడయందలి; శిశువున్—బిడ్డయయినదియు (అనఁగా జహ్నుకన్య యనుట); దీనివలననే గంగకు జాహ్నవి యనుపేరు గలిగె;

కపిలు...గడపుఁదాప—కపిలు – కపిలమహామునియొక్క; ఇంగలపుఁజూపుసెకలన్ – అగ్నిజ్వాలారూపమగు వీక్షణములను (కోపాగ్నివీక్షణములయం దనుట); కలయు – చేరుచున్న (అనఁగా నశించిన యనుట); ఆ సగరువంగడమున్ – ప్రసిద్ధమైనసగరమహారాజుయొక్క వంశమును; (వంగడము–వంశశబ్దభవము); మోక్షోత్తుంగమణిసౌధమునకున్–మోక్షమనెడు నున్నతమగు మణిమయప్రాసాదమునొద్దకు; కడపు–చేర్చెడు; తాపన్–నిచ్చెన యగుదానిని;

అనఁగాఁ గపిలుని కోపాగ్నివీక్షణములచే భస్మీభూతులయిన సగరపుత్త్రులు వేవురకు నుత్తమగతిఁ గల్గించుటకై భగీరథుఁడు పరమశివుంగూర్చి తపంబొనర్చి యద్దేవునను గ్రహంబున గంగను భూమికిఁ దెచ్చి యాభస్మములపైఁ బ్రసరింపఁజేసి తనపితరులకు నుత్తమగతిఁ గల్పించె నసెడురామాయణకథ యిట ననుసంధేయము.

అలంకారము–రూపకము.

గగన...నేర్పరిన్—గగనాంగణ–ఆకాశప్రదేశమును; మహీతల – భూప్రదేశమును; భుజంగనిలయంబున్–పాతాళప్రదేశమును; జంగగొను–దాఁటెడు (అనఁగా నీ మూఁడులోకములందును వరుసగా సంచరించు; నేర్పరిన్–నిపుణురాలును; పతంగజ–సూర్యునికూఁతురగు యమునానదియొక్క; 'పతంగౌ పక్షిసూర్యౌచ' అని యమరుఁడు; అనుంగుఁజెలియన్–ప్రియసోదరి యగుదానిని; కనఖలాచలయుగంగన్—కనఖలాచల–కనఖల మను కొండతో; కనఖలము–ఇది యొకతీర్థవిశేషము; 'తీర్థం కనఖలంనామ గంగాద్వారేஉస్తి పావనమ్' అని ప్రమాణము; యుక్–కూడిన; అంగన్–దేహముకలదియును; అనఁగాఁ గనఖలపర్వతప్రాంతప్రదేశంబులఁ బ్రవహించునది యని భావము; (పూర్వోక్తవిశేషణవిశిష్ట యగు) సురగంగన్–మందాకినీనదిని; 'కనుఁగొను' మనుపదముతో నన్వయము.

ఈవృత్తము లయగ్రాహి యనంబడును.

లక్షణము—ప్రతిపాదమునకును 39 మాత్రలు గల ముప్పదియక్షరము లుండవలయును. 4 ప్రాసయతులుండవలయు. 11–వ మాత్రమీఁదను 21–వ మాత్రమీఁదను 31–వ మాత్రమీఁదను బ్రాసయతి యుండవలయును.

మ. అవె దివ్యర్షినికేతనంబు లనసూయారుంధతీకర్ణపూ
రవివృద్ధార్భకకృష్ణసారగతిసంరంభంబు లింద్రద్రుమో
ద్భవనానావిధవల్కలాంచితబహిర్ద్వారప్రదేశంబు లా
హావనీయాదిహుతాశధూమపటలశ్యామీభవత్ప్రాంతముల్. 95

ఈ పద్యమునందు దేవర్షి గృహములు వర్ణింపఁబడినవి.

(వా) అవె—పురోదృశ్యమానంబు లగు నల్లయవియె; దివ్యర్షి నికేతనంబులు—దేవర్షుల గృహములు; అనసూయా...సంరంభంబులు—అనసూయా — అత్రిభార్య; అరుంధతి—వసిష్ఠునిభార్య (వీరియొక్క); కర్ణపూర—కర్ణావతంసములుగా ధరియించిన తృణకుసుమపల్లవాదులచేత; అనఁగా వానిని దినిపించుటచేత; వివృద్ధ—పెంపఁబడిన; అర్భక—పిల్లలుగల; కృష్ణసారగతిసంరంభంబులు—కృష్ణసార—నల్లచాఱలజింకలయొక్క; గతిసంరంభంబులు—గమనవిలాసములు గలవి;

ఇంద్ర.........ప్రదేశంబులు—ఇంద్రద్రుమ — కల్పవృక్షములందు; ఉద్భవ—పుట్టిన; నానావిధ — పలుదెఱంగు లగు; వల్కల—నారచీరలచేత; అంచిత — అందమైన; బహిర్ద్వారప్రదేశంబులు — వాకిళ్ల ప్రదేశములు గలవి; ఆహవ...ప్రాంతముల్—ఆహవనీయాది—ఆహవనీయము మొదలగు; హుతాశ—అగ్నులయొక్క; (ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని యని యగ్నులు మూఁడు తెఱంగులు); ధూమపటల—పొగలగుములచేత; శ్యామీభవత్—నల్లగానగుచున్న (అనఁగా నల్లగా నున్న యనుట); ("అభూతతద్భావే చ్వి:" అనుటవలన నిటఁ జ్విప్రత్యయము); ప్రాంతముల్—ప్రదేశములు గలిగినవి.

(వి) ఈ పద్యముఁ జదువునపుడు కాళిదాసుని శాకుంతలములోని

శ్లో. "అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః, సమిద్వంతః ప్రాంత సంస్తీర్ణదర్భాః
అపఘ్నంతో దురితం హవ్యగంధైః, వైతానా స్త్వాం వహ్నయః పావయంతు"

అను శ్లోకము జ్ఞప్తికి వచ్చుచున్నది.

అలంకారము—స్వభావోక్తి.

ఉ. అచ్చరపువ్వుఁబోండ్లు సరసామృతధారయుఁ గల్పవాటియున్
లచ్చియుఁ జందమామయుఁ దలంపులమానికముం దలంపఁ బై
పెచ్చులు దీనికి న్నెమరువెట్టుచు నందినియట్లు నాకుచుం
బచ్చికఁ దెండి యున్నయది భామిని వేలుపుటావుఁ జూచితే. 96

ఈపద్యమునందుఁ గామధేనువు వర్ణింపఁబడినది.

(వ్యా)—భామినీ—ప్రియురాలా! అచ్చరపువ్వుఁబోండ్లున్—అప్సరసలును; సరసామృతధారయున్ — రుచ్యమగుసుధారసమును; కల్పవాటియున్ — కల్పవృక్షముల వరుసయు; లచ్చియున్—లక్ష్మీదేవియు; చందమామయున్—చంద్రుఁడును; తలంపుల మానికమున్—చింతామణియును; తలంపన్—విచారింపఁగా; దీనికిన్—ఈకామధేనువునకు;

అనఁగాఁ గామధేనువుతో సరిపోల్చినయెడల ననుట); పైపెచ్చులు—స్వల్పమగు చిల్లరలు; పెచ్చు—నాణెములను మార్చునపు డధికముగా నిచ్చుచిల్లర); అనఁగా నిచ్చటఁ దక్కువైనవని భావము; ఇవియన్నియు క్షీరసాగరమునం బుట్టినను నన్నిటిలోను గామధేనువే మాహాత్మ్యమున హెచ్చని తాత్పర్యము; నెమరువెట్టుచున్—నెమరువేయుచు; (రోమంథమను సంస్కృతపదమున కిది యర్థము); నందిని—నందినియను పేరుగల తనమాడయొక్క; అబ్బుకన్—మెడను; నాకుచున్; పచ్చికన్—పచ్చికయందు; తెంపియున్నయది—పరుండియున్నది. 'పండియున్న' దనియుఁ బాఠాంతరము కలదు; ఆపాఠమునకును నిదేయర్థము; 'పేఁడు' అని రూపాంతరము. దీనికిఁ గర్తృపదము 'వేలుపుటావున్' అను ద్వితీయాంతమునుండి 'వేలుపుటావు' అను ప్రథమాంతమును దెచ్చుకొనవలయును. అట్టి వేలుపుటావును జూడుమని భావము.

ఈపద్యమునం దలంకారము మిక్కిలిచక్కనిస్వభావోక్తి. ఈపద్యమునం దచ్చతెనుఁగుపదములు బహుళములు. కైశికీవృత్తి. కోమలార్థపదసంవర్భము గలరచన కైశికీవృత్తి యనంబడు. ప్రసాద మనుకావ్యగుణము.

## నాకవర్ణనము

చ. కనకమహీధరేంద్రు నలికస్థితపర్వతరాజపట్టబం
ధనమును బోనికోటయు ఘనం బగుతన్మకుటంబుకైవడిం
దనరెడు వైజయంతమును దవ్వులఁ గానఁగ వచ్చెఁ జూచితే
యనిమిషరాజధాని యిది హాయనమాత్రకురంగలోచనా. 97

ఈపద్యమునందును బైమాఁటియందును స్వర్గవర్ణనము చేయఁబడినది.

(వ్యా) హాయనమాత్రకురంగలోచనా—ఏకసంవత్సరమాత్రపుఁబ్రాయము గల జింకపిల్లకన్నులవంటి బెళుకుఁగన్నులు గలదానా; అనఁగా నొకయేఁడు వయస్సు గల జింకపిల్లయొక్క కన్ను లెట్లు తళుకుబెళుకుగా నుండునో యట్టి మనోహరములగుకన్నులు గలదానా యని యర్థము; కనకమహీధరేంద్రు—పర్వతశ్రేష్ఠమగు నీమేరువుయొక్క; అలిక........బంధనమునుబోని—అలిక—ఫాలభాగమునందు; స్థిత—ఉన్న; పర్వత; రాజపట్ట—పర్వతరాజనెడుబిరుదుయొక్క; బంధనమునుబోని—కట్టినకట్టువలె నొప్పెడు; కోటయును—కోటయును; ఘనంబగు వైజయంతమును—ఘనంబగు—పెద్దదియగు; వైజయంతమును—వైజయంతమను పేరుగల ప్రాసాదమును; దవ్వులన్—దూరమునందు; కానఁగ

వచ్చెన్—కనఁబడుచున్నది; వర్తమానార్థమునందు భూతార్థము ప్రయోగింపఁబడియె. ఇది యనిమిషరాజధాని—ఇది యమరావతి.

ఉ. శ్రీలఁ జెలంగు నీసురపురిం గమనీయమహానుభావతం
బోలఁగ లేక యోటములఁ బొంది భజింపఁగ వచ్చినట్టు లు
త్తాలదుకూలకల్పితపతాకలతోఁ గడు నొప్పు నన్యది
క్పాలపురంబులో యనఁగఁ బార్శ్వములం దివిషద్విమానముల్. 98

(వ్యా) కమనీయమహానుభావతన్—రమ్యమగు ప్రాభవమునందు; శ్రీలన్—సంపదలచే; చెలంగు—ప్రకాశించుచున్న; ఈసురపురిన్—ఈస్వర్గమును; పోలఁగ లేక—సరిరాక; ఓటములఁబొంది—పరాజయములను బొంది; భజింపఁగ వచ్చినట్లు—దీనిని (ఈస్వర్గమును) సేవించుటకై వచ్చినట్టి; అన్యదిక్పాలపురంబులో యనఁగన్—అగ్ని మొదలగు నితరదిగధిపతులపురంబులో యన్నట్లు; పార్శ్వములన్—స్వర్గము ప్రక్కలయందు; దివిషద్విమానముల్—దేవతలవిమానములు; ఉత్తాల............పతాకలతోన్—ఉత్తాల—మిక్కిలి పొడవగు; దుకూలకల్పిత—పట్టువస్త్రములచే నిర్మితములైన; పతాకలతోన్—ధ్వజములతో; కడున్—మిక్కిలి; ఒప్పున్—ప్రకాశించుచున్నది; అనఁగా స్వర్గప్రాంతములందున్న విమానములు మహత్త్వమునందు స్వర్గమునకు నోడి వీనిని సేవింప వచ్చిన యితరదిక్పాలకులపట్టణములో యన నొప్పె నని భావము.

అలంకారములు—హేతూత్ప్రేక్ష—అతిశయోక్తి.

మ. మరలక జన్యభూమి నణుమాత్రభయంబును లేనివీరు ల
ధ్వరము లనేకము ల్విధియుతంబుగఁ జేసినభూసురేంద్రు లు
ద్ధురభవపాశబంధములఁ ద్రుంచినయోగికులావతంసు లీ
సురపురకామినీవదనచుంబనమాత్రకృతార్థమానసుల్. 99

(వ్యా) జన్యభూమిన్—యుద్ధరంగమునందు; 'యుద్ధమాయోధనం జన్యం' అని యమరుఁడు; మరలక—వెనుదీయక; అణుమాత్రభయంబును లేని—కొంచెమునుభయంపడని; వీరులు—శూరులు; అధ్వరములు—యాగములను; భూసురేంద్రులు — బ్రాహ్మణులు; ఉద్ధుర.........వతంసులు — ఉద్ధుర — దట్టములైన; బలిష్ఠములైన; భవపాశబంధములన్ — సంసార మనెడుకట్టుత్రాళ్లను; త్రుంచిన—త్రెంచిన; యోగికులావతంసులు — యోగిశ్రేష్ఠులును; ఈసుర.........మానసుల్ — ఈసురపుర — ఈస్వర్గమందలి; కామినీ — (దేవతా) స్త్రీలయొక్క; వదన—ముఖములను; చుంబనమాత్ర—

ముద్దుపెట్టుకొనుటచేతనే; కృతార్థమానసుల్—నెఱవేర్పఁబడినకోరికలు గల మనసులు గలవారలు; అనఁగా ధన్యహృదయులై యనుట; 'అయి, వెలయుదురు' అని క్రియాపదములధ్యాహార్యములు.

(వి) ఈపద్యమునందు 'ఈసురపురకామినీవదనచుంబనమాత్రకృతార్థమానసుల్' అనుచోట 'ఈ' అను విశేషణము 'సురపుర' యను పదముతో నన్వయించినంగాని యర్థముపొసఁగదు. ఇట్లు సంస్కృతసమాసఘటితశబ్దములలో నేకదేశమందు (అనఁగా నొకభాగమునందుమాత్రము) నన్వయించునటులు సమాసమునకు ముందుగా వేఱగు విశేషణమునుగూర్చుట యేకదేశాన్వయంబనబడును. దీనిని లక్షణశాస్త్రవేత్తలు సరి యని యంగీకరింపరు. అయినను సాపేక్షమగు పట్టులలో నిటు లేకదేశాన్వయమును మహాకవులు కొన్నియెడలఁ గూర్చుటయుఁ గలదు.

ఆ-2-70 వ పద్యముయొక్క వ్యాఖ్యానముం గాంచునది.

'యోగికులావతంసులున్' అని పాఠ మున్నచో నీయేకదేశాన్వయదోషము నివారిత మగును; అర్థహానియును లేదు.

శా. సారంగాక్షులచూపుచోఱగముల న్జన్గొండల న్మోహదు
ర్వారావర్తముల న్మునింగి దరిఁ జేర న్రాక యుప్పొంగు సం
సారాంభోనిధి సత్క్రియాతరణి నిశ్శంక న్సముత్తీర్ణులై
చేరు న్సజ్జననావికుండు మదిరాక్షీ యీపురద్వీపమున్. 100

(వ్యా) మదిరాక్షీ—(మదకరములగు)మోహజనకములగుకన్నులు గలదానా; ఇది సత్యభామకు సంబోధనము; 'మదిరాక్షీమదానసార్పితం మధుపీత్వారసవత్కథంను మే' అని రఘువంశము-8 సర్గ. 68 శ్లోకము. మదిరాక్షీ—ఖంజన మను పిట్టలవంటి కన్నులు గలది యనియు నర్థము చెప్పనగు; సజ్జననావికుండు—సత్పురుషుఁడను పడవఁ గోలువాఁడు; సారంగాక్షుల......చోఱగములన్; సారంగాక్షుల—జింకకన్నులవంటి కన్నులుగల స్త్రీలయొక్క; చూపు—చూడ్కు లనెడు; చోఱగములన్—మత్స్యముల గుంపులయందును; ఇచట "చొఱ్ఱగములన్" అని పాఠాంతరము గలదు; చొఱ్ఱ, చోఱ, రెండును సమానార్థకములు; రూపాంతరములు; ప్రాచీన ముద్రితగ్రంథములందు 'చోఱగము' లనియే యున్నది; 'ప్రామినుకులదొంగఁ బాతాళకుహరంబు చోఱఁబాఱి చీఱిన చోఱ వీవ' అను ప్రయోగ మీగ్రంథమునఁ బ్రథమాశ్వాసమున నున్నది; 'చోఱ' యను పదము నాతికటువుగా నుండుటచే నాపాఠమే సరసంబని తోఁచెడి; చన్గొండలన్—చన్నులనెడుకొండలయందును; మోహదుర్వారావర్తములన్—మోహ - భ్రాంతి

యనెడు; దుర్వార–తొలగించుట కశక్యము లగు; ఆవర్తములన్–సుళ్లయందును; మునింగి—; దరిన్–గట్టును; చేరన్ రాక–చేరనియ్యక; ఉప్పొంగు–విజృంభించు; సంసారాంభోనిధిన్–సంసార మనెడుసముద్రమును; సత్క్రియా తరణిన్–సత్కర్మము లనెడు పడవచేత; నిశ్శంకన్–నిర్భయముగా; సముత్తీర్ణుడై–దాటి; ఈ పురద్వీప మున్–ఈపట్టణ మనెడుదీవిని; (అనఁగా స్వర్గము ననుట); చేరును–చొచ్చును; అలంకారము–సావయవరూపకము.

క. అని నాకపురమహత్త్వము
వనితకుఁ దెలుపుచును హర్షవశమానసుఁడై
దనుజకులవైరి చని యి
య్యనఁ గాంచనమేదినీధరాగ్రక్షోణిన్. 101

(వ్యా) నాకపుర–స్వర్గముయొక్క; కాంచనమేదినీధరాగ్రక్షోణిన్—మేరుపర్వతశిఖరప్రదేశములందు; 'దనుజకులవైరి' అను కర్తృపదము 103–వ పద్యమునందలి 'చనుదెంచెన్' అను క్రియాపదముతో నన్వయము.

చ. పతగవిభుండు మింటిపయి భంజలికా మురళీ సుడాల వ
ల్గితముల రాఁ నెదుర్పడినఖేచరవర్గము లోసరించి య
ద్భుతముగ మ్రొక్కఁ లేనగవుతోఁ గనుఁగొంచు వదాన్యనైచికీ
శితఖురటంకచంద్రకిత సిద్ధసరిత్తటమార్గసీమలన్. 102

(వ్యా) పతగవిభుండు–గరుత్మంతుఁడు; భంజలికామురళీసుడాలవల్గితములన్–ఈ పేరులు గల గమనభేదములతో; రాన్–రాఁగా; ఎదుర్పడిన–ఎదురుగా వచ్చిన; ఖేచరవర్గము–దేవతలగుంపులు; ఓసరించి–ఒదిగి; మ్రొక్కన్–నమస్కరింపఁగా; లేనగవుతోఁ గనుఁగొంచున్–మందహాసముతో వీక్షించుచు; 'దనుజకులవైరి' అను పూర్వపద్యమందలికర్తృపదముతో నన్వయము; వదాన్య......సీమలన్ —— వదాన్య నైచికీ–కామధేనువుయొక్క; (వదాన్య–ఈవి, నైచికీ–ఆవు); శిత–వాఁడి యగు; ఖుర–గిట్టలనెడు; టంక – ఉలిచేత (ఆయుధముచేత); చంద్రకిత–గుండ్రముగు చిన్నపల్లములుగా నేర్పఱుపఁబడిన; సిద్ధసరిత్–ఆకాశగంగయొక్క; తట–తీరమందలి; మార్గ సీమలన్–మార్గప్రదేశములందు; పైపద్యములోని 'చనుదెంచెన్' అను క్రియాపదముతో నన్వయము.

క. సరసబిసవిసరముహురా
హరణోద్ధురహంససంసదారవదీక్షా
కరణచణగంధవహములు
శరీరములసేద దేర్పఁ జనుదెంచె రహిన్. 103

(వ్యా) సరస......గంధవహములు—

సరస—రసవంతములైన; బిసవిసర—తామరతూఁడులయొక్క సమూహములను; ముహుః—మాటిమాటికి; ఆహరణ — గ్రహించుట చేత; తినుటచేత నని యర్థము; 'ముహురుద్ధరణ' అనియుఁ బాఠము కలదు. అద్దానికిని నిదియే యర్థము. ఉద్ధుర—చెలరేఁగుచున్న; హంససంసత్—హంసల సమూహముయొక్క; ఆరవ—ధ్వనులను; దీక్షాకరణ—పొడిగించుటయందు; చణ—సమర్థములయిన; గంధవహములు—వాయువులు; శరీరములసేదఁ దేర్పన్—తమదేహములయందలి శ్రమములఁ బోఁగొట్టఁగా; రహిన్—విలాసముతో; చనుదెంచెన్—వచ్చెను; తాత్పర్యము సుగమము.

'అని నాకపుర మహత్త్వము' అనుపద్యము మొదలీపద్యమువఱకు నొకటే యన్వయము గాన విశేషక మని యెఱుంగునది.

శా. సమ్మర్దక్షమ ధీనిబంధనవిధాసంక్రందనాచార్య శూ
రమ్మన్యాచలవజ్రపాత జగతీరక్షాంబుజాక్షా శర
ధ్యమ్మార్గస్థ దశాస్యరాజ్యసమసహ్యప్రోద్భవాతీరభా
గుమ్మత్తూరుశివంసముద్రపురవప్రోన్మూలనాడంబరా. 104

(వ్యా) సమ్మర్దక్షమ—సమ్మర్ద—యుద్ధమును; క్షమ—ఓర్చువాఁడా; (అనఁగా యుద్ధమునందు వెనుదీయనివాఁ డనుట); ధీని......చార్య—ధీనిబంధనవిధా—బుద్ధిప్రసరణవిధానంబునందు; సంక్రందనాచార్య—ఇంద్రునిగురు వగు బృహస్పతివంటివాఁడా; (అనఁగాఁ బ్రజ్ఞావిశేషంబున బృహస్పతికి సమానుఁ డనుట); శూర......వజ్రపాత—శూరమ్మన్య—శూరులని తమ్ముభావించుకొనువా రనెడు; అచల—పర్వతములకు; వజ్రపాత—వజ్రాయుధపుదెబ్బ యైనవాఁడా; శూరమ్మన్యుఁడు—తాను శూరుఁడు కాకున్నను దన్ను శూరుఁడని తలఁచుకొనువాఁడు; దీనికి రూపాంతరము 'శూరమాని'; జగతీరక్షాంబుజాక్షా—జగతీ—లోకములను; రక్షా—కాపాడుటయందు; అంబుజాక్షా—విష్ణువువంటివాఁడా; శరధ్య......నాడంబరా—; శరధి—సముద్రముయొక్క; అమ్మార్గస్థ (అప్ + మార్గ)నీళ్ల మధ్యమునందున్న; దశాస్యరాజ్య—రావణునియొక్క రాజ్యమునకు;

అనఁగా లంకాపట్టణమునకు; సమ—తుల్యమైన; సహ్యాద్రిప్రోద్భవా—(సహ్యాద్రియందుఁ బుట్టిన) కావేరీనదియొక్క; తీరభాక్—గట్టునందుండెడు; ఉమ్మత్తూరు శివంసముద్ర పుర—; ఉమ్మత్తూరు, శివంసముద్రము అను పట్టణములయొక్క; వప్ర—ప్రాకారము లను; ఉన్మూలన—పెల్లగించుటయొక్క; ఆడంబరా—విజృంభణము గలవాఁడా.

క. తిరుమలదేవీవల్లభ
కరుణామయహృదయ రాజకంఠీరవ యీ
శ్వరనరసభూపురందర
వరనందన బాసదప్పవరగండాంకా. 105

(వ్యా) భూపురందర—భూమికి నింద్రుఁడు, అనఁగా మహీపతి; బాసదప్ప వరగండాంకా—బాసదప్ప యనువానిని జయించినవాఁ డనెడుబిరుదు గలవాఁడా.

స్రగ్విణి

నాగమాంబాధిభూనారసింహాత్మజా
భోగలీలాపరాభూతసంక్రందనా
త్యాగవిద్యానిషద్యాయితప్రాభవా
సాగరాంతక్షమాసంపదేకాస్పదా. 106

(వ్యా) నాగమాంబా......త్మజా—నాగమాంబా—నాగమాంబయను రాణికి; అధిభూ—అధిపతియయిన, అనఁగా భర్తయగు; 'అధిభూర్నాయకో నేతా' అని యమ రుఁడు; నారసింహ—నరసింహరాజుయొక్క; ఆత్మజా—కుమారుఁడా; భోగ......సంక్రం దనా—భోగలీలా—భోగవైభవములచేత; పరాభూత—తిరస్కరింపఁబడిన; సంక్రందనా— దేవేంద్రుఁడు గలవాఁడా; అనఁగా భోగమున దేవేంద్రుని నతిశయించినవాఁ డనుట; త్యాగ......ప్రాభవా — త్యాగవిద్యా – ఇచ్చుటయను విద్యకు; నిషద్యాయిత— అంగడివలె నాచరించుచున్న; ప్రాభవా—మహిమగలవాఁడా; 'ఆపణస్తు నిషద్యాయాం' అని యమరుఁడు; అనఁగాఁ గృష్ణదేవరాయల మహిమమునుండి యితరులు త్యాగవి ద్యను నేర్చుకొందురని భావము; సాగ......దేకాస్పదా—సాగరాంత—సముద్రములే యెల్లలుగాఁగల; క్షమా—భూమియొక్క; సంపత్—ఐశ్వర్యములకు; ఏకాస్పదా—ముఖ్య స్థానమైనవాఁడా; అనఁగా సముద్రములవఱకుఁ గల సర్వభూముల కధిపతియై మహై శ్వర్యసంపన్నుఁ డనుట.

ఈవృత్తము స్రగ్విణి.

లక్షణము_ప్రతిపాదమును నాలుగు ర గణములును మూఁడవ గణము మొదటి యక్షరము యతిస్థానమును గలది.

## గద్యము

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నందిసింగయామాత్యపుత్త్రి కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ
తిమ్మయనామధేయ ప్రణీతం బైన పారిజాతాపహరణం
బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

## వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీపరమేశ్వరీసనాథ నిరంతరభజన నాగపూడిగ్రామాభిజన
భారద్వాజగోత్ర సామగద్రాహ్యాయణసూత్ర పవిత్రచరిత్ర
యజ్ఞేశ్వరార్యపుత్త్రి సూక్తిపరితోషితార్య కుప్పుస్వా
మ్యార్యప్రణీతం బైన పారిజాతాపహరణ
మహాకావ్య వ్యాఖ్యావికాసం బగు
పరిమళోల్లాసంబునందుఁ
ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# పారిజాతాపహరణము

## తృతీయాశ్వాసము

క. శ్రీమహితగేహ యుత్కల
భూమీధవదర్పహరణభుజసార సుధా
ధామకులజలధికౌస్తుభ
రామాపాంచాల కృష్ణరాయనృపాలా. 1

(వ్యా) శ్రీ_సంపదలచేత; మహిత_పూజితమైన, గౌరవింపఁబడిన; గేహ_గృహము గలవాఁడా; ఉత్కల......సార—ఉత్కలభూమీధవ – ఉత్కల దేశపు రాజుయొక్క; దర్ప_గర్వమును; హరణ_పోఁగొట్టిన; భుజసార_భుజబలము కలవాఁడా; సుధా......కౌస్తుభ—సుధాధామ_చంద్రునియొక్క; ‘ద్వయోస్తు గౌర్ణ పుంస్యర్చి స్తేజో ధామమహోవిభా’ అని యమరుఁడు; కుల_వంశమనెడు; జలధి_సముద్రమునకు; కౌస్తుభ—మహావిష్ణువుయొక్క కౌస్తుభమువంటివాఁడా; అనఁగాఁ జంద్రవంశకులతిలకుఁడా యనుట; రామాపాంచాల—రామా_(రసికురాండ్రగు) యువతులకు; పాంచాల_పాంచాలుఁ డను పేరు గల కామశాస్త్రోక్తజాతిపురుషుఁడా; అనఁగా యువతులను సంతసింపఁజేయువాఁడని భావము; కృష్ణరాయనృపాలా_కృష్ణరాయమహీపతీ.

పురుషజాతులు నాలుగు. పాంచాలుఁడు, కూచిమారుఁడు, భద్రుఁడు, దత్తుఁడు, అని. పాంచాలపురుషలక్షణము :—

“దేవతాగురుపూజలఁ జేలువాఁడు, ఏకపత్నీవ్రతుండు వివేకశాలి
దానమును నుబ్బువిద్యయుఁ దనరువాఁడు, పురుషవర్యుఁడు పాంచాలపురుషుఁ డగును.”

—అని కామకళానిధి.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నవ్యాసనివల్లభుండు

గగనగంగాప్రతీరోపకంఠభూమి
నల్లనల్లన నేతెంచు నవసరమున. 2

(వ్యా) ఉపకంఠభూమిన్ — సమీపప్రదేశమునందు.

ఉ. అంతకు మున్న నారదమహామునిచే మఘవుండు కంసదై
త్యాంతకురాక దా నెఱిఁగి యభ్రమువల్లభు నెక్కి సంభ్రమా
క్రాంతమనస్కుఁడై యెదురుగాఁ జనుదెంచె జయంతుఁడుం దిశా
కాంతులు మేనకాదిగణికానివహంబులు వెంటఁ గొల్వఁగన్. 3

(వ్యా) మఘవుండు — ఇంద్రుఁడు; అభ్రమువల్లభున్ — ఐరావతమును; (అభ్రము — ఐరావతముభార్యపేరు); జయంతుఁడు — ఇంద్రుని కుమారునిపేరు; దిశాకాంతులు — అగ్నియమవరుణాదిదిక్పతులు; గణికా — వేశ్యలు.

చ. అమరవిభుండు దూరమున నంబుజనాభునిఁ గాంచి సంభ్రమో
ద్గమమునఁ జేతియంకుశముఖంబునఁ గుంభము లూఁది కుంచితా
గ్రిమచరణంబున న్మదకరిన్ డిగి యంసవిలంబికల్పచే
లము నడుమ న్బిగించుచు నిలానిహితాత్మశిరఃకిరీటుఁడై. 4

(వ్యా) అంకుశముఖంబునన్ — అంకుశముయొక్క కొనచేత; కుంభము లూఁది — ఐరావతముయొక్క కుంభస్థలముల నదిమి; (అనఁగాఁ దాను దిగుటకై యైరావతమున కించుక పాదమును వంచుటకై చేసినసంజ్ఞ); కుంచితా.........చరణంబునన్ — కుంచిత — వంపఁబడిన; అగ్రిమచరణంబునన్ — ముందటికాలివలన; అంస — మూఁపునందు; విలంబి — వ్రేలుచున్న; కల్పచేలము — కల్పవృక్షపుఁబట్టుతోఁ జేయఁబడిన వస్త్రమును; నడుమన్ బిగించుచున్ — నడుమునందుఁ గట్టుచు; ఇలా.........కిరీటుఁడై — ఇలా — భూమియందు; నిహిత — ఉంచఁబడిన; ఆత్మశిరః — తనశిరస్సునందలి; కిరీటుఁడై — కిరీటము గలవాఁడై; నమస్కరించి యనుట; ఏనుఁగుపైఁ గూర్చున్నవారు దిగవలసినప్పుడు దిగుట కనుకూలముగా నయ్యేనుఁగు మోఁకాటించుట యనఁగా ముందటిపాదము నించుక వంచుట స్వభావము.

(వి) పూజ్యులు వచ్చినప్పుడు వారికంటెను జిన్నవారు లేచి ప్రత్యుత్థానము చేసి మూఁపున వ్రేలుచున్న యుత్తరీయంబును నడుమున బిగించికట్టుచు నతనిపాదంబులు శిరంబు సోఁక రెండుచేతులం బట్టుకొని స్వనామోచ్చారణపురస్సరంబుగాఁ బ్రణా

సుంబు చేయుట యార్యధర్మము. దీనివలనఁ జిన్నవారికి శ్రేయోభివృద్ధి కలుగును.

అలంకారము—పర్యాయోక్తి.

చ. జడిగొని సమ్మదాశ్రుకణజాలము లొల్కఁగ రోమహర్షముల్
బడిబడి మేనఁ బాదుకొన భక్తినివేశతరంగితాత్ముఁడై
యడుగులమీఁద వ్రాలె దివిజాగ్రణి తత్కుశలంబు నెమ్మితో
నడిగెడురీతి మౌళికుసుమాగతషట్పదపంక్తి మ్రోయఁగన్. 5

(వ్యా) జడిగొని_ఎడతెగక, అధికముగా ననుట; సమ్మదాశ్రుకణజాలములు — ఆనందబాష్పబిందుబృందములు; ఒల్కఁగన్_చిందఁగా; రోమహర్షముల్ - సంతోషసూచకములగు పులకలు; బడిబడి _ పైపైని; మేనన్ - దేహమునందు; పాదుకొనన్ — నిండఁగా; దివిజాగ్రణి — దేవేంద్రుఁడు; తత్కుశలంబున్ — శ్రీకృష్ణుని క్షేమమును; నెమ్మితోన్_ప్రీతితో; మౌళి...పంక్తి—మౌళి—శిరస్సునందలి; కుసుమ—పుష్పములను గుఱించి; ఆగత_వచ్చిన; షట్పదపంక్తి_తుమ్మెదలవరుస; మ్రోయఁగన్_శబ్దింపఁగా; భక్తినివేశతరంగితాత్ముఁడై_ భక్తిని బొందుటచేత నాందోళితమగుమనస్సుకలవాఁడై; అడుగులమీఁద వ్రాలెన్—నమస్కరించె ననుట.

అలంకారము_ఉత్ప్రేక్ష.

ఉ. ఆదనుజాపహర్తయు భుజార్గళము ల్వెసఁ జాఁచి యంచితా
మోదవికాసవన్నయనముగ్ధసరోరుహపంక్తిఁ బూజ ల
త్యాదరలీలఁ జేయునమరాధిపుఁ గౌఁగిటఁ జేర్చె నూతనాం
భోదము సానుమచ్ఛిఖరము న్రభసంబునఁ గప్పుకైవడిన్. 6

(వా) ఆదనుజాపహర్తయున్ — ఆ కృష్ణుఁడును; అంచితా...పంక్తిన్— అంచిత_ఒప్పిన; ఆమోద—సంతోషమనెడు వాసనచేత; వికాసవత్_ప్రకాశముతోఁ గూడిన; వికసించుటతోఁగూడిన యనియు నర్థము; నయన_కన్నులనెడు; ముగ్ధ_మనోహరమైన; సరోరుహపంక్తిన్_తామరలవరుసచేత; అనఁగా సంతోషమనెడువాసనచేతఁ బ్రకాశమనెడు వికసనము గలిగిన నయనము లనెడుతామరలచేత నని భావము; పూజలం_సపర్యలను; అత్యాదరలీలన్_మిక్కిలిగౌరవముతో; చేయునమరాధిపున్_చేసెడు దేవేంద్రుని; నూతనాంభోదము_క్రొత్తమేఘము, నల్లనిమేఘమనుట; సానుమచ్ఛిఖరమున్_పర్వతశృంగమును; రభసంబునన్_వేగముతో; కప్పుకైవడిన్—కప్పునట్లు; భుజా

గ్రశ్మముల్—గడియలవలె నిడుదలగు బాహువులను; వెసన్—త్వరతో; చాఁచి—ప్రసరింపఁ జేసి; కౌఁగిటఁజేర్చెన్—ఆలింగనము చేసికొనెను.

అలంకారములు—'అంచితా——పంక్తి' అనుచో శ్లేషార్థాపిత రూపకము. 'నూత్నాంభోదము......కప్పుకై వడిన్' అనుచో నుపమ.

మ. అనలుం డంజలి సేసె నంతకుఁడు సాష్టాంగంబు గావించె మ్రొ
క్కె నిశాచారి ప్రచేతసుండు దెలచెం గేల్మోడ్చె సారంగవా
హనుఁ డర్థేశుఁడు వందనం బిడియె నీహారాంశుకోటీరుఁడున్
వినతుం డయ్యె యదుప్రవీరునకు నుద్వేలప్రమోదంబునన్. 7

ఈపద్యమునందు దిక్పాలకులు వరుసగాఁ గృష్ణుని నమస్కరించుట వర్ణింపఁబడినది.

(వ్యా) ఉద్వేలప్రమోదంబునన్—అపారమైనసంతోషముతో; అనలుండు—అగ్ని; అంతకుఁడు—యముఁడు; సాష్టాంగముగావించెను—సాష్టాంగముగా నమస్కరించెను; సాష్టాంగము లెవ్వి యన—

శ్లో. ఉరసా శిరసా దృష్ట్యా మనసా వచసా తథా
పద్భ్యాం కరాభ్యాం జానుభ్యాం ప్రణామోఽష్టాంగ ఉచ్యతే.

నిశాచారి—రక్కసుఁడు, నైరృతుఁడు; ప్రచేతసుండు—వరుణుఁడు; తెలచెన్—నమస్కరించెను; సారంగ వాహనుఁడు—జింక వాహనముగాఁ గలవాఁడు, వాయువు; కేల్మోడ్చెన్—అంజలిచేసెను; అర్థేశుఁడు—ధనాధిపతి, కుబేరుఁడు; నీహారాంశుకోటీరుఁడున్—చంద్రునిఁ గిరీటముగాఁగలవాఁడు—ఈశానుఁడు; వినతుండయ్యెన్—నమస్కరించెను.

అలంకారము—రత్నావళి.

శా. వారిం జూచి రథాంగపాణి సరసవ్యాహారలీల న్దర
స్మేరాపాంగవిలోకనక్రియల సంప్రీతాత్ములం జేసి గో
త్రారి రమ్ము గజమ్ము నెక్కు మని నాగారాతిపై నెక్కెఁ దా
రారంభాకరచామరానిలము మార్గశ్రాంతిఁ దూలింపఁగన్. 8

(వ్యా) రథాంగపాణి — చక్రహస్తుఁడగు కృష్ణుఁడు; వ్యాహార — పలుకులు; 'వ్యాహార ఉక్తిర్లపితం' అని యమరుఁడు; దరస్మేర—మందహాసముతోఁ గూడిన; 'స్ఫురద్దంతపంక్తి తారంయత్తత్స్మేరమితికథ్యతే' అని స్మేరలక్షణము; అపాంగవిలోకనక్రియలన్—

(ప్రా)కేఁగంటిమాపు లనెడివ్యాపారముచేత; సంప్రీతాత్ములంజేసి—సంతోషపఱచి; గోత్రారి—పర్వతవిరోధియగు నింద్రుఁడా; తారారంభా—తార, రంభ యనెడు నమరవేశ్యలయొక్క; కర—చేతులయందలి; చామర—చామరములనుండి పుట్టిన (అనఁగా వీచుటవలనఁ బుట్టిన); అనిలము—వాయువు; మార్గశ్రాంతిక—మార్గాయాసమును; తూలింపఁగ—పోఁగొట్టఁగా; నాగారాతిపై నెక్కె—గరుడునిమీఁద నెక్కెను.

క. తక్కిన దిశాధినాథులు
నెక్కిరి నిజవాహనముల నెసఁగె హుడుక్కా-
ఢక్కాపటహధ్వానము
లక్కజముగఁ బొంగి నింగి యఱచినభంగిన్. 9

(వ్యా) హుడుక్కా-ఢక్కా—ఇవి వాద్యవిశేషములు; పటహ—తప్పెట యను వాద్యవిశేషము; (వీనియొక్క); ధ్వానములు—శబ్దములు; అక్కజముగన్—ఆశ్చర్యముగా; పొంగి—అతిశయించి; నింగి—ఆకాశము; అఱచినభంగిన్—మూఁతపెట్టిన విధమున; ఎసఁగెన్—అతిశయించెను; అనఁగా నీ వాద్యవిశేషరవములు మిన్నుముట్టెను.

అలంకారము—సంబంధాతిశయోక్తి.

ఉ. ఆయెడ సిద్ధకింపురుషయక్షవసుప్రముఖామరావళిం
బాయు తొలంగు మంచు శతమన్యుఁడు సందడి వో బరాబరు
ల్సేయఁగ నల్లనల్ల నతసీకుసుమాసితదేహుఁ డేగె వై
హాయసవీథి నారదముఖామరసంయమికీర్తనీయుఁడై. 10

(వ్యా) ఆయెడన్—అప్పుడు; పాయు, తొలంగుము, అంచున్—దారితీయుఁడు, తొలఁగుఁడు, అని కేకలువేయుచు; శతమన్యుఁడు—ఇంద్రుఁడు; సందడివోన్—సమ్మర్దము లేకుండునట్లు; బరాబరుల్సేయఁగన్—హెచ్చరికలు చేయఁగా; అల్లనల్లన్—మెల్ల మెల్లఁగా, అనఁగా మందగమనముతో; అతసీకుసుమాసితదేహుఁడు—అతసీకుసుమ—నల్లవిసె పువ్వులవలె; అసితదేహుఁడు—నల్లనిదేహముగలవాఁడు (కృష్ణుఁడు.); వైహాయసవీథిన్—ఆకాశమార్గమునందు; ఏగెన్—పోయెను.

ఉ. అప్పుడు శౌరిఁ జూచుప్రమదాతిశయంబు హృదంతరంబులం
జిప్పిల సంభ్రమించి కయిసేయుతెఱంగయథాతథంబు గాఁ

గుప్పనఁ గూరి యొండొరులఁ గూడఁగ నీక కడంగి వేలుపుం
గప్పురగందు లెక్కిరి ధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్. 11

ఈపద్యము మొదలు 21 వ పద్యమువఱకు నమరరమణీమణులు కృష్ణస్వామిని దర్శనముచేయు వేడుకలు వర్ణింపఁబడినవి.

(వ్యా)చూచు_దీనికిఁ గర్త కప్పురగందులు; అనఁగాఁ జూడవలయుం ననెడు; ప్రమదాతిశయంబు_ఔత్సుక్యము; చిప్పిలన్_నిండఁగా; కయిసేయు తెఱంగు_అలంకరణరీతి; అయథాతథంబుగాన్_తాఱుమాఱుగా; యథాతథము_సత్యమైనది, అనఁగా బుజుసరణి; 'యథార్థంతు యథాతథమ్' అని యమరుఁడు; కుప్పనఁగూరి_గుంపులు గూడి; వేలుపుంగప్పురగందులు_సురకామినులు; (కప్పురగంది_కర్పూరగంధి శబ్దభవము; అనఁగా ఘనసారమువంటిసువాసన గలది).

చ. అలఁదినచందనంబు వృథ యౌఁ జెమరింపఁగ సమ్మదాశ్రులన్
దోలఁచినయట్లు వోయెడుఁ గనుంగవకాటుక పేటు లెత్తుఁ జె
క్కుల మకరీవిలాసము గగుర్పొడువ న్హరిఁ జూచువేళ నో
చెలి కయిసేయకమ్మ యని చేడియ యొక్కతె పిల్చె నెచ్చెలిన్. 12

(వ్యా)హరిఁ జూచువేళన్___; అలఁదినచందనంబు_గందపుఁబూఁత; చెమరింపఁగన్, వృథయౌన్, అని యన్వయము; అనఁగాఁ జెమర్చుటవలనఁ గందపుఁబూఁత చెడిపోవు నని భావము; కనుంగవకాటుక; సమ్మదాశ్రులన్_ఆనందబాష్పములచేత; తొలఁచినయట్లు_తుడిచినట్లు; పోయెడున్_వ్యర్థమగును; చెక్కులన్, మకరీవిలాసము___ చెక్కిళ్లయందు లిఖియించిన మకరికాపత్రరచన; గగుర్పొడువన్, పేటు లెత్తున్_ రోమాంచములు గలుగుటచేఁ బెల్లులుగా లేచిపోవును; 'కావునన్' అనుపద మిట నధ్యాహార్యము; ఓచెలి_ఓసఖీ; కయిసేయకమ్మ_అలంకరింపవలదమ్మా; ఇందలి 'కయిసేయకమ్మ' అను పదము తనకునలంకరింపవలదని సఖితోఁ జెప్పినట్లయినను, 'నీ వలంకరించికొనకుము' అని తననెచ్చెలితోఁ జెప్పినట్లయినను నూహింపఁదగియున్నది.

ఈపద్యమునందు సురతరుణులు మహాపురుషలక్షణ లక్షితుండగు కృష్ణునిఁ జూచునపుడు తమకు స్వేదోద్గమము మున్నగుసాత్త్వికోదయములు నిక్కముగాఁ గలుగఁగలవని నిశ్చయించిన తెఱంగు సూచింపఁబడినది.

ఇట సాత్త్వికభావలక్షణములు వివరింపఁబడుచున్నవి.

సత్త్వమనఁగా.—

క. పరగతసుఖదుఃఖాదుల, నరయఁగ భావించి యట్ల యలరుట సత్త్వ
స్ఫురణము తద్భవభావము, లరయఁగ సాత్త్వికము లయ్యె నవి యెట్లన్నన్.
—అని కావ్యాలంకారసంగ్రహము.

సాత్త్వికభావము లెనిమిది:—

శ్లో. స్తంభః ప్రళయరోమాంచౌ స్వేదో వైవర్ణ్యవేపథూ,
అశ్రువైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.

వీనిలక్షణములు:—

ఉ. స్తంభ మచంచలత్వ మవశత్వముగుం బ్రళయంబు దృగ్జలో
జ్జృంభణ మశ్రు వౌఁ జెమట స్వేదము గద్గదవాక్యవైఖరీ
గుంభము విస్వరత్వము తగుంబులకం బన రోమహర్షణా
రంభము కంపమౌ వడఁకు రామకుఁ బాండురుచుల్వివర్ణతల్.
—అని కావ్యాలంకారసంగ్రహము.

చ. వనిత యొకర్తు మున్కొని గవాక్షతలంబున నింతు లుండుటం
గనుఁగొనఁ జోటు లేమి నొకకార్యముపేరిట బాల నోర్తు వం
చనఁ దొలఁగంగఁ బిల్చి రభసంబునఁ దత్ప్రతిజాలకంబు చే
కొని హరిఁ జూచెఁ గేకిసలు గొట్టుచు బోటులు దాని నవ్వఁగన్.13

(వ్యా) మున్కొని — తనకంటె మున్నుగాఁ జని; గవాక్షతలంబునన్ — కిటికీయందు; ఇంతులుండుటన్ — ఇతరవనిత లుండుటవలన; కనుఁగొనన్ — చూచుటకు (శ్రీకృష్ణుని దాను జూచుట కనిభావము); చోటు లేమిన్—స్థలము లేనికారణముచే; వనిత యొకర్తు—ఒకమగువ; ఒకకార్యముపేరిటన్—ఒకానొకపనినెపమున (ఏదో యొక పని యున్న దని కల్పించి యనుట); బాలన్, ఓర్తున్ — ఒక పిన్నవయసుపడుచును; వంచనన్—కపటముతో; తొలఁగంగన్, పిలిచి — దూరముగా నుండి యిటు రావే యని పిలిచి; రభసంబునన్ — వేగముతో, తటాలున; (పరువిడి యనుపద మధ్యాహార్యము); తత్ప్రతిజాలకంబున్—అంతవఱకు నాపడుచు నిలిచియుండిన గవాక్షభాగమును; చేకొని—పట్టుకొని; (అనఁగా నాపడుచు పట్టుకొనియుండిన గవాక్షపుఁగమ్ములను బట్టుకొని); బోటులు — తక్కినయువిదలు; కేకిసలుగొట్టుచున్ — చప్పటలుకొట్టుచున్, దాని నవ్వఁగన్—ఏమఱిపోయినయాపడుచును గేలిసేయఁగా; హరిఁ జూచెన్, అని యన్వయము.

(వి) ఇక్కడ 'బాలక' అను పదముచే వంచనార్హ యగు ముగ్ధ యని యెఱుంగునది. ప్రౌఢయయ్యేనేని నావనిత చేసినతంత్రమునకు లోఁబడియుండదుగదా.

బాల—పదియాఱుసంవత్సరములకు లోఁబడిన వయసు గల కన్యక; ముప్పది వత్సరములవఱకు యువతి (తరుణి) యనియు నేఁబదియయిదు వత్సరములవఱకుఁ ప్రౌఢ యనియు నామీఁదట వృద్ధయనియు సంజ్ఞలు.

దీనికిఁ బ్రమాణము:—

యావత్ షోడశసంఖ్య మబ్ద ముదితా బాలా తత స్త్రింశతం
తావత్స్యా త్తరుణీతిబాణశిశిఖై స్సంఖ్యాతు యావద్భవేత్
సా ప్రౌఢే త్యభిధీయతే కవివరై ర్వృద్ధా త దూర్ధ్వం స్మృతా
నింద్యా కామకలాకలాపవిధిషు త్యాజ్యా సదా కామిభిః॥

అలంకారము.—పరికరము.

ఈ పద్యమునందు హాస్యరసము మనోహరముగా వర్ణింపఁబడినది.

ఉ. కాళియభేదిఁ జూచుతమకంబున మజ్జన మాడి యాడి నీ
లాలక యొర్తు గంధసలిలార్ద్రకచంబులు చన్నుదోయిపై
వ్రాలిన సందిటం బొదివి రాజపథంబున కేగుదెంచె గో
పాలకమూర్తిఁ గాన శిఖిబర్హము కానుక దెచ్చెనో యనన్. 14

(వ్యా) నీలాలకయొర్తు—నల్లనికురులుగల యొకవనిత; కాళియభేదిఁ జూచు తమకంబునన్—శ్రీకృష్ణునిఁ జూడవలయునను కౌతుకముతో; మజ్జన మాడియాడి—తనివి దీఱ స్నానముచేసి; ఆడి, ఆడి—వీప్సయందు ద్విరుక్తి; గంధసలిలార్ద్రకచంబులు—పరిమళోదకముచేఁ దడిసిన వెండ్రుకలను; సందిటంబొదివి—సందిలియం దిఱికించికొని; శిఖిబర్హము — నెమలిపింఛమును; శ్రీకృష్ణమూర్తిని 'గోపాలకమూర్తి' యని చెప్పుటచే నాతనికిఁ బ్రియ మగు శిఖిబర్హమును గానుక దెచ్చుట చమత్కారము.

'నీలాలక' యనుపదము సాభిప్రాయము.

అలంకారములు—పరికరము—ఉత్ప్రేక్ష.

ఉ. ఉన్నతసౌధ మెక్కి యన్నతోదరి యొక్కతె సద్మనాభుఁ జూ
డ న్నిజదేహవల్లికఁ గడల్కొను సాత్త్వికలీలఁ జూచు నా
పన్నసఖీజనంబు గని సౌధశిఖాగమనశ్రమంబునం
గన్నియలార మే న్బడలెఁ గంటిరె నాకని బొంకె నేర్పునన్. 15

(వ్యా) అన్యతోదరియొక్కతె_అసత్యమగునడుము గలది; అనఁగా మిక్కిలి సన్నమగు నడుముగలదని భావము-అన్యతశబ్దమిచ్చటఁ గృశార్థకము; నిజదేహవల్లి కన్_తీఁగవలెఁ గోమలముగానుండు తనశరీరమందు; కడల్కొను_అతిశయించిన; సాత్త్విక లీలన్_సాత్త్వికవిలాసమును; ఆసన్నసఖీజనంబున్_దగ్గఱిన చెలికత్తియల మొత్తంబును; సౌధశిఖాగమనశ్రమంబునన్_మేడపై కెక్కుటవలనియాయాసముచేత; మేన్వడలెన్_శరీర మలసటఁ జెందెను; ఇచట గ్లాని యను సంచారిభావము.

'బొంకెన్' అని చెప్పుటచేత 'అవహిత్థ' యను సంచారిభావ మరయునది. అవహిత్థ యనఁగా నాకారగోపనము.

'అవహిత్థాతు లజ్జాదేర్హర్షాద్యాకారగోపనం' అని ప్రమాణము.

అలంకారము_వ్యాజోక్తి.

ఉ. వేడుక నీకె కాని మఱి వే ఱొకయింతికి నైన లేదె త్రో
పాడెద వేల మచ్చర మొకప్పుడు మానక పోయి తీవు పెన్
బ్రోడవు గాన నిన్నె కనుఁబో యతఁ డెవ్వరిఁ జూడఁ డంచు నో
నాడె సపత్ని నొక్కతె మురారిఁ గనుంగొను వేళ నీసునన్. 16

(వ్యా) త్రోపాడెదవు_త్రోయుచున్నావు; మచ్చరము_పగ; పెన్బ్రోడవు_మహాప్రౌఢురాలవు; నిన్నె కనుఁబో, అతఁ డెవ్వరిఁ జూడఁడు___నిన్నుఁ దక్క నితరుల నేరినిఁ గృష్ణుఁడు చూడఁడుసుమా; ఈ మాటలు కేవల మీర్ష్యాసూచకములు; నోనాడెన్_నొవ్వఁబలికెను; నిందించె నని భావము.

ఈపద్యమునం దసూయ యను సంచారిభావ మరయునది. పరోత్కర్షాసహనత్వ మసూయ.

చ. అలికులవేణి యొక్కతె మురారిఁ గనుంగొని మ్రానుపాటు మై
నెలకొన నున్నచో సడలు నీవిక లేఁజెమ రంటి నిల్పె నం
జలిపరిపూర్ణలాజలను సాధ్వసకంపము దాన చల్లె న
చ్చెలువకు సాత్త్వికోదయము చేసిన మేలిక నేమి చెప్పుదున్. 17

(వ్యా) మ్రానుపాటు_అచలత్వము; (ఇక్కడ స్తంభమను సాత్త్వికభావము); మై నెలకొనన్_దేహమునందుఁగలుగఁగా; సడలు నీవికన్_జాఱినపోకముడిని; లేఁజెమరంటి_చిఱుచెమ్మటయొడమి; నిల్పెన్_నీవినిఁ బూర్ణముగాజాఱిపోకుండనిలిపెనని

భావము; ఇక్కడ స్వేదమనుసాత్త్వికభావము; అంజలిపరిపూర్ణలాజలను — దోయిట నించిన పేలాలను; (మంగళార్థము లాజలను జల్లుటయాచారము); 'అవాకిరన్ బాలలతాః ప్రసూనై రాచారలాజై రివ పౌరకన్యాః' అని రఘువంశము; సాధ్వసకంపము—భయముచేఁ బొడమిన వడఁకు; తానచల్లెన్—లాజలను దనప్రయత్నములేకయే స్వయముగాఁ గృష్ణునిపైఁ జల్లెనని భావము.

ఇక్కడ వేపథు వను సాత్త్వికభావము.

క. మోదమునన్నైన రోషభయాదులనేనియును గంప మధికంబుగ దా
నే దేహిదేహమున నది, మేదిని వేపథువనంగ మెఱయుచునుండున్.
—అని వేపథులక్షణము.

క. మదవతి యొకతె పరాకునఁ
బదాంగదము కంకణముగఁ బాణిఁ దొడిగె న
య్యదువల్లభుఁ గనుఁగొనుచుం
దుది నదియును మేను వొంగి తుత్తుము రయ్యెన్. 18

(వ్యా) మదవతి—మదముగల యొక యంగన (ప్రౌఢవనిత); కామాతిశయము గల యంగనయని భావము; అయ్యదువల్లభుఁ గనుఁగొనుచును—కృష్ణునిఁ గాంచుచు; పరాకునన్ — ప్రమాదముచేత; పదాంగదమున్—కాలియందెను; కంకణముగన్—కడియముగ (భావించి); పాణిన్, తొడిగెన్—హస్తమునందు ధరించెను; తుదిన్—పిదప; అదియున్—పాణియందుఁ దొడిగినపాదాంగదమును; మేను పొంగి—శరీర ముబ్బి; తుత్తుమురయ్యెన్—తునియలై పగిలిపోయెను; తుత్తుమురు—తుమురు + తుమురు; ఇచట విభ్రమమను శృంగారచేష్ట వర్ణింపఁబడినది.

విభ్రమమనఁగా మోహపారవశ్యమువలని వేగముచే భూషణములను వ్యత్యస్తముగా నిడుకొనుట. విభ్రమలక్షణము:—

త్వరయా హర్షరాగాదే ర్దయితాగమనాదిషు,
అస్థానే భూషణాదీనాం విన్యాసో విభ్రమో మతః
—అని సాహిత్యదర్పణము.

ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్,
విభ్రమోఙ్గద హారాది భూషాస్థాన విపర్యయః.
—అని రసార్ణవసుధాకరము.

పాదనూపురములను బరాకుచేతఁ గరములందు ధరించుకొనఁగా నవి ధరించు నప్పుడు వదులుగా నున్నను గృష్ణసందర్శనజనితసంతోషాతిశయముచే నెమ్మె నుబ్బఁగా నూపురమును దునియలై పడె నని భావము.

ఈపద్యమునందుఁ గొన్నిగ్రంథములలోఁ 'గనుఁగొనుడు' అని పాఠాంతరము కనఁబడుచున్నది. దానికంటెఁ గనుఁగొనుచున్ అనుపాఠమే సరసముగాఁ దోఁచెడు.

అలంకారములు—పూర్వార్థమునం దసంగతియు నుత్తరార్థమునందుఁ జపలాతిశయోక్తియు. వీనికిసంకరము.

చ. దనుజవిరోధిమీఁద నొకతన్వి కరంబున లాజ లెత్తి చ
ల్లిన నెఱివేణి యీసునబలె న్విరిపూవులఁ జల్లెఁ జల్లెలో
చనములు సమ్మదాశ్రువులఁ జల్లె లలాటము ఘర్మబిందువుల్
చనుఁగవ సల్లె సంభ్రమవశత్రుటితామలమౌక్తికావళుల్. 19

(వ్యా) తన్వి—సుకుమారాంగి; ఈసునబలెన్—ఈర్ష్యచేతనో యనునట్లు; విరిపూవులన్—వికసించినపుష్పములను; 'విరి' యనుపదమునకుఁ బుష్పమని యర్థమున్నను, ఇక్కడ 'విరి' యనుటకు వికసించినయని యర్థముగావునఁ బౌనరుక్త్యములేదని తెలియునది; సంభ్రమ.........కావళుల్—సంభ్రమవశ—తొట్రుపాటుచేత; త్రుటిత—తెగిన; అమలమౌక్తికావళుల్ — స్వచ్ఛమైనముత్యములవరుసలు; ఇటు లావనితామణియవయవములన్నియు నహమహమికతోఁ గృష్ణస్వామి కుపహారములు సమర్పించెనని యామెకొదవిన సాత్త్వికోదయాదులు చమత్కారముగా వర్ణింపఁబడినవి.

అలంకారము—సముచ్చయము.

చ. జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ నొక్కవేలుపుం
జిలుకలకొల్కి రాచిలుకచేఁ బిలిపించిన సత్యభామ కా
కలికి తెఱంగు శౌరి కడకన్నులసన్నలఁ జూపెఁ గోపకం
దళకలుషాయితాక్షివలనంబుల నాసతి దన్నదల్పఁగన్. 20

(వ్యా) వేలుపుంజిలుకలకొల్కి—దేవాంగన; రాచిలుకచేన్—(తనపెంపుడు) శుకరాజముచేత; పిలిపించినన్—తన్నురమ్మని చెప్పిపంపఁగా, అనఁగా మోహాతిరేకముచేఁ దనయొద్దకు రమ్మని తనపెంపుడుఁజిలుకచేఁ గృష్ణునకుఁ జెప్పిపంపెనని భావము; శౌరి—కృష్ణుఁడు; కోప..............వలనంబులన్ — కోపకందళ—కోపప్రాదుర్భావముచేత;

అనఁగా మొలచినకోపముచే ననుట; కలుషాయిత_కలఁతఁజెందిన; అక్షివలనంబునన్_కన్నులఁ ద్రిప్పుటచేత; ఆసతి_చిలుకచేఁ జెప్పిపంపిన యావేల్పుతొయ్యలి_తన్నదల్పఁగన్_తన్ను బెదరింపఁగా; ఆకలికి తెలుంగు_ఆదేవాంగనచర్యను; కడకన్నులసన్నలన్_క్రీఁగంటిసంజ్ఞలచేత; సత్యభామకున్, చూపెన్, అని యన్వయము.

అనఁగా నొకానొకదేవతాస్త్రీ మోహాతిరేకముచేఁ గృష్ణునిఁ దనచెంతకు రమ్మని పెంపుడుఁజిలుకచేఁ జెప్పిపంపె ననియు, నావృత్తాంతమును గృష్ణుఁడు తనకటాక్షసంజ్ఞలచే సత్యభామకుఁ దెల్పుచుండఁగా నాదేవతాస్త్రీ యతనిపైఁ గోపించి కన్నులెఱ్ఱఁజేసికొని కృష్ణునిఁ జుఱచుఱఁజూచి యదల్చె ననియు, భావము.

ఈపద్యమున నున్మాద మను సంచారిభావము.

క. అనిమిషపురజాలకములు
వనితాజనతామయములు వనితలహృదయం
బనురాగరసమయం బ
య్యనురాగము శౌరిమయము నయ్యెడ నయ్యెన్. 21

(వ్యా) అనిమిషపురజాలకములు_అమరావతీపట్టణగృహములందలిగవాక్షములు; వనితాజనతామయములు_స్త్రీజనసమూహముచే నిండినవి; అయ్యెన్, అనుపదముతో నన్వయము.

'వనితాజనితాత్యర్థానురాగాయాంచ యోషితి' —అని యమరుఁడు.

'వనిత'యనఁగా మిక్కిలి యనురాగముఁ బుట్టించుస్త్రీ; వనితలహృదయంబు, అనురాగరసమయము, అయ్యెన్, అని యన్వయము.

అనఁగా నాపట్టణమందలి సుందరీమణుల డెందములందుఁ బ్రేమాతిశయంబు నిండె నని భావము.

అయ్యనురాగము, శౌరిమయమున్ అయ్యెన్, అని యన్వయము. శౌరిమయమున్, అయ్యెన్, అనునెడ శౌరిమయముగా నయ్యె నని భావము.

అనఁగా నచ్చటి దేవతాస్త్రీల యనురాగములు శ్రీ కృష్ణునియందే పరఁగెనని భావము

అనురాగలక్షణము.

" అంకురపల్లవకలికాప్రసూనఫలభోగభాగియంక్రమతః
ప్రేమామానః ప్రణయః స్నేహోరాగోనురాగ ఇత్యుక్తా"

అలంకారము_ఏకావళి.

పూర్వపూర్వముల కుత్తరోత్తరములు విశేషణములై యొప్పుట ఏకావళి.
ఇట్టియలంకారముగల శ్లోకము రామాయణమునఁ జూపట్టుచున్నది:—

"మహీకృతాపర్వతరాజిపూర్ణా, శైలాఃకృతావృక్షవితానపూర్ణాః
వృక్షాఃకృతాఃపుష్పవితానపూర్ణాః, పుష్పంకృతం కేసరపత్రపూర్ణమ్."
—సుందరకాండము.

చ. కనుఁగొన వేడ్కలం బోడముకాయ్యొల నచ్చర లీసడించుట
ల్వినుచు దరస్మితం బొలయ వెన్నుఁడు రాజపథంబు దాఁటి య
య్యనిమిషనాథుగేహబహిరంగణభూస్థలి డిగ్గ వైనతే
యుని మణిచిత్రవేత్రకరహుంకృతి దిక్కులు పిక్కటిల్లఁగన్. 22

(వ్యా) కాయ్యొలన్_అనురాగములతో ((క్రియలతో); ఈసడించుటల్-(పరస్పరము) నిందించుటలను (కోపించుటలను); దరస్మితంబు_మందహాసము;

హాసమాఱువిధములు; స్మితము, హసితము, విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము, అని. వీని లక్షణములు:—

క. స్మితమునుహసితము నను నీ, ద్వితయమునుత్తమము నాఁగ దీపించుఁ దగన్
స్మితమువికాసికపోలము, మితసర్శితరదనమైన మెఱయు హసితమై.

క. విహసితమును బ్రహసితమును, మహి రెండును మధ్యమములు మదిఁబరికింపన్,
విహసితము మృదులనినదము, ప్రహసితము శిరఃప్రకంపపరిమిత మరయన్.

క. అపహసితము నతిహసితము, నెపుడును నధమంబులనఁగ నేపారుశిర
శ్చపలమునశ్రుయుతంబును, నపహసితము మేనుగదల నతిహసితమగున్.
—అని కావ్యాలంకారచూడామణి.

మణిచిత్రవేత్రకరహుంకృతి—రత్నములు చెక్కిన చిత్రపుబెత్తములు గల సేవకుల హుంకారములు (అనఁగా హెచ్చరికలనుట); పిక్కటిల్లఁగన్—బద్దలుకాఁగా.

అదితిని శౌరి దర్శించుట.

క. ఆదరమున శతమన్యుఁడు
కైదండ యొసంగ యామకరిదానఝరీ

మేదురకక్ష్యాత్రితయము
నా దనుజవిరోధి గడచి యటఁ జని యెదుటన్. 23

(వ్యా) క్రైదండయొసంగన్—చేయూఁత నియ్యఁగా; యామ.............
త్రితయము—యామకరి—జాముకావలి యుండు నేనుఁగులయొక్క; దాన—మదజలము
చేత; మేదుర—దట్టమైన; కక్ష్యాత్రితయమున్—మూడంతర్గృహములను; 'కడచి' అను
దానితో నన్వయము.

సీ. తొడలపైఁ జాఁచిన యడుగుఁగెందమ్ముల
నొయ్యనఁ బౌలోమి యొత్తుచుండఁ
బార్శ్వభాగంబునఁ బంకేరుహాసను
కామినీరత్నంబు కతలు సెప్ప
బనిఁబూని యంతంత వినయావనతవృత్తి
సప్తర్షికాంతలు సంచరింప
వీజనచామరవీటీకరండాది
కములు దిక్పతిసతీగణము దాల్ప
తే. విమలచింతామణీమయవేదిమీఁదఁ
గల్పకలతాంతకల్పితతల్పసీమ
నధివసించిన నిఖిలలోకైకవంద్య
నమరమాతృకశుక్తి నయ్యదితిఁ గనియె. 24

ఈపద్యమునందు దేవేంద్రమాత యగు నదితి వర్ణింపఁబడియె.

(వ్యా) ఒయ్యనన్—మెల్లఁగా; పౌలోమి—శచీదేవి; సప్తర్షికాంతలు — సప్త
ర్షుల భార్యలు; సప్తర్షులు—'మరీచి, అత్రి, అంగిరసుఁడు, పులహుఁడు, క్రతువు,
పులస్త్యుఁడు, వసిష్ఠుఁడు' అని మహాభారతమునందును, 'గౌతముఁడు, భరద్వాజుఁడు,
విశ్వామిత్రుఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు, కశ్యపుఁడు, అత్రి'. అని శతపథబ్రాహ్మణము
నందును జెప్పఁబడి యున్నది.

శ్లో. కశ్యపో౽త్రిర్భరద్వాజః, విశ్వామిత్రోథ గౌతమః
జమదగ్నిర్వసిష్ఠశ్చ, సప్తైతే ఋషయ స్స్మృతాః. అని మతాంతరము.

వీజన......దికములు:—వీజన—విసనకఱ్ఱలు; చామర — వింజామరలు; వీటీకరంబ—తమలపాకుల పెట్టె; అసురమౌక్తికశుక్తిన్—దేవత లను ముత్యములకు ముత్యపుంజిప్పయగు (నద్దేవిని); అనఁగా ముత్యపుంజిప్పలో ముత్యములు పుట్టిన ట్లీయదితికడుపున దేవతలు పుట్టి రని భావము; అనఁగా నదితి దేవతలతల్లి యనుట.

మ. కని సత్కారరమణీయుతంబుగ నమస్కారంబు గావించి భౌ
మనిశాటాహృతకుండలద్వయము నాత్మస్వర్ణచేలాగ్రబం
ధనము న్వీడ్చి యొసంగ నందుకొని మోదం బంది యానందనం
దను దీవించుచుఁ జెంగట న్నిలిపెఁ జింతారత్నపీఠంబునన్. 25

(వ్యా) భౌమ...ద్వయము:—భౌమనిశాట — నరకాసురునిచేత; (భౌమ — భూమికుమారుఁడగు నరకుఁడు; నిశాట—అసురుఁడు); ఆహృతకుండలద్వయము—అపహరింపఁబడిన కుండలముల జంటను; ఆత్మస్వర్ణచేలాగ్రబంధనమున్ — తనబంగరు పుట్టపుఁ గొనయందలి ముడిని; వీడ్చి—విప్పి.

అదితి శౌరిం గీర్తించుట

క. మే నిమిరి శిరసు మూర్కొని
దానవపరిపంథి యెంత ధన్యనొ నియత
ధ్యానపరు లయిన మునులుం
గానని నినుఁ గంటి మంటి గతకల్మష నై. 26

(వ్యా) మే—మేనును; రూపాంతరములు మెయి, మై; నిమిరి—తడవి; శిరసు మూర్కొని—మూర్ధాఘ్రాణము చేసి; ఈకార్యములు వాత్సల్యసూచకములు; మంటిన్—బ్రతికితిని.

ఉ. సర్గ మొనర్తు బ్రహ్మ యన సత్కృపఁ బెంతు జనార్దనుండ నా
భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బోరణ సేయుదు విజ్జగంబు నై
సర్గికలీల నొక్క మఱి సౌఖ్యము నొందుదు కేవలంబు దో
రర్గళభూషణీకృతరథాంగ నినుం గొనియాడ నేర్తునే. 27

(వ్యా) దోరర్గళ...రథాంగ:—దోరర్గళ — గడియలవంటి బాహువునందు; భూషణీకృత—ఆభరణముగా నుంచఁబడిన; రథాంగ—చక్రముగలవాఁడా; అనఁగాఁ జక్ర

హస్తుఁడౌ యనుట; ఇజ్జగంబును — ఈప్రపంచమును; బ్రహ్మయనన్ — బ్రహ్మ యను పేరుతో; సర్గ మొనర్తు — సృజింతువు; జనార్దనుండు నాన్ — విష్ణు వను పేరుతో; పెంతువు — పాలనముసేయుదువు; భర్గుఁ డనంగన్ — శివుఁ డను పేరుతో; క్రమ్మఱన్ — మఱల; హారణసేయుదువు — మ్రింగుదువు. (అనఁగా లయము నొందింతువని భావము); ఒక్కమఱి — ఒక్కసారి; నైసర్గికలీలన్ — స్వాభావికలీలతో; కేవలంబు — నిరుపాధికుఁడవై; అనఁగా జగత్సృష్టిస్థితిసంహారనిమిత్తము లైన బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపములను ధరింపక శుద్ధవిరాట్పురుషుఁడై యనుట; సౌఖ్యమునొందుదువు — ఆనంద స్వరూపుఁడవై యుందువు;

(వి) పరమేశ్వరుఁ డొక్కఁడే త్రిమూర్తులతోఁ బ్రపంచసృష్టిస్థితిలయములఁ గావించునని వేదాంతములు నుడువుచున్నవి. ఈ యర్థమునే 'తిసృభి స్త్వ మవస్థాభి ర్మహిమాన ముదీరయన్, ప్రళయస్థితిసర్గాణా మేకః కారణతాంగతః' అని కాళిదాసుఁడు కుమారసంభవమునందు వచియించి యున్నవాఁడు.

## అవతారవర్ణనము

ఉ. వాలముతాఁకున న్గిరులు వజ్రనిపాతము సంస్మరింపఁ బె
న్వాలుగ వై మహార్ణవమునం దొలుఁబల్కులదొంగరక్కసున్
వాలికవంకవాఁడిగతి వ్రచ్చి వెస న్నిగమాలిఁ దమ్మిపూఁ
జూలికిఁ దెచ్చి యీవె త్రిదశు ల్గొనియాడ మురాసురాంతకా. 28

ఈపద్యమునందు మత్స్యావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) వాలముతాఁకునన్ — తోఁకవలనిదెబ్బచే; గిరులు, వజ్రనిపాతమును, స్మరింపఁగాన్ — కొండలు వజ్రాయుధఘాతమును దలంపఁగా; మత్స్యావతారుఁడైన విష్ణుదేవుని వాలపుదెబ్బలు సముద్రమందలిగిరులకు వజ్రాయుధఘాతములవలె నుండె నని భావము; పెన్వాలుగవై — పెద్దవాలుఁగయనుచేఁపవై; మహార్ణవమునన్ — గొప్పసముద్రమునందు; తొలుఁబల్కుల దొంగరక్కసున్ — వేదములను దొంగిలించిన సోమకాసురుని; వాలికవంకవాఁడిగతిన్ — వాలిక — పొడవైన; వంక — పార్శ్వమందలి; వాఁడి — తీక్ష్ణమైన; గతిన్ — కఱకుగానుండు ఱెక్కచేత; వ్రచ్చి — చీల్చి; నిగమాళిన్ — వేదసమూహమును; తమ్మిపూఁజూలికిన్ — బ్రహ్మకు.

చ. సురనికరంబు రక్కసులుఁ జుట్టము లై యమృతాభిలాష మం
దరగిరిఁ జిల్వరాచతరిత్రాట బిగించి పయఃపయోధి ని
ర్భరగతిఁ ద్రచ్చుచో నడుగువట్టిన తద్గిరి యెత్తవే ఢులీ
పరివృఢమూర్తి వై కపటపద్మముఖీత్వ విమోహితాసురా. 29

ఈపద్యమునందుఁ గూర్మావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) కపట........సురా—కపటపద్మముఖీత్వ—మాయావనితాత్వము చేత; అనఁగా మాయాకల్పితమైన మోహినీరూపముచేత; విమోహిత—అవివేకులుగాఁ జేయఁబడిన; అసుర—రాక్షసులుగలవాఁడా; చుట్టములై—హితులై (ఒద్దికతో ననుట); చిల్వరాచ తరిత్రాటన్—వాసుకియనెడు కవ్వపుఁద్రాటితో; బిగించి—బంధించి; చిల్వ—చిలువ (చీలిన, వా—నోరుగలిగినది; (పామనియర్థము); ఇట్టిపదము 'నలువ' నాలుగువాతులు గలవాఁడు బ్రహ్మయని యర్థము; పయఃపయోధిన్—క్షీరసముద్రమును; త్రచ్చుచోన్—చిలుకునప్పుడు; అడుగువట్టిన—క్రిందికిఁబోయిన; తద్గిరిన్—మందరగిరిని; ఢులీపరివృఢమూర్తివై—మేటి తాఁబేటి యాకారము గలవాఁడవై; 'ఎత్తవే' అను పదముతో నన్వయము; ఢులీ—ఆడుతాఁబేలు; 'కమఠీఢులీ' అని యమరుఁడు; 'డులీ' యని రూపాంతరము; పరివృఢ—పతి; వ, బ, లక భేదముగాన 'పరిబృఢ యని రూపాంతరము.

క. విలయోల్బణజలనిధిప
ల్వలమున నిల మునుఁగ నేకలమ వై దంష్ట్రాం
చలమునఁ దాల్పవె నీ వా
బలిసద్మముఁ దూఁటి భుజగపర్యంకశయా. 30

ఈపద్యమున వరాహావతారము వర్ణితము.

(వ్యా) భుజగపర్యంకశయా—శేషతల్పమునందుఁ బవ్వళించియున్నవాఁడా; విలయోల్బణ జలనిధి పల్వలమునన్—విలయ—ప్రళయకాలమునందు; ఉల్బణ—ఉప్పొంగిన (ప్రకట మైన); 'స్ఫుటం ప్రవ్యక్త ముల్బణం' అని యమరుఁడు; జలనిధి—సముద్రమనెడు; పల్వలమునన్—పడియయందు; ఇల—భూమి; ఏకలమవు—వరాహమవు; దీనికిఁ బై పద్యమునందును వరాహావతారమే వర్ణింపఁబడి యుండుటచే నీపద్యము ప్రక్షిప్తమని తోఁచుచున్నది. సరసముగ నుండుటచే వ్యాఖ్యానము చేయఁబడినది.

చ. పెకలి యజాండకర్పరము బీటలు వాఱఁగ మేను వెంచి యా
మకరనికేతనోదరనిమగ్నమహీమహిళాలలామఁ గే
తకముకుళాగ్రసంగత మదభ్రమరీసమరీతి గాఁగఁ గొ
మ్ముకొనఁ దగిల్చి యెత్తఁ గిటిమూర్తిని దాల్చితి గా జనార్దనా. 31

(వ్యా) పెకలి–పగిలి; 'పికిలి' అని రూపాంతరము; అజాండకర్పరము–బ్రహ్మాండభాండము; బీటలువాఱఁగన్–బద్దలుకాఁగా; మేను వెంచి–శరీరమును బొడిగించి; మకర.........లలామ–మకరనికేతన–సముద్రముయొక్క; ఉదర–మధ్యమందు; నిమగ్న–మునిఁగిన; మహీ–భూమి యనెడు; మహిళాలలామన్–స్త్రీరత్నమును; కేతక.........రీతి గాఁగన్–కేతకముకుళ–మొగలిమొగ్గయొక్క; అగ్ర–కొనయందు; సంగత–కూడిన; మదభ్రమరీ–మదించిన యాఁడుతుమ్మెదతో; సమరీతి గాఁగన్–సమానమయి యొప్పఁగా; కొమ్ముకొనన్, తగిల్చి, ఎత్తన్,–; కిటిమూర్తిని–వరాహమూర్తిని; దాల్చితిగా–గరించితివి గదా;

అలంకారములు–ఉపమానము; రూపకము.

చ. సట లిట మాను రోరి హరి సర్వమయుం డనె యంచుఁ బట్టితోఁ
జిటచిట లాడి యిందుఁ గనఁ జేయుము నీ వని దైత్యుఁ డాడినం
బటపట ఱొతికంబ మిరువాయలు గా నరసింహమూర్తి వై
కుటిలనఖాగ్రకుంచికల గ్రువ్వవె వానియురగకవాటమున్. 32

ఈపద్యమునందు నరసింహావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) సటలు–నీనేర్పుమాటలను; ఇటన్–ఇఁకను; మానుర–విడిచిపెట్టురా; 'ఓరీ' యని హిరణ్యకశిపుఁడు తన కుమారుఁడగు ప్రహ్లాదుని సంబోధించుమాట; చిటచిటలాడి–కోపపడి; దైత్యుఁడు–హిరణ్యకశిపుఁడు; పటపటన్–పగులుచుండునట్లు అను కరణము; ఇరువాయలుగాన్–రెండుబద్దలుగా; కుంచికలన్–బీగములు తెఱచుటకు సాధనమగు తాళపుఁజెవులను; గ్రువ్వవె–గ్రుచ్చి తెఱచినావు కదా.

ఇందు రౌద్రరసము వర్ణింపఁబడినది. దీనికి శార్దూలవిక్రీడితము, మత్తేభవిక్రీడితము, స్రగ్ధర మొదలగువృత్తములు యుక్తముగా నుండును. చంపకమాలావృత్తము శృంగారరసోచితము. ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకులని పేరందిన యీకవి రౌద్రరసమును ముద్దుగానే వర్ణించెను.

మ. నను నా కశ్యపకామినీమణులలోన న్ధన్యంగాఁ జేయ మ
త్తనయవ్యాజము దాల్చి వామనునిచందాన న్బలి న్మెట్టవే
ఘనమార్గోన్నమితాంఘ్రిపద్మమునకుం గంజాప్తుఁ డంశువ్రజం
బను కింజల్కపరంపర ల్మెఱయ నుద్యత్కర్ణికం బోలఁగన్. 33

(వ్యా) కశ్యపకామినీమణులలోనన్ — కశ్యపునిభార్య లగు దితి యదితి యను మాయిరువురిలో; ననున్ ధన్యంగాఁజేయన్—నన్నుఁ గృతార్థురాలినిగాఁ జేయుటకై; మత్తనయవ్యాజముఁ దాల్చి—నాపుత్రుఁడను నెపమును వహించి; అనఁగా నుపేంద్రుఁడయి పుట్టియని భావము; వామనునిచందానన్—పొట్టివడుగు రీతితో; ఘన...... పద్మమునకున్——ఘనమార్గ—మేఘమండలమువఱకు; ఉన్నమిత—పైకెత్తఁబడిన; అంఘ్రిపద్మమునకున్—పాదకమలమునకు; అంశువ్రజం బను కింజల్కపరంపర ల్మెఱయన్—కిరణసమూహము లనెడు కేసరముల వరుసలు ప్రకాశింపఁగా; కంజాప్తుఁడు—సూర్యుఁడు; ఉద్యత్కర్ణికం బోలఁగన్—మెఱయుచున్న తామరదుద్దువలె నొప్పఁగా; బలిన్, మెట్టవే—బలిచక్రవర్తి నణఁగఁద్రొక్కితివి కదా.

మ. ఘనదోర్దండనటత్కుఠారమున వీఁక న్రాజహంసాలిఁ దు
త్తునియ ల్సేసియుఁ గ్రౌంచరంధ్రమునఁ దోడ్తో రాజహంసాలి మే
దినికిం దెచ్చితి కార్తవీర్యభుజపంక్తిం జక్కఁ గావించి తం
బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు నిమ్ముం గొంటి వీ వమ్మనన్.34

ఈపద్యమునందుఁ బరశురామావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) ఈవు—నీవు (కర్తృపదము); ఘనదోర్దండ నటత్కుఠారమునన్——ఘన—గొప్పది యగు; దోర్దండ—కఱ్ఱవంటి బాహువునందు; నటత్ — చలించుచున్న; కుఠారమునన్—గొడ్డలిచేత; వీఁకన్—శౌర్యముతో; రాజహంసాళిన్—రాజశ్రేష్ఠులసమూహములను; తుత్తునియలు చేసియున్—ఖండఖండములుగా నఱికిచంపియు; క్రౌంచరంధ్రమునన్—క్రౌంచపర్వతమందు రంధ్రమొనరించి దానిమార్గముగా; తోడ్తోన్—వెనువెంట; రాజహంసాళిన్ — రాజహంసపక్షుల వరుసను; మేదినికిం దెచ్చితి — భూమిమీఁదికి రప్పించినావు.

ఇక్కడఁ బరశురాముఁడు క్రౌంచపర్వతమునందు రంధ్ర మొనరింపఁగా దాని కవ్వలి మానససరోవరమున నుండు రాజహంసపక్షు లారంధ్రమార్గమున భూమికి వచ్చుచుఁ బోవుచునుండు నను పురాణకథ యనుసంధేయము.

మున్ను భగవంతుఁడగు పరమశివునియొద్ద ధనుర్వేదము నభ్యసించుచుండిన పరశురాముఁడు క్రౌంచదారణుఁడగు కుమారస్వామిపై నీసుచేతఁ గ్రౌంచభూధరమును మిగుల వాఁడియగు నారసముచే విలాసార్థము భేదించి రంధ్రముగావించెననియు నమ్మార్గమున మానససరోవరమున నున్న హంసలు వచ్చుచుం బోవుచుండుననియుఁ బురాణకథ కలదు. కాళిదాసు మేఘసందేశమునం దీవిషయము నిట్లు చెప్పెను—

"ప్రాలేయాద్రే రుపతట మతిక్రమ్యతాం స్తాన్ విశేషాన్,
హంసద్వారం భృగుపతి యశోవర్త్మ యత్క్రౌంచరంధ్రం."—

కార్తవీర్య భుజషండ్కిన్—కార్తవీర్యుని భుజముల వరుసను; చక్కుగావించితి—నశింపఁజేసితివి; అంబునిధిన్—సముద్రమునందు; ఆశ్రమంబునకున్—వసియించుటకు; అమ్మునన్—బాణముచేత; ఇమ్మున్, కొంటివి—స్థానమును నిర్ణయించుకొంటివి; అనఁగా సముద్రపు నీటిపై బాణమును బ్రయోగించి యానీటిని గొంచె మావలఁ దటిమి యాభూమిని దనకు వాసస్థానముగా నేర్పఱచుకొనె నని భావము.

ఈకథయు మహాభారతమున నరయునది.

అదియే యిప్పుడు కేరళదేశ మనంబడు.

మ. అరవిందాననఁ గోలుపోయిన యవజ్ఞావాప్తిచే వీరవా
నరసైన్యప్రకరంబు నేలి జలధి న్బంధించి లంకాపురీ
శ్వరకంఠాటవి నేర్చి రౌప్యగిరిలజ్జాపంకముం గీర్తిని
ర్ఝరపూరంబులచేఁ దొలంచితి గదా రామాభిధానంబునన్. 35

ఈపద్యమునందు రామావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) అరవిందాననన్—కమలవదనయగు సీతను; కోలుపోయిన—పోఁగొట్టుకొనిన; అవజ్ఞావాప్తిచేన్—అవమానప్రాప్తిచేత; వీరవానరసైన్యప్రకరంబున్—శూరులగు వానరసేనా సమూహములను; ఏలి—పాలించి (అధిపతియై యని భావము); జలధిన్, బంధించి—సముద్రముమీఁద సేతువును గట్టి; లంకాపురీశ్వరకంఠాటవిన్—రావణుని కంఠములను నడవిని; ఏర్చి—దహించి; రామాభిధానంబునన్—శ్రీరాముఁడను పేరుతో; రౌప్యగిరిలజ్జాపంకమున్—కైలాసపర్వతమునకు సంభవించిన లజ్జయను బురదను; కీర్తినిర్ఝరపూరంబులచేన్—యశస్సను సెలయేటి వెల్లువలచే; తొలంచితి గదా—పోఁగొట్టితివి గదా; అనఁగా శ్రీరాముఁడు రావణుని జంపుటయే గాక తొల్లి రావణునిచేఁ బెకలింపఁబడిన కైలాసమునకుఁ గలిగినలజ్జను దనకీర్తి యనెడు సెలయేటిప్రవాహముచేఁ బోఁగొట్టె నని భావము.

చ. అలుకఁ బ్రలంబదానవుని ప్రాణము గొంటి కళిందనందనా
సలిలభరప్రవాహరభసంబు మరల్చితి పట్టిఁ బ్రోవ నాఁ
గలిమొన హస్తినాపురి పెకల్చితి కౌరవవీరు లెల్ల బె
గ్గిల నలరేవతీరమణికిం బతి వై యదువంశమౌక్తికా. 36

ఈ పద్యమునందు బలరామావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) యదువంశమౌక్తికా_యదువంశ మనెడు వెదురునందు ముత్యమువలెఁ బుట్టినవాఁడా; వంశ_అన్వయము-వెదురు; శ్లిష్టపరంపరితరూపకము; ప్రలంబదానవుని ప్రాణమును గొంటివి_ప్రలంబాసురుని జంపితివి; కళింద.....రభసంబును___ కళిందనందనా_యమునా నదియొక్క; సలిలభర_నీళ్ల భారము గలిగిన; ప్రవాహ_వెల్లువయొక్క; రభసంబున్_వేగమును; మరల్చితి_త్రిప్పినావు; పట్టిఁ బ్రోవన్_కొడుకును గాపాడుటకై (సాంబుని ననుట); నాఁగలిమొనన్_నాఁగటికొనచేత; హస్తినాపురిని___; పెకల్చితివి_పెల్లగించితివి; (హస్తినాపురి — హాస్తినపురి యని రూపాంతరము); బెగ్గిలన్_భయపడఁగా;

లక్షణాపరిగ్రహము చేసి పలాయమానుఁడగు సాంబుని దుర్యోధనాదులు చెఱఁ బట్టఁగా బలరాముఁడు విడిపింపు మని కోరియుఁ గౌరవులు విడువక నిందించుటచేఁ గ్రోధావిష్టుఁడగు రాముఁడు హలాయుధమున హస్తినాపురమును గంగలోఁ గలుపఁ బూనఁగా నగరము తలక్రిందుగా నైనదను భాగవత దశమస్కంధకథ యిట ననుసంధేయము.

మ. త్రిపురస్త్రీలఁ బతివ్రతామణుల సారెం బుంశ్చలీవర్తనం
బుపదేశం బొనరించి బేల్పఱిచి వధ్యుల్గాని తద్భర్తలన్
ద్విపచర్మాంబరుచూపుటింగలమున న్వ్రేఁ త్రోచి పాటింపవే
కపటశ్రీజినరూపము న్భువనరక్షాజాగరూకేక్షణా. 37

ఈపద్యమున బుద్ధావతారము వర్ణింపఁబడినది.

(వ్యా) భువనరక్షాజాగరూకేక్షణా — లోకమును పాలించుటయందు మేలుకొనియుండుకన్నులు గలవాఁడా; అనఁగా నెల్లప్పుడును లోకములను రక్షించువాఁడా యనుట; త్రిపురస్త్రీలన్ — త్రిపురాసురపట్టణములందలిస్త్రీలను; సారెన్ — మాటిమాటికి; పుంశ్చలీ వర్తనంబును_జారత్వమును; బేల్పఱిచి_మోసపుచ్చి; వధ్యుల్ గాని తద్భర్తలన్_చంపుటకశక్యు లగు వారి పెనిమిటులను; అనఁగా రాక్షసు లని భావము;

ద్వీపచర్మాంబరు చూపుఱటింగలమునక్_శివుని ఫాలాగ్నియందు; వే, ద్రోచి_శీఘ్రముగాఁ బడద్రోసి; అనఁగా దహించి యనుట; 'వే' యను పదము కళగాని ద్రుతప్రకృతికము గాదు; కపటశ్రీజిన రూపముక్_మాయమగు బుద్ధదేవునిరూపమును; పాటింపవే_ధరింపలేదా.

(వి) విష్ణుదేవుని యవతారములు పది; మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, బుద్ధ, కల్కు లని యొకపక్షము.

'మత్స్యః కూర్మో వరాహశ్చ నరసింహోథవామనః
రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కిశ్చ తేదశ
ఏతేతు విభవావస్థా బ్రహ్మణః పరమాత్మనః.' అని పద్మపురాణోత్తరఖండమునఁ జెప్పఁబడి యున్నరీతిని బలరామునకు బదులు శ్రీకృష్ణుఁడు దశావతారములలోఁ జేరినవాఁడని మఱియొకపక్షము.

బుద్ధుఁడు—విష్ణుని దశావతారములలోఁ జేర్చి యీపద్యమున వర్ణింపఁబడినబుద్ధుఁడెవఁడని తర్కింతము. ఆదికాలంబునఁ దారకాక్షుఁడు, కమలాక్షుఁడు, విద్యున్మాలి యనుముగ్గురురాక్షసులు తపంబుచేసి యవధ్యు లగునట్లు బ్రహ్మవలన వరంబు వడసి త్రిపురంబుల నిర్మించుకొని దేవతలను హింసించుచుండిరనియు, వారును దత్పత్నులును వేదవిహిత సదాచార సంపన్నులై పాతివ్రత్యంబున నొప్పారుటవలన నజేయులై యుండిరనియు, దేవతలప్రార్థనంబున విష్ణువు మాయాసన్యాసియగు బుద్ధరూపంబుఁ దాల్చి యారక్కసులకు దురాచారంబులు బోధించి తత్కామినులకుఁ గామచారత్వంబు నుపదేశింప వార లమ్మాయకు లోఁబడి దుష్పథంబుల మెలంగఁజొచ్చిరనియుఁ, బదంపడి శంకరుఁడు దేవతల సాహాయ్యంబున వారిని త్రిపురంబులతోడ సంహరించి సురలకు హితం బొనర్చె ననియు, భాగవతపద్మపురాణంబులు నుడువుచున్నవి.

ఈ కలియుగంబునఁ గపిలవస్తునగరంబున శుద్ధోదనునకును మాయాదేవికిని సుతుండై జన్మించిన బుద్ధుఁడే విష్ణుని నవమావతారంబని కొందఱు తలంతురు. బౌద్ధశాస్త్రములవలన నిరువదియైదుగురు బుద్ధులుండిరనియు, వారిలో శౌద్ధోదనియగు శక్తిసింహుఁడు, సర్వార్థసిద్ధుఁడు, అర్కబంధుఁడు, గౌతముఁడు, నను నీనాలుగు పేరులతోఁ బరఁగునతఁడు కడపటివాఁ డనియు, నితఁడును విష్ణ్వంశసంభూతుఁడే యనియుఁ దెలియవచ్చెడు.

ఈపద్యమునందు వర్ణింపఁబడిన బుద్ధుఁడీ పంచవింశతిబుద్ధులకంటె భిన్నుఁడగు విష్ణుదేవుని సాక్షాదవతారం బని యూహింపఁ దగియున్నది.

## కృష్ణావతారవర్ణనము

### గణసమకదండకము

యదుతిలక, జగత్త్రయీనిర్మితిప్రక్రియాకర్మఠేందిందిరోద్భాసినాభీసరఃపద్మ, పద్మాసతీపాదపీఠాకృతిప్రస్ఫురత్కౌస్తుభాంకూరితాళీకబాలాతపద్యోత, పద్ద్యోతరంగిణ్యుదఞ్చాళిత్రైణాంకభృత్పాంసులక్లిష్టనేల్లజ్జటాజాల, జాలంధరోడ్యాణమూలాఖ్యబంధత్రయీబంధసంధుక్షిత స్పర్శనస్పర్శనిర్గ్రంథితగ్రంథిషట్కాంతరోన్నిద్రకద్రూసుతశ్రీముఖజ్వాలవల్లీపరిస్రంసమానేందునిష్యందసర్వాంగనిష్పంద యోగీంద్రహృద్వేదికావాస, యీవాసవాదుల్సరోజాసనుల్ మున్నుగాఁ జేసి సర్వంసహాభీరుభారంబుఁబోఁద్రోయవే యంచుఁ బ్రార్థించిన న్దేవకీదేవిగర్భంబునం దుద్భవం బంది బాహుద్వయద్వంద్వము న్నందకస్యందనాంగాబ్జకౌమోదకీశార్ఙ్గముఖ్యాయుధవ్రాతముం బీతకౌశేయము న్వత్సభాగంబునన్మించు శ్రీవత్సముం జూపినం దల్లి భీతిల్లుచుం గావు కావంగదే యన్న నీ వంతలోఁ గావు కావంచు నేడ్పుల్దలిర్పం గసుంగందవై తండ్రియత్నంబున న్నందగోష్ఠంబునం దున్నచో వ్రేత వై చేఁతిపాల్గ్రోల్ప నేతెంచు నాపూతనాభూతనారీకుచంబగ్రహస్తంబునం బట్టి తత్ప్రాణనిర్యాణశంఖంబు పూరించుచందంబునం గ్రుక్కలన్నొక్కి మక్కించియు, న్బండిరాకాసిఁ గీలూడఁగాఁ దన్నియు, న్వెన్న వేమాఱు గొల్లాడఁగా గొల్లయిల్లాండ్రు నందారవిందాస్యతో ఱట్టు గావించిన న్నిక్కపుంబట్టివే యంచు నిన్పట్టి చట్రోలితోఁ గట్టిన న్దిట్టవై కిట్టి పెన్మద్ది మద్దుల్వడం ద్రోచియు న్శైశవంబు న్విడంబింపవే, లేఁగలు న్గోపబృందంబు బృందావనారణ్యానాటి న్నటింపం జలత్కాకపక్షుంబుతో బర్హిబర్హావతంసంబుతోఁ మంజుగుంజాఫలోద్దామదామంబుతోఁ దానమానక్రియాశంసివంశంబుతో నేపు దీపించు నీప్రోపు వ్రేపాపలం గ్రేపుల న్గాప

కీత్యంబుగాఁ బాపి యాపద్మజుం డొక్కచో డాఁచిన న్వానిరూపంబు నీవై పునస్సృష్టి నాస్రష్టగర్వంబు ఖర్వంబుగాఁ జేయవే, తోయవే గోచ్ఛలద్వీచికా మర్దళధ్వాన మాగుబ్బగా నుబ్బునం గేళిఁ గాళిం దిలోఁ గాళియాహిస్ఫటారంగమధ్యంబునం దాండవం బాడవే, తోడిగోపాలకశ్రేణికి న్నీకు జన్నంబుల న్నీఁదుగా నున్నయన్నంబుల న్వంచితాత్మేశలై పంచలం జల్లు లంచీ మునిస్త్రీలకు న్నీలఁ గైవల్యముం గొల్ల యీవే, పెనుంజిల్వయై బల్విడిం జంగిలి న్మ్రింగు దైతేయువాత న్వడిం జొచ్చి మై పెంచి తత్కాయము వ్రెండు వాయ ల్వడం జించి గోపంక్తిఁ బోషింపవే, గుంపులై యుంపులం గూడి యాభీరు లాదేవతానేతకు జ్జాతర ల్సేయ వారించి తత్పూజన ల్నీవు గైకొన్న మేకొన్న పేరల్కతోఁ బుష్కలావర్తకాబ్దంబులం బంపఁగా నంపజాలంబుగాఁ గొండ లుర్లంగ వర్షించినం గాందిశీకత్వముం బొందునామండలం బ్రోవ గోవర్ధనం బెత్తవే మత్తవేదండ ముద్వృత్తి నెత్తమ్మిపూ వెత్తురీతి, న్నిలింపానిశారిష్టదారిష్టమాయాబలీవర్దముం బట్టి మర్దించి తంచు న్వడి న్వాకలాశ్వాకృతిం డాసినం గేశిజీవానిలంబు ల్భుజాదందశూకంబునం గ్రోలి నీ యావనోద్యద్భుజాగర్వముం జూపవే, శరదభినవసాంద్రచంద్రప్రభాధౌతభాస్వత్కళిందాత్మజాసైకతోత్సంగవీథిం ద్రిభంగ్యాకృతి న్నిల్చి యాకుంచితభ్రూవిలాసంబుతో మోము వామాంసముం జేరఁగా శోణదంతచ్ఛదాంతంబున న్వేణునాళంబు సంధించి రంధ్రాంతరన్యస్తహస్తాంగుళీపల్లవాగ్రంబు లల్లాడ మ్రోయించిన న్మత్తగోమంథనిష్పందగోబృందము న్వ్యక్తగోవర్ధనగ్రావనిష్యందము న్మందమందాంశుమన్నందనావేగముం గందళన్నీరసారణ్యజీర్ణాగముంగాఁ గదంబించు తత్పంచమారావము న్వించు నయ్యించువిల్కానికిం జిక్కి రాధాదిగోపావరోధాంగన ల్డాసిన న్రాససంక్రీడ మాయాసము

ల్లాసివై సౌఖ్యవారాశి నోలార్పవే, దర్పితాశేషదోషాచరాధీశ
దుస్సాధ మైయున్న నీవిక్రమక్రీడ వీక్షింప నక్రూరుచే మామ
విల్పించినం బోవుచోఁ ద్రోవ భావాతిగం బైననీదివ్యరూపంబుఁ
జూపం బరిభ్రాంతుఁడై యున్న మన్నింపవే వాని నీవానిఁగా, భోజ
భూజాని యుద్వేజనం బందఁ దద్రాజధానిం బ్రవేశించి యేతెం
చుచో ముందటం జందనాలేపము న్దర్శనం బిచ్చిన న్గుజ్జుప్రోయాలికి
న్నజ్జకం బైన యందంబు నొందింపవే, యాగపూజార్చితం బైన
కోదండము న్ఖండఖండంబుగాఁ జేయుచుం దద్ధనుర్దండ రక్షా
భటస్తోమ మస్త్రంబులం బెల్లుగా డొల్లఁగా వ్రేయుచు న్మల్లగర్జా
భుజాస్ఫాలనాభీల మై యుల్లసడ్డిండిమారావవాచాలమై నిగ్రహో
యాతరక్షోభటోదగ్రమై యున్న యయ్యుగ్రసేనాత్మజాస్థానిఁ జొ
త్తేరఁ దత్తోరణక్షోణి నాధోరణుం డుద్ధతిం బైపయిం గొల్పినం
బట్టపేనుంగుఁ జెండాడి గండస్రవద్దానపంకంబునం బుండ్రముం గుంభ
నిర్ముక్తముక్తావళిం గర్ణదామంబును న్గట్టి రక్తంబునం బట్టెమైపూఁత
యుం బ్రాఁతిగాఁ బూసి తద్దంతకాండంబు కేల న్గదాదండ మై
యుండఁగా జెట్టివై గిట్టి చాణూరు జానూరువు ల్వాఱుమాఱు
ల్వడిం ద్రిప్పి నీ వప్పళింప న్భయభ్రాంతుఁడై పాఱ నుంకించు
నక్కఱించుఁ గంసుం ద్రిలోకీనృశంసు న్నియుద్ధక్రియాపద్ధతిం గిక్కుస
న్గొంతుక్రో ల్నొక్కివే దేవతాదుందుభివ్రాతధింధింధిమిధ్వానగాన
స్వనోత్కర్షహర్షంబులం గల్పకద్రుప్రసూనాతివర్షంబులం బెల్లుగా
నెల్లలోకంబు లుల్లాసముం బొందఁగా వానిరాజ్యంబునం బూజ్యుఁగా
నుగ్రసేనుం బ్రతిష్ఠాపితుం జేయవే, దుష్టు నష్టాదశాక్షౌహిణీవా
హినీదుర్మదాంధు న్జరాసంధు భీమాపదేశంబునం జేసి శాసించి కౌం
తేయుచే రాజసూయంబు సేయించుచో జాత్యసూయ న్భయం బేది
చేదిక్షమావల్లభుం డెంతయుఁ ద్రుళ్లినం బ్రల్లదం బాడినం బల్లెరం

చెత్తి చిత్రంబుగాఁ దచ్చిరగకర్తనప్రౌఢి వర్తించి ధాత్రి న్వృథావాసుదేవప్రథాచండశౌండీరు నప్పౌండ్రుఁ జక్రాహతిం జక్కుగాఁ జేసి యీశానుఁ బోర న్మహాసేననాగాననవ్యూహసన్నాహముల్వీడ వెన్నాడి బాణాసురస్ఫారబాహాసహస్రచ్ఛిదాకేళిమై వాలి లోకంబుఁ బాలింపవే, ఘోరభౌమాసురగ్రామణీశిక్షకా, కౌరవాకర్షితద్రౌపదీరక్షకా, ఖేదసందగ్ధసాందీపసూనుప్రదా, వేదశాఖాశిఖాంచత్పవిత్రప్రదా, మాధవా సత్యభామాధవా. 38

ఈ దండకమునందుఁ గృష్ణావతారకథలు సంగ్రహముగా వర్ణింపఁబడినవి.

(వ్యా) యదుతిలక_యాదవవంశాభరణమా; జగత్రయీ.....పద్మ—

జగత్రయీ_ముల్లోకములను; నిర్మితిప్రక్రియా—సృజించు కార్యమునందు; కర్మఠ—కర్మనిరతుఁడగు, అనఁగా శ్రద్ధాళువయిన; ఇందిందిర_తుమ్మెదచే, అనఁగా బ్రహ్మచే నని భావము; ఉద్భాసి_ప్రకాశించుచున్న; నాభీసరఃపద్మ—నాభియనెడు కొలఁకునఁ బుట్టిన పద్మము గలవాఁడా; ఇందిందిరమనునెడ నారోప్యము బ్రహ్మయని గమ్యము; అనఁగాఁ గృష్ణునినాభి కొలనువలె నున్న దనియుఁ గొలఁకువంటి నాభి యందుఁ బద్మము పొడమె ననియు నాపద్మమునందు ముల్లోకములను సృజించు బ్రహ్మ పుట్టె ననియు భావము.

పద్మాసతీ.............ద్యోత—

పద్మాసతీ_లక్ష్మీదేవియొక్క; పాదపీఠాకృతి—పాదము లుంచుకొనెడుపీఠము వలె; ప్రస్ఫురత్_ప్రకాశించుచుండు; కౌస్తుభ_కౌస్తుభమణియందుండి; అంకూరిత_మొలకలెత్తిన, అనఁగాఁ బుట్టిన; అళీక_కపటమైన, అనఁగా మాయమగు; బాలాతప_లేఁతయెండలను; ద్యోత—కాంతులు గలవాఁడా; అనఁగా విష్ణువు వక్షస్థలమున ధరించియుండు కౌస్తుభమణి యాతని వక్షస్స్థలమున నున్న లక్ష్మీదేవికిఁ బాదపీఠమువలె నొప్పుచున్న దనియు నా మణియొక్క కాంతులు లేఁతయెండలో యనునట్లు ప్రకాశించుచున్నవనియును భావము.

పద్ద్యో.........జాల—

పత్_చరణమునందలి, అనఁగా విష్ణుదేవుని చరణమునందుఁ బుట్టిన; ద్యోతరంగిణీ_ఆకాశగంగయొక్క; ఉద_జలకములచేత; క్షాళిత_కడుగఁబడిన; ఏణాంకభృత్_(జింక చిహ్నముగాఁ గలచంద్రుని ధరించిన) శివునియొక్క; పాంసుల—దుమ్ము

నించిన; క్లిష్ట—చిక్కుపడిన; వేల్లత్—కదలుచుండు; జటాజాల—జడలగుంపులు గలవాఁడా; అనఁగా శివుఁడు జటాజూటమునందు ధరించిన గంగానది విష్ణుపాదమునుండి పొడమె నని భావము.

"గంగా విష్ణుపదీ జహ్నుతనయా సురనిమ్నగా" అని యమరుఁడు.

జాలంధర.........వాస—

జాలంధరోడ్యాణమూలాఖ్యబంధత్రయీ—జాలంధరబంధము, ఉడ్యాణబంధము; మూలబంధము, అను పేరులు గల యోగశాస్త్రోక్తము లగు మూఁడుబంధములయొక్క; బంధ—(శరీర) నియమనముచేత; సంధుక్షిత—రేపఁబడిన; స్పర్శన—వాయువుయొక్క ('శ్వసనః స్పర్శనో వాయుః' అని యమరుఁడు); స్ఫూర్త్య—పోఁకుటచేత; నిర్గ్రంథిత—(ముళ్లు) విప్పఁబడిన; గ్రంథిషట్క—ఆఱుగ్రంథులయొక్క (గ్రంథి—ముడి); (అనఁగా యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడిన మూలాధారాది షట్చక్రములు); అంతర—మధ్యమునందు; ఉన్నిద్ర—మేలుకొన్న అనఁగా వికసించిన; కద్రూసుత—పాముయొక్క (అనఁగా నిక్కడఁ గుండలినీశక్తి యనుట); శ్రీముఖ—మహిమ గలముఖమునందలి; జ్వాలవల్లీ—తీఁగవలె నుండు తేజస్సునుండి; పరిస్రంసమాణ—జాఱుచున్న; ఇందు నిష్యంద—అమృతముచేత; సర్వాంగ—సర్వావయవములయందు; నిష్పంద—చలింపని, అనఁగా నిశ్చలు లనుట; యోగీంద్ర—యోగిశ్రేష్ఠులయొక్క; హృద్వేదికా—హృదయపీఠము; ఆవాస—ఉనికిపట్టుగాఁ గలవాఁడా;

అనఁగా జాలంధరము మొదలగు యోగబంధనియమములు చేసి ప్రాణాదివాయువులను గదల్చుటచే మూలాధారాది షట్చక్రములయందుఁ గుండలినీశక్తినిఁ బ్రసరింపఁ జేసి దానిచేఁ బొడము నమృతముఁ బానముచేయుచు నిశ్చల మగుసమాధియోగముచే నొప్పారుయోగీశ్వరులమనంబులందు ధ్యానింపఁబడువాఁడా.

జ్వాల యనుశబ్దము స్త్రీలింగముగా నున్నను బుంలింగముగాను గలదు. "జ్వాలమాలాకులంభాతి విశ్వస్యాయతనం మహత్." అని శ్రుతి.

'దహనదహనజటాలజ్వాలజాలాహతానాం' —అని భామినీవిలాసమునందు.

ఇక్కడ జాలంధరాదు లగు యోగబంధములును మూలాధారాదిషట్చక్రములును నిరూపింపఁబడుచున్నవి.

యోగబంధములు మూఁడు. ఉడ్డీయానము, మూలము, జాలంధరము, అని వాని పేరులు. వీని లక్షణములు:—

బద్ధో యేన సుషుమ్నాయాం ప్రాణస్తూడ్డీయతే యతః
తస్మా దుడ్డీయనాఖ్యోఽయం యోగిభి స్సముదాహృతః

ఉడ్డీనం కురుతే యస్మా దవిశ్రాంతం మహాఖగః
ఉడ్డీయానం తదేవస్యా త్తత్రబంధోఽభిధీయతే.

ఉదరే పశ్చిమంతానం నాభేరూర్ధ్వం చ కారయేత్
ఉడ్డీయానోఽహ్యసౌబంధో మృత్యుమాతంగ కేసరీ.

పార్ష్ణి భాగేన సంపీడ్య యోని మాకుంచయే ద్దృఢం
అపాన మూర్ధ్వ మాకృష్య మూలబంధోఽభిధీయతే.

అధోగతి మపానంవా ఊర్ధ్వగం కురుతే బలాత్
ఆకుంచనేన తం ప్రాహు ర్మూలబంధం హి యోగినః.

కంఠ మాకుంచ్య హృదయే స్థాపయే చ్చిబుకం దృఢం
బంధో జాలంధరాఖ్యోఽయం జరామృత్యువినాశకః.

బధ్నాతిహి శిరాజాల మధోగామి నభోజలం
తతో జాలంధరో బంధః కంఠదుఃఖౌఘనాశనః.

షట్చక్రములు—

మూలాధారస్వాధిష్ఠానమణిపూరకానాహత విశుద్ధాజ్ఞ లనునాఱును షట్చక్రములనఁబడును. ఈషట్చక్రములయందే గంథులునుగలవు. యోగశాస్త్రమునందు గ్రంథిత్రయమే ప్రదిపాదితము. కాని షడ్గ్రంథు లని సామాన్యముగాఁ జెప్పఁబడలేదు.

గ్రంథిత్రయము—

బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి యని వాని పేరులు.

'మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథివిభేదినీ
ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథివిభేదినీ' అని లలితాసహస్రనామమునందు.

గ్రంథిషట్క మనఁగాఁ బూర్వోక్తగ్రంథిత్రయమందు నొక్కొక్కదాని యందు రెండేసి గ్రంథులుగలవు కావున నాఱుచక్రములందు నాఱుగ్రంథులు గలవని యొఱుంగునది. వీనింగూర్చి తెలియఁదగిన యంశములు పెక్కు లున్నను గ్రంథవిస్తరభీతిచే

నవి యిచట వివరింపఁబడవయ్యె. యోగశాస్త్రమునందును మంత్రశాస్త్రమునందును విపులముగాఁ దెలియనగు.

'ఈశావాసవాదుల్' అను పదము మొదలు 'విడంబింపవే' అను పదమువఱకు నొక వాక్యము.

సర్వంసహాభీరు—సర్వంసహా—భూమి; భీరు—భీతురాలు; సర్వంసహాభీరు—భూమి యనెడు భీతురాలియొక్క; అనఁగా భీతురాలగుభూమియొక్క; భారంబున్—బరువును; 'నందక'—విష్ణుదేవునికత్తిపేరు; స్యందనాంగ—(రథాంగ), చక్రము; అబ్జ—శంఖము; కౌమోదకీ—విష్ణుదేవునిగదపేరు; శార్ఙ్గ—విష్ణుదేవుని వింటిపేరు; పీతకౌశేయము—కౌశేయము, పట్టువస్త్రము; పీతాంబరము; వత్సభాగంబునన్—వక్షస్స్థలమునందు, 'ఉరోవత్సంచ వక్షంచ' అని యమరుఁడు; శ్రీవత్సము—విష్ణుదేవునిఱొమ్ముమీఁదిమచ్చకు శ్రీవత్సమని పేరు; కావు కావంగదే—కావు—కావుము; ప్రార్థనార్థక 'ము' వర్ణకమునకు లోపము; కావంగదే—కావుము; ప్రార్థనార్థకమునందు 'అన్' ప్రత్యయమును, దానిమీఁదఁ 'గదా' 'ఏ'యను ప్రత్యయములును వచ్చినవి; కావుకావంచున్—శిశువు లేడ్చుటయందలియను కరణము; కసుంగందవు—పసికూనవు; నందగోష్ఠంబు—నందునియొక్క ఆవులపల్లెలో; వ్రేతయై—గొల్లదియై; చేఁతిపాలు—చేఁదుగలపాలును; అనఁగా విషపుఁబాలు ననుట; క్రోల్పన్—త్రాగించుటకు; తత్ప్రాణనిర్యాణశంఖంబు—ఆపూతనప్రాణము పోవునప్పుడూఁదెడుశంఖము; పూరించు—ఊఁదు; ఈవాక్యమునందుత్ప్రేక్షాలంకారము; మక్కించినన్—చంపియుఁ; బండిరాకాసిన్—శకటాసురుని; కీలూడఁగాన్—సంధిబంధము లెడలునట్లు; అట్టు—నింద; పెన్మద్దివద్దుల్—గొప్పవియగు జంటగానుండు మద్దిమ్రాఁకులకును; అనఁగా నర్జునవృక్షములను; విడంబింపవే—ప్రకటింపలేదా;

'లేఁగలన్' అనుపదము మొదలు 'చేయవే' అనుపదమువఱకు నొకవాక్యము.

లేఁగలన్—దూడలును; కాకపక్షంబు—పిల్లజుట్టు; బర్హి బర్హావతంసంబుతోన్—శిరోభూషణముగా ధరించికొనిన నెమలిపింఛముతో; మంజుగుంజాఫలోద్దామదామంబుతోన్—మనోహరమగు గురిగింజదండలు; తానమాన.....వంశంబుతోన్—తాన—స్వరభేదములచేఁ బ్రవర్తించురాగములయొక్క; మానక్రియా—పరిమాణక్రియలను; అనఁగా నిరూపించుటల ననుట; శంసి—పలుకునట్టి; వంశంబుతోన్—పిల్లనఁగ్రోవితో; తానమనఁగా స్వరాంతరప్రవర్తకమగురాగము; శ్రుతిప్రవృత్త్యాదిహేతువగుస్వరవిశేషము; నీప్రాపు—నీవురక్షించుచున్న; వ్రేపాపలన్—గొల్లపిల్లవాండ్రను; క్రేపులన్—ఆవుదూడలను; వైపరీత్యంబుగాన్—ఎడఁబాయునట్లుగా ననుట; దాఁచినన్—మఱుఁగుపఱపఁగా; దాఁచినన్, డాఁచినన్, అని రూపాంతరము; డాఁగు, (దాఁగు) ధాతువున కిది ప్రేరణార్థకము;

తెనుఁగుపదములకుఁ గొన్నియెడల 'ద' కారమునకు; 'డ' కారము వచ్చును; ఉ. దక్కు. డక్కు; "డక్కెనురాజ్యమంచు నకటా యిటు తమ్మునిభాగమీక నీ, వెక్కటి మ్రింగఁ జూచె దది యె ట్లఱుఁగున్".........ఉద్యోగపర్వము. ఆ. 2.

స్రష్ట — బ్రహ్మయొక్క; ఖర్వంబుగాన్ — నశించునట్లు; ఈవాక్యమునం దంతటను వృత్త్యనుప్రాసము ఛేకానుప్రాసమును దెలియునది,

'తోయవేగ' అను పదము మొదలు 'తాండవం బాడవే' యనువఱకు నొకవాక్యము.

తోయ......ధ్వానము — తోయవేగ — నీళ్ల వేగముచేత; ఉచ్చలత్ — ఉప్పొంగుచున్న; వీచికా — అలలయొక్క; మర్దళధ్వానము — మృదంగధ్వని; అగుబ్బుగాన్ — అతిశయించఁగా; ఉబ్బునన్ — ఉత్సాహముతో; స్ఫటా — పాముపడగ;

'తోడిగోపాలక' మొదలు 'గొల్లయీవే' యనువఱకు నొకవాక్యము.

మీఁదుగానున్న — దేవతలకని నియమించిన ముడుపగు; అందీన్ — అందియ్యఁగా; అందిచ్చుధాతువు తుమున్నర్థకరూపము; ఇట 'అందిచ్చు' అనునది శబ్దపల్లవం బగు నొకధాతువు; కొందఱు దీనిని 'అంది + ఇచ్చు' అని పదవిభాగముచేసి క్త్వార్థకేకారసంధికి నుదాహరణముగాఁ జూపెదరు; అది నిరాదరణీయము.

'పెనుంజిల్వ' యను పదము మొదలు 'పోషింపవే' యనువఱకు నొకవాక్యము.

పెనుంజిల్వ — పెనుఁబాము; బల్విడిన్ — ఉద్ధతితో; జంగిలిన్ — పశుసమూహమును.

'గుంపులై' అను పదము మొదలు, 'ఎత్తవే' అను పదమువఱకు నొకవాక్యము.

దేవతానేతకున్ — దేవతలప్రభు వగు నింద్రునకు; జాత్రరల్ — ఉత్సవములు; మేకొన్న — వ్యాపించిన; పుష్కలావర్తకాబ్దంబులన్ — పుష్కలము, ఆవర్తకము అని పేరుగల మేఘములను; అంపజాలము — బాణసమూహము; కాందిశీకత్వము — భయపడి పాఱిపోవుటను; 'కాందిశీకో భయద్రుతః' అని యమరుఁడు;

'మత్తవేదండ' మొదలు 'చూపవే' అనువఱకు నొకవాక్యము.

నిలింప...బలీవర్దమున్ — నిలింప — దేవతలకు; అనిశ — యెల్లప్పుడు; అరిష్టద — అశుభమునొసర్చు (అనఁగా దేవతలను హింసించు); అరిష్ట — అరిష్టుఁ డను పేరుగల; మాయాబలీవర్దమున్ — కపటవృషభరూపధారి యగు రక్కసుని; ఘోటకాకృతిన్ — పోతరించిన గుఱ్ఱమురూపముతో; కేశిజీవానిలంబుల్ — కేశి యనురాక్షసునియొక్క ప్రాణవాయువులను; భుజాదండభోగంబునన్ — బాహు వను పామువలన; గ్రోలి — పీల్చి;

'శరదభినవ' మొదలు 'ఓలార్పవే' అను పదమువఱకు నొకవాక్యము.

శరద...వీథిన్ — శరత్ — శరత్కాలమునందలి; అభినవ — క్రొత్త; సాంద్ర — దట్టమైన (అనఁగాఁ బండిన); చంద్రప్రభా — వెన్నెలలచేత; ధౌత — శుభ్రము చేయఁబడినందున, (అనఁగా తెల్లఁగాఁ జేయఁబడినదై); భాస్వత్ — ప్రకాశించుచుండెడు; కళిందాత్మజా — యమునానదియొక్క; సైకత — ఇసుకదిన్నెలయొక్క; ఉత్సంగవీథిన్ — అగ్రప్రదేశమునందు; 'తుంగం నగోత్సంగమివారురోహ.' అని రఘువంశము; త్రిభంగ్యాకృతిన్ — మూఁడువంపులు గలిగిన యాకారముతో; త్రిభంగి — పాదవిన్యాసమునం దొకవంపు, నడుమునందలివం పొకటి, కంఠవిన్యాసమునందలి యొకవంపు, ఈ మూఁడువంపులు త్రిభంగి; నడుము, ఱొమ్ము, శిరస్సు, ఇవివంపులుగానుండుటయని కొందఱు; వామాంసమున్ — ఎడమభుజమును; శోణాదంతచ్ఛదాంతంబునన్ — శోణ — ఎఱ్ఱని; దంతచ్ఛద — పెదవియొక్క; అంతంబునన్ — కొలుకునందు; వేణునాళంబున్ — పిల్లనఁగ్రోవిని; సంధించి — చేర్చి, ఉంచి; రంధ్రాంతర...పల్లవాగ్రంబులు — రంధ్రాంతర — పిల్లనఁగ్రోవి బెజ్జములనడుమ; న్యస్త — ఉంచఁబడిన; హస్తాంగుళీ పల్లవాగ్రంబులు — చిగురుకొనలవంటి మృదువులగు చేతివ్రేళ్లు; ముక్తరోమంథనిష్పందగోబృందమున్; ముక్త — విడువఁబడిన; రోమంథ — నెమరువేయుటగల; అనఁగా నెమరువేయుటమాని యనుట; ఇది సుఖపారవశ్యసూచకము; 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగానరసం ఫణిః' అని యార్యోక్తి; నిష్పంద — చలింపని; గోబృందమున్ — ఆవులగుంపు గలదియును; వ్యక్తగోవర్ధనగ్రావనిష్యందమున్; వ్యక్త — కనఁబడు; గోవర్ధన — గోవర్ధనపర్వతమునందలి; గ్రావ — రాలయొక్క; నిష్యందమున్ — స్రవించుట కలదియును; అనఁగాఁ గృష్ణుని వేణుగానమాధుర్యముచే ఱాలు కరఁగెనని భావము; మందమంద...వేగమున్ — మందమంద — మిక్కిలి మెల్లనగు; అంశుమన్నందనా — యమునానదియొక్క; (అంశుమత్ — సూర్యుని; నందనా — కుమార్తె యగు యమునానది); వేగమున్ — ప్రవాహవేగముగలదియు; అనఁగా యమునానదియు నాగానమాధుర్యముచేఁ బారవశ్యముఁ జెంది మెల్లమెల్లఁగాఁ బ్రవహింపసాగెనని భావము; కందళత్...జీర్ణాగమున్ — కందళత్ — మొలకలెత్తుచున్న; నీరస — రసములేని, తేమలేని; అరణ్య — అడవియందలి; జీర్ణాగమున్ — ఎండినమ్రాఁకులు గలదియును; అనఁగా నెండినమ్రాఁకులును నాగానమాధుర్యముచేఁ జెమ్మ యొదవి మొలకలెత్తెనని భావము; కాన్ — అగునట్లు; కదంబించు — మనోహరమై వెలయు; తత్పంచమారావమున్ — (ఆ పిల్లనఁగ్రోవియొక్క) పంచమస్వరమును; "పికః కూజతి పంచమం" అనియుండుటచేఁ బంచమ మనఁగాఁ గోయిలయెలుఁగువంటి మధురస్వరము. ఈ స్వరము శరీరమునం దైదుప్రదేశములయందుం దుత్పత్తి యగును.

దీనికిఁ బ్రమాణము—

"వాయు స్సముద్గతో నాభే రురో హృత్కంఠమూర్ధసు, విచర న్పంచమస్థాన ప్రాప్త్యా పంచమ ఉచ్యతే."

'కోకిలో రౌతి పంచమం' అని నారదునిసంగీతశాస్త్రము.

ఇంచువిల్కానికిన్—మన్మథునికి; చిక్కి—వశలయి; అవరోధాంగనల్—అంతఃపుర కాంతలు; రాససంక్రీడన్—రాసక్రీడ యను నొకక్రీడావిశేషముచేత; ఓలార్పవే—సంతసింపఁ జేయలేదా.

రాసక్రీడాలక్షణము:—

"రాసోత్సవ స్సంప్రవృత్తో గోపీమండలమండితః
యోగేశ్వరేణ కృష్ణేన తాసాం మధ్యే ర్ద్వయో ర్ద్వయోః
ప్రవిష్టేన గృహీతానాం కంఠే స్వనికటం స్త్రియః."

అని భాగవతము, స్కంధము 11–పూ. భా. 33.

"అంగనామంగనా మంతరే మాధవో, మాధవంమాధవం చాంతరేణాంగనాః
ఇత్థ మాకల్పితేమండలే మధ్యగ స్సంజగౌ వేణునా దేవకీనందనః."

—అని కృష్ణకర్ణామృతము.

'దర్పితాశేష' మొదలు 'నీవాలిఁగా' అనువఱకు నొకవాక్యము;

దర్పిత — గర్వించిన; అశేష—ఎల్ల; దోషాచరాధీశ—రాక్షసశ్రేష్ఠులకు; దుస్సాధమై—సాధింపరానిదై (అనఁగా నభేద్యమైయనుట); మామ—కంసుఁడు; భావాతిగంబు—తలఁపునకు మించిన; అనఁగా నూహించుటకు శక్యముగాని; వానిన్—అక్రూరు ననుట;

'భోజభూజాని' మొదలు 'నొందింపవే' అనువఱకు నొకవాక్యము:—

భోజభూజాని—భోజభూపతి యగుకంసుఁడు; ఉద్వేజనంబందన్ — కలఁతనొందఁగా, (భయపడఁగా ననుట); తద్రాజధానిన్ — ఆతనిరాజధాని యగు మథురాపట్టణమున; దర్శనం బిచ్చినన్—కానుక నియ్యఁగా; 'దర్శనం బిచ్చె నెద్దానిఁ గోమటి క్రొత్త పాడసూప నేతెంచి భూభుజునకు.' అని శ్రీనాథుని కాశీఖండమున నాలుగవ యాశ్వాసమునఁ బ్రయోగము; గుజ్జు — పొట్టియగు (కుబ్జాశబ్దభవము); ప్రోయాలికిన్ — గృహిణికి; కుబ్జ యను పేరుగలస్త్రీకి; సజ్జకంబైన — మనోహరంబైన;

యాగపూజమొదలు 'ప్రతిష్ఠాపితుం జేయవే' యనువఱకొకవాక్యము.

యాగపూజార్చితంబైన—యాగపూజయందుఁ బూజింపఁబడిన; కోదండముఁ—వింటిని; ఖండఖండంబుగాన్—తునియలు తునియలుగాఁ జేయుచు; తద్ధను........మస్తంబులు — తద్ధనుర్దండ—ఆ కోదండముయొక్క; రక్షాభట—కావలివారియొక్క; స్తోమమస్తంబులన్ — సమూహములతలలను; మల్ల—జెట్లయొక్క; గర్జా—సింహనాదములు; భుజాస్ఫాలన—భుజములను దట్టుటలు (వీనిచే); ఆభీలమై—భయంకరమై; ఉల్లస......వాచాలమై — ఉల్లసత్ — ప్రకాశించుచున్న; డిండిమ—డిండిమ మనువాద్యవిశేషము యొక్క; ఆరావ— శబ్దములచేత; వాచాలమై—మ్రోఁగుచున్నదై; నిగ్రహో.........దగ్రమై—నిగ్రహ—మార్కొనుటకు, అడఁచుటకు; ఆయాత—వచ్చుచున్న; రక్షోభట—రాక్షససేనలచేత; ఉదగ్రమై — భయంకరమై; ఉగ్రసేనాత్మజాస్థానిన్ — ఉగ్రసేనుని కుమారుఁ డగు కంసుని కొలువుకూటమును; చొత్తేరన్ — ప్రవేశింపఁగా; తత్తోరణక్షోణిన్—ఆద్వారప్రదేశమునందు; 'తోరణోఽస్త్రీ బహిర్ద్వారం' అని యమరుఁడు; ఆధోరణుండు — మావటివాఁడు; కొల్పినన్ — మార్కొలుపఁగా; పట్టపేనుంగున్—కువలయాపీడమను కంసుని పట్టపుగజమును; చెండాడి—చంపి; పుండ్రమున్—తిలకమును; కర్ణదామంబున్ — కర్ణావతంసమును; పట్టె—దట్టమయిన; బ్రాఁతిగాన్ — అందముగా; జానూరువుల్—మోఁకాళ్లను, దొడలను; అప్పళింపన్—కొట్టఁగా; క్రించున్—నీచుఁడగు, త్రిలోకీనృశంసున్—మూఁడులోకములను హింసించువాఁడగు; నియుద్ధక్రియాపద్ధతిన్—ద్వంద్వయుద్ధక్రమమునందు; 'నియుద్ధం బాహుయుద్ధేతు తుములం రణసంకులే.' అని యమరుఁడు; కిక్కసన్—మిక్కిలియదుముటచేత; గొంతుక్రోల్—కంఠనాళమును(క్రోవిని); నొక్కి—అదిమి; అనఁగాఁ గంసునిగొంతుఁ బిసికిచంపియనుట; వే—శీఘ్రముగా;

ఇక్కడ నన్ని పుస్తకములలోను 'నొక్కి—దేవతాదుందుభి' యనియే పాఠము కానంబడుచున్నది. అట్లయిన గణభంగ మగును గావున 'నొక్కి' యను పదమునకుఁ బిమ్మట 'వే' యను నక్షరమును జేర్చితి. 'నొక్కవే' యని యొక పుస్తకములో నున్నది. దానికంటెను 'నొక్కివే' యను పాఠమే సరసము.

'దుష్ట' మొదలు 'పాలింపవే' యనువఱ కొకవాక్యము.

అష్టాదశాక్షౌహిణీ........మదాంధున్—అష్టాదశాక్షౌహిణీ—పదునెనిమిదియక్షౌహిణులసంఖ్య గల; వాహినీ—సేనలచేత; దుర్మదాంధుఁడు—మిక్కిలి గర్వించినవాఁడు; అక్షౌహిణీప్రమాణము :— 21870 రథములు; అన్నియేనుఁగులు; 65610 గుఱ్ఱములు, 109350 కాల్బలములుగలసేన యక్షౌహిణి యనంబడును; భారతము, ఆదిపర్వమునఁ జూడనగు; భీమాపదేశంబునం జేసి శాసించి — భీముఁడను వ్యాజమును బురస్కరించుకొని శిక్షించి; అనఁగా భీమునిచేఁ జంపించినాఁ డని భావము; 'వ్యాజోపదేశౌ లక్ష్యంచ' అని

యమరుఁడు. జాత్యసూయన్—తాను క్షత్రియుఁడనియుఁ గృష్ణుఁడు కాఁడనియు జాత్యభిమానముచేఁ బొడమిన యసూయచేత; భయం బేది—నిర్భయుఁడై; చేదిక్ష్మాపాలభండు—శిశుపాలుఁడు; త్రుళ్లునన్—గర్వముచేత; ప్రల్లదం బాడినన్—దుర్భాషలు పలుకఁగా; పళ్లెరంబు—తాంబాళమును; తచ్ఛిరఃకర్తనప్రౌఢిన్—ఆశిశుపాలునితలను నఱకుట యను సామర్థ్యముచేత; వృథా...శౌండీరున్—వృథా—నిరుపయోగముగా (అనర్హముగా ననుట); వాసుదేవప్రథా—వాసుదేవుఁడను ఖ్యాతినిగల; చండ—క్రూరుఁడైన; శౌండీరున్—గర్వితుఁడగు; అపౌండ్రున్—ఆ పౌండ్రక వాసుదేవుని; చక్కుగాఁ జేసి—చంపి; మహాసేన...సన్నాహముల్—మహాసేన—కుమారస్వామి; నాగానన—గజాననుఁడు (వీరియొక్క); వ్యూహ—సేనలయొక్క; సన్నాహములు—క్రమములు; వీడన్—చెదరిపోఁగా; పోరన్—యుద్ధమునందు; ఈశానున్—శివుని; వెన్నాడి—తఱిమి; బాణాసుర...కేళిమైన్—బాణాసుర—బాణాసురుఁ డను రాక్షసునియొక్క; స్ఫార—గొప్పవియగు; బాహాసహస్ర—వేయి బాహువులయొక్క; ఛిదాకేళిమైన్—నఱకువ్యాపారముచేత; వాలి—అతిశయించి;

ఘోర......శిక్షకా—ఘోర—భయంకరుం డగు; భౌమ—నరకుఁ డను; అసుర గ్రామణీ—రాక్షసశ్రేష్ఠుని; శిక్షకా—చంపినవాఁడా యనుట; ఖేద.....ప్రదా—ఖేద—(పుత్రమరణజనిత) దుఃఖముచేత; సందగ్ధ—తపించిన; సాందీప—సాందీపుఁ డను తనగురువునకు; సూనుప్రదా—పుత్త్రదానము చేసినవాఁడా; అనఁగా నతనికొడుకును బ్రతికించినవాఁడా యనుట; వేద........పదా—వేదశాఖా—వేదములనెడుకొమ్మల యొక్క; శిఖా—కొనలయందు (అనఁగా వేదాంతములయం దనుట); అంచత్—ఒప్పుచున్న; ప్రవాళత్—చిగుళ్లవలె నాచరించుచున్న; పదా—చరణములు గలవాఁడా; (అనఁగా వేదాంతగమ్యుఁ డనుట).

అలంకారము—అంతటను వృత్త్యనుప్రాసంబులును ఛేకానుప్రాసంబులును నెఱసి మెఱయుచున్నవి.

(వి) ఈదండకమునందలి 'ముక్తరోమంథనిష్పంద గోబృందమున్', 'వ్యక్త గోవర్ధనగ్రావనిష్యందమున్', ఈ రెండుసమాసములును; 'మందమందాంశుమన్నంద నావేగమున్', 'కందళన్నీరసారణ్యజీర్ణాగమున్', ఈ సమాసద్వయంబును; 'ఘోర భౌమాసురగ్రామణీశిక్షకా', 'కౌరవాకర్షితద్రౌపదీరక్షకా', ఈసమాసయుగళంబును; 'ఖేదసందగ్ధసాందీపసూనుప్రదా', 'వేదశాఖాశిఖాంచత్ప్రవాళత్పదా', ఈసమాసయుగ్మంబును; సమగణపదవిన్యాసలలితంబులై, సుమధురచరమప్రాసకలితంబులై చెలువారు. కావుననే దీనికి గణసమకదండక మనుపేరు సార్థకము.

తొలుత రెండునగణములును బిదప నిష్టము వచ్చినన్ని రగణములైనను, నొకనగణమును బిదప వలయునన్ని తగణములైనను, దొలుతనుండి యన్నియుఁ దగణములైనను, గడపట నొకగురువును దండకమున నుండవలయు.

ఈదండకమున భగవంతుఁడగు శ్రీకృష్ణుని చరిత్రంబును మాహాత్మ్యంబును ముద్దారు మాటలతోఁ జెప్పఁబడియె. దీని నొక్కటిని బ్రతిదినము స్త్రీలుం బురుషులును భగవత్పాదారవిందధ్యానపరాయణులై పారాయణము సేయుచుందురేని కలుష విదూరులై క్రమంబున నభిమతశుభములఁ బడసి సుఖింతురు.

ఇందలి శారదరాకానిశాసమయసరసీజాక్షమురళీగానవర్ణనమునఁ గొమరారు తీపారు పలుకుల సరళతయు సందర్భసుందరతయు స్వభావోక్తిసౌకుమార్యంబును వర్ణనాతీతములు.

## శ్రీకృష్ణులు వైజయంతమున విడియుట

చ. అని కొనియాడి విశ్వభువనైకధురంధర నేఁడు రేపు నీ
వనితయు నీవు నిచ్చట నవశ్యము మజ్జనభోజనాదిపూ
జనములు గైకొనన్వలయు సమ్మతిమై నని పల్కి దేవతా
జననికి మ్రొక్కి యియ్యకొని జంభవిరోధిమొగంబుఁ జూచినన్. 39

(వ్యా) విశ్వభువనైక ధురంధర—విశ్వభువన—సమస్త ప్రపంచములకు; ఏక ధురంధర—ముఖ్యుఁడగు భారమును వహించినవాఁడా (అనఁగా సకలభువనములకు నాధారభూతుఁడా యనుట); జంభవిరోధి—ఇంద్రుఁడు.

చ. అమరవిభుండు సేరి వినయానతుఁడై విడిపట్టు వైజయం
తమునను జిత్తగింపు మన నవ్వుచుఁ దద్బలదైత్యవైరిహ
స్తము గయిదండ గొంచు గిరిశప్రముఖాఖిలలోకపాలకుల్
క్రమమునఁ జేరి కొల్వఁ జని కాంచెఁ దదున్నతసౌధరాజమున్.

(వ్యా) విడిపట్టు—విడిదల; చిత్తగింపుము—అనుగ్రహింపుము.

## వైజయంతవర్ణనము

వ. అదియును నామరసరిదుపహృతహేమతామరసస్తోమతోరణదామ రామణీయకసూచితసౌదామనీవిలసితంబును, గనత్కనకకింకిణీకుల

సంకులక్వాణముగ్ధమధురాలాపనృత్యన్నిజాపత్యమూర్త్యావహ
పార్శ్వప్రవర్తమానవిమానసంతానంబును, నర్థిజనాభిమతదానార్థ
సంగ్రహ సంశయాపాది సమస్తవస్తుప్రతిబింబసంభావితశేఖరీకృత
చింతారత్నంబును, నక్షీణసహస్రాక్షమణిగవాక్షావళీసాక్షాత్కృత
నాకలక్ష్మీకటాక్షవీక్షావిశేషంబును, ననర్ఘ్యమణిస్తంభప్రతిబింబిత
నృత్యదప్సరస్సహస్రప్రదర్శ్యమానలాస్యావలోకనసారస్యాగత
గృహదేవతాశతసన్నిధానంబును, పులోమనముచిజంభపాకవృత్ర
బలప్రముఖదైత్యవిధ్వంసనసన్నద్ధ శతమన్యుజన్యసన్నాహానుకారి
చిత్రకర్మవిచిత్రితభిత్తిభాగంబును, వళితరుచిరరుచినిరంతరస్ఫాటిక
కూటాంతరవిశ్రాంతైరావతోచ్చైశ్శ్రవస్సూచ్యమానక్షీరసాగర
స్నానక్రమంబును, దరంగితమణిభృంగారకవీటికాకరండతాలవృంత
చామర దర్పణ కళాచికాపాదుకాదిపరికరప్రపంచసంచితకరాంచల
విశ్వకర్మనిర్మితయంత్రపాంచాలికాసంచయవంచితపరమార్థ పరిచారి
కాసార్థంబును, నిరంతరసంతానానోకహదుకూలమయపతాకాశ
తాకారితాకాశగంగాచటులతరతరంగావతరణంబును, సమంతత
స్తంతన్యమానతోయకర్మాంతికనిర్ముక్తమందారవిటపిమకరందగంధ
సలిలసేకాతిరేకశీతలమణివేదికాప్రదేశంబును, బహిర్ద్వారవితర్దికా
ప్రకోష్ఠప్రతిష్ఠాపితాష్టాపదఖట్వాస్తీర్ణహరిచందనసాలబాలపల్లవోల్ల
సితసంధ్యారాగసంధానంబును, నవిరళకల్పప్రసవరజఃపటలపటవాస
పాంసువాసితకౌశేయవితానపటీప్రకటీకృతచంద్రాతపపరిపాటికంబు,
నగుచుఁ, జతురతరశచీకరవిరచితంబు లై మణికుట్టిమతలప్రతిబింబిత
తారకాకుటుంబంబుల విడంబించు పారిజాతకుసుమోపహారంబుల
వలన, స్వాహాబాహాంచలావాహితంబు లై మహారజతపాత్రంబులఁ
జిత్రంబులుగా వెలుంగు నారాత్రికాదీపకళికలవలన, యమకామినీ
ధూమోర్ణావితీర్ణంబు లై విస్తీర్ణంబుగా నెగయు మలయజకాలాగురు

ఘూపధోరణులవలన, యాతుధానాపహోధవధూవిధీయమానంబు లై విలసిల్లు గృహప్రవేశసమయసముచితబలివిధానసంవిధానంబులవల నం, బాశధరమత్తకాశినీస్తూత్రితంబు లై విలోకపాత్రంబు లగు లలితప్రవాళలతావందనమాలికలవలనం, బవమానమానవతీవియు క్తంబు లై బాలికాజనంబులకరతలంబులం బరిభ్రమించు కస్తూరి తాలవృంతంబులవలన, నరధర్మసధర్మిణీ నిర్మితంబు లగు విధానకల్పిత శంఖపద్మమకరాకారరంగవల్లీమతల్లికలవలన, నయనోత్సవం బావ హిలం బ్రవేశించి వాసవవహ్నివైవస్వతవానతేయాచరణవరుణ వాయువసువల్లభవామదేవుల వరుస వీడ్కొల్పి సత్యభామాసహి తుండై యథోచితకృత్యంబు లాచరించి యనంతరంబ. 41

ఈవచనంబున వైజయంత మను నింద్రునిప్రాసాదము వర్ణింపఁబడినది.

(వ్యా) ఆమర............విలసితంబును—

ఆమరసరిత్—సురనది యగు నాకాశగంగానదినుండి; ఉపహృత—కొనిరాఁబడిన; హేమతామరసస్తోమ — బంగారుకమలములగుంపుచే (గల్పింపఁబడిన); తోరణదామ— తోరణమాలికలయొక్క; రామణీయక—సౌందర్యముచేత; సూచిత—తెలుపఁబడిన; సౌదా మనీ—మెఱుములయొక్క; విలసితంబును—ప్రకాశముగలదియును;

అనఁగా నామేడయందు బంగారుతామరతోరణములు కట్టఁబడి యుండిన వనియుం నవి మెఱుపుఁదీఁగెలవలెఁ దళతళలాడుచు సుందరముగా నొప్పె ననియు భావము.

ఈసమాసమునందు వృత్త్యనుప్రాసము శబ్దాలంకారము.

కనత్............సంతానంబును—

కనత్—ప్రకాశించుచున్న; కనకకింకిణీకుల—బంగారు గజ్జెల గుంపులయొక్క; సంకుల—క్రమరహితమైన; క్వాణ—శబ్దములనియెడు; ముగ్ధ—మనోహరమైన; మధుర— తియ్యని; ఆలాప—పలుకులతో; నృత్యత్—ఆడుచున్న; నిజాపత్యమూర్త్యావహ—తన యొక్క (అనఁగా వైజయంతముయొక్క) బిడ్డలరూపులను గలిగించుచున్న; పార్శ్వ— ప్రక్కలయందు; ప్రవర్తమాన—ఉన్న; విమానసంతానంబును—విమానసమూహముగలదియు;

అనఁగా వైజయంతపార్శ్వములయందు విమానము లుంపఁబడి యున్న వనియు, వానికి బంగారుచిఱుగంటలు కట్టఁబడియున్నవనియు, నవి నానాప్రకారముల శబ్దించు

చున్న వనియు, వీనిం జూడ నావిమానము లావైజయంతముయొక్క బిడ్డలో యనున ట్లును, నాబంగారుచిఱుగంటల మ్రోఁత లాబిడ్డల మధురాలాపయుతంబులగునృత్యముల యట్లును గన్పట్టె ననియు భావము.

అర్థి............రత్నంబును—

అర్థిజన—యాచకులకు; అభిమత—కోరికలను; దాన—ఇచ్చుటకై; అర్థసంగ్రహ—వస్తువులను సేకరించుట యను; సంశయాపాది—సంశయమును గలిగించుచున్న; సమస్త వస్తు—సకలవస్తువులయొక్క; ప్రతిబింబ—ప్రతిరూపములచేత; సంభావిత—మహితమైన; శేఖరీకృత—శిరోభూషణముగా నుంపఁబడిన; చింతారత్నంబును—చింతామణి గలదియుం;

అనఁగా నావైజయంత మనుమేడమీఁద శిఖరాలంకారముగఁ జింతామణి యమర్పఁబడి యుండె ననియు నందు సమస్తవస్తువులును బ్రతిఫలించుచుండె ననియు దీనిం జూడఁగా నర్థిజనులకిచ్చుటకై సమస్తవస్తువులను నమ్మేడయందు సంగ్రహించియుంపఁబడెనో యనుసందియమును గలిగించుచున్న దనియు భావము.

అక్షీణ............విశేషంబును—

అక్షీణ—కొఱఁతపడని (అనఁగా ననేకములైన యని భావము); సహస్రాక్ష మణి—ఇంద్రనీలమణులచే నిర్మింపఁబడిన; గవాక్షావళీ—కిటికీలవరుసలచేత; సాక్షాత్కృత—ఎఱుఁగఁబడిన; నాకలక్ష్మి—స్వర్గలక్ష్మియొక్క; కటాక్షవీక్షావిశేషంబును—క్రీఁగంటి చూపుయొక్క వైలక్షణ్యంబు గలదియు;

అనఁగా నాప్రాసాదమునం దనేకములగు నింద్రమణిఖచితగవాక్షము లమర్పఁబడియుండె ననియు, నవి నీలకాంతులఁ బొలుపారుటచే స్వర్గలక్ష్మికటాక్షవీక్షణముల వలె నొప్పెననియు భావము. ఈసమాసమునందును వృత్త్యనుప్రాసము శబ్దాలంకారము.

అనర్ఘమణి.........సన్నిధానంబును—

అనర్ఘ—వెలలేని; మణిస్తంభ—మణిఖచితములగు కంబములయందు; ప్రతిబింబిత—ప్రతిఫలించిన; నృత్యత్—నాట్యమాడుచున్న; అప్సరస్సహస్ర—అనేకులగు నప్సరసలచేత; ప్రదర్శ్యమాన—చూపఁబడుచుచున్న; లాస్య—నృత్యముయొక్క;

లాస్యలక్షణము:—

"శృంగారరసభూయిష్ఠై ర్భూరిభావతరంగితైః
అంగైరనంగసర్వస్వ శోభాతిశయశాలిభిః
అన్వితోనృత్తభేదో యత్త్ర లాస్య మితి కథ్యతే."

—అని సంగీతచూడామణి.

అవలోకన—చూచుటయందలి; సారస్య—రసికత్వముచేత; ఆగత—వచ్చిన; గృహదేవతా శత—పెక్కండ్రు గృహదేవతలయొక్క; సన్నిధానంబును—సన్నిధి గలదియు;

అనఁగా వైజయంతమునందలికంబములు మణిఖచిత్రములయి యుండుటచేత నప్సరస లాడు నృత్యవిశేషములు కంబములయందుఁ బ్రతిఫలించెననియు, నానాట్యవిశేషములను జూచుటకై గృహదేవతలు వచ్చి కూర్చున్నారో యన్నట్లుండెననియు భావము.

పులోమ............భిత్తిభాగంబును—

పులోమ, నముచి, జంభ, పాక, వృత్ర, బల, ప్రముఖులగు; దైత్య—రాక్షసులను; విధ్వంసన—చంపుటయందు; సన్నద్ధ — సిద్ధపడిన; శతమన్యు — ఇంద్రునియొక్క; జన్యసన్నాహ—యుద్ధప్రయత్నమును; అనుకారి—అనుకరించుచున్న; చిత్రకర్మ—చిత్తరపు వ్రాఁతపనులచేత; విచిత్రిత—అలంకరింపఁబడిన; భిత్తిభాగంబును—గోడలప్రదేశంబును గలదియు; (భావము సుగమము);

వళిత......క్రమంబును—

వళిత—వర్తులముగాఁ బ్రసరించుచున్న; రుచిర—మనోహరమైన; రుచి—కాంతులచేత; నిరంతర—ఎడఁబాటులేని (అనఁగా దట్టమైన యనుట); స్ఫాటికకూట—స్ఫటికమయములగు శిఖరములయొక్క; అంతర—మధ్యమునందు; విశ్రాంత—విశ్రమించియున్న; ఐరావతోచ్చైశ్శ్రవస్—ఐరావత మను పేరుగల యేనుఁగు, ఉచ్చైశ్శ్రవస్సను పేరు గల గుఱ్ఱము, వీనిచేత; సూచ్యమాన—సూచింపఁబడుచున్న; క్షీరసాగరస్నానక్రమంబును—క్షీరసముద్రమునందు స్నానముచేయు ప్రకారము కలదియును;

అనఁగా వైజయంతముయొక్క శిఖరములు స్ఫటికమయములై యుండె ననియు, వానికాంతు లంతటం బ్రసరించుటచేనాప్రదేశము క్షీరసముద్రముఁ బోలియుండెననియు నందుఁ బరుండియున్న యైరావతమును నుచ్చైశ్శ్రవమును క్షీరసాగరమునందు స్నానము చేయుచున్నవో యనున ట్లొప్పె ననియు భావము.

ఐరావతమును నుచ్చైశ్శ్రవమును క్షీరసాగరమథనసమయమునందు జనించె నని పురాణము.

తరంగిత......సార్థంబును—తరంగిత—చలించుచున్న; మణిభృంగారక—మణులు చెక్కిన చెంబులు; వీటికాకరండ—తాంబూలపుఁబెట్టెలు; తాళవృంత—విసనకఱ్ఱలు; చామర—వింజామరలు; దర్పణ—అద్దములు; కళాచికా—తమ్మపడిగెలు; పాదుకా—పావుకోళ్లు; ఆది—మొదలగు; పరికరప్రపంచ—ఉపకరణసంపదచేత; సంచిత—కూడిన (అనఁగాఁ గలిగినయనుట); కరాంచల—హస్తాగ్రములు గల; విశ్వకర్మనిర్మిత—విశ్వ

కర్మయను పేరుగల దేవశిల్పిచే నిర్మింపఁబడిన; యంత్రపాంచాలికా—కీలుబొమ్మలయొక్క; సంచయ—గుంపులచేత; వంచిత—ఏమార్పఁబడిన; పరమార్థపరిచారికా సార్థంబున—నిజమైనపరిచారికలసమూహము గలదియును;

అనఁగా నావైజయంతమునందు విశ్వకర్మచే నిర్మింపఁబడిన కీలుబొమ్మ లుంపఁబడియుండెననియు నాబొమ్మలు హస్తములయందు రతనంపుఁజెంబులు మున్నగువస్తువులను ధరించియుండెననియు, నవి చలించుచుండునట్లు నిర్మింపఁబడి యుండుటచే (అనఁగా యంత్రసామర్థ్యవిశేషముచేత నవి కదలుచుండుటచే) వానిం జూచి యచ్చటం సంచరించు నిజమైనపరిచారికలు మోసపోవుదు రనియు భావము.

నిరంతర......తరణంబును—

నిరంతర—దట్టమైన; సంతానానోకహ—కల్పవృక్షమునందలి; 'అనోకహః కుటస్సాలః' అని యమరుఁడు; దుకూలమయ—తెల్లపట్టుగుడ్డలచేఁ జేయఁబడిన; (అర్థాంతరము—కల్పవృక్షపల్లవములే దుకూలము లని చెప్పఁబడు. దీనికిఁ బ్రమాణము:—

"ఏషాంపల్లవ మంశుకాని కుసుమం ముక్తాఃఫలం విద్రుమం
వైదూర్యం దళ మంకురో మరకతం హైమంచ శాఖాశతం
ఏతే కే జగతీరుహో వనజుషోప్యజ్ఞాతపూర్వా మయా
ప్రాయస్సార మమీ దివోవిటపినః కింత్వైర్మయాఽన్యోభరః."

—అని శక్తిభద్రుని యాశ్చర్యచూడామణి.

ఈకావ్యమునందే 'కల్పవృక్షదుకూలాంశుకములు గట్టి' అని 4-40 లోఁ గన్పట్టుచున్నది. అప్పుడు కల్పవృక్షములపల్లవము లనెడు పట్టువస్త్రములచే నిర్మింపఁబడిన పెక్కుటెక్కెములచేత నని యర్థము.)

పతాకాశత—పలుటెక్కెములచేత; ఆకారిత—పిలువఁబడిన; 'హూతిరాకారణాహ్వానం' అని యమరుఁడు; ఆకాశగంగా—సురనదియొక్క; చటులతర—మిక్కిలి చలించుచున్న; తరంగ—అలలయొక్క; అవతరణంబును—దిగుట గలదియు;

అనఁగా నావైజయంతమునకుఁ బట్టుటెక్కెములు పెక్కులు కట్టఁబడియుండెననియు, నవి యాకాశగంగను బిలుచుచున్నట్లుండెననియు, నట్లు పిలుచుచుండుటచేతనో యన్నటు లాకాశగంగయలలు పైపై దిగివచ్చుచుండె ననియు భావము.

ఇక్కడఁ బతాకలచేఁ బిలువఁబడినది యనుటచేఁ బతాకలు హస్తములవలె నొప్పె ననియుఁ, బతాకాచలనములు పిలుచుటను సూచించుచు హస్తసంజ్ఞలవలె నొప్పె ననియును ...నీయమానంబు లగుచున్నవి.

సమంతత......ప్రదేశంబును—

సమంతతః—అంతటను; తంతన్యమాన—మిక్కిలి విస్తరింపఁజేయఁబడుచున్న; తోయకర్మాంతిక — నీళ్లగట్టు సేవకులచేత; నిర్ముక్త — విడువఁబడిన, ప్రసరింపఁజేయఁబడిన; మందారవిటపి—కల్పవృక్షముయొక్క; మకరంద—తేనెలనెడు; గంధసలిల—పరిమళోదకములయొక్క; సేకాతిరేక—సేచనాతిశయమువలన; (అధికముగా నీళ్లు గట్టుట యనుట); శీతల—చల్లనైన; మణివేదికాప్రదేశంబును—రతనంపుఁదిన్నెలు గలదియు;

అనఁగా నావైజయంతముచుట్టు ప్రక్కలఁ దిన్నెలుగలవనియు, నీళ్లుగట్టు సేవకులు కల్పవృక్షమకరందము లనెడు పరిమళోదకములను నాతిన్నెలయందంతటను బ్రసరింపఁజేయుటచేఁ జల్లగా నుండెననియు భావము.

బహిర్ద్వార............సంధానంబును—

బహిర్ద్వార—వెలుపటిద్వారప్రదేశమందలి; వితర్దికా—అరుఁగులు గల; ప్రకోష్ఠ — ముంగిళ్లయందు; ప్రతిష్ఠాపిత—ఉంచఁబడిన; అష్టాపదఖట్వా—బంగారు మంచములందు; ఆస్తీర్ణ—పఱుపఁబడిన; హరిచందనసాల—కల్పవృక్షములయొక్క; బాలపల్లవ—లేఁజిగుళ్లచేత; ఉల్లసిత—ప్రకాశింపఁబడిన; సంధ్యారాగసంధానంబును—సంజకెంజాయయొక్క కూడిక కలదియు; 'అష్టాపదం స్యాత్కనకం' అని విశ్వనిఘంటువు.

అనఁగా నాప్రాసాదముయొక్క ముఖద్వారములందలి తిన్నెలఁ జెన్ను మీఱు ముంగిళ్లయందు బంగారుమంచము లుంపఁబడి యుండెననియు, నామంచములయందుఁ గల్పవృక్షపు లేఁజిగుళ్లు పఱుపఁబడియుండెననియు, నవి సంజకెంజాయల పగిది రంజిల్లుచుండెననియు భావము.

అవిరళ............పరిపాటికంబును—

అవిరళ—దట్టమైన; కల్పప్రసవ—కల్పవృక్షపుష్పములయొక్క; రజఃపటల—పుప్పొళ్ల గుంపు లనెడు; పటవాస—వస్త్రములకు వాసనకట్టెడు సుగంధిద్రవ్యములయొక్క; పాంసు—ధూళులచేత; వాసిత—పరిమళముకలదిగాఁ జేయఁబడిన; కౌశేయ—పట్టుచేనిర్మింపఁబడిన; వితానపటీ—మేల్కట్టు వస్త్రములచేత; ప్రకటీకృత—ప్రకటింపఁ బడిన; చంద్రాతప—వెన్నెలయొక్క; పరిపాటికంబును—క్రమము గలదియును;

అనఁగా నాప్రాసాదమునందుఁబట్టుచే నిర్మింపఁబడిన మేల్కట్టువస్త్రములు కట్టఁబడియుండెననియు, నవి కల్పవృక్షకుసుముంబుల పుప్పొళ్లనెడు సుగంధపు బుక్కాముచేఁ బరిమళించుచుండెననియు, నామేల్కట్లు ధవళములై యుండుటచే నవి వెన్నెలవలెఁ బ్రకాశించుచుండెననియు భావము.

అగుచుఁ—ఒప్పుచు;

'చతురతర' మొదలగు 'కుసుమోపహారంబులవలనన్' అనువఱకు వాక్యము.

చతురతర—మిక్కిలి సమర్థములైన; శచీకర—శచీదేవియొక్క హస్తములచేత; విరచితంబులై—కల్పింపఁబడినవై; మణికుట్టిమతల—మణిచిత్రితములగు భూప్రదేశములందు; ప్రతిబింబిత—ప్రతిఫలింపఁబడిన; తారకానికురుంబంబులన్—నక్షత్రముల సమూహములను; విడంబించు—అనుకరించు (అనఁగాఁ బ్రకటింపఁజేయు); పారిజాతకుసుమోపహారంబుల వలనన్—కల్పవృక్షపుష్పము లనెడు కానుకలవలనను; ('వలనన్' అనుపదము 'నయనోత్సవం బావహిలన్' అనుపదములతో నన్వయము);

అనఁగా శచీదేవి యాప్రాసాదమునకుఁ(గానుకగాఁ) బారిజాతపుష్పము లర్పించుచుండుననియు, నవి మణిచిత్రితములగు నానేలలయందుఁ బ్రతిఫలించిననక్షత్రములవలెఁ బ్రకాశించుచుండె ననియు భావము.

'స్వాహాబాహా' మొదలు 'దీపకళికలవలనన్'—అనువఱకు వాక్యము.

స్వాహా—అగ్నిదేవునిభార్య యగు స్వాహాదేవియొక్క; బాహాంచల—బాహువుల కొనలచేత; ఆవాహితంబులై—తీసికొనిరాఁబడినవై; మహారజతపాత్రంబులన్—బంగారు పళ్లెములయందు; చిత్రంబులుగాన్—వేడుకగా; వెలుంగు—ప్రకాశించుచున్న; ఆరాత్రికా దీపకళికలవలనన్—మొగ్గలవలె నుండు హారతిదీపములవలనను; 'చామీకరం జాతరూపం మహారజతకాంచనే' అని యమరుఁడు.

'యమకామినీ' మొదలు 'ధోరణులవలనన్' అనువఱకు వాక్యము.

యమకామినీ — యమునిపత్ని యగు; ధూమోర్ణా — ధూమోర్ణాదేవిచేత; వితీర్ణంబులై—ఇయ్యఁబడినవై (ఉంపఁబడినవై యనుట); విస్తీర్ణంబుగాన్—అంతటను; ఎగయు—వ్యాపించు; మలయజ—చందనము; కాలాగురు—అగరుచెక్కలు—(వీనియొక్క); ధూపధోరణులవలనన్—ధూపములవరుసలవలనను;

"శక్రః శచీపతి ర్దేవో యమో ధూమోర్ణయా సహ
వరుణ స్సహగౌర్యాచ సహర్ధ్యాచ ధనేశ్వరః"
—మహాభారతము, అశ్వమేధపర్వము.

'ధూమోర్ణా యమపత్నీ'—అని త్రికాండశేషము.

'యాతుధానా' మొదలు సంవిధానంబులవలనన్' అనువఱకు వాక్యము.

యాతుధాన—రాక్షసునియొక్క, (అనఁగా నైఋతి నిరృతియనుదిగధిపతియొక్క యనుట); అవరోధవధూ—అంతఃపురస్త్రీచేత, (అనఁగా భార్యచేత ననుట); విధీయమా

నంబులై—ఉంచఁబడినవై; విలసిల్లు—ప్రకాశించుచున్న; గృహప్రవేశసమయ—గృహప్రవేశ వేళకు; సముచిత—తగిన; బలివిధాన—బలులు పెట్టుటయొక్క; సంవిధానంబులవలనన్—కూర్పులచేతను;

అనఁగా నా ప్రాసాదముచుట్టును గృహప్రవేశసమయమందు నైరృతిభార్య బలులు పెట్టుచున్న దని భావము.

'పాశధర' మొదలు 'మాలికలవలనన్' అను వఱకు నొక వాక్యము.

పాశధర—వరుణునియొక్క; మత్తకాశినీ—భార్య యగు గౌరిచేత (మత్తకాశినీ—మదముచేతఁ బ్రకాశించువనిత); సూత్రితంబులై—గ్రువ్వఁబడినవై; విలోకన పాత్రంబు లగు—దర్శనీయము లగు; లలిత—మనోజ్ఞమయిన; ప్రవాళలతా—పవడపుఁదీఁగెలచేత నిర్మింపఁబడిన; వందనమాలికలవలనన్—తోరణములచేతను;

'పవమాన' మొదలు 'తాలవృంతంబులవలనన్' అనువఱకు నొకవాక్యము.

పవమానమానవతీ — వాయుదేవునిభార్యవలన; నియుక్తంబులై—ఆజ్ఞాపింపఁబడిన వారై; బాలికాజనంబుల—ఆఁడుపిల్లలయొక్క; కరతలంబులన్—చేతులయందు; పరిభ్రమించు—తిరుగుచున్న; కర్పూర—కర్పూరపుఁజెట్లయొక్క యాకులచే నిర్మింపఁబడిన; తాళవృంతంబులవలనన్—వీవనలచేతను;

'నరధర్మ' మొదలు 'మతల్లికలవలనన్' అనువఱకు నొకవాక్యము.

నరధర్మ—కుబేరునియొక్క; 'మనుష్యధర్మాధనదో రాజరాజో ధనాధిపః' అని యమరుఁడు; సధర్మిణీ—భార్యయగు బుద్ధిచేత; నిర్మితంబులగు—కల్పింపఁబడిన; నిధాన—నిధులయందుండి; కల్పిత—(గ్రహింపఁబడి)కూర్పఁబడిన; శంఖపద్మమకరాకార—శంఖము, పద్మము, మకరము, రూపములుగల; రంగవల్లీమతల్లికలవలనన్ — శ్రేష్ఠము లగు ముగ్గులచేతను; శంఖము, పద్మము, మకరము, ఇవి కుబేరుని నవనిధులలోఁ జేరిన నిధుల పేళ్లు;

అనఁగాఁ గుబేరుని పత్ని తననిధులగు శంఖ, పద్మ, మకరములలో నుండు మణులను దీసికొని వానిచే నాప్రాసాదమునందు శంఖపద్మమకరాకారముగా ముగ్గులు పెట్టుచున్న దనిభావము;

నయనోత్సవంబు—నేత్రానందము; ఆవహిలన్—కలుగఁగా; ప్రవేశించి—ఆప్రాసాదమును జొచ్చి; దీనికిఁ గర్తృపదము 42 వ పద్యమునందలి 'రామప్రియ సోదరుండు';

వాసవ.........వామదేవులన్——వాసవ—ఇంద్రుఁడు;వహ్ని—అగ్ని;వైవస్వత—యముఁడు; వాసతేయీచరణ—నిరృతి; (వాసతేయీ—రాత్రి-చరణ—చర;) 'వసతిర్వాస

తేయీచశ్యామరాత్రిశ్చకథ్యతే' అని హలాయుధుఁడు; వరుణ—వరుణుఁడు; వాయు—వాయువు; వసువల్లభ—కుబేరుఁడు; (వసు—ధనము); వామదేవులన్—ఈశానుఁడు (వీరిని); వరుసన్, వీడ్కొలిపి—ఒక్కొక్కరినిగా నంపి.

ఈవచనమునందు 'చతురతరశచీకరవిరచితంబులై', అనువాక్యము మొదలు 'మతల్లికలనలవన్' అను పదమువఱకు దిక్పాలకులభార్యలావైజయంతమున కొనర్చు నలంకారాదులు వరుసగా వర్ణింపఁబడినవి.

(వి) ఈ ప్రకరణమునందుఁ గవి దిగధిపతుల సతులం బేర్కొనునెడ నింద్రాగ్నియమ నిర్ఋతివరుణవాయుకుబేరపత్నులం బేర్కొని యీశానునిపత్నియగు పార్వతీదేవిని జెప్పక విడిచిపెట్టుటం జూడ నిఖిలజగజ్జననియుఁ బరమేశ్వరియు నగు పార్వతీదేవి తక్కినదిక్పాలసతులకైవడిం బరిచర్యలొనర్చెనని నుడువఁ దగదనుకారణంబునఁ గవి చెప్పఁడయ్యెనని తెలియనగు.

కవికులసార్వభౌముఁడగు కాళిదాసుఁడు రఘువంశమహాకావ్యమునందు రఘుమహారాజు సింహాసనస్థుఁడగు సందర్భమును వర్ణించునపుడు లక్ష్మీదేవియు సరస్వతీదేవియు రఘుమహారాజుంగొలిచిరని చెప్పి పార్వతీదేవిం జెప్పఁడయ్యె.

"ఛాయామండలలక్ష్యేణ తమదృశ్యా కిల స్వయం
పద్మా పద్మాతపత్రేణ భేజే సామ్రాజ్యదీక్షితం
పరికల్పితసాన్నిధ్యా కాలేకాలేచ వందిషు
స్తుత్యం స్తుతిభి రర్థ్యాభి రుపతస్థే సరస్వతీ".

—రఘువంశము. (4-67)

అలంకారము—రత్నావళి.

'వాసవవహ్ని' అనుసమాసమునం దష్టదిగధిపతులపేరులు వకారాదిగాఁ గూర్పఁబడి యుండుట చమత్కారము.

శబ్దాలంకారము—వృత్త్యనుప్రాసము.

## నందన విహారము

శా. ఆ రామప్రియసోదరుం డపుడు దివ్యారామ మంభోరుహ
శ్రీ రమ్యం బదె చూతమే యన ఘృతాచీమేనకామంజుఘో
షారంభాహారిణీముఖత్రిదివయోషారత్నము ల్గొల్చి రా
నారూఢోత్సవచిత్తుఁడై గగనకుల్యాతీరదేశంబునన్. 42

(వ్యా) ఆ, రామప్రియసోదరుండు — బలరామునితమ్ముఁడగు నాకృష్ణుఁడు; అదె — అదిగో (కనఁబడుచున్నదని భావము); దివ్యారామము — సురోద్యానమగు నందన వనము; త్రిదివయోషారత్నముల్ — సురనారీమణులు; ఆరూఢోత్సవచిత్తలై — మనమున వేడ్కయుల్లసిల్లఁగా; గగనకుల్యాతీరదేశంబునన్ — ఆకాశగంగాతీరప్రదేశమందు; 'కుల్య' యనఁగాఁ జిన్నకాలువ యని యర్థమైనను నిచ్చట నదీపర్యాయముగాఁ జెప్పఁబడినది. ఈ పద్యమునకు 44 వ పద్యమునందలి 'డాయఁజనియెన్' అను క్రియాపదముతో నన్వయము.

క. చందనహరిచందనమక
రందసరిద్బిందుశీకరప్రమదవనేం
దిందిరపక్షస్పందన
కందళితమరుత్కిశోరకంబులు వొలయన్. 43

(వ్యా) చందన — శ్రీగంధవృక్షములయొక్కయు; హరిచందన — పారిజాతవృక్షములయొక్కయు; మకరందసరిత్ — తేనెనదులయందలి; బిందు — బొట్లయొక్క; శీకర — తుంపురులచేత (అనఁగా నానిని ద్రాగుటచేత నని భావము); ప్రమద — మిక్కిలి మదించిన; వనేందిందిర — ఉద్యానవనమందలితుమ్మెదలయొక్క; పక్ష — ఱెక్కలయొక్క; స్పందన — కదలుటచేత; కందళిత — మొలచిన; మరుత్కిశోరకంబులు — గాలికిల్లలు; పొలయన్ — వ్యాపింపఁగా.

ఇందలి కావ్యగుణములు — సౌకుమార్యము — ఓజస్సు.

సీ. రంభామహోరోజకుంభపరీరంభ
కుసుమితప్రత్యగ్రకురవకంబు
మంజుఘోషావక్త్రకంజాతచకచక
స్తబకితచంపకద్యుమ్మొరుహంబు
హరిణీముఖప్రసూనాసవార్పణకోర
కితలతావేల్లితకేసరంబు
నుర్వశీనవయావకోజ్జ్వలాంఘ్రిని వేశ
పుష్పితకంకేళిభూరుహంబు

తే. మేనకామోదనిశ్వాసమృదుసమీర
కుట్మలితసిందువారంబు కుధరధరుఁడు
ప్రేయసియుఁ దాను నల్లన డాయఁ జనియె
దైవతాధీశనందనోద్యానసీమ. 44

(వ్యా) రంభా—రంభయొక్క; మహోరోజకుంభ—కుంభములవంటి గొప్ప స్తనములయొక్క; పరీరంభ—ఆలింగనముచేత; కుసుమిత—పుష్పించిన; ప్రత్యగ్ర—నవీనమైన (లేఁత); కురవకంబు—ఎఱ్ఱగోరంటచెట్లు గలదియు;

మంజుఘోషా—మంజుఘోష యను దేవవేశ్యయొక్క; వక్త్రకంజాత—ముఖకమలముయొక్క; చకచక—ప్రకాశములచేత; స్తబకిత—పూగుత్తులెత్తిన; చంపకక్ష్మారుహంబు—సంపెఁగమ్రాఁకులు గలదియు;

హరిణీ—హరిణియను దేవవేశ్యయొక్క; ముఖ—వదనమునందలి; ప్రసూనాసవ—పుష్పమద్యముయొక్క; అర్పణ—అర్పించుటవలన, (అనఁగా నుమియుటవలననని భావము); కోరకిత—మొగ్గలెత్తిన; లతావేల్లిత—తీఁగలచేఁ జుట్టఁబడిన; కేసరంబు – పొగడచెట్టు గలదియు;

ఊర్వశీ – ఊర్వశి యను దేవవేశ్యయొక్క; నవ – క్రొత్తదైన; యావక—లత్తుకచేత; ఉజ్జ్వల—ప్రకాశించుచున్న; అంఘ్రి—పాదములయొక్క; నివేశ—ఉంచుటచేత, అనఁగా (పాదాహతిచేత ననుట); పుష్పిత—పూచిన; కంకేళిభూరుహంబు—అశోకవృక్షము గలదియు;

మేనక—మేనక యను దేవవేశ్యయొక్క; ఆమోదనిశ్వాస—పరిమళముతోఁ గూడిననిట్టూర్పునెడు; మృదుసమీర—మెత్తనిగాలిచే; కుట్మలిత—మొగ్గలెత్తిన; సిందువారంబు—వావిలిచెట్టు గలదియు; అగు

దైవతాధీశ—ఇంద్రునియొక్క; నందనోద్యానసీమన్ —నందనమను నారామప్రదేశమును; కుధరధరుఁడు—పర్వతమునుధరించిన (అనఁగా గోవర్ధనము నెత్తిన) కృష్ణుఁడు; ప్రేయసియుఁదానున్—సత్యభామాసహితుఁడై; అల్లనన్—మెల్లఁగా; డాయఁజనియెన్—సమీపించెను.

ఈపద్యమునందు దోహదక్రియలు వర్ణింపఁబడినవి. దోహదక్రియల లక్షణములు మున్నె వివరింపఁబడినవి.

మ. మహిభృద్భేదివనాంతసీమమునఁ బద్మాజాని సత్యావధూ
సహితుం డై యనిమేషవారవనితాసందోహము ల్గొల్వఁగా
విహరింపం జనుదెంచినాఁ డనుచు సేవింపంగ వర్షాశర
న్మిహికాశీతవసంతఘర్మఋతువు ల్నిండెం దదుద్యానమున్. 45

(వ్యా) మహిభృద్భేదివనాంత సీమమునన్—మహిభృద్భేది—పర్వతమును భేదించిన యింద్రునియొక్క; వనాంతసీమమునన్—నందనవన మధ్యమునందు; పద్మాజాని—లక్ష్మీ

కళత్రుఁడగు కృష్ణుఁడు; మిహికా—హేమంతఋతువు; శీత—శిశిరఋతువు, ఘర్మ—గ్రీష్మ ఋతువు.

శ్రీకృష్ణుని సేవించుటకై వర్షాదిషడృతువులు నాయుద్యానవనంబునఁ జేరియుండెనని భావము.

షడృతువు లేక కాలమునఁ గనుపట్టునని కవులు వర్ణించుట కలదు.—
"అథ రిరంసు మముం యుగపద్గిరౌ, కృతయథాస్వతరుప్రసవశ్రియా
ఋతుగణేన నిషేవితు మాదధే, భువిపదంవిపదం తకృతం సతాం."
—అని శిశుపాలవధమునందు మాఘుఁడు.

సీ. కనుపట్టె నొకచోట ఘనఘనాఘనరంగ
విద్యున్నటీనాట్యవిలసనములు
చూపట్టె నొకచాయ వాపికాజలజాత
జాలవాచాలహంసవ్రజంబు
తలచూపె నొకవంక దరదళత్స్రవంతి
కాగంధినీహారకణభరములు
పొడచూపె నొకచక్కిఁ బుష్పితఫలినీల
వంగవాసితశైత్యవైభవములు
తే. నెఱసె నొకయెడఁ ద్రామపర్ణిజలార్ద్ర
చందనాచలపవమానకందళములు
మొనసె నొకకడ సామిసంఫుల్లమల్లి
పాటలీచంపకోత్పలప్రౌఢిమములు. 46

ఈపద్యమునందు వర్షాదిషడృతువులు నందనవనమునఁ జేరియుండుట వర్ణింపఁబడినది.

(వ్యా) ఒక చోటన్—ఒకప్రదేశమునందు; ఘన—గొప్పదియగు; ఘనాఘన—వర్షాకాలపుమేఘమనెడు; రంగ—నాట్యస్థలంబునందు; విద్యున్నటీ—మెఱుపుఁదీఁగయను నర్తకియొక్క; నాట్యవిలసనములు—నృత్యవిశేషములు; కనుపట్టెన్—కానఁబడియెను;

ఇచట వర్షఋతువు వర్ణితము.

ఒకచాయన్—ఒకవైపున; వాపికా—నడబావులందలి; జలజాతజాల—తామరల మొత్తములయందు; వాచాల—శబ్దించుచున్న; హంసవ్రజంబు—హంసలగుంపు; చూపట్టెన్—కనఁబడెను;

ఇచట శరదృతువు వర్ణితము.

ఒక వంకన్ — ఒకపార్శ్వమునందు; దరదళత్ — కొంచెముగా వికసించుచున్న; సేవంతికా — చేమంతిపూలచేత; గంధ — వాసనగల; నీహారకణభరములు — మంచుబొట్లు; తలమూపెన్ — కనఁబడెను;

ఇచట హేమంతర్తువు వర్ణితము.

ఒక చక్కిన్ — ఒక ప్రదేశమందు; పుష్పిత — పూచిన; ఫలినీ — ప్రేంకణము; లవంగ — లవంగవృక్షములు; (వీనిచేత); వాసిత — పరిమళింపఁ జేయఁబడిన; శైత్యవైభవములు — చల్లఁదనములయొక్క విభవములు; పొడచూపెన్ — కనఁబడెను;

ఇచట శిశిరఋతువు వర్ణితము.

ఒకయెడన్ — ఒకచోట; తామ్రపర్ణీ జల — తామ్రపర్ణీనదీతోయములచేత; ఆర్ద్ర — తడిసిన; చందనాచల — శ్రీగంధపుఁబర్వతము (మలయాచలము) నుండి వచ్చెడు; పవమాన కందళములు — గాలిమొలకలు (అనఁగా మందమారుతములు); నెఱసెన్ — నిండెను.

తామ్రపర్ణీ నదీతీరమునందుఁ జందనవనంబు లుండునని వాల్మీకిమహర్షి రామాయణమున వర్ణించియున్నాఁడు:—

"తతస్తా మాపగాం దివ్యాం ప్రసన్న సలిలాం శివామ్
తత్ర ద్రక్ష్యథ కావేరీం విహృతా మప్సరోగణైః
తస్యాసీనం నగస్యాగ్రే మలయస్య మహౌజసః
ద్రక్ష్యథాదిత్యసంకాశ మగస్త్య మృషిసత్తమమ్
తత స్తేనా భ్యనుజ్ఞాతాః ప్రసన్నేన మహాత్మనా
తామ్రపర్ణీం గ్రాహజుష్టాం తరిష్యథ మహానదీమ్
సా చందనవనై ర్దివ్యైః ప్రచ్ఛన్నా ద్వీపశాలినీ
కాంతేవ యువతిః కాంతం సముద్ర మవగాహతే."

——రామాయణము-కిష్కింధాకాండము-సర్గము 41.

ఇచట వసంతర్తువు వర్ణితము.

ఒకకడన్ — ఒకప్రదేశమున; సామిసంఫుల్ల — సగము వికసించిన; మల్లీపాటలీచంపకోత్పల — ఈపుష్పములయొక్క; ప్రౌఢిమములు — ఆధిక్యములు; మొనసెన్ — కూడెను.

ఇచట గ్రీష్మఋతువు వర్ణితము.

క. మలయానిలసంగతిఁ జూ
తలతికలంకూరజాలదోహ్లాదవతు లై

యలయిక సడలించిన సౌ
మ్ములకై వడిఁ బాండుపత్త్రములు వెస జాఱెన్. 47

(వ్యా) మలయానిలసంగతిన్—మందమారుతముతోఁ గూడుటచేత; చూతలతికలు—మామిడితీఁగలు; (కొన్నివృక్షములను దీఁగలుగా వర్ణించుట కవిసమయము); అంకూరజాల—మొలకల గుంపులను; దౌహృదవతులై—గర్భచిహ్నముగాఁ గలవారై; ఇచ్చట స్త్రీలదౌహృదలక్షణ మగు రోమరాజిప్రకాశనమును రసాలవల్లరులకు మొలకల గుంపులను దౌహృదలక్షణముగాఁ గవి వర్ణించెను; “క్షామతా గరిమా కుక్షే ర్మూర్ఛా ఛర్ది రరోచకం, జృంభా ప్రసేకస్సదనం రోమరాజ్యాః ప్రకాశనం” అని వాహటుఁడు; అలయికన్—బడలికచేత; సడలించిన—తీసివైచిన; సొమ్ములకై వడిన్ — భూషణములవలె; పాండుపత్త్రములు—పండుటాకులు; వెసన్—శీఘ్రముగా; జాఱెన్—రాలెను.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. గురివెందఁ జైత్రుఁ డొందఁగఁ
గర మలుక న్మావి యవుడు కఱచిన నునువా
తెరమీఁదఁ గాన నగు పలు
వరుస యన న్ననలు పల్లవముపై మొనసెన్. 48

(వ్యా) గురివెందన్—గురివెందచెట్టును; చైత్రుఁడు—వసంతుఁడు; ఒందఁగన్—కూడఁగా; కర మలుకన్—మిక్కిలికోపముతో; మావి—మామిడిచెట్టు; అవుడుకఱచినన్—పెదవినిగొఱుకఁగా; నునువా తెరమీఁదన్—మృదువైన పెదవిమీఁద; ‘వాతెఱ’యని శకటరేఫమును గలదు; కానగు—కనఁబడు; పలువరుస యనన్—దంతపంక్తియో యనునట్లు; పల్లవములపైన్—చిగుళ్లమీఁద; ననలు—పుష్పములు; మొనసెన్—వ్యాపించెను.

ఇచ్చట ఖండిత యను నాయిక వర్ణింపఁబడినది. దీనికి లక్షణము. “విభుఁ డన్యసతిఁ జెంది వేకువరాఁగుందు నబల ఖండిత” అని కావ్యాలంకారసంగ్రహము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. తలిరాకుగుత్తిఁ దమిఁ గో
యిల చంచునఁ జించి క్రోల్చె నీరీతి వియో
గులగుండియ లవియింపుదు
బలువిడి నని మరునియెదుటఁ బచరించె ననన్. 49

(వ్యా) కోయిల_కోకిలము; తమిన్_ఆసక్తితో; తలిరాకుగుత్తిన్_చిగురు జొంపమును; చంచునన్—ముక్కుతో; చించి_చీల్చి; క్రోల్చెన్_కూసెను; ఈరితిన్—ఈవిధముగా; బలువిడిన్_పరాక్రమముతో; వియోగులగుండియలు_విరహులహృదయములను; అవియింపుదు ననిచీల్తువని; మరునియెదుటన్_మన్మథునియెదుట; పచరించె నన్_ప్రకటించెనో యనునట్లు; 'క్రోల్చెన్' అనుదానితో నన్వయము.

అలంకారము.—ఉత్ప్రేక్ష.

చ. మలయసమీరణచ్యుతసమంచితపాండుపలాశ లైనపా
దుల నునుసోగతీఁగలు యదుప్రభునిం దలఁపించె బాలచా
పలహృతతీరవస్త్ర లయి పంకరుహాకరమధ్యసీమలన్
నిలిచిన ముగ్ధగోపరమణీరమణీయవిలాసరేఖలన్. 50

(వ్యా) మలయసమీరణ—మలయానిలవ్యాప్తిచేత; చ్యుత_జాఱిన; సమంచిత—అందమైన; పాండుపలాశలైన_పండుటాకులుగల; పాదులన్—; నునుసోగతీఁగలు—మృదువులును పొడవులును నగు తీఁగలు; బాలచాపలహృతతీరవస్త్ర లయి—చిన్నఁదనపు వేడ్కచేత నపహరింపఁబడిన తీరమునందుంపఁబడిన చీరలుగలవారై; పంకరుహాకరమధ్యసీమలన్—తామరకొలఁకులమధ్యప్రదేశములయందు; నిలిచిన_ఉన్న; ముగ్ధ—సుందరులగు; గోపరమణీ_గోపికలయొక్క; రమణీయ—మనోహరమగు; విలాసరేఖలన్_లీలలను; యదుప్రభునిన్_కృష్ణుని; తలఁపించెన్_స్మరింపఁజేసెను.

స్మృత్యలంకారము. 'రమణీరమణీయ' అను చోట శబ్దాలంకారము—యమకము.

సీ. పరువంబు గాక చొప్పడనిమామిడితేనె
లాన నాసాస నట్టాడునవియుఁ
దమకించి చిగురాకు గమిచి నోరొగరైనఁ
గడఁగి గొజ్జెఁగనీటఁ గడుగునవియు
సంపంగెపొదరింటిచక్కి గోరఁటఁ గాంచి
యుసు రంచు మగిడి నోరూరునవియుఁ
గలిగొట్టుపసరుమొగ్గలఁ గోర్కిఁ బొలివోయి
మునుపటిమొల్లల మూఁగునవియు

ఆ. నగుచుఁ దేఁటికదుపు లామనిఁ దలసూపెఁ
జూపుదనుక నెల్లచోటఁ దోఁట
యందుఁ దామ యగుచు నమ్మరునెలగోలు
పౌఁజు లనఁగఁ జూడ్కిపండు వగుచు. 51

ఈపద్యంబున మధుకరవిలాసంబు లచ్చతెనుఁగుపదములతో నతిమనోహరముగా వర్ణింపఁబడినవి.

(వ్యా) పరువంబుగాక—ప్రాయమురాక (అనఁగాఁజక్కఁగా నెసఁగనికతన ననుట); చొప్పడని—చొప్పు + పడని—వల్లగాని (సరిపడని); మామిడితేనెలు — మామిడిపువ్వులతేనెలను; ఆనన్—త్రాఁగుటకు; ఆసాసన్—అడియాసలతో; అఱ్ఱాడునవియున్—ఇటునటు తిరుగునవియు;

అనఁగా మామిడిపూవులు చక్కఁగా వికసింపమిచే నందుఁ దమముక్కులఁ జొనిపి తేనెఁ ద్రాఁగుటకు వల్లకాక యిటు నటు తిరుగునవియు;

తమకించి—ఆసపడి; చిగురాకున్—పల్లవమును; కమిచి—కొఱికి; నోరు—; ఒగరైనన్—చిఱుచేఁదు (తువరము) కాఁగా; కడఁగి—పూని; గొజ్జెఁగనీటన్—గొజ్జెఁగపూవులతోఁ దడిసిననీటియందు; (గొజ్జెఁగపూల మకరందముచేత నాజలము మధురముగా నుండుటచేతఁ దుమ్మెద లొగరైన తమనోళ్లను గడిగె నని భావము);

సంపెంగపొదరింటిచక్కి — చంపకనికుంజప్రదేశమందలి; గోరఁటన్ — గోరంట చెట్టును; కాంచి—; ఉసురంచున్ — భయపడుచు; మగుడన్ — మరల; నోరూరునవియున్— తేనియఁ ద్రావఁ దమకపడునవియు;

అనఁగా గోరంటచెట్లపూవులతేనెలను ద్రావఁ బోయి యాప్రక్క సంపెంగపొద లుండుటను జూచి యవి తమకు విరోధులు కావున వానిపొంతకుఁ బోవ భయపడి వెండియు గోరంటపువ్వు దేనియలఁ దలఁచి వానిఁ ద్రావ నాసపడునవియు నని భావము;

తుమ్మెదలకు సంపెంగలకును విరోధము—

'చరన్వా నాం తేనవమంజరీషు, నషట్పదో గంధఫలీమజిఘ్రత్'—అని ప్రయోగము.

కలిగొట్టు — పాటలవృక్షముయొక్క; పసరుమొగ్గలన్ — పూపమొగ్గలయందు; కోర్కి—తమయొక్కయాశ; పాలివోయి—చెడి;(అనఁగాఁ దుమ్మెదలు తేనెఁ ద్రావుటకై పాటలవృక్షములందలిపచ్చిమొగ్గలచెంతకుఁ బోయి యందలిమకరందమును ద్రావఁజాలక నిరాశఁ జెంది యని భావము); మునుపటిమొల్లలన్—ముందు తా ముండిన మొల్లతీఁ

గలయందు; మూఁగునవియై — ముసరునవియు; అగుచున్ — అయి; తేఁటికదుపులు — తుమ్మెద గోదములు; ఆమనిన్ — వసంతర్తువునందు; చూపుదనుకన్ — చూపు పర్యవంతవఱకు; (అనఁగా నెంతదూరము చూచినను); ఎల్లచోటన్ — అన్నియెడలను; తోఁటయందున్ — వనమునందు; తామ యగుచున్ — నిండి వ్యాపించుచు; అమ్మరు — ఆమన్మథుని; ఎలగోలు — ముందునడుచు; పోఁజులనఁగన్ — దండులో యనునట్లు; చూడ్కి — పండు వగుచున్ — లోచనోత్సవకరములై; తలసూపెన్ — కనఁబడెను.

అలంకారము-(మిక్కిలి చక్కని) స్వభావోక్తి.

క. నందప్రియనందనుఁ డా
నందన మఖిలర్తునందనం బయి నయనా
నంద మొనరింప నమరీ
బృందంబులు గొలువఁ జనుచుఁ బ్రియసతి కనియెన్. 52

(వ్యా) అఖిలర్తునందనంబయి — సర్వర్తులకును సంతోషదాయి యై;
ఈపద్యమునందుఁ గావ్యగుణము సౌకుమార్యము.

చ. సరసిజనేత్ర చూచితె వసంతుఁడు నీవనవాటికారమా
తరుణియుఁ బాణిపీడనవిధానసమయంబునఁ గేలుదోయి నోం
డొరువయి సమ్మదంబు లిగురొత్తఁగ మాటికిఁ జల్లు సేసఁబ్రా
ల్నెరసె ననంగ వ్రాలెఁ గుహాళీవిగళన్నవకోరకావళుల్. 53

(వ్యా) పాణిపీడనవిధానసమయంబునన్ — పాణిగ్రహణము చేసికొనువేళయందు; (అనఁగాఁ బెండ్లియాడుసమయమున); కేలుదోయిన్ — హస్తద్వయముచేత; సేసఁబ్రాలు — శోభనాక్షతలు (పెండ్లిసమయంబున వధూవరు లొండొరులమీఁద మంగళార్థము పోసికొను తలఁబ్రాలనుట); నెరసె ననంగన్ — నిండెనో యనునట్లు; కుహాళీ......వళుల్ — కుహాళీ — పూగుత్తులనుండి; విగళత్ — జాఱుచున్న; నవకోరకావళుల్ — క్రొత్తమొగ్గలవరుసలు; వ్రాలెన్.

అలంకారము — ఉత్ప్రేక్ష.

చ. చిలుకలు వాఁడిచంచువులఁ జించినచో లవలీదళంబులన్
ఫలరసరేఖ లంటి కనుపట్టెడుఁ జూడుము చైత్రుఁ డీ లతా

లలనల గండదర్పణతలంబులఁ గుంకుమపత్త్రభంగముల్
చెలువుగ వ్రాసెనో యన నలిప్రకరాద్వయవాదికైశికా. 54

(వ్యా) అలిప్రకరాద్వయవాదికైశికా — అలిప్రకర — తుమ్మెదగుంపులతోడ; అద్వయవాది — అభేదమును జెప్పుచున్న; కైశికా — కొప్పుగలదానా; (అనఁగాఁ దుమ్మెదలవలె నల్లనివెండ్రుకలు గలదానా, యని సత్యభామకు సంబోధనము); వాఁడిచంచువులన్ — తీక్ష్ణమగుముక్కులతోడ; చించినచోన్ — చీల్చినప్రదేశములందు; లవలీదళంబులన్ — తమలపుటాకులవంటి యొకానొకయాకులందు; ఫలరసరేఖలు — చిలుకముక్కులయందంటుకొనియుండు ఫలరసరేఖలనుట; గండదర్పణతలంబులన్ — అద్దములవంటి చెక్కిళ్లయందు.

అలంకారము — ఉత్ప్రేక్ష.

ఉ. పాదపనూతనాంబుధరపంక్తివిముక్తమరందవర్షసం
పాదితశక్రగోపములభావము నందుచు నోయదృష్టసిం
హోదరసన్నివేశ కడు నొప్పెడు దాడిమబీజముల్ మదో
న్మాదితరాజకీరవదనత్రుటితోరుఫలచ్యుతంబులై. 55

(వ్యా) ఓయదృష్ట......సన్నివేశ — అదృష్ట — మాపఁబడని; సింహ — సింహము యొక్క (యుదరమువంటి); ఉదరసన్నివేశ — నడుముప్రదేశము గలదానా (సత్యభామా); అనఁగాఁ గానఁబడనంత సన్నని నడుముగలదానా యని భావము; మదోన్మాదిత — మదోన్మత్తములగు; రాజకీర — శ్రేష్ఠములగు చిలుకలయొక్క; వదన — నోళ్లచేత; త్రుటిత — త్రుంచఁబడిన; ఉరు — గొప్ప; ఫల — పండ్లయందుండి; చ్యుతంబులై — జాఱినవై; దాడిమబీజముల్ — దానిమ్మగింజలు; పాదప ...... భావమున్ — పాదప — వృక్షములయందలి; నూతనాంబుధరపంక్తి — క్రొత్తమేఘములవరుసలనుండి; విముక్త — విడువఁబడిన; మరందవర్ష — తేనెసోనలచేత; సంపాదిత — వృద్ధిపొందింపఁబడిన; శక్రగోపముల — ఇంద్రగోపములను పురుగులయొక్క; భావమును — విధమును; అందుచున్ — పొందుచు; కడు నొప్పెడున్ — మిక్కిలి ప్రకాశించుచున్నవి.

అనఁగాఁ జిలుకలు కొఱికినదాడిమపండులందలిగింజలు నేల రాలియుండినవి చూడ వానకాలమందలి యింద్రగోపపుఁబురుగులవలె నొప్పె నని భావము.

అలంకారము — ఉత్ప్రేక్ష.

క. తలిరాకు మెఱుఁగు వాతెఱ
కలకంఠవిటుండు గముచఁగాఁ జూతలతా

లలన విదిర్చెను గంటివె
యలికంకణముఖరవిటపహస్తముల సతీ. 65

(వ్యా) తలిరాకుమెఱుఁగువాతెఱ—చిగురనెడు ప్రకాశించుచున్న పెదవిని;

'వాతెఱ' యనుటకుఁ బ్రయోగము—

“ నెఱకురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పు లొప్పువా
తెఱయును దీనియాననముఁ దెల్వి కరంబు మనోహరంబునా
యెఱిఁగినయంతనుండి సతి నిట్టిలతాలలితాంగిఁ జూచి రే
నెఱుఁగ సురేంద్రకన్యకలు నిట్టిరె రూపవిలాససంపదన్.”

—భారతము—ఆదిపర్వము.

వాతెర యని రూపాంతరము. 'వాతెర' యనుటకీ యాశ్వాసమున 48 వ పద్యమునఁ బ్రయోగము.

కలకంఠవిటుండు—కోకిలయనువిటుఁడు; కమువఁగాన్ — కొఱుకఁగా; (కముచు ధాతువు తుమున్నంతరూపము); చూతలతాలలన — మామిడితీఁగ యనెడుసతి; అలికంకణ.....హస్తములన్—అలికంకణ—తుమ్మెద లనెడుహస్తాభరణములచేత; ముఖర—శబ్దించుచున్న; విటపహస్తములన్—కొమ్మ లనెడుచేతులచేత; విదిర్చెను—నిరాకరించెను.

అనఁగా మామిడితీఁగ స్త్రీవలెను దానిచిగురు పెదవివలెను నొప్పెననియు దానిని గోయిల యనెడు విటుఁడు కొఱుకఁగా నాతన్వి తనకొమ్మలనెడు హస్తములచేత నళిఝంకారము లనెడు కంకణధ్వనులు చెలంగఁగాఁ ద్రోసివైచిన ట్లుండె ననియు భావము.

అలంకారము—సావయవరూపకము; నాయిక ముగ్ధ.

చ. తనుఁ గనుఁబ్రామి యొండొకలతం బతి వేఱొక తేఁటిబోటి పొ
త్తున విరిదేనె గ్రోలఁగ నెదుర్పడి సంపఁగితావివెల్లిలోఁ
గనలునఁ గూలఁబోవునలికామినిసాహస మేమి సెప్ప న
య్యనుఁగుఁబ్రియుండు నెచ్చెలులు నాఁగిన మాన దరాళకుంతలా.

(వ్యా) అరాళకుంతలా—కుటిలాలకములు గల యోసత్యభామా; తనుఁ గనుఁబ్రామి—తన్ను మోసపుచ్చి; పతి—తనభర్తయగు మగతేఁటి; ఒండొకలతన్—మఱియొక తీఁగయందు; వేఱొక తేఁటిబోటిపొత్తునన్—వేఱొక మధుకరాంగనతోఁ గూడ; విరిదేనె గ్రోలఁగన్—మకరందమును ద్రాఁగుచుండఁగా; ఎదుర్పడి—సమక్షమునఁ జూచి;

సంపఁగితావివెల్లిలోన్ — చంపకకుసుమవాసనాప్రవాహమునందు; కనలునన్—కోపముతో; సూలఁబోవు—పడుటకై ప్రయత్నించిన; అలికామిని—భృంగాంగనయొక్క; సాహసమున్—తెంపరితనమును; ఏమిచెప్పన్—ఏమిచెప్పుమను; అయ్యానఁగుప్రియుండున్—దాని ప్రియభర్తయు; నెచ్చెలులున్ — సఖులును; ఆఁగినన్ — అడ్డగించినను; మానదు—తనప్రయత్నమును విడువదు.

అనఁగాఁ జంపకకుసుమవాసనాప్రవాహమునందుఁ గూలి ప్రాణములను విడువ వలయునను ప్రయత్నమును విడువ దనుట.

ఇచట ఖండిత నాయిక; ప్రౌఢ; దశమావస్థ యగు మరణోద్యోగము నెడు మన్మథావస్థ చెప్పఁబడినది.

చ. అనుచుఁ బ్రియాంసపీఠి నిజహస్తతలంబున నూఁది కల్పకా
వనిజదుకూలమార్జనల వంజులపుష్పమరందసేచనన్
దనదువిహారవైఖరికి నందనదేవత యాయితంబు సే
సినగతి నొప్పుదివ్యవనసీమ ముదంబున సంచరించుచున్. 58

(వ్యా) ప్రియాంసపీఠిన్—ప్రియురాలగు సత్యభామయొక్క మూఁపుపై; నిజహస్తతలంబునన్ — తనచేతితో; ఊఁది—ఊని; కల్పకా......మార్జనలన్—కల్పకావనిజ—కల్పవృక్షమునందుఁ బొడమిన; దుకూల—పట్టు వస్త్రములయొక్క; మార్జనలన్—తుడుచుటలచేతను; వంజులపుష్ప—అశోకపుష్పములయొక్క; మరందసేచనన్—మకరందముయొక్క తడుపుటచేతను; తనదు విహారవైఖరికిన్ — తనవిహారప్రక్రియకు; నందనదేవత—వనదేవత; ఆయితంబు సేసినగతిన్—సిద్ధపఱచియుంచినట్లు; ఒప్పు—ప్రకాశించు.

అలంకారము—ఉత్ప్రేక్ష.

శా. అర్చిష్మత్ప్రతిమప్రతాప మహనీయత్యాగ దైత్యాభిమా
త్యర్చోద్యచ్చతురర్ణవాంతసకలజ్యాభోగ జాగ్రద్యశ
శ్చర్చాసాంద్రదిగంతరాళ మదనశ్యామాసహాయేంద్రభూ
వర్చ స్తేనశరీరమోహితజగద్వామా కళామానసా. 59

(వ్యా) అర్చిష్మ......తాప—అర్చిష్మత్ - అగ్నితో; (సూర్యునితోడననియు నొకయర్థము); ప్రతిమ — సమానమైన; ప్రతాప — శౌర్యము కలవాఁడా; మహా...త్యాగ—మహనీయ—గొప్ప; త్యాగ—ఈవి గలవాఁడా; దైత్యా...భోగ—

దైత్యాభియాతి–రాక్షసులవిరోధియైన విష్ణువుయొక్క; అర్చా–పూజచేత; ఉద్యత్–అతిశయించుచున్న; చతురర్ణవాంత – నాలుగుసముద్రములమధ్యమందలి; సకలజ్యాభోగ–సమస్తభూములభోగములు గలవాఁడా; 'క్షోణీజ్యా కాశ్యపీక్షితిః' అని యమరుఁడు; జాగ్ర......రాశీ—జాగ్రత్ – ప్రకాశించుచున్న; యశః – కీర్తియొక్క; చర్చా–పూఁతలచేత; సాంద్ర–దట్టమైన; దిగంతరాశీ–దిఙ్మధ్యప్రదేశములు గలవాఁడా; అనఁగాఁ కృష్ణరాయలకీర్తి సమస్తదిగంతములయందును వ్యాపించె నని భావము; మదన......వామా—మదన–మన్మథుఁడు; శ్యామాసహాయ – చంద్రుఁడు, (శ్యామా–రాత్రి); ఇంద్రభూ–ఇంద్రునికొడుకైన జయంతుఁడు; (వీరియొక్క) వర్చస్–కాంతులకు; స్తేన–దొంగయైన; అనఁగాఁ జంద్రాదులకంటె నతిశయించిన లావణ్యముగల; 'శ్యామాస్యా చ్ఛారిబానిశా' అని యమరుఁడు; శరీర–తనయొక్క దేహముచేత; మోహిత–మోహితురాలుగాఁ జేయఁబడిన; జగద్వామా – జగత్తను స్త్రీ కలవాఁడా; కళామానసా–కళా–సమస్తవిద్యలు కలిగిన; మానసా–మనస్సుగలవాఁడా.

(వి) ఒకవస్తువును మఱియొకవస్తువు దొంగలించినదని వర్ణింపఁగా దాని కిది సమానమని భావము. ఈ విషయమునుగుఱించి – ఆ 2. పద్యము 53 వ్యాఖ్యానమును (119 వ పుటను) జూచునది.

'శారద కమలోదరరుచి, చోరకమగు చూపువలన సుందర మమ్మం
గోరి వెలయీనిదాసుల, ఘోరత నొప్పించుటిది వధించుటగాదే.'

—భాగవతము–స్కంధము 10.

క. విదళితకాళింగమదా
స్పదసింధురకుంభరత్నశర్కరిలారా
దుదయగిరికొండవీటీ
పదవీస్థల మండలీకభాస్కరబిరుదా. 60

(వ్యా) విదళిత–చీల్పఁబడిన; కాళింగ–కళింగదేశాధిపతియొక్క; మదాస్పదసింధుర – మదించినయేనుఁగులయొక్క; కుంభ–కుంభస్థలములందలి; రత్న–మణులచేత (ఇచట ముత్యములని భావము); శర్కరిల–గుల్లలతో నెఱపఁబడిన; ఆరాత్–దూరము నందలి; (దీనికి సమీపమనందనియు నర్థము కలదుగాని, కళింగదేశమున నుదయగిరికొండవీడుప్రదేశములు దూరములగుటచే నిచట దూరమునందలి యనునర్థమే యుక్తమని యెఱుంగునది); 'ఆరా ద్దూర సమీపయోః' అని యమరుఁడు; ఉదయగిరి కొండవీటీపదవీస్థల–ఉదయగిరి, కొండవీడు, అను నీముఖ్యప్రదేశములు కలవాఁడా; (అనఁగాఁ గృష్ణదేవ

రాయలు కళింగదేశాధిపతిని జయించి యతనిమదపుఁటేనుఁగులఁ జంపి వానికుంభస్థలము లందలిముత్యములను పూరమునం దుండు నుదయగిరి కొండవీడు ప్రదేశములకుఁ బంపె నని భావము); మండలీకభాస్కరబిరుదా—మండలీకభాస్కరుఁ డనుబిరుదు కలవాఁడా.

## పంచచామరము

మరుద్వృధాతటస్థశత్రుమండలీగళాంతర
క్షరన్నవాసృగాపగాభిసారికాదృతాంబుధీ
మరుత్పతిస్వరుక్షతిక్రమత్రుటత్కుభృద్వర
స్ఫురద్ధ్వనిప్రవృద్ధయుద్ధపుంఖితానకార్భటీ. 61

(వ్యా) మరుద్వృధా...అంబుధీ—మరుద్వృధా—కావేరీనదియొక్క; (మరుత్—గాలులచేత; వృధా—వృద్ధిగలదియని యవయవార్థము);

'ఇమమ్మే గంగే యమునే సరస్వతి శుతుద్రిస్తోమగ్ం సచతా పరుష్ణియా,
అసిక్నియా మరుద్వృధే వితస్తయా ఽఽర్జీకీయే శృణు హ్యాసు షోమయా.'
—అని తైత్తిరీయారణ్యకము.

తటస్థ — తీరమునందున్న; శత్రుమండలీ — శత్రుసమూహములయొక్క; గళాంతర — గొంతుకల మధ్యములనుండి; క్షరత్ — జాఱుచున్న; నవాసృగాపగా — క్రొన్నెత్తురుటేఱు లనెడు; అభిసారికా — అభిసారికాస్త్రీలచేత; ఆదృత — సంతోషపఱుపఁబడిన; అంబుధీ — సముద్రము కలవాఁడా; (అనఁగాఁ కృష్ణరాయలు కావేరీతీరప్రాంతములందలి శత్రురాజులను జంపి వారి నెత్తురు టేఱులుగాఁ బ్రవహించి సముద్రమువఱకుఁ బాఱునట్లు చేసెననియు, నవి చూడ నానెత్తురుటేఱు లభిసారికలవలెను నవి సముద్రమువఱకుఁ బోవుట యభిసారికలు ప్రియునిఁగూర్చి చనునట్లును నుండె ననియు భావము); మరుత్పతి...కార్భటీ—మరుత్పతి—ఇంద్రునియొక్క; స్వరు—వజ్రాయుధముయొక్క; క్షతిక్రమ—ఏటులవరుసచేత; త్రుటత్—పగిలిన; కుభృద్వర—పర్వతశ్రేష్ఠములవలె; స్ఫురత్—అధికమగు; ధ్వని—శబ్దములచేత; ప్రవృద్ధ—అతిశయించుచున్న; యుద్ధ—యుద్ధమునందలి; పుంఖిత—గుంపు లగు; ఆనక—భేరులయొక్క; ఆర్భటీ—మ్రోఁత గలవాఁడా; అనఁగాఁ గృష్ణరాయలు యుద్ధమునందుఁ దీసికొనిపోవు భేరులమ్రోఁతలు దేవేంద్రుని వజ్రాయుధహతిచేఁ గూలుపర్వతములధ్వనులవలె నొప్పె నని భావము.

(వి) ఈపద్యమును జదువునపు డానకారావములపగిది నుండును.

## గద్యము

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నందిసింగయామాత్యపుత్త్రి కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ
తిమ్మయనామధేయ ప్రణీతం బైన పారిజాతాపహరణం
బను మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

## వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీపరమేశ్వరీసనాథ నిరంతరభజన నాగపూడిగ్రామాభిజన
భారద్వాజగోత్ర సామగద్రాహ్యాయణసూత్ర పవిత్రచరిత్ర
యజ్ఞేశ్వరార్యపుత్త్రి సూక్తిపరితోషితార్య కుప్పుస్వా
మ్యార్యప్రణీతం బైన పారిజాతాపహరణ
మహాకావ్య వ్యాఖ్యావికాసం బగు
పరిమళోల్లాసంబునందుఁ
ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# పా రి జా తా ప హ ర ణ ము



## చ తు ర్థా శ్వా స ము

### పా రి జా త ము

క. శ్రీవేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయక కవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా. 1



(వ్యా) శ్రీవేంకటగిరి వల్లభ_శ్రీవేంకటాచలస్వామియొక్క; సేవా_భజనము నందు; పరతంత్ర_ఆసక్తమైన;హృదయ_మనస్సుకలవాఁడా; చిన్నమదేవీజీవితనాయక_చిన్నాదేవి యనురాణియొక్క ప్రాణేశ్వరుఁడా; కవితాప్రావీణ్యఫణీశ_కవిత్వచాతురియం దాదిశేషునివంటివాఁడా; కృష్ణరాయమహారాజు కవిత్వముచేయుటయం దసాధారణ సామర్థ్యము గలవాఁ డనుట.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
మరునఁ కిట్లను నవ్వ్యాసవల్లభుండు
వనవిహారంబు సలుపుచు వచ్చి వచ్చి
పారిజాతంబు గాంచి సంభ్రమ మెలర్ప. 2

సుగమము.

మ. అమరారాతివిఘాతి సత్యఁ గని కాంతా చూచితే పారిజా
తము భూమీరుహచక్రవర్తి త్రిజగత్సంపూజ్యసౌరభ్యకీ
ర్తి మరుల్లోక మలంకరించునది గౌరీనాథుజూటస్థలం
బు మృగాంకుండు రమామనోరము నురంబుం గౌస్తుభంబుంబలెన్. 3

(వ్యా) అమరారాతివిఘాతి—దేవతలశత్రువు లగురాక్షసులను జంపువాఁడు (కృష్ణుఁడు); 'సత్యఁ గని' అను నీయసమాపకక్రియకు 11వ పద్యమున 'నాపుడున్' అను నానంతర్యార్థకక్రియావిశేషణముతో నన్వయము; భూమీరుహచక్రవర్తి—వృక్షరాజు; త్రిజగత్—ముల్లోకములచేత; సంప్రాజ్య—పూజింపఁదగిన; సౌరభ్య—సువాసనవలని;కీర్తి; యశస్సుకలిగినది; గౌరీనాథుజూటస్థలంబున్—పరమశివునిమౌళిభాగమును; మృగాంకుండున్—చంద్రుఁడును; రమామనోరమునురంబున్—విష్ణువుయొక్క వక్షస్థలంబును—కౌస్తుభంబుం బలెన్—కౌస్తుభమణియునువలెను; మరుల్లోకమును—స్వర్గమును; అనఁగాఁ బరమేశ్వరునిశిరంబును జంద్రుఁ డలంకరించునటులును విష్ణునురంబును గౌస్తుభ మలంకరించునటులును బారిజాతవృక్షము స్వర్గము నలంకరించుచున్న దని భావము.

అలంకారము—ఉపమ.

క. తరుణీ యీతరుశాఖాం
తరలోలదుకూలమారుతము లింద్రాణీ
పరివార వారసతులకుఁ
బరువపువిరికోఁతఁ బొడముబడలిక నడఁచున్. 4

(వ్యా) ఈతరుశా.........తములు...—ఈ తరుశాఖాంతర—ఈపారిజాత వృక్షముయొక్క కొమ్మలమధ్యములయందు; లోల—చలించుచుండు; దుకూల—పట్టువస్త్రములవలనఁ బొడమిన; మారుతములు—వాయువులు; ఇంద్రాణీ—శచీదేవియొక్క; పరివార—పరిచారికలగు; వారసతులకున్—దేవవేశ్యలకు; పరువపువిరికోఁతన్—చక్కఁగాఁ బూచిన పుష్పములను గోయుటచేత; పొడము—కలుగు; బడలికన్—శ్రమమును; అడఁచున్—పోఁగొట్టును.

ఇందు 'ఈ' యనుశబ్దము 'తరు'శబ్దమునకు విశేషణమగుటచే నేకదేశాన్వయము. దీనింగూర్చిన చర్చను ఆ 2-70 వ్యాఖ్యానమునఁ జూడనగు.

ఉ. మానిని దీనిరత్నకుసుమస్తబకమ్ములకాంతిఁ గమ్మఁబూఁ
దేనియ యంచుఁ గ్రోలఁ జనుదెంచిన యా యెలదేఁటి దాఁటు లో
నూనినదప్పి మూఁగఁబడి యున్నతచంచలచంచుకోటిచే
నానెడుఁ జూడు మందగరుదంచలఝుంకృతు లుల్లసిల్లఁగన్. 5

(వ్యా) స్తబకమ్ము—పూగుత్తి; ఎలదేఁటి—లేఁబ్రాయపుఁదుమ్మెద; దాఁటు లోన్—పరుగెత్తుటలో; ఊనినదప్పిన్—ఒదవినతృష చేత; మూఁగఁబడి—చుట్టుకొనఁబడి;

ఉన్నత-పొడవైన; చంచల-కదలుచుండు; చంచుకోటిచేన్-ముక్కుకొనచేత; మంచి-తిన్నని; గరుదంచలఝుంకృతులు-రెక్కలతుదలయొక్క ఝుంకారములు; ఉల్లసిల్లఁగన్-ప్రకాశింపఁగా; ఆనెడున్-త్రాగుచున్నది.

అలంకారము-భ్రాంతిమంతము.

క. ఈతరుశాఖల ద్రేలెడు
మేతొడవులకాంతిలోన మెలఁగెడుపక్షి
వ్రాతము నెఱుఁగరు నిర్జర
కాతరలోచనలు పలుకఁగా వినకున్నన్. 6

(వ్యా) నిర్జరకాతరలోచనలు - దేవతాస్త్రీలు; (కాతరలోచనలు — చకితనేత్రలు; 'అధీరే కాతర స్త్రస్నో భీరుభీరుకభీలుకాః' అని యమరుఁడు; ఈతరుశాఖల ద్రేలెడు-ఈకల్పవృక్షపుఁగొమ్మలయందు వ్రేలుచున్న; మేతొడవుల-శరీరాభరణముల యొక్క; కాంతిలోనన్-ప్రకాశములో; మెలఁగెడు-సంచరించు; పక్షివ్రాతమున్-పక్షులగుంపులను; పలుకఁగా వినకున్నన్-అవిశబ్దింపఁగాఁ దమకువినఁబడదేని; ఎఱుఁగరు-(పక్షు లున్న వని) తెలిసికొనరు.

అనఁగా నీపక్షులశరీరపుఁగాంతులును నాకల్పవృక్షపు శాఖలయందుఁ దగిల్చియుండు తమభూషణములకాంతులును నేకరీతిగా నుండుటచేత వానియెలుఁగులవలన నవి యున్న వని దేవతాస్త్రీలు తెలిసికొందురుగాని నాయెలుఁగులు వినఁబడకున్నచోఁ బక్షు లున్నవని వా రెఱుంగఁజాలరని భావము.

అలంకారము—సామాన్యము.

క. తనపాదుజలములోనం
గనుపట్టెడునీడ నీనగము విలసిల్లున్
మనకన్న మున్న తా మే
దినికిం డిగి యేగుచున్న తెఱఁగునఁ దరుణీ. 7

(వ్యా) ఈనగము-ఈపారిజాతవృక్షము; మనకన్నన్-మనకంటె; (కన్నన్ అనునది పంచమీవిభక్తిప్రత్యయమగు 'కంటెన్' అనుటకుఁ బర్యాయపదము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

ఉ. వారణరాజయాన సురవల్లభుఁ డాశచి నంకపీఠముం
జేరిచి సోఁగవెండ్రుకలఁ జిక్కులు వాపి వియన్నదీనవాం
భోరుహనాళసూత్రములఁ బొందుగ దీనిలతాంతము ల్సరు
ల్గా రచియించి నించుఁ గుతుకంబున వీఁగుమెఱుంగుఁగ్రొవ్వెదన్. 8

(వ్యా) వారణరాజయాన—మదగజగమనా (అని సత్యభామకు సంబోధనము); అంకపీఠమున్—తొడప్రదేశమునందు; చేరిచి—; సోఁగవెండ్రుకలన్—దీర్ఘమైన కేశపాశములందలి; చిక్కులువాపి—చిక్కులు విడఁదీసి; వియన్నదీ.....సూత్రములన్—వియన్నదీ—ఆకాశగంగయొక్క; నవాంభోరుహ—క్రొత్తకమలములయొక్క; నాళ—తూఁడులనెడు; సూత్రములన్—దారములచేత; దీనిలతాంతముల్—ఈపారిజాతకుసుమములను; పొందుగన్—చక్కఁగా; అందముగా; సరుల్గాన్—హారములుగా; రచియించి—చేసి (కూర్చి); కుతుకంబునన్—సంతోషముతో; వీఁగు—ఘనమైన; మెఱుంగు—తళతళలాడు; క్రొవ్వెదన్—కొప్పునందు; నించున్—చుట్టును.

అలంకారము—స్వభావోక్తి.

మ. విను మింతు ల్తిలకంబుఁ జంపకముఁ గ్రోవి న్సిందువారంబుఁ బ్రేం
కనము న్మామిడి గోఁగుఁ బొన్నఁ బొగడం గంకేళి నూహించి క
న్గొన మోమెత్తఁగఁ గౌఁగిలించుకొన మూర్కొఁ బాడఁ జేనంటఁ బ
ల్క నగం గల్లుమియంగఁ దన్న ననుచుం గల్పాగ మాయావిరుల్. 9

ఈపద్యమునందును దీనికిఁ బిమ్మటిపద్యమునందును దోహదక్రియలువర్ణింపఁబడినవి.

(వ్యా) ఇంతుల్—స్త్రీలు, (దేవతాస్త్రీలనుట); తిలకంబున్—బొట్టుగుచెట్టును; ఊహించి—మనంబున భావించి; ఈపద మొక్కొక్కచెట్టుతోడను జేర్చి పఠింపవలయును; కన్గొనన్—చూడఁగా (ఈకల్పనగమును జూడఁగా); తిలకో వీక్షణేన చ' అని దోహదశాస్త్రము; చంపకమున్—సంపెంగను; (ఊహించి); మోమెత్తఁగన్—ముఖరాగము చేయఁగా ('ముఖరాగేణ చంపకః'); క్రోవిన్—గోరంటవృక్షమును; (ఊహించి); కౌఁగిలించుకొనన్—ఆలింగనముచేయఁగా ('ఆలింగనా త్కురవకః'); సిందువారంబు—వావిలిచెట్టును; (ఊహించి); మూర్కొన్—వాసనచూడఁగా ('సిందువారో ముఖానిలాత్'); ప్రేంకణమున్—ప్రియాళువృక్షమును; (ఊహించి); పాడన్—గానముచేయఁగా '(గీతాత్ప్రియాళు ర్నితరాం'); మామిడిన్—మామిడిచెట్టును; (ఊహించి); చేనంటన్—తాఁకఁగా ('కరస్పర్శేన మాకందః'); గోఁగున్—కర్ణికారవృక్షమును; (ఊహించి); పల్కన్—మాట

లాపఁగా ('సల్లాపతః కర్ణికారః'); పొన్నన్—సురపొన్నను; (ఊహించి); నగన్—నవ్వఁగా ('సమేరుర్హసితేనచ'); పొగడన్—వకుళవృక్షమును; (ఊహించి); కల్లుమియన్—ముఖాసవము నుమియఁగా ('వకుళో ముఖసీధునా'); కంకేళిన్—అశోకవృక్షమును; (ఊహించి); తన్నన్—కాలితోఁదన్నఁగా ('అశోకశ్చరణాహత్యా'); కల్పాగము—కల్ప వృక్షము; ఆయావిరుల్—ఆయాచెట్లుల పుష్పములను; ననుచున్—పూచును.

ఈపద్యమునందు దోహదశాస్త్ర మంతయుఁ జెప్పఁబడినది.

అనఁగా దేవాంగనలు కల్పవృక్షముచెంతకుఁ బోయి యేయితరవృక్షము నైనను మనంబులఁ దలంచి దానికిఁ జెప్పఁబడియుండు దోహదక్రియను జేయఁగా నావృక్షముయొక్క పుష్పమును గల్పవృక్షము పూచు నని తాత్పర్యము.

అలంకారము—యథాసంఖ్యము.

చ. కనఁ దిలకంబుఁ గేసరముఁ గల్లుమియ న్నగిఁ బాడఁ బ్రేంకణం
బు నిమురఁ మావి నవ్వ సురపొన్న ముఖాంబుజ మెత్తఁ జంపకం
బు నెఱ గవుంగిలం గొరవి మూర్కొన వావిలి దన్న వంజుళం
బు నుడువ గోఁగు నై తరుణి పూచు సురద్రుమ మన్నిపువ్వులన్.

ఈపద్యమునందును క్రమాలంకారవివక్ష లేక దోహద క్రియలు చెప్పఁబడినవి.

ఇందలివిశేష మేమనఁగా సురతరుణు లితరవృక్షంబులను మనంబులఁ దలంపక యే కల్పవృక్షమునకు దోహదక్రియలుసలుపఁగా నాక్రియలచే నేయేచెట్లులు పూచునో యాయాచెట్లులు తానేయై యాయాచెట్లులపువ్వుల నీకల్పవృక్షమే పూచు నని చెప్పఁబడినది.

(వ్యా) కేసరము—పొగడచెట్టు; నిమురన్—కరస్పర్శముచేయఁగా; కవుంగిల—ఆలింగనముచేయఁగా; 'కవుఁగిలించు' అనుధాతువున కిది 'యించు'గాగమము లేనిరూపము; ఇట్టిశబ్దము 'దొంగిలు' 'దొంగిలించు' అనుటకు రూపాంతరము; కొరవి—గోరంటచెట్టు; వంజుళము—అశోకవృక్షము.

ఉ. నావుడు సత్యభామ నిజనాథున కిట్లను నేల తామసం
బే విబుధాధినాయకమహీరుహముం బెకలించి లోకసం
భావిత మైననీపలుకుఁ బంతము సెల్ల మదీయగేహకే
ళీవనవాటి వేడుక దలిర్పఁగ నిల్పుము జీవితేశ్వరా.

(వ్యా) తామసము_ఆలస్యము_(ఇది దేశ్యపదము); పెకలించి_పెల్లగించి; లోకసంభావితమైన_లోకులచేత నెన్నఁబడిన (అనఁగాఁ గొనియాడఁబడిన); పంతము_ప్రతిజ్ఞ; చెల్లఁగ౯_నెఱవేఱునట్లుగా.

మ. అనినం గైటభదైత్యవైరి దరహాసాంకూరము ల్మోవిపై
మొనయం గొండొక నిల్చి యివ్వనమున న్మోదంబుతో నిర్జరీ
జనము ల్గోల్వఁగఁ గ్రీడ సల్పి భవదిష్టం బేను గావింతు నం
గన యం చా తరురత్నగుచ్ఛ మిడియెం గర్ణావతంసంబుగ౯. 12

(వ్యా) దరహాసాంకూరముల్ _ చిఱునగవు మొలకలు; మోవిపై౯_అధరము మీఁద; మొనయఁ౯_వ్యాపింపఁగా; కొండొక_ఇంచుక; నిర్జరీజనముల్_దేవతాస్త్రీలు; కావింతును_నెఱవేర్తును; కర్ణావతంసంబుగ౯_చెవియందుఁ దాల్చు నాభరణముగ.

ఉ. ఈపగిది న్మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి నిర్జరేం
ద్రోపవనస్థలంబునఁ బయోరుహనేత్రయుఁ దానుఁ జేరి పు
ష్పాపచయప్రమోదభరితాత్మకుఁడై చిదిమె న్లతాంతముల్
గోపవధూకుచస్తబక లోల నిశాత నఖాంకురంబుల౯. 13

(వ్యా) పుష్పాపచయ_పువ్వులుగోయుట; చిదిమె౯_గిల్లెను; నిశాత_తీక్ష్ణము లగు; నఖాంకురంబుల౯_కొనగోళ్లచేత.

మ. ఎలదేఁటు ల్దమవాలుఁగన్గవలపై నిందీవరభ్రాంతిచే
మెలఁగం జేరలఁ గప్పుకో నలవి గామిం జీదఱం జెంది యి
చ్చలఁ గాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుషత్వంబు న
య్యలిభీతి న్ముకుళీకృతాక్షి యగు సత్యాకాంత నీక్షించుచు౯. 14

(వ్యా) ఎలదేఁటుల్ _ తుమ్మెదకొదమలు; ఇందీవరభ్రాంతిచే౯_నల్లకలువలనెడు భ్రమచేత; తమవాలుఁగన్గవలపై౯ _ నిడుదలగు తమ లోచనద్వయములమీఁద; మెలఁగ౯_సంచరింపఁగా;

ఇచట భ్రాంతిమదలంకారము.

నిర్నిమేషజలజాస్యల్_దేవతాస్త్రీలు (నిర్నిమేష_ఱెప్పపాటు లేనివారు; అనిమిషులు_దేవతలు); చేరల౯_ప్రసరించిన తమహస్తములచేత; కప్పుకో౯_(తమకన్ను

-లను) మూసికొనుటకు; అలవిగామిన్ — శక్యముకాకుండుటచేత; అనఁగాఁ దమనేత్రములు చేరలకంటెను విశాలము లైనవని భావము). (అతిశయోక్త్యలంకారము వ్యంగ్యము.) (ఇచట నర్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని.) చిఁదలంజెంది — విసుఁగుఁజెంది; అయ్యలిభీతిన్ — ఆతుమ్మెదలవలని భయముచేత; ముకుళీకృతాక్షి యగు — కన్నులుమూసికొనిన; సత్యాకాంతన్ — సత్యభామను; ఈక్షించుచున్ — చూచుచు; ఇచ్చలన్ — కోర్కెలందు; హృదయములందని భావము; మానుషత్వంబున్ — మనుష్యజాతిత్వమును; కాంక్షించిరి — కోరిరి.

అనఁగా నాతుమ్మెదలు నల్లఁగలువలను భ్రాంతిచేఁ దమకన్నుల మ్రోల సంచరింపఁగా నానికి భయపడి సత్యభామ కన్నులుమూసికొనెననియు, నట్టుల తాము గన్నులు మూసికొనఁదలఁచియు నవి తమచేరలకంటెను విశాలములగుటచేఁ జేరలతో మూసికొనఁజాలకయు, ననిమిషలగుటచేఁ దమ ఱెప్పలను మోడ్చి కన్నులను మూసికొనఁజాలకయు, దేవతాస్త్రీలు విసిగి తమకును మానుషత్వముండిన లెస్సయని దానిం గోరిరనియు భావము.

ఉ. అంబరచారి పంకజదళాక్షులు చంపకపుష్పరేణు జా
లంబులయందు సర్వశుభలక్షణరేఖలఁ బొల్చునట్టి పీ
తాంబరు పాదపంకజము లంటినతావులు ద్రొక్క నోడి పా
ర్శ్వంబుల సంచరింతురు పరస్పరకేళివచఃప్రసంగతిన్. 15

(వ్యా) అంబరచారిపంకజదళాక్షులు — దేవతాస్త్రీలు (అంబరచారి — దేవత); రేణు — పొడి; సర్వశుభలక్షణరేఖలన్ — పద్మము చక్రము మొదలగు శుభసూచకంబులగు రేఖలచేత; ఓడి — భయపడి; పరస్పర — ఒండొరుల; కేళివచఃప్రసంగతిన్ — వినోదక్రీడాసంభాషణములయొక్క కూడికతో (అనఁగా వేడుకమాటలాడుచు నని భావము).

## పుష్పాపచయము

(వృషగతిరగడ)

కొమ్మ వేగిర మేటికే కొనగోర గోరఁటవిరులు గిల్లుము
తమ్మిపువ్వులమీఁద జలములదార దారకయుండఁ జల్లుము
మృగవిలోచన మేను చుఱుకన మేలమే లత నిటులు వ్రేయఁగ
వగవ నేటికిఁ జూడుమీ గొరవంకవంకఁ బ్రియుండు డాయఁగ
నలుగ నేటికి ముద్దుమీ చెలువార వారణయాన మొల్లలు

పొలంతి నైంపవు మాకు నీకయ పోలుఁ బో లులివడినకల్లలు
పన్నిదం బిడఁ బ్రేంకనమునన బాడి పాడి దొఱంగి తెచ్చితిఁ
బొన్నమొగ్గలఁ గంటసరి పూఁబోఁడి పోఁడిమి గాఁగ గ్రుచ్చితి
వడుగ నేటికి దీనివిరులు దురాశ రా శఫరీవిలోచన
జడఁ బరాగము నిండె దుడువు రసాల సాల మరంద సేచనఁ
జామరో సురపొన్నలకు నీ చాయఁ జాయలఁ బల్కనేటికె
భామ కోయకు వేగపడి పూఁబాళఁ బాళము గాదు నేఁటికి
మగువ పలుమఱు దిగిచి చూచుట మానుమా నులివడియె దండలు
మగిడి చనుఁ డీఁక నేల యీ యెలమావి మా విహరించుదండలు
పలుకకుము తుచ్ఛములు పలుమఱు బాల బాలకి యన్నఁ దిట్టితి
వలసగమనముఁ జూపి చెలి నీ వంచ వంచన నేసి పట్టితి
తావిబుగులుగొనంగఁ దొడఁగె ఘృతాచి తాఁచితె యీయశోకము
రావె తేనియ కంచుఁ బలికెదు రంభ రంభలలో ననేకము
ననలు వేఁడిన మొఱఁగి తప్పదు నాలి నా లికుచంబు ముట్టకు
మెనయుఁ బ్రాణపదంబుగాఁ దలఁ తీవ తీవ తలంగ మెట్టకు
మంజుఘోష సువర్ణలత లనుమానమా నందనవనంబున
నంజ దిది యెలదేఁటి కన నే మఱచె మఱచెదమే మనంబున
నమృతమధురము లైనఫలరస మాని మానిని త్రుళ్లె శుకములు
గుములు లగులేమావిచిగురులు గోయఁ గో యని కూసెఁ బికములు
గుమగుమని వాసనలగేదఁగికొమ్మ కొమ్మకు నందె దోఁటికి
రమణి గొజ్జఁగిపొదలు గడు దూరమ్ము రమ్ము చలమ్ము లేటికి. 16

ఈ రగడయందు దేవతాస్త్రీలు కుసుమాపచయ మొనర్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) కొమ్మ...గిల్లుము—కొమ్మ—ఓవనితా; వేగిర మేటికే—ఏల త్వరపడియె దవు; కొనగోరన్ — నఖాంకురముచేత; గోరఁటవిరులు — గోరంటపువ్వులు; గిల్లుము— కోయుము; తమ్మిపువ్వుల...జల్లుము — తమ్మిపువ్వులమీఁదన్ — తామర పుష్పముల

మీఁద; జలములధార—నీటిధార; తొరకయుండఁగ—చేరకుండునట్లుగా; పల్లము—నీటిని నల్లము.

మృగవిలోచన......వేయఁగ—మృగవిలోచన - జింకకన్నులుగలయోలలనా; మేనుచులుకనఁగ—దేహమునకు నొప్పి కలుగునట్లుగా; లతఁగ—తీఁగను; ఇటులు—ఈప్రకారము; వేయఁగ—కొట్టుట; మేలమే—పరిహాసమే;

పగవనేటికి.........డాయఁగ—వగవనేటికిఁ—విచారపడనేల; గోరవంక వంకఁ—గోరంకిపిట్టప్రక్కను;

అలుగనేటికి.........మొల్లలు—ముడువుమీ—ధరింపుమా;

పాలఁతి.........కల్లలు—మాకు సైపవు—మాకు రుచింపవు; లలిపడినకల్లలు—నీనసుగుకల్లమాటలు; నీకయ—నీకే; పోలుఁబో—తగునుబోమ్మ;

పన్నిదంబిడ.........తెచ్చితిఁ—పన్నిదం బిడఁ—పందెము పెట్టఁగా; పాడిగోటలంగి—న్యాయమును విడిచి; పాడి—పాటలుపాడి; పేంకణమునన—ప్రియాళిఁకు సుమమును; తెచ్చితిఁ—తెచ్చితిని;

పొన్నమొగ్గల......గుచ్చితివి—పూఁబోఁడి—ఓచెలియా; పొన్నమొగ్గలఁ—పొన్నమొగ్గలచేత; పోఁడిమిగాఁగ—అందముగా; కంటసరిఁ—మెడనుధరించెడు హారముగా; (కంటసరి యని కొన్నిపుస్తకములలోఁ బాఠము కానఁబడెడు); గుచ్చితివి—కూర్చితివి.

అడుగనేటికి.........లోచన—రా-రమ్మ; శఫరీవిలోచన—మీననేత్ర;

జడఁబరాగము.........నేచనఁ—జడఁ—వేణియందు; పరాగము—పుష్పొడి; గసాలసాలపుకందనేచనఁ — తియ్యమామిడిచెట్టు పూఁదేనియచేఁ దడుపుటచే; తుడువు—గుడువుము;

చామరో.........నేటికిఁ—చామరో—ఓయింతీ; 'రో' యను ప్రత్యయము స్త్రీవాచకశబ్దములకు సంబోధనార్థమందువచ్చును; సురపొన్నలకుఁ—సురపొన్నపూలకై; ఈనాయఁ—ఈవిధముగా; చాయలఁ బల్కనేటికిఁ—జాడలతోఁ బల్కనేల;

భామ......నేఁటికిఁ—భామ—ఓభామా; పూబాళఁ—పూగుత్తిని; వేగపడి కోయకు—తొందరపడి కోయకుము; నేఁటికిఁ—ఈదినమునకు; పాళము గాదు—సమయము గాదు;

మగువ పలుమఱు......దండలు—దండలు—హారములు; మలిపడియెఁ—చిక్కుపడియెను; తిగిచిచూచుటఁ—వెలుపటికిఁ దీసిచూచుటను; మానుమా యని యన్వయము;

మగిడిచనుఁడి.........దండలు—మా విహరించు దండలు—మేము విహరించు స్థానములు;

పలుకకుము.........తిట్టితివి—బాల—ఓపడుచా; బాలకియన్నన్—బాలకియని నేను జెప్పఁగా; పలుమఱు తిట్టితివి—పలుమాఱు దూషించితివి; తుచ్ఛములు పలుకకుము—నీచపుమాటలు చెప్పకుము;

ఇచట 'బాలకి' యను రూప మెట్లు సాధువో యెఱుంగరాకున్నది; 'బాలిక' యనుట సాధురూపము; ఛేకానుప్రాసనియమముచేఁ గవి బాలకి యనియే వ్రాసినట్లు తోఁచెడి;

అలస.........పట్టితివి—చెలి—ఓసఖీ; నీవు—; అలసగమనముఁ జూపి—తిన్ననినడకను బ్రకటించి; వంచనచేసి—మోసపుచ్చి; అంచన్—హంసను; పట్టితివి—;

తావి.........యశోకము—ఘృతాచి—ఘృతాచి యను పేరుగలయొయప్సరసా; ఈయశోకము—; తావి—వాసన; బుగులుకొనంగఁ దొడఁగెన్—దట్టమై ప్రకటింపఁదొడఁగెను; (కావున); తాఁచితే—(ఈయశోకమును) తన్నితివా; 'అశోక శ్చరణాహత్యా' అనుశాస్త్రరీతి నిందు దోహదక్రియసూచితము;

రావె.........ననేకము—రంభా—; రంభలలోన్—అరఁటిచెట్లలో; అనేకము—బహుళము (తేనియ బహుళమనుట); (కావున); తేనియకున్—రావె—అంచున్—పలికెదు—అని యన్వయము;

ననలు......ముట్టకు—ననలు వేఁడినన్—నేను బుష్పములు కోరఁగా; అపుడు—; నాలిన్—కపటముతో; మొఱఁగితి—కనఁబడకపోతివి; (కావున) నాలిసుదంబున్—నాయొక్క—గజనిమ్మపండును; ముట్టకుము—తాఁకవలదు;

ఎనయు.........మెట్టకు—ఎనయు—పొందిన; ప్రాణపదంబుగాన్—ప్రాణప్రియమగువస్తువుగా; ఈవ—నీవే; తలఁతు—భావింతువు; (కావున); తీవన్—తీఁగను; తలంగన్—తొలఁగునట్లుగా; మెట్టకుము—త్రొక్కకుము;

మంజు.........వనంబునన్—మంజుఘోష—మంజుఘోష యను నప్సరసా; నందనవనంబునన్—ఈయుద్యానవనంబునందు; సువర్ణలతలు—బంగారుతీఁగలు; అనుమానమా—సందేహమా; (అనఁగా బంగారుతీఁగ లుండుటకు సందేహ మేమి యనుట);

అంజ దిది.........మనంబునన్—ఇదియెలదేఁటికిన్—అంజదు—అని యన్వయము; అంజదు—భయపడదు; అనన్—ఏమి—అఱచెన్; అనఁగానేమని యఱచినది; మనంబున మఱచెదవే—తలఁపకుందువే యనియర్థము;

అమృత........శుకములు—మానిని–ఓసాలఁతీ; శుకములు–చిలుకలు; అమృతమధురములైన – అమృతమువలెఁ దియ్యని; ఫలరసము—; అని–త్రాగి; త్రుళ్లెన్–గర్వించెను;

గుమురులను........పికములు—గుమురులగు–గుంపులగు; పికములు కోయని కూసెన్–(తమయాహారవస్తువులను చిగుళ్లుపోయెనే యని దుఃఖముతో ననుట);

గుమగుమని........దోఁటికిన్—గుమగుమనివాసనలన్– గుమగుమనిపరిమళించుచున్న; గేదఁగికొమ్మ–మొగిలిచెట్టుయొక్క శాఖ; కొమ్మకున్–ఆస్త్రీకి; దోఁటికిన్, అందెన్–దోఁటితోఁ గోయుటకుఁ జిక్కె ననిభావము;

రమణి........లేటికిన్—రమణి–ఓతరుణీ; చలమ్ములు–పంతములు;

(వి) ఈరగడయందుఁ బలువురు నెలఁత లొక్కచోఁ గూడి సంభ్రమోత్సాహములతో వినోదలీలల నారామవిహారంబును గుసుమాపచయంబును సలుపునపు డొండొరులతో సంభాషణము సేయురీతి వర్ణింపఁబడినది. ఇత్తెఱంగున వాక్యములలో విశేషము పరస్పరసంబంధము లేక మాటలాడుకొనుట మహిళాజనసహజగుణంబు.

ఇది వృషభగతిరగడ యనంబరఁగును. ప్రతిపాదమునకును 28 లఘువులును, 15వ లఘుస్థానమునందు యతి, రెండేసిపాదములకుఁ బ్రాసము నుంచవలయును. ఇదియే లక్షణమైనను బ్రతిపాదమునందును రెండేసి యక్కరములకు ఛేకమును, రెండేసిపాదముల కాద్యంత్యప్రాసంబులును గూర్చుట కవిసమయము.

అలంకారము—స్వభావోక్తి.

మ. అనుచుం గాంతలు వల్లికారచితడోలాందోళనప్రక్రియం<br>
గనకాంభోరుహకర్ణికాహృతిఁ బరాగక్షేపలీలాగతిన్<br>
వనకేళీపరతంత్రవృత్తిఁ దిరుగ న్మార్తండబింబంబు ని<br>
ల్చె నభోమధ్యమునం గఠోరకిరణశ్రేణీదురాలోక మై. 17

(వ్యా) వల్లికా......ప్రక్రియన్–వల్లికా–తీఁగలచేత; రచిత–చేయఁబడిన; డోలా–ఉయ్యెలలయందు; ఆందోళనప్రక్రియన్–ఊఁగువ్యాపారములచేతను; కనకా... ఆహృతిన్—కనకాంభోరుహ–బంగారుకమలములయొక్క; కర్ణికా–దుద్దులను; ఆహృతిన్–కోయుటచేతను; పరాక్షేపలీలాగతిన్–పుప్పొళ్లను జల్లుకొనువిలాసములచేతను; వనకేళీ.....వృత్తిన్—వనకేళీ–ఉద్యానవనక్రీడయందు; పరతంత్ర–ఆసక్తమయిన; వృత్తిన్–నడవడితో; తిరుగన్–(వనంబున)సంచరించుచుండఁగా; మార్తండబింబంబు–

సూర్యబింబము; ఇది 'మార్తండ' శబ్దము, శకంధ్వాదిగణములోఁ జేరినది. 'మార్తాండ' అనురూపమును గలదు; కఠోర.........లోకమై—కఠోర—క్రూరమగు; కిరణశ్రేణీ—కిరణములవరుసలచేత; దురాలోకమై—చూచుటకుఁ గష్టమై; నభోమధ్యమునన్—ఆకాశమునడుమ; నిల్చెన్—కనఁబడె ననుట.

ఈపద్యము మూఁడవపాదమునందుఁ 'బరతంత్రవృత్తి నరుగన్' అనుపాఠ మన్నిపుస్తకములయందును గానంబడుచున్నది. కాని యది యిచట సరియైనయర్థము నియ్యదు గావునఁ 'బరతంత్రవృత్తిఁ దిరుగన్' అని యుండిన లెస్సయనితలంచి యిట్లుసవరించితి.

'కర్ణికాహ్వాతి'యనుటకు మాఱుగా నొకప్రాచీనపుస్తకమునందుఁ 'గందుకాహతి' అనుపాఠ మున్నది; దానికంటెఁ గర్ణికాహ్వాతి అనుపాఠమే సరసము.

చ. వదలిన నీవిబంధముల వాడినమోముల జాఱుకొప్పులం
జెదరినపత్త్రిభంగములఁ జిక్కులుగొన్న మణీసరంబులం
బొదలిన యూర్పుఁదెమ్మెరలఁ బుప్పొడిఁ గెం పగువాలుఁగన్నులం
ద్రిదశమృగాయతాక్షులు రతిశ్రమఖిన్నలఁ బోలి రందఱున్. 18

(వ్యా) వదలిన—జాఱిన; నీవిబంధములన్—పోఁకముళ్లతోను; చెదరిన—వీడిన; పొదలిన—అతిశయించిన.

## మధ్యాహ్నము

క. బెడిద మగునెండసోఁకునఁ
దొడిమలు వసివాడి ననలు దొరఁగె లతల నె
ల్లెడ వనదేవత మేనం
బొడమిన లేఁగమ్మచెమటబొట్టు లనంగన్. 19

ఈపద్యముమొదలు 23వ పద్యమువఱకు మధ్యాహ్నకాలవర్ణనము చేయఁబడినది.

(వ్యా) బెడిదమగు — భయంకరమగు; తొడిమలు—కాఁడలు; వసివాడి—మిక్కిలి వాడి; ఎల్లెడన్—అంతటను; లతలన్—తీఁగలనుండి; ననలు—పుష్పములు; దొరఁగెన్—రాలెను; లేఁగమ్మ—లేఁత యగు వాసనగల.

అలంకారము—ఉత్ప్రేక్ష.

శా. తూఁగెం జల్లనిగాడ్పు లేమి ఫణిసందోహంబు పేరాఁకటన్
లోఁగెం దప్తసరోజశీధురసముల్ గ్రోల న్మదాళిచ్ఛటల్

గ్రాఁగె న్నిరుగఁ గాంచనాచలతటీగండోపలవ్రాతముల్
వ్రాఁగె న్బల్వలపంకసీమ బకజాలత్రస్తపాఠీనముల్. 20

(వ్యా) చల్లనిగాడ్పులేమిన్—చల్లనిగాలి వీచకుండుటచే; పన్నగసందోహంబు—పాములగుంపులు; పేరాఁకటన్—మిక్కిలియాఁకలితో; తూఁగెన్—బిలమునుండి వెడలెను; మదవాళిచ్ఛటల్—మదించినతుమ్మెదలగుంపులు; తప్త......రసముల్—తప్త—ఉడికిన; సరోజ—తామరలయందలి; శీధురసముల్—తియ్యనికల్లురసములు (ఇక్కడ తేనియల నుట); క్రోలన్—త్రాఁగుటకు; లోఁగెన్—చొచ్చినవి; కాంచన.....వ్రాతముల్—కాంచనాచలతటీ—మేరుపర్వతప్రదేశమునందలి; గండోపలవ్రాతముల్—గండశిలల సమూహములు; నీరుగన్—జలమగునట్లుగా; క్రాఁగెన్—ఉడికినవి; ('నీఱుగన్' అని కొన్నిపుస్తకములలోఁ బాఠము గలదు. అపుడు 'భస్మముగ' నని యర్థము గావున నది సరసము గాదు); బక.........పాఠీనముల్—బకజాల—కొంగలగుంపులవలన; త్రస్త—భయపడిన; పాఠీనముల్—చేఁపలు; పల్వలపంకసీమన్—పడియలలోని బురదప్రదేశము లందు; డాఁగెన్—డాఁగినవి.

అలంకారము—స్వభావోక్తి.

చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱకల్విరియంబడ జోర మోవ నెం
డిన వదనంబులం దెఱచి నిక్కి నయఱ్ఱులు దల్లడించుటల్
గనఁబడ నూరుపుల్దళముగా నిగుడ న్వడఁ గుంది యీరెలుం
గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడ నిల్చె మ్రాఁకులన్.

(వ్యా) శకుంతములు—పక్షులు; అయ్యెడన్—ఆమిట్టమధ్యాహ్నమునందు; కనుఁగవ—కన్నులు; మ్రాన్పడంగన్—తిన్నపాటు సారయఁగా; ఎఱకల్—ఱెక్కలు; విరియంబడన్—విచ్చఁగా; (అనఁగాఁ బటుత్వముతప్పి శిథిలముకాఁగా నను); జోర—జొమ్మ; మోవన్—చెట్టుమీఁదనానఁగా; అఱ్ఱులు—మెడలు; తల్లడించుటల్—తపించుటలు; వడన్—బడలికతో; కుంది—కృశించి; తమవానిన్—స్వజాతిపక్షులను; ఈరెలుంగునన్—సన్నని ధ్వనులతో; పిల్చుచున్, మ్రాఁకులన్, నిల్చెన్, అని అన్వయము.

అలంకారము—స్వభావోక్తి.

చ. ఒకయెడఁ జక్రవాకము పయోరుహమిత్రుని వేఁడిమిండచేఁ
జెకచెకఁ గ్రాఁగు తమ్మివిరిదేనియ ఱెక్కలఁ జల్లి నార్చి కాం
తకుఁ దనివార నిచ్చెఁ బరితాపము వాయ మృణాళవల్లరీ
శకలము మాటికిం గమిచి చంచుపుటంబున నంది యిచ్చుచున్. 22

(వ్యా) ఒకయెడన్_ఒకచోట; తెకతెకఁగ్రాఁగు_సలసలమని యుడుకుచున్న; మృణాలవల్లరీ_తామరతూఁడుయొక్క; శకలము_తునుకను; మాటికిన్_పలుమాఱు; కమిచి_కొఱికి; చంచుపుటంబునన్_దొప్పలవంటిముక్కులతో.

అలంకారము—స్వభావోక్తి.

నాయకుఁ డనుకూలుఁడు; నాయిక స్వాధీనపతిక. మనుష్యేతరంబులను జంతువులయెడ రసభావాదులు వర్ణించుట రసాభాస మనంబడును. అయినను వద్దానిని గవులు వర్ణించుటయుం గలదు.

'ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్ మ్లేచ్ఛగతోపివా,
యోషితో బహు సక్తిశ్చే ద్రసాభాస స్త్రిధామతః.'

—అని ప్రతాపరుద్రీయము.

తే. ఆతపగ్లానిఁ బడలిన యభ్రమువును
నిజకరాగ్రజలంబుల నెఱయఁ జల్లి
శ్రవణయుగతాలవృంతసంజాతశీత
వాతములఁ దేర్చె గీర్వాణవారణంబు. 23

(వ్యా) గీర్వాణవారణంబు_ఐరావతము; ఆతపగ్లానిన్_ఎండవలని శ్రమముచేత; అభ్రమువును—తన భార్యయగు నభ్రమువను నేనుఁగును; నిజకరాగ్రజలంబులన్_తనతొండపుకొనయందలి జలములతో; నెఱయన్_పూర్ణముగా; శ్రవణయుగ................ వాతములన్—శ్రవణయుగ_తనవీనుదోయి యనెడు; తాళవృంత_విసనకఱ్ఱలనుండి; సంజాత_పుట్టిన; శీత_చల్లని; వాతములన్_వాయువులచేత; తేర్చెన్_శ్రమమును బోఁగొట్టెను.

అలంకారమును నాయికానాయకులును పైపద్యమునందువలెనే.

జలక్రీడ

క. అపుడు జగత్పతి సత్యా
చపలాక్షియుఁ దాను వెడలె జలకేలికి న
య్యుపవనతరుకుసుమలతా
తపత్రములు పూని వేల్పుఁదరుణులు గొల్వన్. 24

ఈపద్యము మొదలు 40_వ పద్యమువఱకు సత్యభామాశ్రీకృష్ణులు సురతరుణీమణులతో జలక్రీడ సలుపుట వర్ణింపఁబడియె.

(వ్యా) ఆతపత్రములు_గొడుగులు.

చ. చనుఁగవ వ్రేఁకము న్జఘనచక్రభరంబును మోవ లేక యొ
య్యనఁ బదపంకజంబు లలసాలసవైఖరి మోపుచుక్ జనా
ర్దనుభుజ మూఁత గాఁగ వనితామణి యేగెఁ బరస్పరాంగ మే
ళనమున రోమహర్షముకుళవ్రజ మొండొరుమేన నిండఁగన్. 25

(వ్యా) వ్రేఁకముక్—భారమును; వ్రేఁగుధాతువునకుఁ గృదంతరూపము; జఘన చక్రభరంబును—చక్రములవలె గుండ్రముగా నుండు పిఱుఁదులభారమును; మోవలేక—భరింపఁజాలక; అలసాలసవైఖరిక్—మందమందమగు రీతులతో; మోపుచుక్—అడుగు పెట్టుచు; ఊఁత—అవలంబము; పరస్పరాంగమేళనమునక్—ఒండొరులమేను లొరయుట చేత; ఒండొరు మేనక్—ఇతరేతర శరీరములందు; రోమహర్షముకుళవ్రజము—మొగ్గలవలెఁ జెలువారు గగుర్పాటుజొంపములు; నిండఁగక్, ఏగెక్, అని యన్వయము.

(వి) 'ఏగు' అనుపదమునం దరసున్న లేదు. కొందఱు దీని నరసున్న యుంచి వ్రాయుచున్నారు; అది పొరఁబాటు.

చ. ఇనకరతాపవేదన సహింపఁగ లేక నిజోదకంబులక్
మునిఁగి వినీలకుంతలసమూహము నారఁగ విచ్చె నాఁగ వీ
చినికరచాలనం దరులఁ జేరినజొంపపు నాచుఁదీఁగలం
దనరు నభోనదిం గనియె దానవలోకవిరోధి యత్తఱిక్. 26

(వ్యా) ఆరఁగక్—తడియారునట్లు; విచ్చె నాఁగక్—విప్పెనోయనునట్లు; వీచినికరచాలనక్—అలలగుంపులకదలికలచేతను; జొంపపు—గుబురులగు; నాఁచుతీఁగలక్—పాఁచితీఁగలచేతను; తనరు—ఒప్పుచున్న; నభోనదిక్—ఆకాశగంగను.

అలంకారము—ఉత్ప్రేక్ష.

తే. కాంచి చేరంగఁ జని మధుకైటభారి
రత్నసోపానకలితమార్గముల డిగ్గి
కులసతియుఁ దాను వేలుపుఁగొలను దఱిసె
నొండొరుల కేలుఁదమ్ముల నూఁత గొనుచు. 27

(వ్యా) సోపాన—మెట్లు; వేలుపుఁగొలను—ఆకాశగంగను; ఇచటఁ గవి నదిని కొలనుగాఁ జెప్పియున్నాఁడు; ఇది కవిసమయము; తఱిసెక్—చేరఁజనియెను.

చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు వేలుపుమ్రానిచీనిపా
వడలు ధరించి దేహరుచివైభవము ల్నవమల్లికారుచిం
దొడర నితంబచక్రములతో నెఱివాలుమెఱుంగుఁగప్పుఁ బె
న్జడ లోరయంగఁ దద్గగనశైవలినిం దగఁ జొచ్చి రందఱున్. 28

(వ్యా) నిర్జరవధూటులు—దేవాంగనలు; తొడవులు పుచ్చి—ఆభరణములు తీసి వైచి; చీనిపావడలు—సన్నని పావడలను, (అధోంశుకములనుట); నెఱి...... పెన్జడలు—నెఱి—పూర్ణమైన, గొప్పవైన యనుట; వాలు—దీర్ఘములగు; మెఱుంగు—తళతళ మని ప్రకాశించుచున్న; కప్పు—నల్లని; పెన్జడలు—గొప్పజడలు; ఒరయంగన్—రాచుకొనఁగా; తద్గగనశైవలినిన్—ఆయాకాశగంగానదిని; చొచ్చిరని యన్వయము.

మ. మరుదంభోరుహనేత్ర లంబరధునీ మధ్యంబున న్నిల్వ ని
ష్ఠుర తత్పీనపయోధరాహతి జలస్తోమంబు నల్వంకలం
దెరల న్నాభిచయంబు లోఁగొనియె దానిం జాల గాంభీర్యశీ
లురు సంక్షోభము నొందువారి నెచట న్లోఁగొంచు వర్తింపరే. 29

(వ్యా) ధునీ—నది; నిష్ఠుర—క్రూరమగు; తత్పీనపయోధరాహతిన్—వారి బలిసిన స్తనములయొక్క కొట్టుటలచేత; జలస్తోమంబు—నీటిమొత్తము; నల్వంకలన్—నాలుగు పార్శ్వములందును; తెరలన్—తొలఁగఁగా, (కలఁగఁగా ననియు నర్థము); దానిన్—ఆజలమును; నాభిచయంబు—వారలపొక్కిళ్లు; లోఁగొనియెన్—ఐక్యపరచుకొనెను (చేరఁదీసె నని భావము); గాంభీర్యశీలురు—గంభీరస్వభావము కలవారు; గాంభీర్య మనఁగా లోఁతనియు నర్థాంతరముగావున సురాంగనలపొక్కిళ్లు చాలలోఁతుగా నుండె ననియు భావము; చాలన్—మిక్కిలి; సంక్షోభమునొందువారిన్—కలఁత చెందువారిని; ఎచటన్—ఏప్రదేశమునందైనను; లోఁగొంచున్—తమప్రాపునఁ జేర్చుకొనుచునని యర్థము; లోపలఁ బ్రవేశింపఁజేయుచునని యర్థాంతరము; వర్తింపరే—మెలఁగరా;

అనఁగా నుదారస్వభావులగు నుత్తము లిడుమలఁబడువారిని జేరఁదీసి రక్షింతు రని భావము.

అలంకారము—అర్థాంతరన్యాసము.

(వి) 'చాలగాంభీర్యశీలురు సంక్షోభము నొందువారిన్'—ఈ యన్వయము ప్రౌఢము.

'తం పాతయాం ప్రథమమాస పపాత పశ్చాత్' అని కాళిదాసుఁడు రఘువంశ మునందుఁ (9-67) బ్రయోగించియున్నాఁడు. కవులు నిరంకుశులుగదా.

చ. ఘనకుచకుంభముల్ బయలుగా విబుధాలయవారభామినీ
జనకరిణీసమూహములు సల్లె యదూద్వహకుంజరంబుపై
వనజవనీపరాగపరివాసితమైన నభస్తరంగిణీ
ఘనతరభంగతోయకణికాచయముల్ కరపుష్కరంబులన్. 30

(వ్యా) విబుధా...సమూహములు — విబుధాలయవారభామినీజన—దేవవేశ్యా సమూహములనెడు; కరిణీసమూహములు—ఆఁడేనుఁగులగుంపులు; ఘనకుచకుంభముల్—గొప్పస్తనములనెడు కుంభస్థలములు; బయలుగాన్—బయలుపడునట్లుగా; వనజ...... వాసితమైన—వనజవనీ — తామరవనములందలి; పరాగ—పుప్పొళ్ల చేత; పరివాసితమైన—పరిమళముకలవిగాఁజేయఁబడిన; నభ.........చయముల్—నభస్తరంగిణీ—ఆకాశగంగ యొక్క; ఘనతర — గొప్పలగు; భంగ — అలలయందలి; తోయకణికా—జలబిందువుల యొక్క; చయముల్—గుంపులను; కరపుష్కరంబులన్—చేతులనెడు తొండములచివరల చేత; 'పుష్కరం కరిహస్తాగ్రే' అని యమరుఁడు; పుష్కర మనఁగాఁ 'గమలము' అను నర్థము కావునఁ గమలములవంటిచేతు లనియును భావము; యదూద్వహకుంజరంబుపైన్—కృష్ణుఁడనెడు మగయేనుఁగుమీఁద; చల్లెన్, అని యన్వయము.

అలంకారము—సావయవరూపకము.

క. వారణయానలు కరముల
నీ రడిచిన రవము మురజనిస్వనముగఁ జె
న్నారఁగ బద్మిను లాడెను
వారిజహస్తముల మధుపవలయము లులియన్. 31

(వ్యా) నీరడిచినరవము—జలమును గొట్టఁగాఁ బొడమినశబ్దము; మురజనిస్వనముగన్—మృదంగధ్వనులుగా; చెన్నారఁగన్—ఒప్పఁగా; వారిజహస్తములన్ — కమలము లనెడు హస్తములయందు; మధుపవలయములు — తుమ్మెద లనెడుకంకణములు; ఉలియన్—శబ్దింపఁగా; పద్మినులు—తమ్మితీఁగలు; ఆడెను—నర్తనముచేసెను.

ఇచటఁ బద్మినులను స్త్రీలింగసారస్యముచేతఁ బద్మినులు నాట్యముచేయు స్త్రీలు వలె నొప్పెనని భావము.

అలంకారములు—సావయవరూపకము. ఉత్ప్రేక్ష గమ్యము.

క. ప్రోడతనంబులు మీఱఁగఁ
జేడియ లడుగులును మొగముఁ జేతులు మెఱయ
న్వేడుక నీఁదఁగ నపు డా
మ్రేడితజలజాత మయ్యె మిన్నే టెల్లన్. 32

(వ్యా) ప్రోడతనంబులు—చాతుర్యములు; చేడియలు—స్త్రీలు; మిన్నేటెల్లన్—ఆకాశగంగయంతటను; ఆమ్రేడితజలజాత మయ్యెన్—రెట్టింపఁబడిన తమ్మిపూవులు గలది యాయెను.

అనఁగా నవ్వనితలు సురతరంగిణియం దీఁత గొట్టుచుండఁగా వారివదనములును హస్తములును పాదములును నీళ్లపైఁ దేలుచుండునపు డవి పద్మములవలె నొప్పారుటచే నానదియందు మునుపుండినతామరపువ్వులు రెట్టింతలయినట్టు లలరారెనని భావము.

అలంకారములు—ఇచట నర్థశక్తిమూలకమగు నుపమాలంకారధ్వనియు సామాన్యాలంకారధ్వనియు నెఱుంగునది.

తే. తామరల వ్రేటు లాడుచోఁ దరుణు లెత్తు
కరరుహాంకితబాహువల్లరులు వొలిచె
బిరుదవర్ణావళీపరిస్ఫురిత మైన
పల్లవాస్త్రుజయస్తంభపటలి యనఁగ. 33

(వ్యా) తామరలన్—తమ్మిపువ్వులచేత; వ్రేటులాడుచోన్—ఒకరిపై నొకరు వేడుకగా వేసికొనుచు నాడుచుండఁగా; తరుణులు—; ఎత్తు—; కరరుహాంకిత...వల్లరులు—కరరుహ—గోళ్లచేత; అంకిత—ఒప్పుచున్న (చిహ్నముగాఁ గల); బాహువల్లరులు—తీఁగలవంటిబాహువులు; బిరుద...స్ఫురిత మైన—బిరుదవర్ణావళీ—బిరుదాక్షరముల వరుసలచేత; పరిస్ఫురిత మైన—ప్రకాశించుచున్న; పల్లవాస్త్రు......పటలి యనఁగన్—పల్లవాస్త్రు—మన్మథునియొక్క—; జయస్తంభపటలియనఁగన్—విజయసూచకములగు స్తంభముల పంక్తియో యనునట్లు; పొలిచెన్—ప్రకాశించెను;

అనఁగాఁ బైకెత్తఁబడిన యానారీమణులయొక్క బాహువులు మన్మథుని జయస్తంభములవలె నొప్పెననియు వారిచేతులందలి గోళ్లు మన్మథునిబిరుదాక్షరములో యన నొప్పె ననియు భావము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

ఉ. దానవవైరి దివ్యవనితానికురుంబముతోడ జహ్నుక
న్యానవపంకజాతనివహంబులఁ గందుకకేలి సల్పుచు
న్మేనఁ దదబ్జపత్త్రములు నిండఁగ నంటిన నొప్పె నెంతయుం
దాను నుపేంద్రుఁడౌట నయనంబులు పెక్కులుదాల్చెనో యనన్. 34

(వ్యా) నికురుంబము—సమూహము; జహ్ను.....నివహంబులన్—జహ్నుకన్యా—గంగానదియొక్క; నవపంకజాతనివహంబులన్—క్రొత్తకమలముల సంపుటములచేత; కందుకకేళి—బంతులాట; సల్పుచున్—ఆడుచుండఁగా: మేనన్—తనశరీరమునందు; తదబ్జపత్త్రములు—ఆకమలములరేకులు; నిండఁగన్—పూర్ణముగా; అంటినన్—; దానవవైరి—కృష్ణుఁడు; తాను నుపేంద్రుఁడౌటన్—తాను నుపేంద్రుఁడను పేరు గలవాఁడగుటచేత: అనఁగా నింద్రునితమ్ముఁ డగుటచేతనని భావము; నయనంబులు పెక్కులు దాల్చెనో యనన్—అనేకలోచనములు ధరించెనో యనునట్లు; ఒప్పెన్—ప్రకాశించెను.

ఇంద్రుఁడు సహస్రాక్షుఁడు తానును నుపేంద్రుఁడుగావునఁ గృష్ణుఁడింద్రునివలెనే పెక్కునయనములు ధరించెనో యనునట్లనేకతామరసపత్త్రములతో నొప్పెనని భావము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

తే. తన మనోవల్లభుని భుజాస్తంభ మూఁది
సలిలవిహరణ మొనరించె సత్యభామ
యలసవైఖరి వీచిడోలాంతరా వి
హారసంగతనవరాజహంసి యనఁగ. 35

(వ్యా) అలసవైఖరిన్—మందరీతితో; వీచి...హంసి—వీచి—అలలనెడు; డోలాంతర—ఉయ్యేలలమధ్యమునందు; విహారసంగత—విహారములతోఁగూడుకొనిన; నవరాజహంసియనఁగన్—రాయంచకొదమయనునట్లు; 'సలిలవిహరణమొనరించె' ననుదానితో నన్వయము. 'దోలా', 'డోలా' శబ్దమునకు రూపాంతరము.

అలంకారము—ఉత్ప్రేక్ష.

క. అవతంసితశైవల యై
వివలద్వేణి యయి కోకవిస్ఫుటకుచ యై
దివిషన్నది నాకపురీ
ధవళాక్షులలోన నన్యతమ యనఁ బొల్చెన్. 36

(వ్యా) దివిషన్నది—ఆకాశగంగానది; అవతంసితశైవలయై—పాఁచిత్రీఁగె [illegible] శిరోభూషణము కలదై; అనఁగాఁ బాఁచితీఁగెలు శిరోజములవలె నొప్పెనని [illegible] వివలద్వేణి యయి—వ్రేలుచున్నజడ గలదియై; అని స్త్రీపరముగునర్థము; [illegible] ప్రవాహము గలదియైయని నదిపరముగునర్థము; ఇచట శ్లేష; కోకవిస్ఫుటకుచయై—[illegible] వలెనెడు ప్రకటమగుకుచములు కలదయై; నాకపురీధవళాక్షులలోన—దేవతాస్త్రీ[illegible] అన్యతమ యనఁ—ఒక్కతె యనునట్లు; పొల్చెన్—ప్రకాశించెను.

అలంకారము—రూపకోత్థాపితమగు మీలితము.

చ. పెరిఁగినహారరత్నముల పెల్లున నొక్కెడఁ దామ్రపర్ణియై
నెరసినసోఁగపెన్నెఱుల నిగ్గున నొక్కెడ భానుకన్యయై
గురుకుచలిప్తమైన నవకుంకుమ నొక్కెడ శోణయై నభ
శ్చరనది యొప్పె దివ్యజలజాతముఖుల్ జలకేళి సల్పఁగన్. 37

(వ్యా) దివ్యజలజాతముఖుల్—దేవాంగనలు; జలకేళి సల్పఁగన్—[illegible] చుండఁగా; ఒక్కెడన్—ఒకచోట; పెరిగిన—తెగిజాఱిన; హారరత్నముల పెల్లున—ముత్యాలహారములయందలి మణులగుంపులవలన, అనఁగా ననేకముత్యములవలన [illegible], నభశ్చరనది—ఆకాశగంగానది; తామ్రపర్ణియై యొప్పెన్; అనఁగా [illegible] నదీజలములు ధవళములైనను నామున్యములు గుంపులుగా [illegible] కాంతిచే నాస్థలంబున జలంబు లతివిమలంబులై తామ్రపర్ణివలె నొప్పెనని [illegible] హారమనఁగా ముత్యాలహారమనియు, హారరత్నము లనఁగా ముత్యము లనియు [illegible]; ఒక్కెడన్—మఱియొకచోట; నెరసిన—నిండిన; సోఁగపెన్నెఱులనిగ్గున [illegible] శిరోజములకాంతులచేత; భానుకన్యయైయొప్పెన్—యమునానది [illegible]; [illegible] నాదేవతాస్త్రీలశిరోజములకాంతిచే వియన్నదీతోయములు కొన్నిచోటుల [illegible] కతంబున యమునానదివలె నొప్పెనని భావము; ఒక్కెడన్—[illegible]; [illegible] లిప్తమైన—గొప్పస్తనములందుఁ బూయఁబడిన; నవకుంకుమన్—నూతనమగు కుంకుమ పువ్వుయొక్క—ప్రాంతచేతనను; శోణయైయొప్పెన్—శోణనదిగాఁ దోఁచెను; అనఁగా [illegible] వనితల స్తనములందుఁ బూసికొనియుండినకుంకుమపువ్వుయొక్క [illegible] బులరుణంబులై యొప్పినకతంబున నచ్చోటు శోణనదివలెఁ బ్రకాశించెనని భావము; శోణ—ఇది గండవనమను ప్రదేశమునఁ బుట్టి పాటలీపుత్రమునకు సమీపమున గంగానది లోఁ గలియునదము; ఇందలి నీరు లెఱ్ఱనివై యుండును.

'కుంకుమ' ఇది నపుంసకలింగ మైనను జరితాదులలోఁ జేర్చి ముపర్ణలోపము సాధింపనగు.

అలంకారము—తద్గుణాలంకారానుప్రాణిత మగు నుత్ప్రేక్షము.

చ. అలకలు నాసికామణియు నన్నువకౌనుఁ గుచద్వయంబుఁ గుం
డలములుఁ జంచలింప జతనంబున హస్తము లూఁది జీర్కు బం
డల దిగజాఱి రొండొరుకడం దరళాక్షులు దోనివింట బిం
జలు గొన నేయుపుష్పశరుసంపెఁగవాలికతూపులో యనన్. 38

తరళాక్షులు—(దేవతా)స్త్రీలు; అలకలు—కురులు; అన్నువకౌను—సన్ననినడుమును; కుండలములు—చెవికమ్మలును; జతనంబునన్—జాగ్రత్తతో; యత్నశబ్దభవము; జీర్కుబండలన్—జరుగుడుబండలమీఁద; దోనివింటన్—దోనెవలెనుండువింటిచేత; పింజలు గొనన్—పుంఖానుపుంఖముగా; ఏయు—ప్రయోగించు; పుష్పశరు—మన్మథునియొక్క; సంపెఁగవాలికతూఁపులో యనన్—సంపెఁగపూవులనెడుక్రూరనారాచములో యన్నట్లు; ఒండొరుకడన్—ఒకరివెంట నొకరుగా; దిగజాఱి—పైనుండి క్రిందికి జాఱి.

'జీర్కుబండలు', దీనికిమాఱుగా 'చీకుబండ' లని యన్నిముద్రితగ్రంథములలోఁ గానంబడుచున్నది. సీతారామాచార్యులు తమనిఘంటువునందు 'జీర్కుబండ' లని వ్రాసి దాని కితరప్రయోగములు చూపియున్నారు. కావున నిదియే సమంజసపాఠముగా గ్రహింపఁదగుననితోఁచెడి.

మ. బలివిధ్వంసియుఁ బెక్కుభంగుల మరుత్పద్మాకరాంతంబునన్
సలిలక్రీడ యొనర్చి నిర్భరమదస్తంబేరమప్రక్రియన్
వ్వేలలె నృత్యయుఁ దాను మజ్జనవిధావిభ్రాంతకౌటిల్యకుం
తలసంక్రాంతనితంబలై దివిజకాంతారత్నము ల్గొల్వఁగన్. 39

(వ్యా) బలివిధ్వంసియున్—కృష్ణుఁడును; మరుత్పద్మాకరాంతంబునన్—ఆకాశగంగానది మధ్యమందు; నిర్భర...ప్రక్రియన్—నిర్భర—ధీరమైన; మదస్తంబేరమప్రక్రియన్—మదపుటేనుఁగువలె; (స్తంబేరమ—ఏనుఁగు, తృణములందుఁ గ్రీడించునది యని వ్యుత్పత్త్యర్థము.); మజ్జన...నితంబలై—మజ్జన విధా—స్నానకార్యముచేత; విభ్రాంత—తిరుగుడుపడిన; కౌటిల్య—వంకరతనముగల; కుంతల—వెండ్రుకలతోడ; సంక్రాంత—కూడుకొనిన; నితంబలై—పిఱుఁదులు గలవారై; వెలలెన్—వెడలెను; 'వెడలెన్' అనుటకు 'వెలలెన్' అని రూపాంతరము.

కం. వెలలి బలరిపుడు చలమునఁ, గల హాముననుఁ జొచ్చెవృత్రుఘునబాహుబలం
బలవికివిూ నెనుదంష్ట్రివి, మలతపమునఁజేసి సురలమనములు దలఁకన్.

—భారతము—ఉద్యోగపర్వము.

తే. నెఱులఁ దడి యార్చి క్రొవ్విరు లుఱిమి మేనఁ
గలపము లలంది తోడవు లంగములఁ బూని
గల్పవృక్షదుకూలాంశుకములు గట్టి
రంగనలు మారునొఱతోడియలుఁగు లనఁగ. 40

(వ్యా) నెఱులన్—వెండ్రుకలను; కలపము—చందనాది సుగంధద్రవ్యములు; పూని—ధరించి; కల్పవృక్షదుకూలాంశుకములు గట్టి—కల్పవృక్షపల్లవములగుపట్టుచేఁ గూర్పబడిన సన్నిబట్టలను గట్టికొని యని భావము. ఆ 3—41 వ్యాఖ్యానముం జూచునది; మారు—మన్మథునియొక్క; ఒఱతోడి—కవచముతోఁగూడిన; అలుఁగు లనఁగన్—బాణము లో యనునట్లు; మరునిపూఁదూఁపులవలె సుకుమారశరీర లని భావము.

చ. జలరుహపత్త్రనేత్రుఁడును సత్యయుఁ దాను ననర్ఘ్యదివ్యభూ
షలు ధరియించి నిర్జరనిశాకరబింబముఖు ల్భజింపఁ ద
ద్బలపరిపంథిబాహుపరిపాలిత మైనపురంబు సొచ్చె ని
శ్చలతరనేత్ర పౌరజనసంతతి హర్మ్యము లెక్కి చూడఁగన్. 41

(వ్యా) నిర్జరనిశాకరబింబముఖుల్—దేవతాస్త్రీలు; బలపరిపంథి—బలుఁ డను రాక్షసునకు శత్రుఁడగు నింద్రునియొక్క; 'బలారాతిః శచీపతిః' అని యమరుఁడు; నిశ్చల......సంతతి—నిశ్చలతర—చలింపని(కదలని); నేత్ర—కన్నులుగల; పౌరజనసంతతి—పట్టణవాసులసమూహము; హర్మ్యములు—మేడలు.

## సా యం కా ల ము

క. దినరా జత్తఱిఁ బంకజ
వనములఁ జరియించు కాంతివర్గము దానున్
వనధి జలకేళి సలుపఁగఁ
జనియె నన న్వారుణీదిశాతటిఁ బొల్చెన్. 42

ఈపద్యము మొదలు 45 వ పద్యమువఱకు సూర్యాస్తమయము వర్ణింపఁబడినది.

(వ్యా) దినరాజు_సూర్యుఁడు; వారుణీదిశాతటిన్_పశ్చిమదిక్ప్రదేశము నందు; కృష్ణుండమరరమణులతో సురనదియందు జలక్రీడ సలుపఁగా సూర్యుఁడును దినకాంతు లనెడుకాంతలతోఁ గూడి జలనిధిని సలిలక్రీడ సలుపఁ జనియెనో యనునట్లు పశ్చిమదిక్ప్రదేశంబుఁ జేరఁ జనియె నని భావము.

అలంకారము__హేతూత్ప్రేక్ష.

తే. వేల్పుఁజిగురాకుఁబోఁడుల వీఁగుఁజన్నుఁ
గవలపైఁ గుంకుమచ్ఛాయ గడలుకొలిపి
పసిఁడిగట్టున కొకవింత మిసిమి నించి
నెఱసెఁ గడసావి ముదుసలి తెఱపయెండ. 43

(వ్యా) వేల్పుఁజిగురాకుఁబోఁడుల_దేవతాస్త్రీలయొక్క; వీఁగుఁజన్నుఁగవలపైన్_బరువు లగు స్తనద్వంద్వములమీఁద; కడలుకొలిపి_వ్యాపింపఁజేసి; పసిఁడిగట్టునకున్_మేరుపర్వతమునకు; ఒక_అనిర్వాచ్యమైన; వింతపసిమిన్_వింతయగు పచ్చనికాంతిని; నించి-పఱపి, 'పసిమి' యనుటకు బదులు 'మిసిమి' యని కొన్ని గ్రంథములలోఁ గానంబడుచున్నది; అపుడు కాంతి యని యర్థము; కడసావి_సాయంకాలమునందలి (కడ_అంతము, సావి_కాలము, కడసావి_అంతమగు సమయము, అనఁగా సాయంకాల మని యర్థము); ముదుసలి_వృద్ధమైన; తెఱపయెండ_తైక్ష్ణ్యము లేనియెండ (అనఁగా నుపశమించినయెండ); నెఱసెన్_వ్యాపించెను; నిండెనని యర్థము.

ఆ. వేల్పుగట్టుగవుల వెలువడి వడదేఱఁ
జదలువాఁకనీట జలక మాడి
వైజయంతహర్మ్యవలభినీడంబులఁ
గ్రందుకొనియెఁ గిన్నరద్వయములు. 44

(వ్యా) కిన్నరద్వయములు_కిన్నరమిథునములు; వేల్పుగట్టుగవులన్_మేరుపర్వతగుహాలయందుండి; వెలువడి_బయలువెడలి; వడదేఱన్_అలపు తీర్చుకొనుటకై; చదలువాఁక నీటన్_ఆకాశగంగానదీజలములందు (చదలు_ఆకాశము, వాఁక_నది); జలక మాడి_స్నాన మాడి; వలభి_కొణిగెలయందలి; నీడంబులన్_గూండ్లయందు; క్రందుకొనియెన్_గుంపులుగాఁ జేరెను.

క. ఘనసాంధ్యరాగవినతా
తనయ గరుత్సమితికడిఁదితాఁకున ధర వ్రా
లినగగనఫణిఫణామణి
యన రవిమండలము పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. 45

(వ్యా) ఘన......సమితి—ఘన_దట్టమైన; సాంధ్యరాగ_సంజకెంజాయ యనెడు; వినతాతనయ_గరుత్మంతునియొక్క; గరుత్సమితి _ పక్షజాలముయొక్క; కడిఁదితాఁకునన్_క్రూరమగు దెబ్బచేత; ధరన్_భూమియందు; వ్రాలిన_పడిన; గగనఫణిఫణామణి యనన్—గగన_ఆకాశ మనెడు; ఫణి_పాముయొక్క; ఫణా _ పడగయందలి; మణి యనన్_రత్నమో యనునట్లు; రవిమండలము_సూర్యబింబము; పశ్చిమాంబుధిఁ గ్రుంకెన్_అస్తమించెను.

అలంకారము—రూపకోత్థాపితహేతూత్ప్రేక్ష.

చీఁకటి

మ. మరుదీశద్విపదానశోభ శిఖిధూమ్యారోచిఁ గీనాశకా
సరదేహప్రభ రాక్షసాసిలతికాంచద్దీధితి న్వారిధీ
శ్వరకేతుద్యుతి మాతరిశ్వహరిణచ్ఛాయన్ ఘనాఢ్యక్షునీ
లరుచిన్ ధూర్జటికంఠకాంతిఁ దమము ల్వ్యాపించె దిగ్భిత్తులన్. 46

ఈపద్యమున నంధకారము వర్ణింపఁబడినది.

(వ్యా) మరు......శోభన్—మరుదీశ _ దేవేంద్రునియొక్క; ద్విప—ఏనుఁగగునైరావతముయొక్క; దాన_గండస్థలమునుండి స్రవించుమదజలముయొక్క; శోభ... —కాంతితోను; శిఖి......రోచిన్—శిఖి_అగ్ని దేవునియొక్క; ధూమ్యా_పొగలగుంపులయొక్క (అనఁగా దట్టమగుపొగలయొక్క); రోచిన్—కాంతులతోడను; కీనాశ... ప్రభన్—కీనాశ_యమునియొక్క; కాసర_(వాహనమైన) ఎనుబోఁతుయొక్క; దేహ ప్రభన్_శరీరకాంతితోడను; రాక్షసా......దీధితిన్—రాక్షస_గక్క సుఁడగునిరృతి యొక్క; అసిలతికా _ తీఁగవలెనుండుకత్తియొక్క; అంచత్_ఒప్పుచుండు; దీధితి... —ప్రకాశముతోను;

(వి) ఇచట 'రాక్షసాళితిలకాంచద్దీధితిన్' అనుపాఠ మన్నిపుస్తకములఁ గానఁబడుచున్నది. అనఁగా రాక్షసులసమూహములతిలకములయొక్క ప్రకాశములతో

నని యర్థము. దిగధిపతులను వరుసగాఁ జెప్పుటచే సామాన్యరాక్షసులను గవి చెప్పియుండఁడు. రాక్షసులు తిలకము ధరించువటులు ప్రసిద్ధియు లేదు. కావున నీపాఠ మంగీకరింపఁదగినదికాదని 'రాక్షసాసిలతికాంచద్దీధితిః' అని సవరించితిని; వారిధీ......ద్యుతిః—వారిధీశ్వర—వరుణునియొక్క; కేతు—పడగ యగు మకరముయొక్క; ద్యుతిః—కాంతితోడను; మాతరిశ్వ...చ్ఛాయః—మాతరిశ్వ—వాయుదేవునియొక్క; హరిణచ్ఛాయః—జింకయొక్క కాంతితోడను; ధనాధ్యక్షనీలరుచిః—ధనాధ్యక్ష - కుబేరునియొక్క; నీల—ఇంద్రనీలమణులయొక్క; రుచిః—కాంతితోడను; ధూర్జటికంఠకాంతిః—పరమశివునికంఠముయొక్క కాంతితోడను; తమములు—చీఁకటులు; దిగ్భిత్తులః—దిక్కులయొక్క గోడలయందు; అనఁగా దిక్ప్రదేశంబులందు; ప్రాపించెః—వ్యాపించెను.

ఈపద్యమునం దష్టదిక్పాలకులయొక్క నల్లనివస్తువులకాంతులే చీఁకటి కుపమానములుగాఁ జెప్పఁబడియె. అష్టదిక్పాలకులు క్రమముతప్పక వర్ణింపఁబడియుండుటచే నలంకారము రత్నావళి.

## చంద్రోదయము

మ. వనజశ్రీధనపశ్యతోహరుఁడు జీవంజీవజీవంబు ప
చ్చనివిల్కానికి మామ చల్వగని పశ్యత్ఫాలజూటాగ్రమో
హనరత్నంబు సుధాకరుం డపుడు ప్రాగ్దిక్స్థలీవీథి నా
యెనఁ దోఁతెంచె వియత్తటీకవణలీలానీతశంఖాకృతిః. 47

ఈపద్యమునందుఁ జంద్రోదయము వర్ణింపఁబడినది.

(వ్యా) వనజ...హరుఁడు—వనజశ్రీ—తామరలకాంతి యనెడు; ధన—ద్రవ్యమును; పశ్యతోహరుఁడు — అపహరించుదొంగ (చూచుచుండఁగనే దొంగిలించువాఁడని యవయవార్థము); జీవంజీవ—చకోరపక్షులకు; జీవంబు—ప్రాణాధారము; 'జీవంజీవ శ్చకోరకః' అని యమరుఁడు; పచ్చనివిల్కానికిమామ—మన్మథునితల్లియగు లక్ష్మీదేవికిఁ దోఁబుట్టువు; చల్వగని—శైత్యమునకుస్థానము; పశ్యత్ఫా......రత్నంబు—పశ్యత్ఫాల—శివునియొక్క—(చూచునట్టిఫాలముఁ గలవాఁడు; అనఁగా ఫాలనయనుఁడనుట); జూటాగ్ర—జడముడికొనయందలి; మోహనరత్నంబు—సుందరమైనమణి; (అగు) సుధాకరుండు—చంద్రుఁడు; వియత్తటీ......కృతిః—వియత్తటీ—ఆకాశప్రదేశమునందు; కవణలీలా—వరయుకార్యముచేత; ఆనీత—తీసికొనిరాఁబడిన; శంఖాకృతిః—శంఖమో యన్నట్లు;

ప్రాగద్రిస్థలీవీథిక౯-తూర్పుకొండప్రదేశమునందు; ఒయ్యన౯-మెల్లఁగా; తోఁతెంచె౯-కనఁబడెను.

ఈపద్యమునందుఁ గావ్యగుణము ప్రసాదము.

క. ఆరాత్రి సత్యఁ గూడి ము
  రారి ముదం బెసఁగ వైజయంతమున మనో
  భూరాజ్యసౌఖ్యనిద్రా
  పారీణత నుండుచోఁ బ్రభాతం బయ్యె౯. 48

(వ్యా) మనోభూరాజ్య-మన్మథరాజ్యమందలి; పారీణత-పూర్తి.

## సూ ర్యో ద య ము

సీ. మొగుడుఁదమ్ములఁ జిక్కు మగతేఁటి యలుఁగులు
      సడలిపోఁ జేయువిశల్యకరణి
  కాలవశంబునఁ గడచన్న వాసర
      శ్రీఁ గ్రమ్మఱించు సంజీవకరణి
  రే యనువాలునఁ బాయ లైన రథాంగ
      తతుల హత్తించు సంధానకరణి
  తిమిరంబుచే సొంపు సమసిన దిశలకు
      వన్నియ నొసఁగు సౌవర్ణకరణి
తే. మించుబీఱెండయగ్నిఁ బుట్టించునరణి
  కలుషఘోరపయోరాశిఁ గడపుతరణి
  తోఁచెఁ బ్రాచీమహీధరోత్తుంగసరణిఁ
  బ్రాఁజదువుమానికంబులబరణి తరణి. 49

ఈపద్యమునందు సూర్యోదయము వర్ణింపఁబడినది.

(వ్యా) మొగుడుఁదమ్ముల.........విశల్యకరణి-మొగుడు - ముకుళించుచున్న; తమ్ముల౯-తామరపువ్వులందు; చిక్కు - చిక్కుకొను (రాత్రులందనుట); మగతేఁటి - తుమ్మెదకొదమ లనెడు; అలుఁగులు - బాణాగ్రపు ముక్కుతునుకలను; (ఇక్కడ సంకటముల నవి భావము); సడలిపోఁజేయు-పోఁగొట్టు; విశల్యకరణి-విశల్య

కరణి యను పేరుగల యోషధివిశేషము; ఈయోషధి మనుజుల శరీరములందుఁ జిక్కుకొన్న శల్యములను దీసివైచుటచే నీపేరు గలిగె.

కాలవశంబున.........సంజీవకరణి—కాలవశంబునన్ — కాలపరిపాకముచేత; కెడపన్న—పోయిన—(నశించిన); వాసరశ్రీన్—దినలక్ష్మిని; క్రమ్మఱించు — పునర్జీవితురాలినిగాఁ జేయు; సంజీవకరణి—సంజీవకరణి యను పేరుగలయోషధివిశేషము; చచ్చిన వారిని బ్రతికించుటచే దీని కీపేరు కలిగె. సమరంబున లక్ష్మణుఁడు మూర్ఛనొందిన పుడు హనుమంతుఁడు సంజీవకరణిని దెచ్చి దానిచేలక్ష్మణుని బ్రతికించె నని రామాయణము నుడువుచున్నది.

రేయను......సంధానకరణి—రే యను వాలునన్—రాత్రియనెడుకత్తిచేత; పాయలైన—తునుకలైన; (అనఁగా జంటలువిచ్చిన); రథాంగతతులన్—చక్రవాకపక్షుల గుంపులను; హత్తించు—ఒకటిగాఁజేర్చు; సంధానకరణి—సంధానకరణి యనునోషధివిశేషము; ఖండములైనవాని నొకటిగాఁ జేర్చుటచే దీని కీపేరు గలిగె.

తిమిరంబుచే.............సావర్ణ్యకరణి—తిమిరంబుచేన్—చీఁకటిచేత; సొంపు సమసిన—వన్నియచెడిన; దిశలకున్—దిక్కులకు; వన్నియ నొసఁగు—మునుపటివలెనే వర్ణములను గలుగఁజేయు; సావర్ణ్యకరణి—సావర్ణ్యకరణి యనునోషధివిశేషము; పాలిసినవర్ణమును మరల వన్నెవెట్టుటచే దీని కీపేరుగలిగె.

మించు......నరణి—మించు—ప్రకాశించు; బీరెండ—తీక్ష్ణమైనయెండ యను; అగ్నిన్—నిప్పును; పుట్టించు—కలుగఁజేయు; అరణి—మథించుకొయ్య; యాగములయం దగ్నిఁ బుట్టించుటకై యుపయోగించుదారువుల కరణి యని పేరు;

కలువ......తరణి—కలువ — పాపములనెడు; ఘోరపయోరాశిన్—భీకరమగుసముద్రమును; కడపు—దాఁటించు; తరణి—ఓడ;

ప్రాఁజదువు......బరణి—ప్రాఁజదువు—వేదములనెడు; మానికంబుల—రత్నములకు; బరణి—సంపుటము; అనఁగా వేదస్వరూపుఁ డనుట; 'త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే' అని యాదిత్యమంత్రము;

(అగు); తరణి—సూర్యుఁడు; 'ద్యుమణి స్తరణి ర్మిత్రః' అని యమరుఁడు; ప్రాచీ......సరణిన్—ప్రాచీమహీధర — తూర్పుకొండయొక్క; ఉత్తుంగ — పొడవైన; పథశ్రేణిన్—మార్గమునందు; తోఁచెన్—కానఁబడెను. (అనఁగా నుదయించెననుట).

అలంకారములు—ఉల్లేఖము: అంత్యానియమము గల ఛేకానుప్రాసము.

## పారిజాతమును హరించుట

క. హరి యపుడు పారిజాతా
హరణోద్యోగమున నందనారామము ని
ర్భరగతిఁ జొచ్చె విహగవర
పరివృఢుపయి నెక్కి సత్యభామయుఁ దానున్. 50

(వ్యా) విహగవరపరివృఢుపయిన్-విహగవర — పక్షిశ్రేష్ఠములు; పరివృఢుప యిన్-రాజైనగరుత్మంతునిమీఁద.

చ. సకలసురైకవంద్యుఁ డగుచక్రధరుం డిదె నేఁడు దన్ను ను
ర్విక్రిఁ గొనిపోవ వచ్చె నని వెక్కసమైనమనఃప్రభాతకౌ
తుకమునఁబోలె సంభ్రమముతో నటియించె నభీష్టవస్తుదా
యకతరుచక్రవర్తి యపు డాతతవాతవిధూతశాఖ మై. 51

(వ్యా) వెక్కసమైన — దుస్సహమైన; మనఃప్రభాతకౌతుకమునఁ బోలెన్— మనస్సునందలి యధికమగు తమిచేతనో యనునట్లు;ఆతత...శాఖమై—ఆతత—విస్తారమైన; వాత—గాలులచేత; విధూత-చలింపఁజేయఁబడిన; శాఖమై—కొమ్మలు కలదై; నటియించె నను పదముతో నన్వయము.

అలంకారము— హేతూత్ప్రేక్ష.

క. శౌరి యిదె పారిజాతముఁ
గోరికఁ గొని చనుచు మనలఁ గొనిపోఁ డని లోఁ
గూరిన నెవ్వగఁ దక్కిన
భూరుహములు మధురసాశ్రుపూరము నించెన్. 5;

(వ్యా) లోన్—మనస్సులో; కూరిన—నిండిన; నెవ్వగన్—దుఃఖముతో; మధు సాశ్రుపూరమున్—తేనియ లనెడు కన్నీటి వెల్లువలను.

అలంకారములు — హేతూత్ప్రేక్ష; మధురసాశ్రుపూరము — అనుప్రా రూపకము.

మ. సురలోకాభిమతప్రదానసమతాసూయన్బలెం గంసఘు
స్మరుఁ డత్యుద్ధతిఁ బారిజాతధరణీజాతంబు గోవర్ధనో

ద్ధరణప్రస్తుత మైనహస్తమున నుత్పాటించి లీలగతిన్
గరుడస్కంధముమీఁద నిల్పి నిలిపెం గౌతూహలం బింతికిన్. 53

(వ్యా) సుర......సూయన్బలెన్ — సురలోక — దేవలోకమునకు; అభిమత ప్రదాన — కోరికల నిచ్చుటయందు; సమతా — తనతో సమత్వముకలుగుటచేఁ బొడమిన; అసూయన్బలెన్ — అసూయచేతనో యన్నట్లు; కంసఘస్మరుఁడు — కంసునిఁ జంపిన శ్రీకృష్ణుఁడు; ఉత్పాటించి — పెల్లగించి; స్కంధము — మూఁపు; నిలిపెన్ — కలుగఁజేసెను. భగవంతుఁడగు కృష్ణుఁడు సురనికరంబులకుఁ గోర్కుల నొసఁగునట్లు పారిజాతవృక్షమును వారలకెల్ల కోర్కుల నొసఁగుచున్నదే యని దానిపై నసూయచేతనో యన్నట్లు కృష్ణుఁడు పారిజాతవృక్షమును పెల్లగించె నని భావము.

అలంకారము — హేతూత్ప్రేక్ష; తుల్యయోగిత.

చ. జలరుహనాభుఁ డిట్లు రభసంబున నందనపారిజాతముం
బలిమిఁ బెకల్చి యెత్త విటపంబుల వ్రేలుదుకూలపల్లవం
బులు వడిఁ బట్టి యీడ్చుఁ గొనిపోవఁగనీక పెనంగులీలఁ గ
ల్పలతిక లెల్ల వల్లభలు ప్రాణవిభుం బెడఁబాయ నేర్తురే. 54

(వ్యా) రభసంబునన్ — వేగముతో; కల్పలతికలెల్లన్ — కల్పవృక్షపుఁదీఁగలెల్లను; కొనిపోవఁగనీక పెనంగులీలన్ — పారిజాతవృక్షమును దీసికొనిపోనియ్యక యడ్డగించు విధమున; విటపముల వ్రేలు — కొమ్మలయందు వ్రేలుచున్న; దుకూలపల్లవంబులు — పట్టుచిగుళ్లను; 'వడిఁ బట్టియీడ్చున్' అనుదానితో నన్వయము; వల్లభలు — భార్యలు; (ఇచటఁ గల్పలతికలని యెఱుఁగునది).

అలంకారము — అర్థాంతరన్యాసము.

చ. గరుడుని తెక్కలం బొడము గాడ్పులసోఁకునఁ దక్కు వేలుపుం
దరువులుఁ బెల్లగిల్లి గగనంబునఁ దోడన వెంట నంటి రా
నరిగెడు పారిజాతహరణాచరణవ్యసనైకలోలు నా
హరిఁ గని యడ్డమై పలికి రచ్చటినందనపాలు రందఱున్. 55

(వ్యా) పారిజాత......లోలున్ — పారిజాతహరణాచరణ — పారిజాతవృక్షమును హరించుట యనెడు; వ్యసన — అధికశ్రద్ధయందు; ఏకలోలున్ — ముఖ్యముగా నాసక్తి గల; ఆహరిన్ — ఆకృష్ణుని.

చ. తగునె యదుప్రవీర యిటు ధౌర్త్యము నీ వొనరించి యీమహ
న్నగము హరించి వంచనఁ జనన్ దివిజాగ్రణి దీని నిచ్చె ద
క్కఁగ నిజకాంత కాకుసుమకోమలయాజ్ఞ భయంబు నొందుఁ దేఁ
టిగములు దీనిచెంగట నటింపను నిందులతావిఁ గ్రోలఁగన్. 56

(వ్యా) ధౌర్త్యము—దుష్టకార్యమును(దుండగము); దక్కఁగన్—అనుభవయోగ్యమగునట్లు; నిజకాంతకున్—తనభార్యయగుశచీదేవికి; ఇందులతావి—దీనియందలివాసనను.

ఉ. నా విని సత్యభామ వదనంబున లేనగ వంకురింప నే
మే వచియింపఁ బూను హృదయేశ్వరునిం గరసంజ్ఞ మాన్చి చ
న్గ్రేవల జాఱుకొంగు సవరించుచు వీడినకొప్పుఁ బల్మఱుం
జే వెడ దోఁపుచుం బలికెఁ జెందొవచూపులు క్రేళ్లు దాఁటఁగన్. 57

(వ్యా) ఏమేన్—ఏమో; వితర్కార్థకము; చేన్—హస్తముతో; వెడదోఁపుచున్—ఇంచుకదిద్దుచు; చెందొవచూపులు—కలువలవంటిచూడ్కులు; క్రేళ్లుదాఁటఁగన్—పరువిడఁగా (అనఁగా వ్యాపింపఁగా ననుట). ఇచ్చట సత్యభామ తనమగనిని మాటలాడ నియ్యక యాఁపి తానే వనపాలకులకు బదులు సెప్పుట యప్పాలఁతి దిట్టతనంబును గర్వంబును దెలిపెడు. గర్వమనెడు సంచారిభావము.

సీ. వినుఁడు సురేశ్వరువనపాలకులు వార్ధిఁ
బొడమిన యీదివ్యభూరుహమున
కింద్రాణి యెవ్వతె యింద్రుండు నెవ్వఁడు
తోడియిందిరను గౌస్తుభము నెవ్వఁ
డధిపుఁడై ధరియించె నతఁడె చేకొనుఁగాక
తెకతేర యిది యేమి యొకరిసొమ్మొ
యిదె నాదువిభునిచే నీవదాన్యనగంబు
నొడియించుకొని యేగుచున్నదానఁ
తే. బలుకు లేటికిఁ దా వీరపత్ని యేని
మీ శచీదేవి తనదు ప్రాణేశుఁ డైన
మఘవు నిటఁ బంపి సత్యభామావిధేయ
వలన మరలంగఁ గొనుఁజెపో వాసితనము. 58

ఈపద్యమునందు వనపాలకులతో సత్యభామ చెప్పినగర్వోక్తులు వేడుకగా వర్ణింపఁబడినవి.

(వ్యా) వనపాలకులు_వనపాలకులారా; సంబోధనము; ఇంద్రాణి యెవ్వతె_శచీదేవి యెట్లధిపురాలయ్యె; తోడియిందిరను_తోడి_సముద్రమునందుఁ గల్పవృక్షముతోఁబుట్టిన; ఇందిరను_లక్ష్మీదేవిని; తెకతేర_బొత్తిగాసంబంధము లేనిది; వదాన్యనగంబు_ఈవిద్రుమమును; ఒడియించుకొని_అపహరించుకొని; సత్యభామా విధేయువలనన్_కృష్ణునివలన; హాసితనము_నేర్పు.

'సత్యభామావిధేయువలన' ననుటచే సత్యభామకుఁ దనమగనిపైనుండు స్వాతంత్ర్యమును నీమెయెడ నతనివిధేయత్వమును నాలేమగర్వము నువ్యక్తమగుచున్నవి. ఇచ్చటను గర్వ మను సంచారిభావము.

క. అని పలికిన గర్వోక్తులు
 విని వనపాలకులు చాల విస్మితు లగుచుం
 జని చెప్పి రంతయును దా
 రనిమిషపతికిం బులోమజాన్వితునకున్. 59

(వ్యా) 'పులోమజాన్వితునకున్,' అనుటచే శచీదేవిసమక్షమున వనపాలకు లింద్రునితోఁ బారిజాతనగాపహరణవృత్తాంతమును జెప్పిరని భావము. అప్పు డింద్రునకుఁ బరిభవము మెండుగాఁ దోఁచునుగదా.

శా. ఆమాట ల్విని పాకశాసనుఁడు రౌద్రాకారుఁడై పేర్చి యే
 మేమీ కృష్ణుఁడు మందలో బలెనె తా నింద్రద్రుమోత్పాటనం
 బీమై నిచ్చటఁ జూప వచ్చె నిది మేలే తార్క్ష్యుఁడైన న్మదీ
 యామోఘాశనిపాత మిట్టి దని యాహా తెల్పఁ డాయెం జుమీ. 60

(వ్యా) పేర్చి_విజృంభించి; మందలో బలెనె_మందయందువలె; ఇంద్రద్రుమోత్పాటనంబున్_కల్పవృక్షమును బెల్లగించుటను, అని ప్రకృతార్థము; దేవదారువృక్షమును బెల్లగించుటయని కృష్ణునిగోష్ఠవిహారక్రీడాపరమైనయర్థము; ఈమైన్_ఇట్లు; ఇది మేలే_ఇది మంచిదా; తార్క్ష్యుఁడైనన్_గరుత్మంతుఁడైనను; మదీయామోఘాశనిపాతమున్_నాయొక్క_యనివార్యమైన వజ్రాయుధపుదెబ్బను. ఇవి యింద్రునిప్రతాపోక్తులుకాని వాస్తవముగా నింద్రుఁడే గరుత్మంతునివలనఁ బరాభవముఁ జెందెఁగదా.

మ. అని పౌలోమిమొగంబుఁ జూచి వినుమా యబ్జాస్య నీ కింతమా
త్రన విన్నంబడ నేల పోదు నిదె సత్యాగర్వభారంబు ది
వ్యనగంబు న్వెడిపించి వత్తు నని సాహంకారుఁ డై లేచి చ
య్యన శుద్ధాంతగృహంబు వెల్వడి సుధర్మాస్థానమధ్యస్థుఁ డై. 61

(వ్యా) విన్నంబడనేల—దైన్యముచెందనేల; సత్యా......వత్తు—ఇటఁ దుల్యయోగితాలంకారము; శుద్ధాంతగృహంబు—అంతఃపురము; సుధర్మాస్థానమధ్యస్థుఁడై—సుధర్మ యనెడుపేరు గల తనకొలువుకూటమునడుమ నున్నవాఁడై; ఈవాక్యము 62వ పద్యమునందలి 'కరంబునఁ బూఁచి పట్టినన్' అనువాక్యముతో నన్వయము.

ఉ. తా నఁటె పారిజాతవసుధారుహముం గొనిపోవువాఁడు క
న్గానఁడు యాదవుం డనుచుఁ గన్నులు వేయును జేవుఱింప వై
శ్వానరధర్మదైత్యవరవారిధిపానిలయక్షనాయకే
శానుల దిక్కు చూచి కులిశంబు కరంబునఁ బూఁచి పట్టినన్. 62

(వ్యా) తానఁటె—ఇది కృష్ణునిపైనింద్రునియలక్ష్యభావమును సూచించుచున్నది; కన్గానఁడు—కన్నుదెలియనివాఁడు; అనఁగా మదాంధుఁడై యున్నవాఁడు; యాదవుండు—గొల్లవాఁడు; అని యింద్రుఁడు కృష్ణుని నీచునిగాఁ జెప్పెను; జేవుఱింపన్—ఎఱ్ఱకాఁగా; వైశ్వానర—అగ్ని; ధర్మ—యముఁడు; దైత్యవర—నిరృతి; వారిధిప—వరుణుఁడు (సముద్రునికధిపతి); అనిల—వాయువు; యక్షనాయక—కుబేరుఁడు; ఈశానుఁడు—రుద్రుఁడు; కులిశంబున్—వజ్రాయుధమును; పూఁచి—పూన్చి; ధరించి.

ఇంద్రుఁడు కృష్ణునితోఁ బోర సమకట్టుట

ఉ. కోణపరంపరాహతులఁ గూరినవేదననో సమస్త ని
ర్మాణధృతిప్రణాశకరు మాధవునిం జెనకంగఁ బోవు గీ
ర్వాణులఁ బోకుఁ డంచు మొఱ వై చెనొకో యన మ్రోసె నంత ని
స్సాణము పాకశాసను హజారమునం గదనాభిశంసి యై. 63

ఈపద్యమునందు నిస్సాణధ్వనులు వర్ణింపఁబడినవి.

(వ్యా) కోణపరంపరాహతులన్—కొయ్యలపంక్తులయొక్క దెబ్బలచేత; (కోణము—తప్పెటలువాయించుకొయ్య); కూరిన—నిండిన; వేదననో—వేదనచేతనో; సమస్త

...కరుఁ—సమస్త—సర్వమును; నిర్మాణ—సృజించుట; ధృతి—ధరించుట (పాలించుట); ప్రణాళి—సంపుటు; (వీనిని); కరుఁ—చేయునట్టి; మాధవునిఁ—కృష్ణుని; చెనకంగఁబోవు—ఎదిరింపఁ బూనిన; గీర్వాణులఁ—దేవతలను; పోకుఁడంచుఁ—పోనలదని; మొఱపైఁ జెనోకోయనఁ—మొఱపెట్టునోయనునట్లు; నిస్సాణము—తప్పెట; కదనాభిశంసియై—యుద్ధమును దెలుపునదియై; పాకశాసనునిహజారమునఁ బ్రమోసెఁ; అని యన్వయము.

అలంకారము—హేతూత్ప్రేక్ష.

మ. అపుఁ డాబద్ధఖలీనకాశ్వచయమై యందూపరిభ్రంశిత
ద్విపమై దివ్యరథాగ్రకేతుపటసందిత్సామిళత్సూతమై
యపరాభూతభుజావలేపభటవీరాలాపమై జంభవై
రిపురం బంతయు మందరక్షుభితవార్ధింబోలె ఘూర్ణిల్లుచుఁ. 64

(వ్యా) జంభవైరిపురంబంతయుఁ—దేవేంద్రునిపట్టణమునం దెల్లెడలను; ఆబద్ధ......చయమై—ఆబద్ధ—చక్కఁగాఁ గట్టఁబడిన; ఖలీనక—కళ్లెములతోడి; అశ్వచయమై—గుఱ్ఱములసమూహముకలదియై; అందూ...ద్విపమై—అందూ—గొలుసులయందుండి; పరిభ్రంశిత—విడువఁబడిన, విప్పఁబడిన; ద్విపమై—ఏనుఁగులు కలదియై; అందూ—ఏనుఁగుకాళ్లకుఁగట్టెడుగొలుసు; దివ్య......సూతమై—దివ్య—ప్రకాశించుచున్న; రథాగ్ర—తేరులకొనలందు; కేతుపటసందిత్సా—టెక్కెములను గట్టవలయుననునిచ్ఛతో; మిళత్—కూడిన; సూతమై—సారథులుకలదియై; (సందిత్సా—సందాతుమ్ ఇచ్ఛా—కట్టవలయుననునిచ్ఛ; ఇది సన్నంతరూపము); ఇక్కడ 'సంధిత్సా' అని ఒకపాఠము గలదు; అపుడు సంధాతుమ్ ఇచ్ఛా—చేర్పవలయుననునిచ్ఛ యని యర్థము; సందిత్సా అనుపాఠమే సరసము; అపరా...వీరాలాపమై—అపరాభూత—అవమానము చెందని (జయింపఁబడనియనుట); భుజావలేప—బాహుగర్వముగల; భట—సేనలయొక్క; వీరాలాపమై—శూరోక్తులుకలదియై; ఘూర్ణిల్లుచుఁ—మ్రోఁగుచు; మంద......బోలెఁ—మందర—మందరపర్వతముచేత; క్షుభిత—కలఁపఁబడిన; వార్ధిఁ—సముద్రమును; పోలెఁ—అనుకరించెను.

అలంకారము—ఉపమ.

ఉ. నీ యనుజన్ముఁడ న్సఖుఁడ నీ కని యింటికి వచ్చి జంభవై
తేయవిరోధిచే నపుడు తేజము లన్నియుఁ గాంచి చేసె న
న్యాయము పారిజాతహరణంబునఁ గృష్ణుఁడు మంచిచుట్ట మా
రా యని పల్కఁగా జనపరంపరచే విని రెల్లవారలుఁ. 65

(వ్యా) తేజములు—ప్రాభవములు, పోణుములు.

అలంకారము—వక్రోక్తి.

వ. అత్తఱిం దత్తఱంబునం దత్తడులం బల్లింపకయ నెప్పరంబున నెక్కం బోవువారును కృష్ణుండు కృష్ణుఁ డని పౌనఃపున్యంబుగాఁ బలుకుచు నే మేమి యెక్కడెక్కడ నని యడుగువారికిఁ దెలివిపడ నుడువం దడవు లేక పారిజాతంబు పారిజాతం బని పలుకుచు రణసంభ్రమంబునం బరిభ్రమించువారును, కణయకంపణముసలముద్గర పరిఘపరశ్వధంబు లనియెడు బహువిధప్రహరణాహరణవిపర్యాసంబున శస్త్రశాలాంతరంబునం గలహించువారును, మరుదధిప మలినపథ మహిషరథ మాంసాశన మకరాకరేశ మాతరిశ్వ మనుష ధర్మమహేశ్వరులకు మానవుం డీ డగునే యనువారును, గత్తు లంకించువారును, రిత్తజంకించువారును, సంగడీలం జీరువారును, సంగరభీరులం గేరువారును, వాహనంబులం దఱుమువారును, సాహసంబుల నఱుముడువారును, నై వీరావేశంబున రాజద్వారంబునం దొట్టి రయ్యవసరంబున. 66

(వ్యా) తత్తఱంబునన్—సంభ్రమముతో; తత్తడులన్—గుఱ్ఱములను; పల్లింపకయ—జీనుకట్టకయే (పల్లము—జీను, పల్లించు—జీనుకట్టు); నెప్పరంబునన్—వేగముతో; పౌనఃపున్యంబుగాన్—సారెసారెకు; పౌనఃపున్యము—పునఃపునః అనుపదమునకుఁ దద్ధిత రూపము; తెలివిపడన్—తెలియునట్లు; తడవు—అవకాశము; కణయ... పరశ్వధంబులు—కణయ—కుంతవిశేషము (ఈఁటె); కంపణ—ఆయుధవిశేషము, ('కంకణ' యని కొన్ని గ్రంథములలోఁ గానఁబడుచున్నది; అది యసాధువని యెఱుంగునది; ముసల—రోఁకలి; ముద్గర—ఇనుపగుదియ; పరిఘ—ఇనుపకట్లగుదియ; పరశ్వధము—గొడ్డలి; ప్రహరణా... విపర్యాసమునన్—ప్రహరణ—ఆయుధములయొక్క; ఆహరణ—తీసికొనుటయందలి; విపర్యాసంబునన్—వ్యత్యాసముచేత; మరుద.....మహేశ్వరులకున్—మరుదధిప—దేవేంద్రుఁడు; మలినపథ—అగ్ని (కృష్ణవర్త్మ); 'బర్హిశ్శుష్మా కృష్ణవర్త్మా' అని యమరుఁడు; మహిషరథ—యముఁడు; మాంసాశన—రాక్షసుఁడు, నిరృతి; మకరాకరేశ—వరుణుఁడు; (మకరాకర—సముద్రమునకు, ఈశ—ప్రభువు); మాతరిశ్వ—వాయువు; మనుష్యధర్మ—

కుబేరుఁడు; 'మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః' అని యమరుఁడు; మహేశ్వరులకున్—ఈశానుఁడు, (వీరికి;) (ఇచట దిక్పాలకు లెనమండ్రును మకారాదిపదములతోఁ జెప్పఁబడియుండుట చమత్కారము); అంకించు—జళిపించు; కి త్త—నట్టి; జంకించువారును—భయపెట్టువారు; సంగడీలన్—చెలికాండ్రను; చీరువారును—పిలుచువారును; సంగరభీరులన్—యుద్ధమునకు భయపడువారిని; కేరువారును—పరిహసించువారును; వాహనంబులన్—గుఱ్ఱములను; అఱుమువారును — విజృంభించువారును; తోట్రిరి—కూసిరి.

అఱుమనుటకుఁ బ్రయోగము:—

'ఎఱుఁగుదు నేను సుయోధను, కొఱగామియు నతనితోడఁ గూడిన నృపులం
దఱుఁ బగ మనమున నిడుకొని, యఱుములయును సంధి పొసఁగదనియు మహాత్మా'
—భారతము. ఉద్యోగపర్వము.

ఇందు వీరరసము వర్ణింపఁబడినది.

తే. గలితశృంఖల లయ్యు నకాలనిద్ర
గనుఁగవలఁ గ్రాలఁ దమయంతఁ గదలవయ్యె
దారుణాధోరణప్రయత్నమునఁ గాని
నముచిమథనునివీట శుండాలఘటలు. 67

ఈపద్యము మొదలు 72 పద్యమువఱకు నశుభసూచకంబులు కలుగుట వర్ణింపఁబడినది.

(వ్యా) నముచిమథనుని—ఇంద్రునియొక్క; 'స్వారాణ్నముచిసూదనః.' అని యమరుఁడు; వీటన్—పట్టణమునందు; శుండాలఘటలు—ఏనుఁగులగుంపులు; గలితశృంఖలలయ్యున్—సంకిళులు విడువఁబడినవైనను; అకాలనిద్ర, కనుఁగవలన్, క్రాలన్—; దారుణాధోరణప్రయత్నమునగాని—దారుణ—క్రూరమైన; ఆధోరణ—మావటివానియొక్క; ప్రయత్నమునఁగాని—ప్రయత్నముచేతఁదప్ప; తమయంతన్—స్వేచ్ఛగా; కదలవయ్యెన్.

క. పొరిఁబొరి నెగయుచు ద్రెుగ్గుచు
ధరణీస్థలిఁ బొరలఁబడుచుఁ దలకొని శిఖం
బొరసిన వయ్యు హయంబులు
భరియింపవు కొంత తడవు పల్యాణంబుల్. 68

(వ్యా) పొరిఁబొరిన్—మాటిమాటికి; ఎగయుచున్—ఎగురుచు; ద్రెుగ్గుచున్—వ్రాలుచు; పొరలఁబడుచున్—తలక్రిందులుగాఁ బొరలుచు; తలకొని—పూని; శిఖం బొర

సినవయ్యుఁగ౯—శిక్షింపఁబడినవైనను; (అనఁగా నేర్పఁబడినవైనను); హయంబులు—గుఱ్ఱంబులు; కొంతతడవు—కొంతసేపు; పల్యాణంబుల్—జీనులను; భరియింపవు—ధరింపవు.

ఉ. డాసి పురోహరిన్మణివిటంకమునం దనమేనినీడ ను
ల్కా—సమదృష్టిఁ జూచి కినుకం బ్రతివీరుఁడ యంచు వ్రేసి బా
హాసి విభిన్నమై పడఁ దదర్ధముఁ జేకొని వచ్చెఁ గల్పవృ
క్షాసవపానమత్తుఁ డమృతాంధసుఁ డొక్కఁడు జన్యకేళికి౯. 69

(వ్యా) కల్ప.....మత్తుఁడు — కల్పవృక్షాసవ — కల్పతరువునుండి పొడమిన కల్లును; పాన—త్రాగుటచేత; మత్తుఁడు—మదించినవాఁడగు; అమృతాంధసుఁడు—అమరుఁ డొకడు; అమృత + అంధస్—అమృతమే యన్నముగాఁగలవాఁడు, 'అమర్త్యా అమృతాంధసః' అని యమరుఁడు; డాసి—సమీపించి; పురో.....విటంకమున౯ — పురః—ఎదుట నుండు; హరిన్మణి—పచ్చనిమణులచేత; అనఁగా నింద్రనీలమణులచే నిర్మింపఁబడిన; విటంకమున౯ — కొణిగెలయందలి (గువ్వగూఁడులందు); తన మేనినీడ౯—తన ప్రతిచ్ఛాయను; ఉల్కా—సమదృష్టి౯—కొఱవివలెఁ గ్రూరమగుచూపుతో; చూచి—; కినుక౯—కోపముతో; ప్రతివీరుఁడయంచు—తన్నెదిరించుశూరుఁడని భ్రమసి; వ్రేసి—దానిం గొట్టి; బాహాసి—తనచేతియందుండు ఖడ్గము; విభిన్నమైపడ౯—తునిఁగిపడఁగా; తదర్ధము౯—మిగిలినసగమును; చేకొని—గ్రహించి; జన్యకేళికి౯—యుద్ధక్రీడకు; వచ్చె౯.

అలంకారము—భ్రాంతిమంతము.

తే. కారణము లేక యూరకె నారి దెగిన
విడిచిపెట్టక రణరసావేశ మొదవఁ
బట్టి కోదండదండంబు పరిఘ గాఁగ
విసరుచును వచ్చె వేఱొండు వేల్పుజోదు. 70

(వ్యా) వేల్పుజోదు—సురవీరుఁడు; జోదు—యోధశబ్దభవము; నారి—అల్లెత్రాడు; పరిఘ—ఇనుపగుదియ.

క. గొనయంబు నెక్కఁ ద్రోచిన
గనయంబున కెక్కకున్నఁ గ్రమ్మిన తమకం
బున విల్లు విడిచి వేఱొక
యనిమిషభటుఁ డనికి వెడలె నడిదముఁ గొనుచు౯. 71

(వ్యా) గొనయంబున్—అల్లెత్రాటిని + (గుణశబ్దభవము); ఎక్కుఁద్రోచినన్—ఎక్కుపెట్టఁగా; గనయంబునకున్—బింటికొప్పునకున్; క్రమ్మినతమకంబునన్—అధిక సంభ్రమముతో; అడిదమున్—కత్తిని.

ఉ. పట్టఁదలంచె నేని పదపద్మయుగంబు వశంబు గాక లోఁ
బుట్టిన బాష్పగద్గదికఁ బోకు మనం బలు కెత్త లేక పైఁ
జుట్టిన నెయ్యపుం బదనుచూపులచే సతి వెంట నంటి త
న్బట్టఁగఁ బట్టఁగా నొక సుపర్వుఁడు వచ్చె రణాభిలాషి యై. 72

(వ్యా) పోకుము + అనన్—పోవలదనుటకు; పలుకెత్తలేక—చెప్పఁజాలక; పదను చూపులచేన్—వాఁడిచూపులచేత; పట్టఁగఁ బట్టఁగాన్—సంభ్రమద్యోతనార్థము ద్విరుక్తి; సుపర్వుఁడు—అమరుఁడు.

క. సురవీరుఁ డొకఁడు సతిచే
దురమునకు ననుజ్ఞ వేఁడి తొల్లిటియలుకం
జిరకాలదుర్లభం బగు
పరిరంభము గాంచి వెడలెఁ బ్రమదం బెసఁగన్. 73

(వ్యా) దురమునకున్—యుద్ధమునకు; తొల్లిటియలుకన్—పూర్వప్రణయకలహముచేత; చిరకాలదుర్లభంబగు—పెద్దకాలముగా లభింపని; పరిరంభమున్—కౌఁగిలిని; కాంచి—పడసి.

(వి) ఇచటఁ బరిరంభము నుపలక్షణం బనియు నెన్నఁదగు.

చ. నను నని సేయఁ బంపు ఖగనాథునిసోఁగపసిండి ఱెక్క లు
క్కునఁ గొని కర్ణపూరమునకు న్రభసంబునఁ దెత్తు నేను నీ
కని తన కడ్డమై నిలుచు నచ్చరతొయ్యలి నూఱడించి పో
రున కరుదెంచె వేల్పుఁగొమరుం డొకరుం డురుదండహస్తుఁడై. 74

(వ్యా) అనిసేయన్—యుద్ధము సేయుటకు; ఖగనాథుని—గరుత్మంతుని; సోఁగ—నిడుదలగు; ఉక్కునన్—శౌర్యముతో; కొని—గ్రహించి; కర్ణపూరమునకున్—కర్ణాభరణమునకై; రభసంబునన్—వేగమున.

ఉ. మానసవేగరథ్యమును మాతలిసారథికంబు నగ్రసం
దానితనీలనీరదపతాకము నైనరథంబుపై శచీ
జాని పులోమవృత్రబలజంభశరప్రవిఘాతకారణం
బైనతనుత్రముం దొడిగి నాహవదోహలమానసంబునన్. 75

(వ్యా) శచీజాని—ఇంద్రుఁడు; మానసవేగరథ్యము—మనోవేగముఁబంటివేగముగల గుఱ్ఱములు; అగ్ర.....పతాకము—అగ్ర—శిఖరమునందు; సందానిత—కట్టఁబడిన; నీల నీరద—నల్లనిమేఘమనెడు; పతాకము—టెక్కెముగలదియును; ప్రవిఘాత—అడ్డపడుటకు; తనుత్రము—కవచము; ఆహవ.....మానసంబునన్—ఆహవ—యుద్ధమునందు; దోహల—ఇచ్ఛగల; మానసంబునన్—మనస్సుతో.

సీ. గతిఁ బ్రముచ్చిలఁగ వేచుగాలిఁ ద్రావఁగఁ బాము
నిడినకైవడిఁ గాలికడియ మమర
నలదేవమణికిఁ గావలి యిడ్డప్రహరి నా
గళమున ఘంటికావళులు మెఱయఁ
బన్నగారికి నెదుర్పడ వెండిటెక్కెలు
ధరియించె ననఁగఁ బక్కెర సెలంగఁ
బారిజాతాహృతిప్రభవకోప మనంగ
గతిరోధజనితఘూత్కృతులు నిగుడ

తే. ఖురముఖక్షుణ్ణకాంచనక్షోణిరజము
పర్వ సంధ్యారుణేందుబింబంబుఁబోలఁ
వాహకోత్తముఁ డైన రేవంతుఁ డమర
వల్లభుని మ్రోల నుచ్చైశ్శ్రవంబు నిలిచె. 76

ఈపద్యమునం దుచ్చైశ్శ్రవ మను దేవేంద్రునిగుఱ్ఱము వర్ణింపఁబడినది.

(వ్యా) గతిన్—(దీని) గమనమును; ప్రముచ్చిలఁగన్—దొంగిలించుటకై; వేచు—కాచియున్న; గాలిన్—వాయువును; త్రావఁగన్—పానముచేయుటకై; పాము నిడిన కైవడిన్—పామునుంచినారోయన్నట్లు; కాలికడియము—కాలియందె; అమరన్—ఒప్పఁగా; అనఁగా నింద్రునిపట్టపుగుఱ్ఱమగును చ్చైశ్శ్రవము వాయువేగమునకంటె నధికవేగము గల

చుటచే దానివేగమును వాయువు గ్రహింపరాఁగా నావాయువును మ్రింగుటకై పెట్టిన పాశమోయనునట్లు కాలికడియము చెలువారెనని భావము; ఇట్లు నర్థశక్తిమూలవస్తుధ్వని; అల — ప్రసిద్ధమైన; దేవమణికిన్ — ఉత్తమాశ్వముయొక్క మెడమీఁద నుండు దేవమణి యను పేరుగల మంగళదాయకమగు నొకసుడికి; మణిని బదిలపఱచుట వాఁకుక; కావలి యిడ్డ — కావలియుంచిన; ప్రహరినాన్ — ప్రాకారమో యనునట్లు; పన్నగాశికిన్ — గరుత్మంతునకు; ఎదుర్పడన్ — ప్రతిఘటించుటకై; పక్కెర — అంగీ (గుఱ్ఱములోనగువాని యంగీ) ; పారిజాతా...మునంగన్ — పారిజాతాహృతి — కల్పవృక్షాపహరణముచేత ; ప్రభవ — పుట్టిన; రోష...మునంగన్ —; ఖుర...రజము — ఖురముఖ — గొరిజెలకొనలచేత; క్షుణ్ణా — నలపఁబడిన; కాంచనక్షోణి — బంగారుమయమైన నేలలయందలి; రజము — దుమ్ము; పర్వి — వ్యాపించి ; వాహకోత్తముఁడైన — శ్రేష్ఠుఁడైన గుఱ్ఱపురౌతగు ; రేవంతుఁడు — రేవంతుఁ డనువాఁడు ; మ్రోలన్ — ఎదుట.

అలంకారములు:— పెద్దపాదములు నాలుగింటియందును నుత్ప్రేక్షలును; గీతము నం దుపమయు.

శా. చండస్థూలరదద్వయద్వయమహాస్తంభంబులం బూని యు
ద్దండస్ఫారపతాకికాసహితమై దానచ్ఛటాచిత్రవ
ద్గండాభోగవిశాలకుడ్యములచేఁ గన్పట్టు నద్దేవతా
శుండాలం బరుదెంచె సంగరరమాశుద్ధాంతసౌధం బనన్. 77

ఈపద్యమున నైరావతము యుద్ధసన్నద్ధమై వచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) చండ...స్తంభంబులన్ — చండ — క్రూరమైన; స్థూల — గొప్పవియగు; రదద్వయద్వయ — నాలుగుదంతము లనెడు; మహాస్తంభంబులన్ — గొప్పకంబములను; పూని — ధరించి;

ఐరావతమునకు నాలుగుదంతములు గల వనుటకుఁ బ్రమాణము:—

'చత్వారి వేదబ్రహ్మస్య వర్ణాబ్ధిహరిబాహవః
స్వర్గంతిదంతసేనాంగోపాయయామయుగాశ్రమాః' — అని కవికల్పలత.

ఉద్దండ......సహితమై — ఉద్దండ — భయంకరమైన; స్ఫార — గొప్ప; పతాకికా — జెండాకొమ్ములతో; సహితమై — కూడినదై; దాన......కుడ్యములచేన్ — దానచ్ఛటా — చెక్కిళ్లయందు జాఱుమదజలముచేత; చిత్రవత్ — వన్నె గావింపఁబడిన; గండాభోగ — చెక్కిళ్లప్రదేశము లనెడు; విశాలకుడ్యములచేన్ — విస్తారమైన గోడలచేత; కన్పట్టు — కనఁబడుచున్న; అద్దేవతాశుండాలంబు — ఆయైరావతము; సంగరరం......సౌధంబనన్ — సంగ

రమా—రమాలక్ష్మియొక్క—; శుద్ధాంత—అంతఃపురమండలి; సౌధం బనక్—మేడయో యనునట్లు; అరుదెంచెన్—వచ్చెను.

అలంకారము—రూపకానుప్రాణితోత్ప్రేక్ష.

ఇందు వృత్తి-ఆరభటి. రీతి-గౌడి. రసము-రౌద్రము.

ఉ. ఏడుకరంబుల న్వరుస నెత్తినతోమరశక్తిచాపశ
స్త్రీకమరుస్రువవ్యజనదివ్యమహాస్త్రరసాధనంబు లా
మ్రేడితకాంతితో నిజశరీరరుచిం బచరింప వచ్చె న
య్యేడికరాచతత్తడిపయిన్ హుతవాహుఁ డుదగ్రమూర్తియై. 78

ఈపద్యమునం దగ్నిదేవుఁడు యుద్ధసన్నద్ధుఁడై రణానికివచ్చుట వర్ణింపఁబడియె.

(వ్యా) హుతవహుఁడు—అగ్ని; ఏడుకరంబులన్—ఏడుహస్తములచేత; స్రువ—గరిటెవంటియొకయాయుధవిశేషము; ఆమ్రేడితకాంతితోన్—రెట్టింపఁబడినప్రకాశముతో; పచరింపన్—ప్రవర్తింపఁగా; ఏడికరాచతత్తడిపయిన్—ఏడిక—పొట్టేలు; 'తగ రేడిక పొట్టే లన' నని యాంధ్రనామసంగ్రహము; ఏడికరాచ—శ్రేష్ఠమగుపొట్టేలనెడు; తత్తడిపయిన్—గుఱ్ఱముమీఁద; ఇట వాహనముమీఁద ననుట; అగ్నికి వాహనము మేక.

సప్తహస్త శ్చతుశ్శృంగ స్సప్తజిహ్వో ద్విశీర్షకః
త్రిపాత్ప్రసన్నవదన స్సుఖాసీన శ్శుచిస్మితః
స్వాహాంతు దక్షిణే పార్శ్వే దేవీంవామే స్వధాంతథా
బిభ్రద్దక్షిణహస్తైశ్చ శక్తిమన్నం స్రుచం స్రువం
తోమరంవ్యంజనంవామే ఘృతపాత్రంతు ధారయన్
మేషారూఢంజటాబద్ధం గౌరవర్ణం మహౌజసం
ధూమధ్వజం లోహితాక్షం సప్తార్చి స్సర్వకామదం
ఆత్మాభిముఖమాసీన మేవం ధ్యాయే ద్ధుతాశనం.

—అని యగ్నిదేవుని ధ్యానశ్లోకములు.

శా. బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులింగాలికి
న్సాహాయ్యంబు ఘటించి కోపరసఘూర్ణన్నేత్రదీప్తు ల్పయో
వాహాంతర్గతవైద్యుతప్రభల లేవం జోప వాహద్విప
ద్వాహోత్తంసము నెక్కి పోరి కడరె న్వైవస్వతుం డుద్ధతిన్. 79

ఈపద్యమునందు యముఁడు యుద్ధమునకు వెడలుట వర్ణితము.

(వ్యా) వైవస్వతుండు—యముఁడు; బాహా — గాలికిన్—బాహా — భుజముల యందు; సంభృత—భరింపఁబడిన (అనఁగాధరింపఁబడిన); కాలదండ—కాలదండమునుండి; జనిత—పుట్టిన; స్ఫార—గొప్పవి యగు; స్ఫులింగాళికిన్—మిణుఁగురులవరుసకు; సాహాయ్యంబు ఘటించి—తోడై; కోపరసఘూర్ణన్నేత్రదీప్తుల్ — కోపావేశముచేతఁ దిరుగుడు పడుచున్నకన్నులకాంతులు; పయో.....ప్రభలన్—పయోవాహ—మేఘములయొక్క—; అంతర్గత—మధ్యమున నుండు; వైద్యుతప్రభలన్—మెఱుపుఁదీఁగలకాంతులను; లేపం జోపన్—లేవనెత్తఁగా (ప్రజ్వరిల్లఁజేయఁగా); వాహ.....త్తంసమున్—వాహద్విషత్—ఎనుబోఁతనెడు; 'లులాయో మహిషో వాహ ద్విషత్కాసర సైరిభాః' అని యమరుఁడు; అనఁగా గుఱ్ఱమునకు శత్రు వని యవయవార్థము; 'సింహేభం మహిషాశ్వ మోతు ఖనకం శ్వేణంచ కీశాది గోవ్యాఘ్రం బభ్రుఫణీతి భీరుపరయోః..................' అని ముహూర్తమార్తండము; వాహోత్తంసమున్—వాహనశ్రేష్ఠమును; ఎక్కి—; ఉద్ధతిన్; పోరి కడరెన్.

ఈపద్యమునం దారభటీవృత్తి; గౌడీరీతి; రౌద్రరసము.

శా. భీమాకారులు కామరూపధరు లాభీలక్రియాపారగో
ద్దాము ల్పుణ్యజను ల్భజింపఁ గుముదస్తంబేరమం బగ్రతో
భూమిం బల్లన గట్టి రా నసిరుచిస్ఫూర్తు ల్విజృంభింప సం
గ్రామేచ్ఛం బలలాశి యేఁగె మనుజస్కంధాంతరారూఢుఁడై. 80

ఈపద్యమునందు నిరృతి యుద్ధమున కేగుట వర్ణింపఁబడినది.

(వ్యా) పలలాశి—మాంసభక్షకుఁడు, (అనఁగా రాక్షసుఁడు; ఇచట నిరృతియని భావము); కామరూపధరులు—ఇచ్ఛారూపములనుధరించువారు; ఆభీల...ద్దాముల్—ఆభీలక్రియా—క్రూరకార్యములయొక్క—; పారగ—పూర్ణతనుబొందినవారు కావున; ఉద్దాముల్—అడ్డులేనివారు; (అగు) 'క్రియాపాదన'యని పాఠముగలదు; అపుడు 'ఆపాదన, కలిగించుటచేత' అనియర్థము; పుణ్యజనుల్—రాక్షసులు; 'యాతుధానః పుణ్యజనో నైరృతో యాతురక్షసి' అనియమరుఁడు; కుముదస్తంబేరమంబు—కుముదమను పేరుగల యతనియేనుఁగు; 'ఐరావతః పుండరీకో వామనః కుముదోఽంజనః పుష్పదంతస్సార్వభౌమ స్సుప్రతీకశ్చదిగ్గజాః' అని యమరుఁడు; అగ్రతోభూమిన్—తనకెదుట—; పల్లన—జీను; అసిరుచిస్ఫూర్తుల్—కత్తి మెఱుఁగులవిడంబములు; మనుజస్కంధాంతరారూఢుఁడై—మనుష్యుని మూఁపునడుమఁ గూర్చుండి.

ఇందు_వీరరసము; భారతి_వృత్తి; పాంచాలి-రీతి.

చ. మకర కుళీర కచ్ఛప సమానము లైనముఖంబుల న్భయా
నకరస ముప్పతిల్లఁ గెలన న్నిజకింకరదైత్యదానవ
ప్రకరము గొల్వ బాహుశిఖరంబునఁ బాశము పూని వార్ధినా
యకుఁ డని కేఁగుదెంచెఁ గలహాంసతురంగరథాధిరూఢుఁడై. 81

ఈపద్యంబున వరుణుం డాహవభూమికి వచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) వార్ధినాయకుఁడు_వరుణుఁడు; మకర_మొసలి; కుళీర_ఎండ్రకాయ; కచ్ఛప_తాఁబేలు; (వీనికి) సమానములైన ముఖంబులన్_తుల్యములగు మోములందు; భయానకరసము_భయోత్పాదకమగురసము; (శృంగారాదులలో నొకటి); ఉప్పతిల్లన్_కలుగఁగా; కెలనన్_పార్శ్వమునందు; కల...రూఢుఁడై__ఇతనికివాహనమురాయంచ.

ఇందును రసవృత్తులు పైపద్యమునందువలె నని తెలియునది.

ఉ. అంగసుగంధము ల్నిజభటాలిపథశ్రమమున్ హరింప ను
త్తుంగగదాపరిభ్రమవిధూతము లై ఘనము ల్దిగంతమా
తంగవిశాలకర్ణములఁ దార్కొని చామరలీలఁ జూప సా
రంగహయంబు నెక్కి సమరంబున కేగె సమీరుఁ డుద్ధతిన్. 82

ఈ పద్యమునందు సమీరుండు సమరరంగంబునకు వచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) సమీరుఁడు _ వాయుదేవుఁడు; ఉత్తుంగగదా_పొడవైనగదయొక్క; పరిభ్రమ_త్రిప్పుటచేత; విధూతములై_ఎగఁజిమ్మఁబడినవై; ఘనముల్_మేఘములు; దిగంత...కర్ణములన్__దిగంతమాతంగ_దిగ్గజములయొక్క;విశాలకర్ణములన్_వెడల్పయిన చెవులయందు; తార్కొని_చేరుకొని; చామరలీలన్_చామరములు వేయువిధమును; చూపన్_ప్రకటింపఁగా; సారంగహయంబున్_జింక వాహనమును.

ఇందును రసవృత్తిరీతులు పైపద్యమునందువలెనే యని యెఱుంగునది.

క. నలకూబరమణికంఠులు
బలములు నడపింప నర్థపతి తురగముపై
ధళధళితచంద్రహాసో
జ్జ్వలితభుజుం డగుచు నడచె వాసవుమోలన్. 83

దీనియందుఁ గుబేరుఁడు యుద్ధమునకువచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) అర్థపతి—కుబేరుఁడు; నలకూబరమణికంఠులు —నలకూబరుఁ డను తన కుమారుఁడును మణికంఠుఁడును; బలములనడిపింపన్—తన సేనలను నడిపింపఁగా; ధళ... భుజుండగుచున్—ధళధళిత — తళతళమని మెఱయుచుండెడు; చంద్రహాస — కత్తిచేత; ఉజ్జ్వల—ప్రకాశించుచుండు; భుజుండగుచున్—బాహువుఁ గలవాఁ డగుచు.

ఉ. ఆననసీమఁ గ్రోధజనితారుణదీధితి ఫాలభాగనే
త్రానలకీలలం బెనుప హస్తమున న్నిశితత్రిశూలముం
బూని మదించి అంకెలిడుపోఁటరి గిబ్బలజేని నెక్కి యీ
శానుఁడు వచ్చెఁ బారిషదసైన్యముతో రణకౌతుకంబునన్. 84

ఈపద్యమునం దీశానుఁడు సమరాంగణమునకు వచ్చుట వర్ణింపఁబడినది.

(వ్యా) ఈశానుఁడు — ఈశానుఁ డను దిగధిపతి, (పరమశివాంశజుఁ డనుట); క్రోధ......దీధితి—క్రోధ—కోపముచేత ; జనిత—పుట్టిన; అరుణదీధితి—ఎఱ్ఱనికాంతి ; ఫాల......కీలలన్—ఫాలభాగ—నొసటియందలి ; నేత్రానలకీలలన్—కంటియగ్నిజ్వాలలను; పెనుపన్—వృద్ధిపొందింపఁగా;నిశిత—వాఁడియైన;అంకెలిడు—బొబ్బలిడు; పోఁటరి—శూరుఁడైన; గిబ్బలజేనిన్—వృషభపతిని;పారిషదసైన్యముతోన్—ప్రమథగణములతోడ.

ఈపద్యమునందును రసవృత్తిరీతులు 80 వ పద్యమునందువలెనే.

ఉ. ఆయుధగర్భితంబు లగునంజలు లెత్తి పులోమకన్యకా
నాయక యేన యేన యని నాకనివాసులు మ్రొక్కి సూరెలం
బాయక కొల్చి రా దిగధిపాలురతో నలనందసూనుఁ డా
హా యిటు సేయునే యని మహాహమికం బలుమాఱు పల్కుచున్.

(వ్యా) ఆయుధగర్భితంబులగు—ఆయుధములు ధరించిన; అంజలులు—దోయిళులు; పులోమకన్యకానాయక—శచీదేవికిభర్తయగునింద్రుఁడా; యేనయేనయని—నేనేనేయని తమతమపేరులుగ్గడించుచు; సూరెలన్—పార్శ్వములందు; అలనందసూనుండు—ఆప్రసిద్ధుఁడైనకృష్ణుఁడు; (అల—ఇదివాక్యాలంకారార్థముప్రయుక్తము); మహాహమికన్—(మహత్ + అహమిక—మహాహమిక)అధికమైన శూరాలాపముతో; 'అహమహమిక'యని ద్విర్భావముతో రూపము గలదుగాని, 'అహమిక' యనురూపము ప్రయోగములందు మృగ్యము.

నేనేసమర్థుఁడను నేనేసమర్థుఁడననియెడు వీరోక్తియహమహమిక; నేనే సమర్థుఁ డననియెడు వీరాలాపమహమికయని చెప్పఁదగు.

చ. హరిహయుఁ డాహరిం గెలుచునాసయు మోసము నాక యీగతిం
బురి వెడలంగ నవ్విభునిమ్రోల మరుద్వసువిశ్వరుద్రభా
స్వరతుషితాదికత్రిదశవర్గము ముప్పదిమూఁడుకోటు లు
ద్ధురగతి నేగుదెంచె రణధూర్వహగర్వము లుల్లసిల్లఁగన్. 86

(వ్యా) హరిహయుఁడు_ఇంద్రుఁడు; 'జంభభేదీహరిహయః' అని యమరుఁడు; మోసము నాక_ప్రమాద మనక; అనఁగా వ్యర్థమగునని తలంపక; మరుద్వసు...వర్గము___వీరంద ఱు దేవయోని భేదములు; ధూర్వహ___భారవాహిత్వము.

శా. అర్వారోహణచాతురీవిలసనాహంకారదుర్వారతన్
సర్వాంగీణము లైనమైమఱువులు న్శస్త్రీకృపాణంబులున్
గర్వాలాపవిడంబము ల్మెఱయ జోకం జిత్రసేనాదిగం
ధర్వు ల్వజ్రికిఁ దోడుసూపిరి పురద్వారప్రదేశంబునన్. 87

(వ్యా) అర్వ___గుఱ్ఱము; సర్వాంగీణములైన _ అవయవములన్నిటిని గప్పు; మైమఱువులు_కవచములు; జోకన్_పరాక్రమముతో; వజ్రికిన్_ఇంద్రునికి.

ఉ. హేమధరాధరంబు చలియింప వెసన్ బహుకోటిసంఖ్య లై
యామరసైన్యము ల్నడచునప్పు డనంత సితోష్ణవారణ
స్తోమనిరోధ మందియును దోడనె దిక్కులు గప్పె నయ్యెడం
జామరవాయునున్నములు సాంద్రహిరణ్మయభూపరాగముల్. 88

(వ్యా) హేమధరాధరంబు _ మేరుపర్వతము; చామరవాయునున్నములు_ చామరములవలనిగాలులచేత నెగఁజల్లఁబడినవగు; సాంద్రహిరణ్మయ భూపరాగముల్_ దట్టములగుబంగారు నేలలందలిధూళులు; అనంత...నిరోధము___అనంత_లెక్కలేని; సిత_తెల్లని; ఉష్ణవారణ_గొడుగులయొక్క; స్తోమ_గుంపులచేత; నిరోధము_అడ్డపాటును; అందియును_పొందియును; తోడనే_వెంటనే; దిక్కులు గప్పెన్_దిశ లాక్రమించెను.

ఉ. దారుణభంగి నొండొకటి దాఁకెడు నస్త్రముఖంబుల న్ఘనా
త్కారము లుల్లసిల్ల బెడిదంబుగఁ బుట్టినసందడిం బుర
ద్వారము నిర్గమించె సురవల్లభుసేనలు భర్గజూటకాం
తారముఖంబున న్వెడలు దైవతసింధుఝురంబులో యనన్. 89

(వ్యా) బెడిదంబుగన్ — భయంకరముగా; సందడిన్ — కలకలముతో; భర్గ... ముఖంబునన్ — శివుని జడముడియనెడునడవియందుండి; వెడలు — వెలుపటికివచ్చు; దైవత సింధుస్ఫురంబులో యనన్ — ఆకాశగంగాప్రవాహములో యన్నట్లు; సురవల్లభుసేనలు నిర్గమించెనని యన్వయము; నిర్గమించెను — వెలువడెను.

అలంకారము — ఉత్ప్రేక్ష.

శా. బాణద్విణ్మథితాంబుధిధ్వనికళాపాణింధమానీకని
స్సాణస్వానభిదేలిమాద్రితట నిస్సామాన్యచాపాగమ
ద్రోణాచార్య సురీసమూహవరణోద్యుక్తాహితశ్రేణిని
శ్రేణీభూతకృపాణ మాంసలభుజాశేషాహిపత్యుద్ధరా. 90

(వ్యా) బాణ......తట — బాణద్విట్ — బాణాసురునకు విరోధియగువిష్ణువుచేత; మథిత — తరువఁబడిన; అంబుధి — సముద్రముయొక్క; ధ్వనికళా — శబ్దముయొక్క చాతుర్యములను; పాణింధమ — వృద్ధిపఱచుచున్న; అనీక — సేనలయొక్క; నిస్సాణస్వాన — తప్పెటలధ్వనులచేత; భిదేలిమ — పగులుస్వభావము కల (అనఁగాఁ బగులుచున్నయనుట); అద్రితట — పర్వతప్రాంతముకలవాఁడా; అనఁగాఁ గృష్ణదేవరాయలసేనలతప్పెటలధ్వనులు సముద్రఘోషములకంటెను బెడిదముగానుండుననియు నాధ్వనులచేఁ గొండలు పగులునట్లుండెననియు భావము; ఇచట నలంకారమతిశయోక్తి; నిస్సామా......చార్య — నిస్సామాన్య — అసాధారణమైన (అనఁగా నితరుల కలవికాని యనుట); చాపాగమ — ధనుర్విద్యయందు; ద్రోణాచార్య — ద్రోణాచార్యునివంటివాఁడా; సురీ...కృపాణ — సురీసమూహ — దేవతాస్త్రీబృందములను; వరణ — పాణిగ్రహణము చేయుటకు; ఉద్యుక్త — ప్రయత్నపడిన; అహితశ్రేణి — విరోధులవరుసలకు; నిశ్రేణీభూత — నిచ్చెనలైన (అనఁగా నిచ్చెనవలె నాచరించెడు); కృపాణ — కత్తి కలవాఁడా; అనఁగాఁ గృష్ణరాయలకత్తి శత్రువులవరుసలఁ జంపి దేవలోకమునకుఁ బంపుటచేనచ్చట నుండుకామినులను బాణిగ్రహణము చేయుటకై వారలు స్వర్గమున కెక్కిపోవుటకై తాను నిచ్చెనవలె నాచరించుచున్నదని భావము; ఇచట నలంకారము రూపకము; ఉత్ప్రేక్షగమ్యము; మాంసల......ద్ధరా — మాంసల — క్రొవ్విన (బలిసినయనుట); భుజా — బాహువులచేత; శేషాహిపతి — నాగేశ్వరుఁడగు నాదిశేషుని; ఉద్ధరా — కాపాడువాఁడా; అనఁగా నాదిశేషునిభూభారమును దాను వహించి యతనికి మేలు చేసినవాఁడా యని భావము ఇచ్చట నర్థశక్తి మూలవస్తుధ్వని.

ఈ పద్యమున నింద్రసేనల యుద్ధసన్నాహసమయంబున 63—వ పద్యమున వర్ణింపఁబడిన నిస్సాణధ్వానము సూచితము. ఇట శబ్దశక్తి మూలవస్తుధ్వని.

క. చండతర మూరురాయర
గండమహాబిరుద ధాటికారయవిచల
త్కొండపలి కొండవీటీ
మండల కటకేశసింధుమందరకుధరా. 91

(వ్యా) చండతర... బిరుద — చండతర — మహోగ్రమైన; మూరురాయరగండ — మూరురాయరగండయను పేరుగల; అశ్వపతి, నరపతి, గజపతియనునీముగ్వురుసేనాధిపతులను జయించినవాఁడనెడు; మహాబిరుద — గొప్పబిరుదము గలవాఁడా; ధాటికా... మండల — ధాటికారయ — దాడివేగముచేత; విచలత్ — చలించుచున్న (కదలుచున్న); కొండపలికొండవీటీమండల — కొండపల్లి, కొండవీడు, అను దేశములు గలవాఁడా; అనఁగాఁ గృష్ణరాయఁడు కొండపల్లి కొండవీడను దేశములమీఁద దాడివెడలి వాని నాక్రమించి వానిం జలింపఁజేసెనని భావము; ఇటఁ గొండపలి కొండవీటియను పదము లందుఁ గల 'కొండ' శబ్దసారస్యముచేత సహజములుగా నచలములగు కొండలను గృష్ణరాయలు చలింపఁ జేసెననుట చమత్కారము; కటకేశ.....కుధరా — కటకేశ — కటకదేశాధిపతియనెడు; (ఉత్కలదేశము కటకదేశమనంబడును); సింధు — సముద్రమునకు; మందరకుధరా — మందరపర్వతమువంటివాఁడా; అనఁగా నుత్కలదేశాధిపతిని మథించినవాఁడా యని భావము.

అలంకారము — రూపకము.

(తోటకము.)

త్వరితాధరితానిలవాజినట
త్ఖురజోరురజోభరగూఢరవి
స్ఫురణా కరణాధికశూరత్కృతిమ
ద్వ్విరదాకరదారణ వీరబలా. 92

(వ్యా) త్వరి... స్ఫురణా — త్వరిత — వేగముచేత; అధరిత — తక్కువపఱుపఁబడిన; అనిల — వాయువు కలిగిన, (అనఁగా వాయువేగముకంటె నధికవేగముగల యనిభావము); వాజి — గుఱ్ఱములయొక్క; నటత్ — నర్తనముచేయుచుండు; అనఁగాఁ బరువిడుచున్న; ఖురజ — గొరిజలనుండి పొడమెడు; ఉరు — గొప్ప; రజోభర — దట్టపుధూళులచేత; గూఢ — మఱుఁగుపడిన; రవిస్ఫురణా — సూర్యునియొక్క కాంతులుగలవాఁడా; అనఁగా వాయువేగ

ముకంటె నధికవేగముగల కృష్ణదేవరాయనిగుఱ్ఱములు పరువిడునపుడు గొరిజలవలనఁ బొడముదట్టంపుదుమారములు సూర్యకాంతులను గప్పుచుండు నని భావము.

అలంకారము—సంబంధాతిశయోక్తి.

కరణాధిక......వీరబలా— కరణ — తనయింద్రియమైన తొండమునకంటెను; అధిక—దీర్ఘమగు; శూత్కృతిమత్—శూత్కారముతోఁగూడిన; ద్విరదాకర—(ద్విరద+ఆకర) ఏనుఁగులగుంపులను; దారణ—నతిశకెదు; వీరబలా—శూరులగుసేవలుగలవాఁడా; అనఁగా నయ్యేనుఁగుల శూత్కారములధ్వనులతోడి నిశ్వాసములవియొనరించు నింద్రియమగు తొండముఁకంటెను నిడుదలని భావము.

అర్థాంతరము—

కరణా......వీరబలా—కరణాధిక; కరణ—శరీరముచేత; అధిక—గొప్పవియగుక అనఁగా గొప్పయాకారముకల; శూత్కృతిమత్—శూత్కారములతోఁగూడిన; అనఁగా రోఁజుచున్న; ద్విరదాకర—ఏనుఁగులగుంపులను; దారణ—చీల్చెదు; వీరబలా—శూరుల సైన్యములు గలవాఁడా;

ఈ పద్యముయొక్క రచన తురగనర్తనవిధమున నలరారుచుండుట చమత్కారము.

ఈవృత్తము తోటకము—ప్రతిపాదమునకు నాలుగుసగణములును దొమ్మిదవ యక్షరము యతిస్థానమును గలది.

అలంకారము—ఛేకానుప్రాసము.

ఈ పద్యమున నింద్రుని గజతురగపదాతివర్గములు కృష్ణునిపై యుద్ధమునకు వెడలునప్పటి సమరగమనాటోపము సూచితము. ఇచ్చటను శబ్దశక్తి మూలవస్తుధ్వని.

## గద్యము

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది నందిసింగయామాత్యపుత్త్రి కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ తిమ్మయనామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణం బను మహాప్రబంధంబునందుఁ

జతుర్థాశ్వాసము.

## వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీపరమేశ్వరీసనాథ నిరంతరభజన నాగపూడిగ్రామాభిజన
భారద్వాజగోత్ర సామగద్రాహ్యాయణసూత్ర పవిత్రచరిత్ర
యజ్ఞేశ్వరార్యపుత్త్రి సూక్తిపరితోషితార్య కుప్పుస్వా
మ్యార్యప్రణీతం బైన పారిజాతాపహరణ
మహాకావ్యవ్యాఖ్యావికాసం బగు
పరిమళోల్లాసంబునందుఁ
జతుర్థాశ్వాసము.

శ్రీ ర స్తు

# పారిజాతాపహరణము

## పంచమాశ్వాసము

### యుద్ధము

క. శ్రీవర్ణనీయ తిరుమల
దేవీ హృదయేశ యమృతదీధితికులపా
రావారపారిజాత ధ
రావలయశరణ్య కృష్ణరాయవరేణ్యా. 1

(వ్యా) శ్రీవర్ణనీయ—శ్రీ—సంపదలచేత; వర్ణనీయ—పొగడఁదగినవాఁడా; తిరుమల దేవీహృదయేశ—తిరుమలదేవియనెడు రాణికిఁ బ్రాణేశ్వరుఁడా; అమృత...... పారిజాత—అమృతదీధితి—చంద్రునియొక్క; కుల—వంశమనెడు; పారావార—సముద్రమునకు; పారిజాత—కల్పవృక్షమువంటివాఁడా; అనఁగాఁ జంద్రవంశమనెడు రత్నాకరమందుఁ గల్పవృక్షమువలె జనించినవాఁడా యనుట; ధరావలయశరణ్య—భూమండలమునకు రక్షకుఁడా; కృష్ణరాయవరేణ్యా—కృష్ణరాయ మహామహీపతీ.

అలంకారము—రూపకము.

(వి) ఈయాశ్వాసమునందుఁ గృష్ణుఁడు దేవలోకమునుండి పారిజాతవృక్షమును భూమికిఁ దెచ్చిన వృత్తాంతము వర్ణింపఁబడునని యీపద్యమందలి పారిజాతశబ్దప్రయోగచాతుర్యముచే ధ్వనించెను.

తే. అవధరింపుము జనమేజయక్షితీశ
వరున కిట్లను నమ్మౌనివల్లభుండు

దైవసైన్యంబు లీరీతిఁ దరతరంబ
వెడలి మొన లేర్పరించి యుద్వేలవృత్తి. 2

(వ్యా) తరతరంబ—ఖండములు ఖండములుగా (వేర్వేఱుగా); మొనలు—మొగ్గరములు; ఉద్వేలవృత్తిన్—అడ్డులేక.

ఉ. వచ్చితి మింక నెందుఁ జనవచ్చు నొహో నిలు పారిజాతపా
టచ్చర యంచు జంకెలు గడల్కొనఁ గృష్ణునిఁ జుట్టుముట్టి వై
యచ్చరసేన దాఁకునపు డచ్చల మేమని చెప్ప దిక్కులం
జిచ్చుఱ తూపుతండములు సింహరవంబులు నిండె నొక్కటన్. 3

(వ్యా) పారిజాతపాటచ్చర—పారిజాతమును దొంగిలించినవాఁడా; జంకెలు—బెదరింపులు; వైయచ్చరసేన—వియచ్చరుల సేన; అనఁగా దేవతల సేన; అచ్చలము—ఆగ్రహము; చిచ్చుఱతూపుతండములు—ఆగ్నేయాస్త్రజాలములు.

ఉ. ఆకమలాయతాక్షి సమరావనిజాతము డించి సంభ్రమ
న్నాకపురీమహారథుల నవ్వుచుఁ గన్గొని యంగుళిత్రగో
ధాకలనంబుతో యదువతంసుఁడు శార్ఙ్గనిబద్ధశేషని
ర్మోకనిచోళముం దిగిచి రోషనటద్భ్రుకుటీవిలాసుఁడై. 4

(వ్యా) సంభ్రమత్—వేగిరపడుచున్న; అంగుళిత్రగోధాకలనంబుతోన్—ఉడుముతోలుతోఁజేయఁబడిన వ్రేళ్లకవచముతో; శార్ఙ...నిచోళమున్—శార్ఙ—శార్ఙమను పేరుగల తనవింటియందు; నిబద్ధ—కూర్పఁబడిన; శేషనిర్మోక—ఆదిశేషునికుబుసమను; నిచోళమున్—ఒరను; తిగిచి—తీసి; రోష......విలాసుఁడై—రోష—కోపముచేత; నటత్—చలించుచున్న; భ్రుకుటీవిలాసుఁడై—వంకరయగు కనుబొమలయందము గలవాఁడై; (కుటీ—వంకర).

క. తిగిచి శరాసన మెక్కిం
చి గుణధ్వని చేసి యంసశిరముల దొనలన్
బిగియించి తూపు లొక్కట
నిగిడింపఁ దొడంగె మరుదనీకినిమీఁదన్. 5

(వ్యా) తిగిచి_లాగి; శరాసనము_విల్లు (బాణముండుచోటు); దొనలన్_బాణము లుంచెడు తూణీరములందు (అంపపొదులందు); ఒక్కటన్ — ఒక్కసారిగా (అనఁగా గుంపులుగా); మరుదనీకిని__దేవతలసేన.

క. భిన్నాసురాస్రములచవి
గన్న మురాహితశిలీముఖము లపు డనిలో
ము న్నెఱుఁగని సురవీరుల
క్రొన్నెత్తురుచవియు నెఱిఁగి క్రోలఁదొడంగెన్. 6

(వ్యా) భిన్న—నఱుకఁబడిన; అసురాస్రముల — రాక్షసుల నెత్తుళులయొక్క; 'రుధిరేఽసృగ్లోహితాస్రరక్తక్షతజశోణితమ్' అనియమరుఁడు; చవిన్_రుచిని; కన్న—చూచిన_(ఆస్వాదించియుండినయనుట); మురాహితశిలీముఖములు_కృష్ణుని బాణములు;

అనఁగాఁ గృష్ణునిబాణములంతకుమునుపు రక్కసులనెత్తుళులనే రుచిచూచియుండెననియు నిపుడు దేవతలనెత్తుళులను గ్రోలి క్రొత్తరుచి ననుభవింపఁబూనెననియు భావము.

(వి) దేవతలకు శరీరములు లేవని మీమాంసకుల మతమైనను వారికిశరీరములుగల వని వేదాంతులు సిద్ధాంతీకరించియున్నారు. ఈ విషయమును విపులముగాఁ దెలియఁగోరువారు బ్రహ్మసూత్రములనంబడు శారీరకమీమాంసయందుఁ బ్రథమాధ్యాయ తృతీయ పాదమునందలి దేవతాధికరణమును దద్భాష్యమును జూడనగు.

చ. అమరహితంబు గోరి యసురాంగకము ల్విదళించు నట్టి మా
కమరులఁ ద్రుంపఁగా వలసె నక్కట నేఁ డని సిగ్గుఁ జెందుచం
దమునఁ గఠోరశార్ఙ్గజనితప్రదరంబులు వైరి మర్మభే
దము లొనరించి యుద్ధవసుధాస్థలిఁ గూడఁగఁ బాఱు నయ్యెడన్. 7

(వ్యా) అసురాంగకముల్ — ఇచటఁ గుత్సార్థమందుఁ గప్రత్యయము ప్రయుక్తము; ప్రదరంబులు_బాణములు; కూడఁగఁబాఱున్_గుంపులుగాఁ బరుగెత్తును.

సీ. హరిబాణలూనంబులై వచ్చు నమరాస్త్ర
ఖండము ల్డాల్చుఁ బక్షముల జడిసి
యమృతగంధాసక్త మగు చంచుపుటమున
వడి సింధురంబులఁ బొడిచి యెత్తు

సధిపుఁ జేసినఁ బాఱునాశుగంబులకంటె
మునుమున్న చని లక్ష్యములు దళించు
భటులపై హరులపై బహురథాగ్రములపై
నొక్కఁ డయ్యును దోఁచుఁ బెక్కుగతుల
తే. నఖముఖంబుల నఱికి గండ్రలుగఁ జేయు
దివిజబిరుదధ్వజంబు లుద్రేకవృత్తి
నిఖిలలోకాద్భుతావహ నిర్నిరోధ
విక్రమస్ఫూర్తి ఖగరాజచక్రవర్తి. 8

(వ్యా) నిఖిల...చక్రవర్తి—నిఖిలలోక_సర్వలోకములకు; అద్భుతావహ_ఆశ్చర్యమును గలిగించు; నిర్నిరోధ_అడ్డులేని; విక్రమ_పరాక్రమముచేత; స్ఫూర్తి_ప్రకాశించుచున్న; ఖగరాజచక్రవర్తి_గరుత్మంతుఁడు; లూనంబులై_తెగినవై; జడిసి_నివారించి; తూల్చున్_ఎగురఁగొట్టును; సింధురంబులన్_ఏనుఁగులను; ఆశుగంబులు_బాణములు; గండ్రలుగన్_తునియలుగా.

తే. సర్వతోముఖ మయి పేర్చు శార్ఙ్గిబాణ
వర్షసమ్మర్దదుర్దినవ్యాప్తివలన
నప్పు డెదిరించి పన్నిద్ద రహిమకరులుఁ
గానఁ బడలేక తేజోవిహీనులైరి. 9

ఈ పద్యములో ద్వాదశాదిత్యపరాభవంబు వర్ణింపఁబడినది.

(వ్యా) సర్వతోముఖమయి _ అంతటను వ్యాప్తిఁ జెంది (నలువలంకులను); పేర్చు_అతిశయించు; శార్ఙ్గి...వ్యాప్తివలనన్—శార్ఙ్గి – కృష్ణునియొక్క; బాణవర్ష – అమ్ముల వర్షముయొక్క; సమ్మర్ద – ఒరయికవలనఁ గలిగిన; (అనఁగా జడివానచేతఁ గలిగినయనుట); దుర్దిన_సూర్యుఁడు కనఁబడని (మేఘములచేఁగప్పఁబడిన)దినముయొక్క; "మేఘచ్ఛన్నేఽహ్ని దుర్దినమ్" అని యమరుఁడు; వ్యాప్తివలనన్_క్రమ్మటవలన; పన్నిద్దఱు_పండ్రెండు సంఖ్యగల; అహిమకరులు_సూర్యులు (అనఁగా ద్వాదశాదిత్యులనుట); అప్పు డెదిరించి_కృష్ణుని మార్కొని; కానఁబడలేక_అదృశ్యులై; తేజోవిహీనులైరి_నిష్ప్రకాశులైరి.

ఇంద్రుఁడు, ధాత, పర్జన్యుఁడు, త్వష్ట, పూషుఁడు, అర్యముఁడు, భగుఁడు, వివస్వంతుఁడు, విష్ణువు, అంశుమంతుఁడు, వరుణుఁడు, మిత్రుఁడు, వీరు ద్వాదశాదిత్యులు.

తత్రశక్రశ్చ విష్ణుశ్చ జజ్ఞాతే పునరేవహి
అర్యమాచైవధాతాచ త్వష్టాపూషాచభారత
వివస్వాన్ సవితాచైవ మిత్రో వరుణఏవచ
అంశో భగశ్చాతితేజా ఆదిత్యాద్వాదశస్మృతాః'

—అని హరివంశము.

ఉ. చుక్కలరాణివాసముల సోయగపుం జనుదోయిత్రెక్కునం
జిక్కనయైనయక్కు యదుసింహుఁడు బాణపరంపరాహతిన్
వ్రక్కలు సేయఁ గాఱు రుధిరంబునఁ దోఁగుచు రేవెలుంగు గెం
పెక్కినచాయ నభ్యుదయ మేదియుఁ దాల్చె రణాంగణంబునన్. 10

ఈ పద్యమునందుఁ జంద్రుని పరాజయము వర్ణింపఁబడినది.

(వ్యా) రేవెలుంగు—చంద్రుఁడు; చుక్కల రాణివాసముల—నక్షత్రములనెడు తనపత్నులయొక్క; సోయగపు — అందమైన; చనుదోయి — స్తనద్వంద్వముయొక్క; త్రెక్కునన్—ఒరయికచేత; చిక్కనయైన—కర్కశమైన (దృఢమైన); అక్కు—ఱొమ్ము; యదుసింహుఁడు—కృష్ణుఁడు; బాణపరంపరాహతిన్—శరపుంజంబుల దెబ్బలచేత; వ్రక్కలు సేయన్—చీల్పఁగా; కాఱు—స్రవించు; రుధిరంబునన్—నెత్తుట; తోఁగుచున్—మునుంగుచు; రణాంగణంబునన్—యుద్ధభూమియందు; అభ్యుదయమేదియున్—సొంపుచెడి; 'యున్' అనునది యిచ్చట వాక్యాలంకారార్థమని యెఱుంగునది; కెంపెక్కిన చాయన్—రక్తవర్ణమును; తాల్చెన్—ధరించెను.

అభ్యుదయమనఁగా నుదయించుటయనియు నర్థముగావున నుదయము లేకున్నను నీరణావనిలోఁ జంద్రుఁడు కెంపెక్కిన చాయఁదాల్చెననుట విరోధము.

అలంకారము—విరోధము. విభావనయుఁ జెప్పవచ్చును.

రణమును వర్ణించు ప్రకరణమునను నిక్కరణిని ముద్దారుమాటల శృంగార రస పోషకంబుగా నీకవికులభూషణుండు వ్రాయుటచే నితని పలుకు లెల్లభంగుల ముద్దుఁబలుకులనం జెల్లుఁగదా.

తే. చోద్య మప్పుడు భవరోగవైద్యుఁ డైన
యంబుజోదరు డాసినయంతమాత్ర
నపగతాసాధ్యగదుఁ డయ్యె యక్షభర్త
సారిది రుద్రులు నిర్ముక్తశూలు లైరి. 11

ఈపద్యమునందును బై పద్యమునందును నితరదిక్పాలకులయోటమి వర్ణింపఁబడినది.

(వ్యా) అప్పుడు; భవరోగవైద్యుఁడైన—సంసారమనెడు రోగమునకు వైద్యుఁడగు; అంబుజోదరున్—కృష్ణుని; డాసినయంతమాత్రన్—దగ్గఱకురాఁగానే; యక్షభర్త—కుబేరుఁడు; అప...డయ్యెన్—అపగత—పోయిన; అసాధ్య—జయింపనలవికాని; గదుఁడయ్యెన్—గద కలవాఁడయ్యెనని యర్థము; రోగముగలవాఁ డయ్యెనని యర్థాంతరము; గద—రోగము; రుద్రులు—ఏకాదశరుద్రులు;(అజుఁడు, ఏకపాదుఁడు, అహిర్బుధ్న్యుఁడు, త్వష్ట, రుద్రుఁడు, హరుఁడు, శంభుఁడు, త్ర్యంబకుఁడు, అపరాజితుఁడు, ఈశానుఁడు, త్రిభువనుఁడు); సారిదిన్—క్రమముగా; నిర్ముక్తశూలులైరి—విడువఁబడిన శూలాయుధములు కలవారైరని యర్థము; విడువఁబడిన శూలరోగము కలవారైరని యర్థాంతరము.

అనఁగా వైద్యునిచెంతకుఁ బోవఁగా రోగములు నశించునట్లు భవరోగవైద్యుఁడగు కృష్ణునిపొంతకుఁ బోవఁగానేఁ గుబేరుని యసాధ్యమగు రోగము నశించెననియు రుద్రుల శూలరోగము నశించెననియు నప్రకృతార్థము; కుబేరుని గదాయుధము చెడియెననియు రుద్రుల శూలాయుధములు నిరుపయోగములయ్యెననియుఁ బ్రకృతార్థము.

అలంకారములు—ప్రకృతాప్రకృతశ్లేషము - రూపకోత్థాపితము - చపలాతిశయోక్తి.

సీ. నిర్భగ్నశృంగుఁ డై నిజవాహనముఁ దాను
వైవస్వతుఁడు లాఘువంబునొందె
దళితశాతకృపాణదంష్ట్రి యై నైరృత
భుజభుజంగస్వామి పొల్లువోయె
నిర్ధూతహేతి యై నిలువు సీఱుగ నగ్ని
దేవుండు నిర్వాణ తేజుఁడయ్యె
భయపలాయనవేళఁ బవమానునకు నాత్మ
జవసత్త్వములకల్మి సఫలమయ్యె

తే. వరుణునకు డాఁగికొనఁ జోటువలఁతి యగుట
నుదధినాయకభావంబు నుపకరించె
జలరుహోదర సవ్యాపసవ్య ముక్త
నిష్ఠురాస్త్రంబు లొండొండ నిగుడునపుడు. 12

(వ్యా) జలరుహోదర...అస్త్రంబులు—జలరుహోదర — కృష్ణునియొక్క; సవ్యాపసవ్య—కుడియెడమచేతులనుండి; ముక్త—విడువఁబడిన; నిష్ఠురాస్త్రంబులు—క్రూర నారాచములు; ఒండొండన్—తోడ్తోడన; నిగుడునపుడు—ప్రసరించుసమయమున;

వైవస్వతుఁడు—యముఁడు; నిర్భగ్నశృంగుఁడై—విఱిగినకొమ్ముకలవాఁడై; (కొమ్ములు విఱిగినవాఁడనఁగాఁ బ్రాభవముచెడి యవమానపడినవాఁడని భావము); ఇచట వాహనమును గూడఁజెప్పిన కతంబున వాహనంబగు నెనుబోఁతునకు నిక్కముగా శృంగభంగ మయ్యెనని భావము; లాఘవంబునొందెన్—చులకఁదనమును బొందెను;

నైరృత — నైరృతుఁడను దిక్పాలకునియొక్క; భుజ—బాహువనెడు; భుజంగ స్వామి—పాపఱేఁడు; దళిత...దంష్ట్రమై—దళిత-చీల్పఁబడిన; శాత—పదునైన; కృపాణ—కత్తియనెడు; దంష్ట్రమై—కోఱలుగలదియై; పొల్లుపోయెన్—వ్యర్థమయ్యెను;

అలంకారము—రూపకము.

అగ్నిదేవుండు; నిర్ధూతహేతియై—ఎగఁజిమ్మఁబడిన జ్వాలలుగలవాఁడై యని యర్థము; కత్తికలవాఁడై యని యర్థాంతరము; నిలువునీఱుగన్—ఉన్నచోటనే భస్మముగా; జ్వాలపోయినపిదప నగ్నిభస్మమగునుగదా; నిర్వాణతేజుఁడయ్యెన్—తేజము చెడినవాఁడయ్యెను;

పవమానునకున్—వాయువునకు; భయపలాయనవేళన్—(కృష్ణునికోల్తలకు సైరింపలేక) భయముతోఁ బరువిడునపుడు; ఆత్మజవసత్త్వములకల్మి—తనకువేగమును బలమును గలిగి యునికి; సఫలమయ్యెన్—ఉపకరించెను;

వరుణునకున్; డాఁగికొనన్—దాఁగుకొనుటకు; చోటు—స్థానము; వలఁతి యగుటన్—అనుకూలమగుటచేత; ఉదధినాయకభావంబున్ — సాగరాధిపత్యమును; ఉపకరించెన్—ప్రయోజనపడెను.

అనఁగా గృష్ణునిశరపరంపరలచే నిర్జితులై యముఁడు శృంగభంగముఁ జెందెననియు, నిరృతికత్తినఱుకఁబడుటచే వ్యర్థుఁడయ్యెననియు, నగ్నిదేవుఁడు జ్వాలయనెడు నాయుధమును బోగొట్టుకొని భస్మమయ్యెననియు, వాయుదేవుఁడు బలవేగములతోఁ

బరిగి డెననియు, వరుణుఁడు దాను సాగరాధిపతియగుటచే సుకరముగా సముద్రముఁ జొచ్చి దాఁగుకొనియెననియు భావము.

వ. మఱియు నమ్మధుమథను సముద్దండదోర్దండమండలీకృత శార్ఙ్గకోదండ నిర్ముక్తనిర్భరక్రూరనారాచధారానిపాతంబున గవాక్షితవక్షులగు యక్షులును, జక్రనిర్వక్రవిక్రమక్రీడలం బరిచ్ఛిన్నకర్ణనాసాధరు లగు విద్యాధరులును, గౌమోదకీప్రహారంబులం జూర్ణీకృత శిరోమధ్యు లగు సాధ్యులును, నందకాసిధారావిదారణంబునం బ్రత్యవయవశిథిలితానువిద్ధులగు సిద్ధులును, బతంగపుంగవ పక్షవిక్షేపణాహతిం దూలి జర్జరు లగు నిర్జరులును, ధైర్యంబులతోడన కంకటంబులు వ్రస్సినం జలుకఁదనంబునొంది సాధ్వసోద్రేకంబున భద్రదంతావళంబుల డిగ్గనుఱికి మేరుశిఖరంబులుద్రాఁకియు రథ్యసారథిసహితంబుగా శతాంగంబులు పొడిపొడియైనం జొర మఱు వెఱుంగక మాతంగశవంబుల క్రింద నీఁగియు భగ్నచరణంబు లై తలకెడపుగం ద్రెళ్లిన తురంగకళేబరంబులం గౌఁగిలించుకొని నిర్జీవులుంబోలె గ్రుక్కుమిక్కనక పక్కెరలు పైఁ ద్రోచుకొనియును సంత్యక్తహేతివర్గంబును సర్వతఃప్రధావనమార్గంబును బ్రవర్తిత ప్రార్థనాలాపంబును బరిధూయమాన కేశకలాపంబునుంగాఁ గాందిశీకత్వంబునొంది తిరుగుడువడి పాంచజన్యఘోషంబు మున్నుగా దిగంతంబు లంటం బఱచుటయుఁ, బ్రహారమూర్ఛాపరవశు లగు జయంతనలకూబరచిత్రసేనాదులం గనకకమలదళపుటానీయమానంబు లగు నభ్రగంగాపానీయంబుల సేద దేర్చి ఫలకగర్భంబులకుం దార్చి నిజనివాసంబులకుం జేర్చికొను నాప్తసేవకవర్గంబువలనను, విలూనదండంబు లై పడినధవళచ్ఛత్త్రంబులఁ బ్రఫుల్లపుండరీకంబు లని పరిభ్రాంతి నొడియు నబ్జాడుచు నిపాతితవరుణం బై నింగిఁ బేరెంబు వాఱు వాహనహంసంబువలనను, మేదుర మేదఃపంకసంకులంబు లగు రుధిరపల్వలంబులు దఱిసి మజ్జన

క్రీడాపరాయణం బై చండి వడిఁ గదలమిం గృతాంతుండు విడిచిపో
యిన జిఱికొట్టుచుఁ దిరుగునున్మత్తలులాయంబులవలనను, మూర్ఛిత
క్షపాకరమండల నిర్గతంబై నిర్గళితశృంగం బగులాంఛనమృగంబుం
గురంగీశంకం దఱిమికొని వెనువెంటం దిరుగు పలాయితపవమాన
విముక్తకురంగంబులవలనను, వైనతేయచరణనఖముఖాఘాతనిపాతి
తంబు లై రణధూళిధూసరితంబు లగు రుద్రజటామండలమండన
శశిఖండఖండంబులఁ గర్ణపూరంబులుగా నిడుకొను వేడుకం గూడ
నొండొరులఁ గడవం గేరికొను బేతాళ బాలికాజనంబులవలనను,
గదనరంగం బభిరామం బయ్యె నయ్యవసరంబున. 13

ఈవచనంబున పంపుల సమరమువర్ణింపఁబడినది.

(వ్యా) మండలీకృతకోదండ–గుండ్రముగునట్లు వంపఁబడినవిల్లు; గవాక్షితవక్షులగు–గవాక్షమువలెఁ జిల్లులుగాఁ జేయఁబడిన వక్షఃస్థలములు గలవారలగు; యక్షులును; ఈ పదము 'పఱచుటయున్' అను క్రియాపదముతో నన్వయము; నందకాసిధారావిదారణంబునన్ – నందక మను పేరుగల కత్తి మొనచేతఁ జీల్పఁబడిన; అనువిద్ధులగు–కూడినవారగు; జర్జరులగు–శిథిలులగు; ధైర్యంబులతోడన; కంకటంబులు వ్రస్సినన్–కంకటంబులు–కవచములు; వ్రస్సినన్–తునుఁగఁగా; ఇచ్చట సహోక్త్యలంకారము; సాధ్వసోద్రేకంబునన్–అధికమగు భయముచేత; దంతావళంబులు–ఏనుఁగులు; శతాంగంబులు–రథములు; ఈఁగియున్–చొచ్చియు; తలకెడవుగన్ – శిరఃపతనమగునట్లు; కళేబరంబులన్–మొండెములను (అట్టలను); గ్రుక్కుమిక్కనక – ఊపిరియాడక; పక్కెరలు–జీనులు; సంత్యక్తహేతివర్గంబును–విడువఁబడిన కత్తులసమూహమునుగలవారును; సర్వతః ప్రధావనమార్గంబును–అంతటను బరుగెత్తుచున్న మార్గముకలవారును; ప్రవర్తిత ప్రార్థనాలాపంబును–చుమ్మువిడిచిపెట్టుమాయని ప్రార్థించు మాటలుగలవారును; పరిధూయమానకేశకలాపంబును–చెదరియల్లాడుచున్న వెండ్రుకలుగలవారును; అయి–; కాందిశీకత్వంబునొంది–భయముచేఁ బరుగెత్తి; తిరుగుడువడి–పరిభ్రమించి; పాంచజన్యఘోషంబు మున్నుగాన్–కృష్ణునివిజయశంఖధ్వనులు తమకంటెమున్నుగాఁ బోవఁగా; దిగంతంబులంటన్–దిగంతములుచేరునట్లు; పఱచుటయున్–బరుగెత్తఁగా; దీనికిఁ గర్తృపదములు, యక్షులు, విద్యాధరులు, ధ్యులు, సిద్ధులు, నిర్జరులు; కనక...మానంబులగు—కనకకమల–బంగారుతామరల; దళ–ఆకులచేఁజేయఁబడిన; పుట–దొప్పలయందు; ఆనీయమానంబు

లగు—తేఁబడుచున్న; అభ్రగంగాపానీయంబులన్—ఆకాశగంగోదకంబుల చేత; నేద దేర్చి—శ్రమములుపోఁగొట్టి; ఫలకగర్భంబులఁన్—పీఁటలమీఁద; తార్చి—పెట్టి; విలూన—నఱుకఁబడిన; ప్రఫుల్ల పుండరీకంబులని—లెస్సగాఁబూచిన తెల్లదామరలని; పరిభ్రాంతిన్—భ్రమించుట చేత; ఒడియన్—(వానిని) గ్రహించుటకై; అఱ్ఱాడుచున్—ఈవలావలఁ దిరుగాడుచు; నిపాతితవరుణంబై — పడఁద్రోసిన వరుణుఁడుగలదియై; (అనఁగాఁ దనపై నెక్కియుండు వరుణునిబడఁద్రోసియనుట); నింగిన్—ఆకాశమునందు; పేరెంబువాఱు—పరుగిడుచున్న; వాహనహంసంబువలనన్ — వరుణునివాహనమగుహంసమువలన; 'కడవరంగబభిరామంబయ్యెన్' అనుదానితో నన్వయము.

వరుణుఁడు హంసవాహనుఁ డనుటకుఁ బ్రమాణము:—

'ద్విభుజం హంసపృష్ఠస్థం దక్షిణేనా భయప్రదం
కృత్వైవం వరుణం దేవం ప్రతిష్ఠావిధి నార్చయేత్'
—అనిహయశీర్ష పాంచరాత్రము.

మేదుర.........లగు— మేదుర—దట్టమైన; మేదఃపంక—బురదవంటి మెదడుల చేత; సంకులంబులగు—తొఱుమాఱుగానైన; రుధిరపల్వలంబులు— నెత్తుటిపడియలు; (పల్వలములు—నీళ్లునిలిచెడు చిన్నపల్లములు); చండి—మూర్ఖపుఁబట్టుఁబట్టి; వడిన్ కదలమిన్—వేగముగాఁ బోవకుండుట చేత; కృతాంతుఁడు—యముఁడు; జిఱకొట్టుచున్—బుసకొట్టుచు; లులాయంబు—మహిషము; ఇక్కడ దున్నపోతుస్వభావము లెస్సగా వర్ణింపఁబడినది; మూర్ఛిత......నిర్గళంబై—మూర్ఛిత—మూర్ఛనొందిన; తుషాకరమండల—చంద్రమండలంబునుండి; నిర్గతంబై—బయలువెడలినదై; నిగ్గళిత—జాఱిన; శృంగంబగు—కొమ్ముగల; లాంఛనమృగంబున్—చంద్రునికిఁ జిహ్నముగానుండు జింకను; కురంగీశంకన్—ఆఁడు జింకయను సందేహముతో; (ఆఁడు జింకకుఁ గొమ్ములు లేవు); తఱిమికొని వెనువెంటం దిరుగు—; పలాయిత.........కురంగంబునలనను—పలాయిత—పరుగెత్తుచున్న; పవమాన—వాయుదేవునివలన; విముక్త—విడువఁబడిన; కురంగంబువలనను—(వాహనమగు) జింకవలనను; కడవన్—అతిక్రమించునట్లు; కేరుకొను—నూడుకొను.

ఇందు రుద్రునిజటామండన చంద్రశకలంబు గరుడుని కాలిగోళ్లచేఁ జూనియనై పడియెనని మాత్రము కవి వర్ణించెఁగాని రుద్రునికిఁ బరాభవము గలిగినట్లు చెప్పఁడయ్యె.

ఈ వచనమున బీభత్సరసము వర్ణింపఁబడినది.

చ. హరిహయుఁ డాగ్రహోజ్జ్వలితుఁడై యనిఁ బాఱు దిశాధినాథులం
దిరుగుఁడు పోకుపోకుఁ డని తిట్టి యదల్చి సహోదయత్పయో

ధరము నలంకరించు తన ధన్వ మధిజ్యముచేసి గోత్రభీ
కరముగ బాహు లెత్తి తమకంబున నేసకుఁ జేయి వీచినన్. ౧౪

(వ్యా) హరిహయుఁడు_ఇంద్రుఁడు; 'జంభభేదీహరిహయః' అని యమరుఁడు; నవోదయత్ప్రయోధరము నలంకరించు_క్రొత్తఁగాఁ గలుగు మేఘమును బోలెను; ధన్వము_వింటిని; అధిజ్యముచేసి_అల్లెత్రాటి నెక్కువెట్టి; అధి + జ్యా; (జ్యా-అల్లెత్రాడు); గోత్రభీకరముగన్_కొండలకు భయంకరముగా; తమకంబునన్_సంభ్రమముతో (త్వరతో).

క. గిరితటముఁ దాఁకి తిరిగెడు
తరంగిణియుఁబోలె దేవతాపతి యాజ్ఞన్
మరలి వియచ్చరవాహిని
మురహరునిం బొదివి ఘోరముగఁ బోరునెడన్. 15

(వ్యా) తరంగిణి_నది.
అలంకారము—ఉపమ.

ఉ. ఱిం గను ప్రోఁత మ్రోఁగుచును ఱెక్కలపాములుబోలె శౌరిచే
సింగిణివింట వెల్లిగొనుచిత్రశరంబులు సూతు నొంచి ర
థ్యాంగకము ల్దళించుచు నిజావయవంబులు దూల్చ దేవతా
పుంగవుఁ డోసరించుటయు బోరన నడ్డము సొచ్చె సైన్యముల్. 16

(వ్యా) సింగిణివింటన్ – ఒకదినుసువింటినుండి; వెల్లిగొను_ప్రవహించు (అనఁగాఁ బరంపరగావచ్చుచున్న); రథ్యాంగకముల్_గుఱ్ఱములయొడళ్లను; తూల్పన్_చలింపఁజేయఁగా; ఓసరించుటయున్ –వెనుదీయఁగా; బోరనన్ – వేగముగా.

మ. మది నొక్కించుక శంక లేక సమరోన్మాదంబునం బేర్చి బె
ట్టిద మై తాఁకిన దేవతారథికకోటిం గిట్టి తూలించె ను
న్మద వేతండ ఘటాతమ శ్ఛయ నిశమ్మన్యంబుఁ దత్సైన్యమున్
గదచే శార్ఙ్గముచే రథాంగకముచేఁ గంసారి హింసారతిన్. 17

(వ్యా) ఒక్కించుక_ఒకకొంచెము; ఇచట 'నొక'యనుపద మత్యల్పార్థద్యోతకము; సమరోన్మాదంబునన్ –యుద్ధముసేఁతయందలివెఱ్ఱితో; పేర్చి-అతిశయించి; బెట్టిద మై-క్రూర మై; కిట్టి–తొడరి; తూలించెన్_పాఱఁదోలెను; ఉన్మద...మన్యంబు_ఉన్మద_మిక్కిలి మదించిన; వేతండఘటా_ఏనుఁగులగుంపుల నెడు; తమశ్ఛయ_చీఁకటుల సమూహముచేత; నిశంమన్యంబు_రాత్రి యని తన్ను భావించు; అనఁగా రాత్రివలెఁ గానఁ

బడుననుట; 'అగు' అనుపద మధ్యాహార్యము; తత్సైన్యముఁ—అని యన్వయము; రథాంగకముచేఁ—చక్రముచేత; ఇట స్వార్థమునఁ 'క' ప్రత్యయము వచ్చినది.

ఉ. సైనికు లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాఱిన
న్మానయు నచ్చలంబు మది నాటుకొనంగఁ గపోలమండలీ
దానమిళద్ద్విరేఫనినదంబుల ఘీంకృతి సందడింప వె
ల్లేనుఁగు మీఁద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె నుద్ధతిన్.

(వ్యా) రణసన్నహనంబు—యుద్ధసన్నాహమును; ఎడలించి — విడిచిపెట్టి; మానయున్—సిగ్గును; అచ్చలంబున్—ఆగ్రహంబును; కపోల............దంబులన్— కపోలమండలీ—చెక్కిళ్ల ప్రదేశములందలి; దాన—మదజలముతో; మిళత్—కూడుకొనిన; ద్విరేఫ—తుమ్మెదలయొక్క; నినదంబులన్—ఝుంకారములతో; ఘీంకృతి—ఐరావతము యొక్క ఘీంకారశబ్దము; సందడింపన్—కలియఁగా; వెల్లేనుఁగున్—ఐరావతమును; మీఁదన్—కృష్ణునిపై; డీకొలిపి—తాఁకున ప్రైసకొల్పి; ఉపేంద్రునిన్—కృష్ణుని; 'ఉపేంద్ర ఇంద్రావరజ శ్చక్రపాణి శ్చతుర్భుజః' అని యమరుఁడు.

క. పునరాగతుఁ డగుమఘవునిఁ
గనుఁగొని తనమ్రోల నున్నకామిని నెమ్మో
మున దృష్టి నిలిపి మురమ
ర్దనుఁ డి ట్లను హాసగర్భితక్రోధోక్తిన్. 19

సుగమము.

ఉ. అచ్చరలేమ లెల్ల నగ నాహవభూస్థలిఁ దానుఁ దోడుగా
వచ్చిన తద్దిశాధిపతివర్గములుం దల లూడఁ బాఱియు
న్మచ్చటులాస్త్రఘట్టన మనంబున నెంచక నానగేడి యై
వచ్చినవాఁడు చూచితివె వాసవునిం గమలాయతేక్షణా. 20

(వ్యా) అచ్చరలేమలెల్లన్—ఎల్లరు ననుటకు 'రు' వర్ణకము లేకయే ప్రయోగములు గలవు; తలలూడన్—వెంద్రుకలు విరియఁబోసికొని; నానగేడియై—సిగ్గుమాలినవాఁడై; 'నానగండయై' యని కొన్ని పుస్తకములలోఁ బాఠాంతరము కానంబడుచున్నది. దానికి నిదేయర్థము; వచ్చినవాఁడు—వచ్చెను; భూతార్థకమున నిట్టిప్రయోగములు గలవు.

'వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు రా
లచ్చికినైన పైనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే.'

భారతము—ఉద్యోగపర్వము.

ఉ. చూడుము నన్ను నంచు మధుసూదనుఁ డమ్మరిఁ బోసి తద్భుజా
క్రోడము గాఁడ నేసిన నకుంఠితుఁ డై సురరాజు కృష్ణు నీ
రేడుశరంబుల న్నగకులేశ్వరు ముప్పదిరెంట నేసెఁ బే
ర్వాడి తదన్యదిక్పతులు గ్రక్కున గంధగజాధిరూఢు లై. 21

(వ్యా) చూడుము నన్నున్—నాపరాక్రమమును జూడుమని భావము; ఇది ప్రతాపోక్తి; అమ్మరిఁబోసి (అమ్ము + అరిన్ + పోసి) బాణమును నల్లెత్రాటియందు సంధించి; అరి—అల్లెత్రాటియొక్క నడిమిభాగము; పోసియనఁగా నిచటఁగూర్చి యని భావము; భుజాక్రోడము—బాహుమధ్యప్రదేశము; గాఁడన్—గ్రుచ్చునట్లు; ఏసినన్—ప్రయోగింపఁగా; అకుంఠితుఁడై — మొక్కఁబోనివాఁడై; అనఁగాఁ జలింపనివాఁడై; పేర్వాడి—మిక్కిలి వాడి (పేరు + వాడి); గంధగజాధిరూఢులై — మదపుటేనుఁగుల నెక్కినవారై; గంధగజము — మదముచేసువాసన గల యేనుఁగు.

'యస్యగంధం సమాఘ్రాయ నతిష్ఠంతి ప్రతిద్విపాః
సవై గంధగజో నామ నృపతే ర్విజయావహః'

—అని ముద్రారాక్షసము.

చ. అనలుఁడు రెండు మూఁడు యముఁ డాసురనాథుఁడు నాలు గైదు తో
యనిధిపుఁ డాఱు గంధవహుఁ డర్థపుఁ డేడు మహేశుఁ డెన్మిదిన్
ఘనవిశిఖంబు లేయ మురఘస్మరుఁ డన్నియుఁ ద్రుంచి శార్ఙ్గసం
జనితమహోగ్రభల్లముల జర్జరితాంగులఁ జేసె నందఱన్. 22

(వ్యా) విశిఖంబులు — బాణములు; భల్లములన్—బాణములచేత;
అనలుఁడు మొదలగు దిక్పాలకు లాయాదిక్సంఖ్యలుగల బాణములఁ బ్రయోగించి రని కవి చమత్కారముగాఁ జెప్పెను.

ఆ. వేల్పుమ్రానియందు వేడుకపడుకూర్మి
సతులకోర్కి దీర్పఁ జాలి యపుడు

హరియు హరియుఁ బోరి రన్యోన్యజయకాంక్ష
నసుర జీవితాపహాశుగముల. 23

(వ్యా) వేల్పుమ్రానియందుఁ—కల్పతరువునందు; వేడుకపడు—ఆశపడు; కూరిమి సతుల—ప్రియభార్యలయొక్క; కోర్కిన్—అపేక్షను; తీర్పన్ జాలి—నెఱవేర్చుటకుఁ బ్రయత్నించి; హరియున్, హరియున్—కృష్ణుఁడును, ఇంద్రుఁడును; అన్యోన్యజయకాంక్షన్—ఒండొరుల గెలువవలయునను నాసతో; అసురజీవితాపహాశుగములన్—అసుర—రాక్షసులయొక్క; జీవిత—ప్రాణములను; అపహ—నశింపఁజేయు; ఆశుగములన్—బాణములచేత; పోరిరి—యుద్ధముచేసిరి. హరి—ఇంద్రుఁడు.

'యమానిలేంద్రచంద్రార్క—విష్ణుసింహాంశువాజిషు, శుకాహికపిభేకేషు హరిర్నా కపిలే త్రిషు—' అని యమరుఁడు.

ఈపద్యమునందు యుద్ధముచేయునిరువురకును నొక్కటే పేరును వారిరువురకును యుద్ధముసేయుటకుఁ గారణమును నొక్కటిగాను వారొండొరులమీఁదఁ బ్రయోగించు బాణము లొకేగుణము కలవిగాను నుండునట్లు కవి చమత్కారముగాఁ జెప్పినాఁడు.

క. మురహర బలహరు లిట్లొం
డొరుతూపులఁ గప్పఁబడుట నొదవించిరి త
మ్మిరువురఁ గనుఁగొనఁ దివిరెడు
గరుడోరగముఖులకోరికకు విఘ్నంబుల్. 24

(వ్యా) తివిరెడు—ప్రయత్నపడు; విఘ్నంబుల్, ఒదవించిరి, అని యన్వయము.

అనఁగాఁ గృష్ణుఁడును నింద్రుఁడును బరస్పరబాణములచేఁ గప్పఁబడుటవలన గరుడోరగాదు లగుఖచరులకుఁ గానఁబడరైరని భావము.

అలంకారము.—పర్యాయోక్తి.

చ. అలుఁగుల దట్టమై పొడమునగ్నికణంబులు సోఁకి పైగఱు
ల్వ్రాలిసియుఁ దొంటివేగ ముడివోక క్రమంబున నొండొకంటిఁ బిం
జలు గొని త్రోచికొంచు శరసంఘము లక్ష్యము దాఁకు విస్మితా
ఖిలసురసిద్ధసాధ్యముగఁ గృష్ణుఁడు జిష్ణుఁడు బోర నయ్యెడన్. 25

(వ్యా) అలుఁగులన్ — బాణములచేత; పైగఱుల్ — పైభాగమునం దుండు ఱెక్కలు; వ్రాలిసియున్—నశించినను; ఉడివోక—నశింపక; పింజలుగొని—గుంపులై; త్రోచికొంచున్—మీఱుచు; లక్ష్యము—గుఱిని; విస్మితా.....సాధ్యముగన్—విస్మిత—

ఆశ్చర్యము నొందింపఁబడిన; అఖిల_సమస్తమైన; సురసిద్ధసాధ్యముగణ్_సురలు సిద్ధులు సాధ్యులు కలుగునట్లుగా; జిష్ణుఁడు_ఇంద్రుఁడు; 'జిష్ణుర్లేఖర్షభ శ్శక్రః' అని యమరుఁడు.

తే. ఘోరముగ మింటఁ బందిరి గొని జగంబు
నంధముగఁ జేయునిరువుర యంపగములు
నొండొకటి దాఁకి క్రొమ్మంట లొదవి తామ
చూర్ణమై పోవ ముద మయ్యెఁ జూపఱకును. 26

(వ్యా) మింటన్_ఆకాశమునందు; పందిరిగొని_పందిరివలెఁ గప్పి; చూపఱకును_చూచువారికి; ఇది నిత్యబహువచనాంతము.

క. అలనాఁటినన్ను మఱచితె
నిలు నిలుమీ తగినయాజ్ఞ నీ కిదె యనుచుం
బులుఁగుల ఱేని మహేంద్రుం
డలుఁగులపెనుగూఁటఁ జిక్కునట్టుగ నేసెన్. 27

(వ్యా) అలనాఁటి నన్నున్_ఆనాఁడు నీతో యుద్ధముచేసిన నన్ను; అనఁగా నమృతహరణకాలమం దనిభావము; ఆజ్ఞ_శిక్ష; అలుఁగులపెనుగూఁటన్_బాణములచే నేర్పడిన గొప్పగూఁడునందు; అనఁగా గూఁడువలె నేర్పడునట్లుగా బాణములను బ్రయోగించి యని భావము.

పక్షులు గూఁట నడంగుట స్వభావముగావున దేవేంద్రుం డీపక్షీంద్రమును బాణములగూఁటియందుఁ జిక్కించె నని భావము.

అలంకారము — పరికరము.

మ. అలుకం గంసవిభేది నందకముచే నయ్యస్త్రము ల్ద్రుంచి వే
బలుదూపు ల్దృఢముష్టిఁ గూర్చి బలభిద్భద్రేభకుంభంబు వ్ర
క్కలుగా నేసిన బోరునం దొరఁగె ముక్తాశ్రేణి పై పై హిమా
చలశృంగావతరన్నభశ్చరధునీచంచత్ప్రవాహాకృతిన్. 28

(వ్యా) ముక్తాశ్రేణి_ముత్యములవరుసలు; హిమా......కృతిన్—హిమాచలశృంగ_హిమవంతము శిఖరమునుండి; అవతరత్—జాఱుచున్న; నభశ్చరధునీ_ఆకాశగంగ

యొక్క; చంచత్—జరగుచున్న (జాఱుచున్న); ప్రవాహాకృతిన్—వెల్లువయో యనునట్లు; పైపైన్—మీఁదుమీఁదుగా; బోరునన్—బో రను శబ్దముచేయుచు; జల్లని యని భావము; తొరఁగెన్—స్రవించెను; జాఱెను.

అలంకారము—ఉత్ప్రేక్ష.

చ. ఇతని కితండె సాటి యగు నీతని కీతఁడె సాటి వచ్చు నొం
డ్లితరులు వీరిఁ బోలఁగలరే యను చారణసిద్ధసాధ్యసం
స్తుతులు సెలంగ నా రణము చూచి రణాశనమౌని నింగిపైఁ
గుతుకరసాతిరేకమునఁ గుంచియ వీచి నటించె నయ్యెడన్. 29

(వ్యా) ఒండ్లు—అన్యులు; ఒడ్లనియు రూపాంతరము; రణాశనమౌని—నారద మునీంద్రుఁడు; కుంచియ—నెమలియీఁకలకట్టను; వీచి—ఎగురవైచి.

అలంకారము — అనన్వయము.

సీ. కినిసి బిడౌజుఁ డాగ్నేయాస్త్ర మడరింప
నది శార్ఙ్గితేజంబునందు డిందెఁ
గనలి వృద్ధశ్రవుం డనిలాస్త్ర మేసిన
నది యదూద్వహునూర్పునందు డిందె
నలిగి బలారి సౌరాస్త్రంబు నిగిడింప
నది శౌరివలచూడ్కియందు డిందె
నడరి యింద్రుండు బ్రహ్మాస్త్రంబు పయికొల్ప
నది మురాంతకునాభియందు డిందెఁ
ఆ. బాకదమనముక్తపాశుపతాస్త్రంబు
హరినిజార్ధతనువునందు డిందె
నేమి సేయవచ్చు నీశ్వరుం డఖిలాత్ముఁ
డతని గెల్వఁ దనకు నలవి యగునె. 30

(వ్యా) బిడౌజుఁడు—ఇంద్రుఁడు; 'బిడౌజాః పాకశాసనః' అని యమరుఁడు; అడరింపన్—ప్రయోగింపఁగా; డిందెన్—అణఁగెను; ఐక్యమయ్యెను; వృద్ధశ్రవుండు —

ఇంద్రుఁడు, 'వృద్ధశ్రవా శ్శునాసీరః పురుహూతః పురందరః' అని యమరుఁడు; పాక దమన—ఇంద్రుఁడు.

కృష్ణుఁడు సర్వదేవాత్మకుఁ డగుటచే నింద్రుఁడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము కృష్ణుని తేజంబునందును, వాయవ్యాస్త్ర మతనినిశ్వాసవాయువునందును, సౌరాస్త్ర మతనిదక్షిణనయనమందును, బ్రహ్మాస్త్ర మతనినాభికమలమునందును, పాశుపతాస్త్ర మతనియర్ధశరీరమునందును నైక్య మయ్యె నని భావము. ఆయావస్తువు లాయాచోటులఁ జేరె నని తాత్పర్యము.

(వి) హరిహరుల కభేద మనియు హరిహరశబ్దవాచ్యుఁ డగుదేవుఁ డొకఁడే యనియుఁ బురాణములు నుడువుచున్నవి.

'పరమాత్మా వ్యవస్థితః—స బ్రహ్మాసశివస్సహరిస్సేంద్రస్సోక్షరః పరమస్స్వరాట్'

—అని నారాయణీయము.

'భవానహంచ విశ్వాత్మ న్నేక మేవహి కారణమ్
జగతోఽస్య జగత్యర్థే భేదేనావాం వ్యవస్థితౌ
త్వయా యదభయం దత్తం తద్దత్తమఖిలం మయా
మత్తో విభిన్న మాత్మానం ద్రష్టుం నార్హసి శంకర
యోహం సత్వం జగ చ్చేదం సదేవాసురమానుషమ్
అవిద్యా మోహితాత్మానః పురుషాభిన్నదర్శినః.'

—అని విష్ణుపురాణము.

ఇది విష్ణువు శివునితోఁ జెప్పిన వాక్యము.

'విష్ణోరన్యంతు పశ్యంతి యే మాం బ్రహ్మాణమేవచ
కుతర్కమతయో మూఢాః పచ్యంతే నరకేష్వధః'

—అని భవిష్యత్పురాణము.

'అహంత్వం సర్వగో దేవ త్వమే వాహం జనార్దన
ఆవయోరంతరంనాస్తి శబ్దై రర్థై ర్జగత్పతే
నామాని తవ గోవింద యానిలోకే మహాంతిచ
తాన్యేవ మమనామాని నాత్రకార్యావిచారణా
త్వ దుపాసా జగన్నాథ సైవాస్తు మమ గోపతే
యశ్చత్వాం ద్వేష తే గోపసమాం ద్వేష్టి న సంశయః.'

—అని హరివంశము. అ. 276.

(ఇది శివుఁడు కృష్ణునితోఁ జెప్పిన వాక్యము)

"ఏకో మూర్తి స్త్రయో దేవా రుద్రవిష్ణుపితామహాః
రుద్రస్య పరమో విష్ణుః విష్ణోశ్చ పరమ శ్శివః
ఏకఏవ ద్విధాభూతే లోకేచరతి నిత్యశః
నవినా శంకరం విష్ణు ర్నవినా కేశవం శివః
తస్మాదేకత్వ మాయాతౌ రుద్రోపేంద్రౌతు తౌపురా"

—అని హరివంశము. అ. 184.

చ. తఱి గొని యంతలోన మధుదైత్యహరుండు మహేంద్రుశింజినిం
గొఱనెలతూపునం దునిమి క్రూరతరం బగుభల్ల మొక్కట
న్నఱికినఁ గూలెఁ దద్ఘనఘనాఘనకల్పిత మైనపెక్కియం
బొఱలుచు నోరుగాలి మొద లూడఁగఁ గూలెడుమ్రానికైవడిన్.

(వ్యా) తఱిగొని—సమయము చూచి; శింజినిన్—వింటినారిని; కొఱనెలతూపునన్—అర్ధచంద్రబాణముచేత; ఒక్కటన్—ఒకదానిచేత; ఒఱలుచున్ — శబ్దించుచు; ఓరుగాలిన్—ఝంఝూవాతముచేత; మొదలూడఁగన్ — వేళ్లూడునట్లు.

అలంకారము — ఉపమ.

శా. భుగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచు నాస్ఫోటించుచు న్లోనిరో
షాగ్నిజ్వాలలు బాహ్యనిర్గతము లైనట్లుత్కటారుణ్యని
ర్మగ్నం బై కనుపట్టులోచనసహస్రం బొప్ప మౌర్వీలతా
భగ్నం బైనశరాసము న్విడిచి జంభద్వేషి యత్యుగ్రతన్. 32

(వ్యా) జంభద్వేషి—ఇంద్రుఁడు; భుగ్నభ్రూకుటిదుర్ముఖుం డగుచున్—ముడివడిన కనుబొమలచేత వికృతమైనమోము కలవాఁడగుచు; ఆస్ఫోటించుచున్—అప్పళించుచు; బాహ్యనిర్గతము లైనట్లు—వెలుపటికి వెలువడివచ్చినవిధమున; ఉత్కటా...... నిర్మగ్నంబై —ఉత్కట-అధికమగు; ఆరుణ్య-రక్తవర్ణమునందు; నిర్మగ్నంబై -తడిసినదై; మౌర్వీలతాభగ్నంబైన-అల్లెత్రాడు తెగిన; శరాసమున్—వింటిని.

ఈపద్యమున రౌద్రరసము వర్ణింపఁబడినది; వృత్తి యారభటి.

చ. కులవసుధాధరావలికిఁ గుంటితనం బొదవించె నెద్ది యా
బలితపుఁగైదువుం గొని సుపర్వకులాగ్రణి వేయుఁగన్నులం

దలకొని కౌస్తుభస్తబకితం బగుశౌరియురంబు సూచిన
జ్జలజదళోదరోదకముచాడ్పున నల్లలనాడె లోకముల్. 33

(వ్యా) కుంఠితనంబు_తక్కువపాటు, హైన్యము; కైదువుఁ_ఆయుధమును (వజ్రాయుధముననుట); తలకొని_పూని; కౌస్తుభస్తబకితంబగు_కౌస్తుభమణిచే నలంకృతమగు; జలజదళోదరోదకముచాడ్పునఁ_తామరాకుపై నీటివలె; అల్లలనాడెఁ_గడగడ వడఁకెను.

ఉ. వీరుఁడ వౌదు దీనిబలుప్రేటున కోరిచి నిల్చితేని యం
భోరుహనాభ యంచు సురపుంగవుఁ డప్పుడు లోకభీకరా
కారత నిల్చి భీతిపరికంపితులై సుర లూహ లేది హా
హారవము ల్ఘటింపఁ గులిశాయుధరాజముఁ బూఁచి వైచినన్. 34

(వ్యా) ఊహ లేది_తలంపులు నశించి, (మనంబుల నేమియుఁ దోఁపక యని భావము); పూఁచి_ధరించి; పూనుధాతువు ప్రేరణార్థకరూపము; పూనిచి, పూంచి, పూన్చి యని రూపాంతరములు.

(మహాస్రగ్ధర.)

శతధారాజాయమానజ్వలనముఖశిఖాచ్ఛాదితాభ్రస్థలం బై
వితతాభీలధ్వనిశ్రీవిలసనబధిరోద్విగ్నదిగ్వారణం బై
కృతలోకాలోకముఖ్యాఖిలగిరిచలనక్షిప్తభూమండలం బై
పతయాళుద్వాదశాత్మప్రకరఖరకరౌపమ్య మై యేగుదేరన్. 35

(వ్యా) శతధారా.....స్థలంబై__శతధారా _ నూఱంచులనుండి; జాయమాన_పుట్టుచున్న; జ్వలనముఖ_అగ్నిముఖములయొక్క; శిఖా_జ్వాలలచేత; ఆచ్ఛాదిత_కప్పఁబడిన; అభ్రస్థలంబై_ఆకాశప్రదేశముఁ గలదియై; అనఁగా వజ్రాయుధము నూఱంచులనుండి యగ్నిజ్వాలలు వొడమి యాకాశప్రదేశంబు నిండె నని భావము;

వితతా...వారణంబై__వితత_విస్తారమైన (అధికమైన); ఆభీల_భయంకరమైన; ధ్వనిశ్రీ_శబ్దసంపత్తియొక్క; విలసన_వ్యాప్తిచేత; బధిర_చెవుడైన; ఉద్విగ్న_కలఁతనొందిన; దిగ్వారణంబై_దిగ్గజములు గలదియై; అనఁగా నీవజ్రాయుధము వచ్చునపుడు పుట్టిన భయంకరములగు శబ్దములచేత దిగ్గజములచెవు లవిసి భయపడె నని భావము;

కృత......మండలంబై—కృత-చేయఁబడిన; లోకాలోకముఖ్య – చక్రవాళ పర్వతము మొదలగు; అఖిల_సమస్తమైన; గిరి_కొండలయొక్క; చలన_కదలుటలచేత; క్షిప్త–ఎగఁద్రోయఁబడిన; భూమండలంబై_అననితలము గలదియై; అనఁగా నీవజ్రాయుధము వచ్చువేగముచేతఁ జక్రవాళము మొదలగు పర్వతములు కదలుటచే నేలలు పై కుబ్బె నని భావము;

పతయాళు......పమ్యమై—పతయాళు – పడెడుస్వభావము గల; అనఁగాఁ బడుచున్న; ద్వాదశాత్మప్రకర – సూర్యులసమూహములయొక్క; ద్వాదశాత్మ – సూర్యుఁడు, 'సూరసూర్యార్యమాదిత్య ద్వాదశాత్మదివాకరాః' అని యమరుఁడు; 'ప్రకర' అని చెప్పుటచేఁ బన్నిద్దఱుసూర్యు లని భావము; ఖర–తీక్ష్ణములైన; కర–కిరణములు; ఔపమ్యమై_ఉపమానముగాఁ గలది యై; అనఁగా నీవజ్రాయుధము ద్వాదశాదిత్యులప్రచండకిరణములవలె నతితీక్ష్ణమై యొప్పె నని భావము; ఏసు దేరఁగ_రాఁగా. ఇది మహాస్రగ్ధరావృత్తము. ప్రతిపాదమునకును స. త. త. న స. ర. ర. గ. గణము లను దొమ్మిదవ పదునాఱవ యక్షరములు యతిస్థానములును గలది.

ఈపద్యమునందును నారభటీవృత్తిని రౌద్రరసము వర్ణింపఁబడినది.

## కృష్ణుని జయము

మ. కని నెమ్మోమునఁ బిన్ననవ్వు దొలఁకం గంసారి నిశ్శంకఁ దా
ర్క్ష్యుని నడ్డంబుగ ద్రిప్పి వేగ రవితేజోదుస్సహస్ఫూర్తిమైఁ
దను డాయ న్శతకోటిఁ గేలి శతపత్త్రక్రీడఁ బట్టెం గటా
క్షనిరీక్షాగతి నందకత్సరుకిణాంకం బైనహస్తంబునన్. 36

(వ్యా) తొలఁకన్_ప్రకాశింపఁగా; రవి...స్ఫూర్తిమైన్—రవితేజస్_సూర్యప్రకాశమువలె; దుస్సహస్ఫూర్తిమైన్ – సహింపఁగూడని ప్రకాశముతో; తను డాయన్ _తనచెంతకు రాఁగా; 'శతకోటిన్_శతకోటి స్స్వరుశ్శంబో దంభోళిరశనిర్ద్వయోః' అని యమరుఁడు; వజ్రాయుధమును, (నూఱంచులు గలదని వ్యుత్పత్త్యర్థము); కటాక్షనిరీక్షాగతిన్_క్రేఁగంటిచూపుతో; నంద......కంబైన—నందక–నందకమను తనకత్తియొక్క; త్సరు_పిడిచేత; పిడిని బట్టుటచేత నని భావము; 'త్సరుః ఖడ్గాదిముష్టౌ స్యాత్' అని యమరుఁడు; కిణాంకంబైన–కాయలు కాచి గుఱుతులుగా నేర్పడిన; హస్తంబునన్_చేతితో; కేళిశతపత్త్రక్రీడన్_విలాసార్థమగు తామరనువలె; పట్టెన్_గ్రహించెను.

సీ. తలలు వీడంగ విద్యాధరు ల్పఱచిరి
గగ్గులకాఁడైరి ఖచరవరులు
చట్టుపైపోఁక లై చనిరి గంధర్వులు
గరుడులు పంచబంగాళ మైరి
కన్నది గతి గాఁగఁ గిన్నరు లరిగిరి
పన్నగేంద్రులు పటాపంచ లైరి
పోయినపోక లై పోయిరి సిద్ధులు
దిక్కాౘెుకము లైరి దిగధిపతులు
తే. హరిహయత్రాణ నాయత్తు లగుచు వచ్చి
మునులు సంప్రార్థనావచోముఖరు లైరి
పూని తనమీఁద వచ్చుదంభోళి నిట్లు
పంకజోదరుఁ డొడిసి చేపట్టుటయును. 37

(వ్యా) తలలు—ఇస్సటు వెంట్రుకలని భావము; వీడంగన్—విరియఁగా; గగ్గులకాఁడైరి—గగ్గులకాడువంటి వారైరి; అనఁగా నిస్సారులై నలుదెసలఁ బఱచిరని భావము; గగ్గులకాడు—ధాన్యము రాల్చినకంకులసమూహము; (గగ్గి—కంకి, కాడు—సమూహము); చట్టుపైపోఁకలై—బండమీఁద వేసినవక్కలవలె నలువలంకులఁ బరువిడిరని భావము; పంచబంగాళమైరి—మాయమైరి; కన్నది గతి గాఁగన్—పట్టినదే త్రోవగా; పటాపంచలైరి—చెదరి పరుగిడిరి; పోయినపోకలై — ఇచ్చకువచ్చినట్లు; దిక్కాౘెుకములైరి—దిగంతములకుఁ బాఱిరి; హరిహయ...యత్తులగుచు—హరిహయ—ఇంద్రుని; త్రాణన—కాపాడుటయందు; ఆయత్తులగుచున్—సిద్ధపడినవారై; (అనఁగాఁ బ్రయత్నించినవా రనుట); సంప్రార్థనావచోముఖరు లైరి—వేడికోలుమాటలను బలికిరి; దంభోళి—వజ్రాయుధమును.

ఉ. ముందల వట్టినట్లు తనముఖ్యతరాస్త్రము గొన్న దేవకీ
నందనుఁ జూచి సాధ్వసము నానయుఁ గ్రమ్మఁ గరీంద్రు డిగ్గి సం
క్రందనుఁ డోముకుంద మురఘస్మర యే నపరాధి నంచు వే
ముందఱ వచ్చి సాఁగఁబడి మ్రొక్కిన శౌరి కృపార్ద్రచిత్తుఁ డై. 38

(వ్యా) ముందల—నడునెత్తిని; సాధ్వసమున్—భయమును; నానయున్—సిగ్గును; సంక్రందనుఁడు—ఇంద్రుఁడు; మురఘస్మర—మురారి;—అబ్బినచో సిగయు నబ్బినచోఁ గాళ్లను బట్టుట యందఱికిని సహజముకదా.

ఉ. లెమ్ము సురేంద్ర నీవలన లే దొకతప్పును నీమఱంద లీ
కొమ్మ వదాన్యభూరుహముఁ గోరినఁ దెచ్చితిఁ గాని కొమ్మ నీ
సొమ్మని వజ్ర మిచ్చి మధుసూదనుఁ డా తరు వీఁ దలంచినం
గ్రమ్మఱ మ్రొక్కె వాసవుఁడు కందళితప్రమదాంతరంగుఁ డై. 39

(వ్యా) వదాన్యభూరుహము—ఈవులమ్రాను - (వదాన్యము—కోరిక); కల్పవృక్షము.

ఉ. సొమ్మన నెద్ది యే ననఁగ సొమ్మున కెవ్వఁడఁ గర్త వీవు నీ
సొమ్మఖిలప్రపంచమును శూరకులంబు నలంకరించు నీ
వమ్మహి నుండునంతకు ననన్యదురాపము పారిజాతభూ
జమ్మును నుండు నన్న వికసన్ముఖుఁ డై హరి వీడుకొల్పుచున్. 40

(వ్యా) నీ వమ్మహి నుండునంతకున్—నీ వాభూలోకమున నుండునందాఁక; 'ఉండునంతవఱ'కనునర్థమందుఁ బ్రాచీనకవులు 'వఱకు'ను, ప్రత్యయమునుపయోగింపక 'నుండునంతకు' ననియే ప్రయోగించుచువచ్చిరి; కవిత్రయమువారిగ్రంథములందును నితరప్రాచీనప్రామాణికగ్రంథములను 'వఱ' కను శబ్ద మీయర్థమున మృగ్యము; అనన్యదురాపము—ఇతరులకుఁ బొందనలవికానిది.

శా. గంధర్వోరగసిద్ధసాధ్యవరులం గారుణ్యదృష్టిక్రియా
సంధానంబున వీడుకొల్పి సురభూజంబు న్సతి న్వాహన
స్కంధాగ్రంబున నుంచి విక్రమకళాసంలబ్ధతత్ప్రేయసీ
సంధాసిద్ధిఁ గృతార్థుఁ డై మఱలె నిచ్చ న్వేడ్క లుప్పొంగఁగన్. 41

(వ్యా) కారుణ్యదృష్టిక్రియాసంధానంబునన్—కారుణ్య—దయతోడి; దృష్టిక్రియా—చూచుకార్యముయొక్క; సంధానంబునన్—కూడికతో; అనఁగాఁ గరుణయొలయుచూడ్కులం జూచుచు; వీడుకొల్పి—పంపి; స్కంధాగ్రంబునన్—మూఁపుమీఁద; విక్రమ.........సిద్ధిన్—విక్రమకళా—శౌర్యచాతుర్యముచేత; సంలబ్ధ—పొందఁబడిన; తత్ప్రేయసీ—తనభార్యయగు సత్యభామయొక్క; సంధా—ప్రతిజ్ఞయొక్క; సిద్ధిన్—నెఱవేఱుటచేత.

ఉ. వాసవుతోడి కయ్యమున వార్తలు సెప్పుచు మోముఁదమ్మి ను
ల్లాసము మందహాసముఁ దొలంకఁగ వేలుపుమ్రానిపూవులం

జేసినసొమ్ము లంగములఁ జేర్చి వధూమణి నాదరించుచున్
వాసుకిభోగతల్పుఁడు సువర్ణగిరీంద్రము దాఁటెఁ జయ్యనన్. 42

(వ్యా) కయ్యాముశవార్తలు—యుద్ధమునందలివార్తలు; సప్తమీతత్పురుషము నందుఁ గొన్నియెడల నవర్ణకం బగు; ఉదాహరణము.

క. అలయమునెడ డయ్యునెడ నాఁ, కలియుఁద్పృషయునైన యెడలఁ గడుకొనిధరణీ
తలనాథ పురుషునకు ని, మ్మల భార్యయ పాచుఁ జిత్తమునదుఃఖంబుల్.

—భారతము, ఆరణ్యపర్వము.

కృష్ణుఁడు నిజనగరంబుఁ జేరుట

చ. కనకగిరీంద్రముం గడచి గ్రక్కున రైవతకాద్రిప్రాంత ని
ల్చినయదువృష్ణిభోజనృపసింహులు సేనలతోడఁ దన్నెదు
ర్కొన నగరంబుఁ జొచ్చె మణిగోపురసంస్థితపౌరభామినీ
జనములు సేసముత్తెములు సల్లఁగ నుల్లసితాంతరంగుఁడై. 43

(వ్యా) సేసముత్తెములు—శోభనాక్షత లగు ముత్యములను.

తే. పురబహిర్ద్వారములు దాఁటి భుజగశాయి
రాజమార్గంబు దఱియ హేరాళ మగుచు
బుగులుకొనియెను నామోదపూర్వకములు
పారిజాతమహీజాతపరిమళములు. 44

(వ్యా) హేరాళమగుచున్—విస్తారమై; బుగులుకొనియెన్—క్రమ్ముకొనెను; ఆమోదపూర్వకములు – సంతోషమును మున్నుగాఁ గలవి; జనులకు సంతోషము గలిగించునవి యని భావము.

ఆమోదపూర్వకము లనుటకంటె 'బుగులుకొనియె ననాఘ్రాతపూర్వము లగు'నని యుండిన నింతకుమున్ను వాసన చూడఁబడనివైన యని సరసార్థము నిచ్చును.

అయినను నిట్టి లేపుస్తకమునందును గానంబడదు.

ఉ. ఆమహీజాతముం గనినయంతటిలో ధనధాన్యరాశితో
సామజఘోటికామహితశాలలతో మణిసౌధపంక్తితో

గోమహిషీశతాంగభటకోటులతోఁ మణిభూషణాలితోఁ
దామరతంపరై తనరెఁ దత్పురిఁ గింపచగేహవాటికల్. 45

(వ్యా) కనినయంతటిలోన్ — కన్నంతమాత్రముననే, అనఁగా చూచునప్పుడే; కింపచగేహవాటికల్ — దరిద్రులయొక్క యిండ్లవరుసలు; సామజ — ఏనుఁగులు; ఘోటికా — గుఱ్ఱములు; వీనిచేత; మహిత — కొనియాడఁబడిన; శాలలన్ — స్థానములతో; తామరతంపరై — తామరతీఁగవలె విస్తారముగా నల్లుకొని, (సంపూర్ణమై యని భావము); తనరెన్ — ఒప్పెను.

మ. బెరసె న్మేన నిగిడ్చినట్లు వళు లుబ్బె న్దుర్బలాంగంబు లం
కురము ల్వాపె రదంబు లంఘ్రులవడంకు ల్దీఱె వాలారు లై
కరజంబు ల్సిగిరించెఁ గేశవితతు ల్గప్పారె వృద్ధాలికిన్
మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచలన్మందానిలాసంగతిన్. 46

(వ్యా) తత్తరు...సంగతిన్ — తత్తరు — ఆకల్పవృక్షముయొక్క; చలత్ — కదలుచున్న; మందానిల — మందమారుతముయొక్క; ఆసంగతిన్ — అంతటను గూడుటచేత; వృద్ధాలికిన్ — ముదుసళుల సమూహంబులకు; మేనన్ — శరీరమునందు; నిగిడ్చినట్లు — నిక్క పొడిచినట్లు; వళులు — ముడుతలు; బెరసెన్ — కూడెను; రదంబులు — దంతములు; అంకురము ల్వాపెన్ — మరల మొలచెను; తీఱెన్ — వదలెను; వాలారులై — నిడుదలై; కరజంబుల్ — గోళ్లు; కప్పారెన్ — నల్లనయ్యెను; (ఇట్లు), మరలన్, ప్రాయమువచ్చెను.

క. విన నేర్చిరి బధిరులు గనఁ
గొన నేర్చిరి యంధకులు లఘుత్వము మీఱన్
జన నేర్చిరి వికలాంగకు
లనిమిషతరుకుసుమసౌరభావేశమునన్. 47

(వ్యా) బధిరులు — చెవిటివారు; వికలాంగకులు — కురూపులు; లఘుత్వము మీఱన్ — లాఘవముతో; సౌరభావేశమునన్ — వాసనయొక్క చేరికచేత.

క. విస్మయముగ నీగతి ముర
ఘస్మరుఁడు నికేతనప్రఘాణమున భుజం
గస్మయహరవాహము డిగి
సస్మితముఖుఁ డగుచు నరిగె సమ్మోదమునన్. 48

(వ్యా) నికేతనప్రఘాణమునన్ — ఇంటిముంగలియందు; 'ప్రఘాణ ప్రఘ ణాళిందా బహిర్ద్వారప్రకోష్ఠకే' అని యమరుఁడు; భుజంగస్మయహరవాహము—భుజంగ స్మయ—పాములయొక్క గర్వమును; హర—హరించిన గరుడుఁడను; వాహమున్—వాహనమును.

సీ. వరభక్తి దేవకీ వసుదేవులకు మ్రొక్కి
బలభద్రునకు నట్ల ప్రణతి చేసి
గురు పురోహిత బంధుకోటికి వినయంబు
గావించి మిత్రులఁ గౌఁగిలించి
సుత సోదరామాత్యతతి నతు ల్గయికొని
యాప్తవర్గంబుల నాదరించి
గారవంబునఁ బెక్కుగతుల మన్నించుచు
వినతాతనూభవు వీడుకొలిపి
తే. ప్రేయసియుఁ దానుఁ గూడి తదీయమంది
రమున కేగి సుఖాలాపరచన మెఱయఁ
బ్రతిన వచ్చెఁ గదా యిదె పారిజాత
మనుచు నర్పింప నద్దేవి హర్ష మంది. 49

(వ్యా) మన్నించుచున్—ఆదరించుచు; ప్రతిన వచ్చెఁగదా—ప్రతిజ్ఞ నెఱవేఱినది కదా.

పారిజాతము నారామములోఁ బ్రతిష్ఠించుట

తే. ప్రాణవిభుఁ బెక్కుమాఱులు ప్రస్తుతించి
మందిరారామవాటికామధ్యసీమ
దివిజభూమీరుహంబుఁ బ్రతిష్ఠ సేసి
యర్హపూజన మొనరించె ననుదినంబు. 50

సుగమము.

చ. సతు లఁట ప్రాణనాథు లఁట సారెకు నైక్యము లైన మోహాసం
గతు లఁట యేమి సెప్ప బలఘస్మరుఁ బోర జయించి కల్పక

క్షితిరుహము న్నిజేశ్వరికిఁ గృష్ణుఁడు దా నిటఁ దెచ్చె నంచు సం
స్తుతు లొనరించి రొండొరులతో సవతు ల్పదియాఱువేవురుం. 51

సుగమము.

సీ. విరివిగా నొకవేళఁ బెరిగి పీటికి నెల్ల
నిజశీతలచ్ఛాయ నిగుడఁ జేయుఁ
బిన్నగా నొకవేళఁ బెనుఁబ్రేవేలియంత యై
చూడ్కులకెంతయు వేడ్క సేయు
వింతగా నొకవేళ వివిధభూరుహపుష్ప
సురభిగంధంబుల సోడు ముట్టు
వేర్వేఱ నొకవేళ వికచకాంచనరత్న
పరిపక్వఫలములఁ బరిణమించు
తే. నభిలషించినరూపంబు నభినయించు
నుల్లమునఁ గోరుకోరిక లెల్ల నొసఁగు
సత్యభామాగృహారామ నిత్యమైన
పారిజాతంబు విస్మయాపాది యగుచు. 52

(వ్యా) సోడుముట్టుట—బ్రహ్మరంధ్రమును దాఁకుట.

నా ర దా గ మ న ము

వ. ఇవ్విధంబున నభీష్టఫలసిద్ధిసంతోషితస్వాంతులును నిఖిలలోకైకసం
స్తూయమానమహామహిమోదాత్తులు నై నిరంతరసౌఖ్యవర్ధిష్ణు లగు
నా సత్యాకృష్ణులను జూచువేడుకం గ్రమ్మఱ నొక్కనాఁడు నిజ
తనుప్రభాప్రభావాపహసితశారదనీరదుం డగు నారదుం డరుగుదెంచి
యాదంపతులు సేయు సత్కారంబులం బరితుష్టి నొంది సుఖోపవి
ష్టుం డై యిష్టాలాపసమయంబున నుల్లసితముఖారవిందుం డగుచు
నయ్యిందువదనం గనుంగొని. 53

(వ్యా) ఉదాత్తులు—గొప్పవారు; నిజ.....దుండగు—నిజతనుప్రభా—తన
దేహకాంతియొక్క; ప్రభావ—మహిమచేత; అపహసిత—గేలిసేయఁబడిన (తిరస్కరిం

పడబడిన యనుట); శారదనీరదుండగు_శరత్కాలమేఘము గలవాఁడను; అనఁగా శర త్కాలమేఘమువలె ధవళశరీరుం డనుట.

తే. హేమనిభగాత్రి నీభాగ్య మేమి చెప్ప
జిష్ణుభూజంబు నీ పెట్టుచెట్టుఁ జేసి
సవతులన కాదు త్రిభువనేశ్వరి యనంగఁ
బొలుచు పౌలోమి గెలిచితి వలఘుమహిమ. 54

(వ్యా) హేమనిభగాత్రి_బంగారుతో సమానమైనదేహకాంతి కలదానా; జిష్ణు_ఇంద్రుని; నీపెట్టుచెట్టుగ_నీవు నాఁటిన వృక్షముగా; పౌలోమిగ_శచీదేవిని.

పు ణ్య క వ్ర త ము

చ. అతులిత తావకీనమహిమాతిశయోచిత మైన పుణ్యక
వ్రత మొనరింపఁగావలయు వారిజలోచన నీవు నయ్యరుం
ధతియును గౌరియు న్నచియుఁ దత్పరబుద్ధి నొనర్చువేళఁ జూ
చితి మును తద్విధం బెఱుఁగఁ జెప్పెద నే నిపు డానుపూర్విగ. 55

(వ్యా) అతులిత.........యోచితమైన; అతులిత_నిరుపమానమైన; తావకీన_నీయొక్క; మహిమాతిశయ_వైభవాధిక్యమునకు; ఉచితమైన_తగిన; పుణ్యకవ్రతము_పుణ్యకమను పేరుగల వ్రతము; వ్రతము_తాఁజేయఁదగిన కార్యమునందు నియత సంకల్పము; నీ వొనరింపఁగావలయునని యన్వయము; తత్పరబుద్ధిగ_శ్రద్ధతో; ఆను పూర్విగ_క్రమముగా; పతివ్రతలగు నుత్తమసతులకుఁ బుణ్యఫలము గలుగుటచే నిది పుణ్యకవ్రత మనంబడును.

'కర్మణా మనసా వాచా పతిం నాతిచరంతి యాః
తాసాం పుణ్యఫలం సౌమ్యే పుణ్యకైః సముదాహృతమ్'
అని హరివంశము. అధ్యాయము 137.

చ. తెలతెలవాఱ మౌననియతి న్నదికిం జని తీర్థ మాడి ని
ర్మలవసనంబు గట్టి నవరత్నవిభూషణము ల్ధరించి మైఁ
గలప మలంది క్రొమ్ముడిని గమ్మవిరు ల్నవరించి యుత్తమా
మలకును నాత్మభర్తకు నమస్కృతి సేసి తదీయసమ్మతిగ. 56

(వ్యా) తెలతెలవాఱన్—తూర్పు తెల్లవాఱుచుండఁగా; అనఁగాఁ బ్రాతః కాలమున; మౌననియతిన్—మౌననియమముతోడ; తీర్థమాడి—స్నానమాడి; కలపము—చందనాది సుగంధద్రవ్యములు; సవరించి—ధరించి; తదీయసమ్మతిన్—భర్తయనుమతితో.

స్త్రీలు భర్తయనుజ్ఞ పొందియే వ్రతాదుల నాచరింపవలయుఁ గాని భర్తల యనుమతి లేకున్నను భర్తల కిష్టము కాకున్నను నేవ్రతమును నాచరింపఁదగదు. ఉత్తమసతులకు భర్తృశుశ్రూషయే యుత్తమోత్తమవ్రత మనియు సకలకామిత శుభప్రదం బనియు స్మృతులుం బురాణములు ను నుడువుచున్నవి.

'యా నారీ ఖల్వనాజ్ఞాతా భర్త్రా పిత్రా సుతేనవా
నిష్ఫలం తు భవేత్తస్యా యత్కరోతి వ్రతాదికం'

—అని మార్కండేయపురాణము.

'నాస్తి స్త్రీణాం పృథగ్యజ్ఞో న వ్రతం నాప్యుపోషణం
భర్తృశుశ్రూషయైవైతా లోకానిష్టా న్వ్రజంతిహి'

—అని స్కాందపురాణము.

ప్రాతస్స్నానఫలమును గూర్చి—

'ప్రాతస్స్నానం ప్రశంసంతి దృష్టాదృష్టకరం హి తత్
స్వరవర్ణప్రదం పుంసాం రోగాఘుస్వేదనాశనం
కండూతృష్ణాపహం ధన్యం పుణ్య మాయుష్కరం నృణాం
శ్రీకాంతిదం పుష్టికరం మేధాప్రజ్ఞాకరం పరం'

—అని యాశ్వలాయనస్మృతియందును

'ఉత్సాహమేధాసౌభాగ్యరూప సంపత్ప్రవర్తకం
మనఃప్రసన్నతాహేతుః ప్రాతస్స్నానం ప్రశస్యతే
ప్రాతస్స్నానం హరేత్పాప మలక్ష్మీం గ్లాని మేవ చ
అశుచిత్వం చ దుస్స్వప్నం తుష్టిం పుష్టిం ప్రయచ్ఛతి'

—అని కాశీఖండమునందును

జెప్పఁబడి యున్నవి.

'అజ్ఞానా ద్యదివా మోహా ద్రాత్రౌ దుశ్చరితం కృతమ్
ప్రాతస్స్నానేన తత్సర్వం శోధయంతి ద్విజాతయః'

—అని దక్షస్మృతి.

చ. కువలయనేత్ర తొంటితనకోపము గర్వము మత్సరంబు మా
ని వినయముం బ్రమోదమును నిండి తొలంకెడు నెమ్మనంబున
న్నవతులయిండ్ల కెల్లఁ దొలునాఁడు క్రమంబున నేగి తద్వ్రతో
త్సవమున కామతించి యతిసంభ్రమలీలలఁ దోడితేఁ దగున్. 57

(వ్యా) తొంటి_మునుపుండిన; ఆమతించి_పిలిచి.

చ. దినదిన మట్లు తత్పరమతిం బది వేవురు పేరఁటాండ్ర క
ర్చన లొనరించి సారఘనసారసుగంధములు న్విచిత్రనూ
తనపటరత్నభూషణవితానము లిచ్చుచు వేడ్కఁ జైత్రశు
ద్ధనవమి యాదిగా నెల వ్రతం బొనరించినయంతమీఁదటన్. 58

(వ్యా) దినదినము_ప్రతిదినము; పేరఁటాండ్రకున్_ముత్తైదువలకు; ఐదువ_ఐదువన్నెలు గలది (వన్నె యనఁగా నిచ్చట సుమంగలియొక్క యలంకారము; మంగళసూత్రము, పసపు, కుంకుమ, గాజులు, చెవ్వాకు, ఇవి యైదువన్నెలు); ఘనసార_పచ్చకప్పురము; పట_వస్త్రములు.

మ. పరమాచారధురీణు నధ్యయనసంపన్ను న్మహాకారు శా
స్త్రరహస్యజ్ఞు విశిష్టవంశజుఁ బ్రశాంతస్వాంతు నుద్యద్దయా
పరతంత్రు న్విదితాత్ము భూసురవరుం బ్రార్థించి యాచార్యుఁగాఁ
దరళాక్షీ నియమింపఁగాఁ దగు వ్రతోద్వాసక్రియావేళకున్. 59

(వ్యా) పరమాచారధురీణున్ – శ్రేష్ఠమైన యాచారసంపత్తి గలవానిని; ఆచార మనఁగా శిష్టులకు సమ్మతమైన శౌచదయాదాక్షిణ్యవినయాది సుగుణములతోఁ గూడిన వర్తనము; అనఁగా శిష్టజనులయొక్క సత్ప్రవర్తనము;

'ఆచారలక్షణోధర్మ స్సంతశ్చాచారలక్షణాః
సాధూనాంచ యథావృత్త మే తదాచారలక్షణమ్'

'ఆచారః పరమోధర్మః' —అని మహాభారతము-ఆనుశాసనికపర్వము.

బ్రాహ్మణుఁడు సాంగములుగా నాలుగువేదముల నధ్యయనముచేసినను నాచారహీనుఁడగునేని యావేదములు వానిం బవిత్రుని జేయఁజాలవు. వానిమరణసమయమందు రెక్కలువచ్చినపక్షులు గూఁటిని విడిచిపోవునట్లు వానిని వేదములు విడిచిపోవును.

'ఆచారహీనం నపునంతివేదాః యద్యప్యధీతాః సహషడ్భి రంగైః
ఛందాంస్యేనం మృత్యుకాలే త్యజంతి నీడం శకుంతా ఇవ జాతపక్షాః'

—అని వసిష్ఠుఁడు చెప్పెను.

అధ్యయనసంపన్నుఁ—అర్థజ్ఞానయుతముగ వేదములఁ జదివినవానిని; అర్థజ్ఞానమావశ్యక మని

'స్థాణురయంభారహరః కిలాభూత్-అధీత్యవేదం నవిజానాతి యోర్థం-యోర్థజ్ఞ ఇత్సకలంభద్ర మశ్నుతే'

—అని యాస్కునినిరుక్తమునం దుక్తము.

శుభాకారుఁ—అవయవేంద్రియవైకల్యములు లేని సురూపవంతుని; అంగాదివికలత్వముగలవాఁ డాచార్యకృత్యములను లెస్సగా సలుపలేఁడని భావము;

శాస్త్రరహస్యజ్ఞుఁ—ఆగమములను గర్మప్రయోగములను సమగ్రముగాఁ దెలిసినవానిని; శాస్త్ర మనఁగాఁ బరినిష్ఠితజ్ఞానోత్పాదక మగు వాక్యజాలము; వేదాదులు; (హితశాసనము చేయునది యని యర్థము);

'ప్రవృత్తిర్వా నివృత్తిర్వా నిత్యేన కృతకేనవా
పుంసాం యేనోపదిశ్యేత తచ్ఛాస్త్ర మభిధీయతే'

—అని శాస్త్రలక్షణము-వాచస్పతి మిశ్రునిభామతియందు.

శాస్త్రముఁ దెలిసి కార్యముల నాచరించినచో నభిమతార్థసిద్ధి యగుననియు లేకున్నఁ గలుగదనియు భగవంతుండగు శ్రీకృష్ణుఁ డర్జునుని కుపదేశించెను.

'య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః
న ససిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిం
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి'

—అని భగవద్గీత-అధ్యాయము 16.

విశిష్టవంశజుఁ—ఉత్తమకులమందుఁ బుట్టినవానిని; వెంటనే 'భూసురవరుఁ' అని చెప్పియుండుటచే నిక్కడ 'విశిష్టవంశజుఁ' అనఁగాఁ బారంపర్యముగా వచ్చు నుత్తమకులమందు జనితుఁ డని భావము;

ప్రశాంతస్వాంతుఁ—కామక్రోధలోభాదిదోషదూషితముగానిమనస్సు గలవాఁడును; ఇంద్రియనిగ్రహము గల సత్త్వగుణవిశిష్టు ననుట;

'విప్రాణాం వినయో హ్యేష శమః ప్రాకృత ఉచ్యతే
దమః ప్రకృతిదాంతత్వా దేవం విద్వాన్ ఛ్ఛమం వ్రజేత్'
—అని గౌడపాదీయమాండూక్యోపనిషత్కారిక.

ఉద్యద్దయాపరతంత్రుఁడ్—పరమదయాళు వగువాఁడును;
విదితాత్మున్—తెలిసికొనఁబడిన యాత్మస్వరూపము గలవానిని; అనఁగా బ్రహ్మ జ్ఞానసంపన్నుని;

'ఆత్మ' యనఁగా బ్రహ్మము;
'తదేతద్బ్రహ్మాపర మనపర మనంతర మబాహ్య
మయమాత్మా బ్రహ్మసర్వానుభూః'
'ఇమేలోకా ఇమేదేవా ఇమేవేదా ఇమాని సర్వాణి
భూతానీదగ్ సర్వం య దయ మాత్మా—
—అని బృహదారణ్యకోపనిషత్తు.

'స యఏషో ఒణిమై తదాత్మ్య మిదంసర్వం
తత్సత్యం స ఆత్మాతి త్త్వ మసి శ్వేతకేతో'
—అని ఛాందోగ్యోపనిషత్తు.

ఆత్మజ్ఞానమునకు ఫలము:—
'అశరీరం శరీరే ష్వనవస్థే ష్వవస్థితమ్
మహాంతం విభు మాత్మానం మత్వాధీరో నశోచతి'
—అని కఠోపనిషత్తు.

'సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి'
—అని ముండకోపనిషత్తు.

'బ్రహ్మవి దాప్నోతిపరమ్'
—అని తైత్తిరీయోపనిషత్తు.

'బ్రహ్మసంస్థో ఒమృతత్వ మేతి'
'తరతి శోక మాత్మవిత్' —అని ఛాందోగ్యోపనిషత్తు.
'సఏష విసుకృతో విదుష్కృతో బ్రహ్మవిద్వాన్ బ్రహ్మైవాభిప్రైతి'
—అని కౌషతకీబ్రాహ్మణోపనిషత్తు.

(అగు);
భూసురవరున్—బ్రాహ్మణోత్తముని;

బ్రాహ్మణులు సర్వదేవతాస్వరూపులనియు మహిమవంతులనియు నిగ్రహాను గ్రహసమర్థులనియు సకలజనపూజ్యులనియు శాస్త్రములు నుడువుచున్నవి.

ఈప్రకరణమున బ్రాహ్మణమాహాత్మ్యముల గూర్చిన ప్రమాణవచనములు కొన్ని వివరింపఁబడుచున్నవి.

"యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణేవసంతి తస్మా
ద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే నమస్కుర్యాత్,
నాశ్లీలంకీర్తయే దేతా ఏవదేవతాః ప్రీణాతి"

—అని శ్రుతి.

బ్రాహ్మణులు సర్వదేవమయు లని యీశ్రుతి నుడువుచున్నది.

బ్రాహ్మణ్యమునకుఁ దపస్సు—శాస్త్రాధ్యయనము — జన్మము—అను నీ మూడును గారణములు.

'తపశ్శ్రుతంచయోనిశ్చ త్రయం బ్రాహ్మణ్యకారణం
తపశ్శ్రుతాభ్యాం యోహీనో జాతిబ్రాహ్మణఏవ సః'

—అని శుద్ధార్థచింతామణియందు.

వీనిలో జన్మము ముఖ్య మని చెప్పఁబడియున్నది:—

'జన్మనైవమహాభాగో బ్రాహ్మణో నామ జాయతే
నమస్యస్సర్వభూతానా మతిథిః ప్రసృతాగ్రభుక్'

—అని మహాభారతము-ఆనుశాసనికపర్వమునందు భీష్మునివచనము.

ఈయర్థమునే యంగిరుఁ డిట్లు చెప్పెను:—

'జన్మశారీరవిద్యాభీ రాచారేణశ్రుతేనచ
ధర్మేణచ యథోక్తేన బ్రాహ్మణత్వం విధీయతే.'

బ్రాహ్మణవాక్యములు పవిత్రము లని చెప్పఁబడియున్నది:—

'బ్రాహ్మణాజంగమంతీర్థం తీర్థభూతాహి సాధవః
తేషాంవాక్యోదకేనైవ శుధ్యంతి మలినాజనాః
బ్రాహ్మణాయానిభాషంతే మన్యంతే తానిదేవతాః
సర్వదేవమయోవిప్రో నతద్వచన మన్యథా'

—అని పరాశరస్మృతి.

'దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్
సమంత్రో బ్రాహ్మణాధీనో బ్రాహ్మణో మమదేవతా'

—అని కృష్ణవాక్యము.

'బ్రాహ్మణాహి మహాత్మానో దేవానామపి దేవతాః'
'బ్రాహ్మణానాం ప్రసాదాచ్చ దేవాస్స్వర్గనివాసినః'
—అని మహాభారతము-ఆనుశాసనికపర్వము.

ఉద్వాస—ఉద్యాపనము (పరిసమాప్తి); ఆచార్యుఁగాన్—గురువునుగా; నియమింపఁగాఁ దగున్—అని యన్వయము.

'ఆచినోతిహి శాస్త్రార్థ మాచారే స్థాపయత్యపి
స్వయమాచరతేయస్తు త మాచార్యం ప్రచక్షతే'
—అని యాచార్యలక్షణము.

శా. ఆరీతి న్నియమించి యీవలయు మాద్యద్దంతివాహావళు
ల్నారీరత్నచయం బనర్ఘనవరత్నశ్రేణిగోభూపరీ
వారంబు ల్ధనధాన్యసంతతి రసవ్రాతంబుఁ గర్పూర క
స్తూరీసంకుమదాగురుక్రముకరాసు ల్కోటిసంఖ్యాకముల్. 60

(వ్యా) మాద్యద్దంతి—మదపుటేనుఁగులు; వాహ—గుఱ్ఱములు; అనర్ఘ—వెలలేని; పరీవారంబుల్—పరిచారకులు; రసవ్రాతంబు—ఆజ్యాదిరసనిచయమును; సంకుమద—జవాజి; క్రముక—పోఁక.

శా. ఏతద్వస్తుసదక్షిణాకముగ నాత్మేశు న్సురానోకహ
స్వీతుంగాఁ దగ ధారవోసి ద్విజుఁ డేయేయర్థము ల్వేఁడినం
జేతఃప్రీతిగ నిచ్చి క్రమ్మఱఁ బతిం జేకొంట యుక్తంబు వి
ఖ్యాతం బై తనరారుసీవ్రతము సాకల్యంబుగాఁ జేసినన్. 61

(వ్యా) ఏతద్వస్తు సదక్షిణాకముగన్—ఈవస్తువులను దక్షిణతోడను; ఆత్మేశున్—ప్రాణనాథుని; సురానోకహస్వీతుంగాన్—కల్పవృక్షముతోఁ గూడినవానిఁగా; అనఁగాఁ బారిజాతవృక్షముతోఁ జేర్చియనుట; అనోకహము—వృక్షము; 'అనోకహః కుట స్సాలః' యని యమరుఁడు; ధారవోసి—నీటిధారతో దత్తముచేసి; యుక్తంబు—ఉచితము; విఖ్యాతంబై—ప్రసిద్ధమై; సాకల్యంబుగాఁ జేసినన్—సంపూర్ణముగాఁ జేసిన యెడల; పైపద్యమునందలి 'సుఖము లందుదు' రను క్రియతో నన్వయము.

క. ధనకనకవస్తుసమితియుఁ
దనయసమృద్ధియును గల్గి తానుం బతియున్

మనమున నఱగొఱ లెఱుఁగక
యనితరసులభైకసుఖము లందుదు రనుచున్. 62

(వ్యా) అఱగొఱలు_కొదువలు; అనితరసులభైకసుఖములు_ఇతరులకుఁ జెంద నలవిగాని సుఖములను.

క. నారదుఁడు పుణ్యకవ్రత
మారూఢిగ నెఱుగఁ జెప్ప నవహితమతియై
కోరిక లిగురొత్తఁగఁ ద
త్ప్రారంభ మొనర్చె సత్య ధవునియనుజ్ఞన్. 63

(వ్యా) అవహితమతియై_అవధానముతోఁగూడిన బుద్ధి కలదియై: ఇగురొత్తఁగన్_చిగుర్పఁగా (అనఁగా నుదయింపఁగా ననుట).

సీ. యదువృష్ణికుకురభోజాంధకాదికముగా
నాత్మనీనం బైనయాప్తగణము
సంబంధులైన భీష్మకమహీశాదులు
పదియాఱువేల భూపతులకులము
పాండవకౌరవపాంచాలు రాదిగాఁ
బరమహితం బైనబంధుసమితి
నందాదిగోపాలబృందంబు మఱియును
నెయ్యురై వర్తించునృపచయంబు
తే. వారివారలచుట్టము లారిసఖులు
గా జగంబునఁ గల్గిన రాజలోక
మెంత యంతయు సకుటుంబ మేగుదెంచెఁ
బుణ్యకాఖ్యవ్రతోత్సవాభ్యుదయమునకు. 64

(వ్యా) ఆత్మనీనం బైన_తనకు హితమైన; సంబంధులైన_వియ్యపువారైన; నెయ్యురు_హితులు.

ఈ పద్యమునం దన్నిపుస్తకములలోను 'నాత్మకీయంబైన' యనియే పాఠము కానంబడుచున్నది. అది సరియగురూపము కామిచే 'నాత్మనీనం బైన' యని సవరించితి. కవి యటులే వ్రాసియుండు ననని తలంతు.

క. నగముల నదులఁ బయోధుల
దిగంతములఁ గాననముల దీవుల మఱియుం
దగునెడలఁ బుణ్యాకవ్రత
జగదుత్సవమునకు వచ్చె సంభారంబుల్. 65

(వ్యా) సంభారంబుల్—(వస్తు)సామగ్రులు.

సంభారంబులు వచ్చె ననఁగా జహల్లక్షణచే సంభారంబులు తెచ్చినమనుష్యులు వచ్చిరని భావము.

తే. అసురహరునాజ్ఞ రైవతకాద్రిఫాంత
విస్మయము గాఁగ నిర్మించె విశ్వకర్మ
యాత్మనిర్మాణచాతురి కవధి గాఁగ
మణిమయోజ్జ్వల మగు దానమంటపంబు. 66

(వ్యా) ఆత్మ...కవధి గాఁగన్—తాను సృష్టిచేయునై పుణ్యమునకు మేర యగునట్లు;

అనఁగా నింతకంటెను నిపుణతరముగా నిర్మింపలేఁడనియు నిదియే యతనినిర్మాణమైపుణ్యమునకుఁ బరమావధియనియు భావము; అనఁగాఁ దన చాతుర్యము నంతయు వినియోగించి విశ్వకర్మ యతిశ్రేష్ఠమగు దానమంటపమును నిర్మించె ననుట.

సీ. చూడ్కికి వేఁక మై సురవిమానములచే
గగనమార్గం బెల్లఁ గ్రందుకొనియె
మనుజనాయకవరమకుటాగ్రమణులచే
దిగ్భిత్తు లధికచిత్రితము లయ్యె
నాహూతు లైనమహామునీశ్వరులచేఁ
బొడవడ దయ్యె భూభువనతలము
సందర్శనాయాతజనభరంబునఁ గ్రింద
భుగ్నస్ఫటుం డయ్యె భుజగభర్త

తే. సమయబహుముఖముఖరతూర్యములవలనఁ
బద్మజాండంబు ఘోషసంభరిత మయ్యె

సకలలోకమహైశ్వర్యజనక మయిన
పుణ్యకాఖ్యమహోత్సవాభ్యుదయమునను. 67

(వ్యా) ప్రేక మై—బరువై (ఇచ్చట నధికానందదాయకమై యని భావము); క్రందుకొనియెన్—క్రిక్కిఱిసెను; అనఁగా నిండెను; ఆహూతులైన—పిలువఁబడిన; మహామునీశ్వరులచేన్—'ముని' యనఁగా

'నిర్వృత్త స్సర్వతత్త్వజ్ఞః కామ క్రోధవివర్జితః
ధ్యానస్థో నిష్క్రియో దాంత స్తుల్యమృత్కాంచనో మునిః.'
అని నిర్వచనము.

భూభువనతలము—భూలోకప్రదేశము; (అనఁగా భూలోకమంతయు నిండియుండి రని భావము); పొడవడదయ్యెన్—కనఁబడకుండెను; సందర్శనాయాతజనభరంబునన్—(వేడుక) చూడవచ్చినజనులభారముచేత; భుగ్నస్ఫటుండు—వంగిన పడగ గలవాఁడు; సమయ .........తూర్యములవలనన్—సమయ—ఆవేళయందు; బహుముఖ—నానాప్రకారములుగా; ముఖర—శబ్దించుచున్న; తూర్యములవలనన్—వాద్యములచేత; పద్మజాండంబు—బ్రహ్మాండము.

ఉ. దానవభేది సత్యయును దాను యథోచితవృత్తి మంగళ
స్నాన మొనర్చి శుభ్రవసనంబులు గట్టి యనర్ఘరత్నభూ
షానివహంబు పూని హరిచందనచర్చ వహించి వృద్ధస
భ్యానుమతి న్సులగ్నమున నావ్రతదీక్ష వహించె నయ్యెడన్. 68

(వ్యా) మంగళస్నానము—తైలాభ్యంజనముచేసికొని పసపుఁబూసికొని చేయుస్నానము; శుభ్రవసనంబులు—తెల్లచీరలు; వ్రతోపవాసాదులలో ధవళవస్త్రములు ప్రశస్తములు; వృద్ధసభ్యానుమతిన్—పెద్దలగుసభాసదుల యనుజ్ఞను బొంది.

క. వ్రతకల్పోచితదాన
ప్రతిగ్రహార్థముగ నిఖిలపరిషదనుజ్ఞం
గృతనిశ్చయుఁ డై సవినయ
నతిచే సమ్మతిలఁ జేసె నారదమౌనిన్. 69

(వ్యా) వ్రత......గ్రహార్థముగన్—వ్రతకల్ప—వ్రతవిధానమునకు; ఉచిత—యుక్తమైన; దానప్రతిగ్రహార్థముగన్—దానమును బుచ్చుకొనుటకై; నిఖిలపరిషదనుజ్ఞన్—సభవారలందఱి సమ్మతితో; సమ్మతిలఁ జేసెన్—అంగీకరించునట్లు చేసెను.

సీ. మదవతీకరముక్తమణికుంభసంభృత
సౌరభోదకముల జలక మార్చి
హిమధామకిరణవిభ్రమవిడంబకశుభ్ర
కౌశేయయుగళంబు గట్ట నిచ్చి
ఘనసారమృగమదగంధబంధుర మైన
గంధసారము మేనఁ గలయ నలఁది
విసృమరపరిమళప్రసవమాల్యంబులు
ఘనజటాజూటంబు మునుఁగఁ జుట్టి
తే. లలితమణిమయభూషణావళులు దొడిగి
యిష్టరాజోపచారసంతుష్టుఁ జేసి
ఋత్విజులఁ గాఁగ ధౌమ్యాదిఋషుల నిలిపి
వారిఁ బూజించె సకలోత్సవంబు మెఱయ. 70

(వ్యా) హిమధామ......యుగళంబు — హిమధామకిరణ — చంద్రకిరణముల యొక్క; విభ్రమ—ప్రకాశములను; విడంబక—తిరస్కరించుచున్న; అనఁగా ననుకరించుచున్న; శుభ్రకౌశేయ యుగళంబున్—తెల్లనిపట్టువస్త్ర ద్వయమును; ఘనసార...... బంధుర మైన—ఘనసార—పచ్చకర్పూరము; మృగమద—కస్తూరి; (వీని), గంధ—వాసనల చేత; బంధుర మైన—ఇంపైన; గంధసారము—చందనము; విసృమర—వ్యాపించుచున్న; పరిమళ—వాసనలుకలిగిన; ప్రసవమాల్యంబులు—పూలహారములు; మునుఁగన్—నిండుగా; ఋత్విజులు—చేయించువారు (పురోహితులు). ధౌమ్యాదిఋషులన్—ఋషి యనఁగా

‘ఊర్ధ్వరేతా స్తపస్యుగ్రో నియతాశీచ సంయమీ
శాపానుగ్రహయో శ్శక్త స్సత్యసంధో భవే దృషిః’
—అని నిర్వచనము.

శా. భద్రేభంబులమీఁద నెక్కి వెనుకం బ్రద్యుమ్ను సైనేయసౌ
భద్రాదు లనన ధర్మజప్రముఖభూపశ్రేణితో శౌరి తూ
ర్యద్రాఘిష్ఠరవంబు లుప్పతిలఁ జేర న్వచ్చె నంపన్ననా
నాద్రవ్యం బగుదానమంటపము నంత స్సంభృతానందుఁ డై. 71

(వ్యా) తూర్యద్రాఘిష్ఠరవంబులు — తూర్య - వాద్యములయొక్క; ద్రాఘిష్ఠ—దీర్ఘతమములైన (మిక్కిలి దీర్ఘము లగు); 'దీర్ఘ' అను శబ్దమున కిది తమ ప్రత్యయార్థరూపము; అనఁగా మిక్కిలియధికము లగు శబ్దములని భావము; అంతస్సంభృతానందుఁడై—మనస్సునందు నిండినసంతోషము గలవాఁడై.

ఉ. ద్రోవదియు స్సుభద్రయును దోఁ జనుదే విభవాగతాన్యపృ
థ్వీవరకామినీమణులు వేడ్కఁ భజింపఁగ సత్యభామ ము
క్తావినిబద్ధపంజరయుతం బగుపల్లకి యెక్కి వచ్చె వృ
ద్ధావిసరంబు మున్నుగ వ్రతప్రతిపాదనసావధాన యై. 72

(వ్యా) ద్రోవదియుఁ—ద్రౌపదియును; ఇది తద్భవశబ్దము; తోఁ జనుదేఁ—తోడ రాఁగా; విభవా......మణులు—విభవ—ఈప్రాభవమును జూచుటకై; ఆగత—వచ్చిన; అన్యపృథ్వీవర కామినీమణులు—ఇతరరాజులభార్యలు; పంజరయుతం బగు—గూఁడువంటిమూఁత గలది యగు; వృద్ధావిసరంబు—వృద్ధాంగనాసమూహము; మున్నుగఁ—ముందు నడువఁగా; వ్రత......సావధానయై—వ్రతాచరణమునందు శ్రద్ధ కలదియై.

చ. జలరుహపత్త్రినేత్ర మునిసత్తమవృద్ధసువాసినీజనం
బులు వెనువెంట రాఁ జని ప్రభుత్వముతో వ్రతదానమంటప
స్థలమున నర్చితం బగువదాన్యమహీరుహసార్వభౌమముఁ
వలగొని వచ్చి దేవమునివర్యున కిచ్చె యథోచితార్చనల్. 73

(వ్యా) మునిసత్తమ—మునిశ్రేష్ఠులు; ప్రభుత్వముతోఁ—ఐశ్వర్యముతో; వలగొని—ప్రదక్షిణముచేసి; యథోచితార్చనల్—తగినపూజలను.

చ. సతులు పదాఱువేవురును సంగడి రా వదనాంబుజంబునం
గృతకవికాస మచ్చుపడఁ గృష్ణునిపట్టపుదేవి యిందిరా
ప్రతినిధి రుక్మిణీరమణి రాఁ దగ వౌనని వచ్చెఁ బుణ్యక
వ్రతము గనుంగొనం గమలరాగమణీశిబికాధిరూఢ యై. 74

(వ్యా) సంగడిఁ—కూడ; కృతకవికాస మచ్చుపడఁ—కల్పింపఁబడిన ప్రసన్నత (సంతోషము) కన్పడఁగా; అనఁగా (మోమున) లేని సంతోషమును గాన్పించుచు; ఇందిరాప్రతినిధి—లక్ష్మీదేవికి బదులగు; రుక్మిణీరమణి—రుక్మిణీదేవి; రాఁ దగవౌనని—

వచ్చుట న్యాయమను తలంపుతో; కమల......రూఢయై—పద్మరాగ మణిఖచిత మైన పల్లకి నెక్కి.

(వి) ఇందు రుక్మిణీదేవియెడ నౌదార్య మను గొప్పసుగుణము వర్ణింపఁబడినది. "ఔదార్యం వినయం ప్రాహు స్సర్వావస్థానుగం బుధాః" అని యౌదార్యలక్షణము రసార్ణవసుధాకరమునందుఁ జెప్పఁబడినది. శ్రీరాముఁడు నిరపరాధురాలగు సీతను వనమునకుఁ బంపినపు డామహాదేవి భర్తను నిందింపక వినీతురాలై యేగుట యౌదార్యము.

వ. అట్టియెడ నమ్మహావ్రత దానోచితంబుగా వేర్వేఱ నేర్పరింపంబడు సాలంకారధేనుసహస్రంబులు విడువడు నిజవత్సంబులం బిలుచునంభారవంబులవలనం, బ్రత్యేకంబ పర్వతంబులుగాఁ గల్పింపఁబడు కనకరజతతామ్రకాంస్యాదిలోహంబులుం బద్మరాగప్రవాళవజ్రనీలమౌక్తికమరకతాదిరత్నంబులుం దిలగోధూమయవవ్రీహిమాషముద్గాదిధాన్యంబులుం గనకనిర్మితచ్ఛత్త్రచామరశయ్యావ్యజనపాదుకాద్యుపకరణంబులుం గజతురగస్యందనాదివాహనంబులు మొదలుగాఁ గలుగు దానద్రవ్యంబులును సమకూర్చునధికారులసంభ్రమాలాపంబులవలన, నపూర్వమహోత్సవసంతోషితస్వాంతు లగు దిగంతమహీకాంతుల పరస్పరసరససల్లాపంబులవలన, వివిధదేశాగతంబు లగు రాజలోకశుద్ధాంతవర్గంబుల కెడగలుగ జడియువేత్రహస్తులతర్జనస్ఫూర్జనంబులవలన, సంయమీశ్వరతిలకంబులవికస్వరస్వరంబుల నామ్రేడించు వేదమంత్రపఠనంబులవలన, వైభవాలోకనలంపటు లై యాకసంబున గుంపులుగొని నిలింపు లగ్గించుసంస్తవరవంబులవలనం, బటహాభేరీఝల్లర్యాదివాద్యత్రనాదంబులవలనను, నాసమయం బభ్యర్ణపూర్ణచంద్రోదయఘూర్ణమానార్ణవంబునుం బ్రేగణిసేయు చుండె నట్టియెడఁ దత్కలకలంబు వినివారించి నారదుండు సత్యభామ కిట్లనియె.

(వ్యా) వ్రీహి—వడ్లు; మాష—మినుములు; ముద్గ—పెసలు; వ్యజన—వీవనలు; శుద్ధాంతవర్గంబులకు—అంతఃపురస్త్రీలకు; ఎడగలుగఁ—దారి యిచ్చునట్లు; జడియు—

తోలఁగఁజేయు; (మనుజుల నీవల నావలఁ దొలఁగఁజేయు); వేత్రహస్తుల—బెత్తము చేతి యందుఁ గల భటులయొక్క; తర్జనస్ఫూర్జనంబులవలన౯ — బెదరింపుటఱపులవలనను; వికస్వరస్వరంబులను — ఉదారధ్వనులను (గొప్పధ్వనులను); ఆమ్రేడించు.—రెట్టింపఁ జేయు; లంపటులై—ఆసక్తికలవారై; నిలింపులు—దేవతలు; అగ్గించు—పొగడు; పటహ—తప్పెట; ఝల్లరీ—ఉడుక యను నొకవాద్యవిశేషము; వాదిత్ర—వాద్యము; అభ్యర్ణా... నార్ణవంబును—అభ్యర్ణ—సమీపమందలి; పూర్ణచంద్రోదయ—పూర్ణచంద్రోదయము కలుగుటచేత; అనఁగాఁ బూర్ణచంద్రోదయసమయంబున ననుట; ఘూర్ణమాన—మ్రోఁగుచున్న; అర్ణవంబును—సముద్రంబును; క్రేణిసేయుచుండె౯—తిరస్కరించుచుండెను (అలక్ష్యము సేయుచుండెను); అనఁగా నచ్చటి కలకలము సముద్రముయొక్క మ్రోఁతకంటె నధికముగా నుండె నని భావము; కలకలంబు—సందడి; వినివారించి—నిలిపి.

క. వికచాబ్జనేత్ర యీ పు
ణ్యకవ్రతవిధానమునకు నాథుని ధారో
దకపూర్వ మీవలయు ని
య్యకొలుపుమా యిపుడు యాదవాన్వయతిలక౯. 76

(వ్యా) విధానము—సలుపుట; ధారోదకపూర్వము — దానధారాజలపురస్సరముగా; ఇయ్యకొలుపుమా—సమ్మతింపఁజేయుమా.

చ. అనవుడు సత్యభామ హృదయంబున లజ్జయు సమ్మదంబునుం
బెనఁగొనఁ బ్రాణవల్లభునిఁ బ్రేమ రసాలసవీక్షణంబునం
గనుఁగొని మోము వాంచి మధుకైటభమర్దన చిత్తగించితే
మునిపతిమాట నావుడును మోవిపయిం జిఱునవ్వు గుర్పఁగ౯. 77

సుగమము.

సత్య ప్రాణనాథుని నారదునికి ధారవోయుట

మ. నవచంద్రాలిక నీకు నేల యనుమానం బాగమోక్తంబు గా
న విచారింపక ధార వోయు మనిన న్లజ్జాభరక్రాంత లై
నవతు ల్వాంచిరి వక్త్రపంకరుహము ల్సంబంధిభూపాలక
ప్రవరు ల్నవ్విరి నర్మగర్భితవచఃప్రాగల్భ్య మేపారఁగ౯. 78

(వ్యా) ఆగమోక్తంబు గానన్—శాస్త్రమునందుఁ జెప్పఁబడినది కావున; నర్మ......ప్రాగల్భ్యము—నర్మ-పరిహాసమును; 'పరిహాసవచో నర్మ' అని లక్షణము;

'శృంగారరసభూయిష్ఠః ప్రియచిత్తానురంజకః
అగ్రామ్యపరిహాస స్తు నర్మస్యా త్త త్త్రిధామతం'

—అని రసార్ణవసుధాకరము.

గర్భిత—లోపలఁగల్గిన; వచఃప్రాగల్భ్యము—మాటలచమత్కారము; (ప్రాగల్భ్యం—ప్రౌఢోక్తివైచక్షణ్యం) 'నిస్సాధ్వసత్వం ప్రాగల్భ్యం ప్రయోగేష్వపిసర్వతః' అని తల్లక్షణము; ఏపారఁగన్—అతిశయింపఁగా; సంబంధిభూపాలకప్రవరుల్ — వియ్యంకు లగు రాజులు; నవ్విరి.

చ. మునిపతియానతిం జకితముగ్ధమృగీతరలాక్షి ప్రాణనా
థునిఁ గనకాంబరాంచలముతోఁ గుసుమాయుధవాగురానిబం
ధనమునుబోని క్రొవ్విరులదండఁ దగులొ్కనఁ జుట్టె వేడ్కఁ గ
ల్పనగముఁ గూడఁ గంకణఝుళంఝుళమంజులదోర్యుగంబునన్. 79

(వ్యా) చకిత......తరలాక్షి—చకిత—భయపడిన; ముగ్ధ—సుందరమైన; మృగీ—ఆఁడుజింకయొక్క (నేత్రములవలె); తరల—చలించుచున్న; అక్షి—కన్నులు కలది; (అగు సత్యభామ); కుసుమాయుధ వాగురానిబంధనమును—కుసుమాయుధ—మన్మథుని యొక్క; వాగురానిబంధనమును బోని—వలత్రాఁటివంటి; క్రొవ్విరుల దండన్—పూలహారముచేత;కంకణ...దోర్యుగంబునన్—కంకణ—చేతివలయములయొక్క;ఝుళంఝుళ—ఝుళంఝుళమనుశబ్దముతోఁ గూడిన; మంజుల—అందమైన; దోర్యుగంబునన్—బాహుద్వయముచేత; కల్పనగముఁ గూడన్—కల్పతరువుఁ జేరునట్లుగా; ప్రాణనాథునిన్—కృష్ణుని; తగులొ్కనఁ జుట్టెన్—చేర్చి కట్టెను.

తే. పరమమునిమానసాలానబంధనమునఁ
గుదురుపడకుండుయాదవకుంజరంబు
వికచరాజీవనేత్రచే వేల్పుమ్రానఁ
గమ్మఁబూవులదండచేఁ గట్టువడియె. 80

(వ్యా) పరమ..........బంధనమునన్ — పరమముని—మునీంద్రులయొక్క; మానస—మనస్సులనెడు; ఆలాన—ఏనుఁగులఁ గట్టెడుకొయ్యయందు; బంధనమునన్—కట్టుటచేతను; కుదురుపడకుండు—నిలువకుండు (అణఁగకుండు); యాదవకుంజరంబు—

కృష్ణుఁ డనెడు గజము; వికచరాజీవనేత్రచేన్—అంగన యగు సత్యభామచే; వేల్పు ద్రుమానన్—కల్పతరువునందు; కమ్మపువ్వులదండచేఁ గట్టుపడియె నని యన్వయము.

అలంకారము—అతిశయోక్తి; విరోధము.

చ. బలిదనుజేంద్రుఁ గట్టె తని పల్కఁగ విందుము గాని నేఁడు మా
చెలి యిదె పుష్పదామకముచే నినుఁ గట్టఁగఁ గంటి మింక నె
మ్మెలు పచరింప రా దనుచు మేలము లాడెడుసత్యబోట్లు స
న్నల నెసకొల్పుచుం గెలన నవ్విరి ధర్మజ భీమ ఫల్గునుల్. 81

(వ్యా) ఎమ్మెలు—టక్కులు; పచరింపరాదు—ప్రకటింప వలనుపడదు; మేలములాడెడు—గేలిచేసెడు; సత్యబోట్లన్—సత్యభామచెలికత్తెలను; సన్నలన్—సంజ్ఞలతో; ఎసకొల్పుచున్—పురికొల్పుచు, వెండియు గేలిసేయుఁడని ప్రోత్సాహపఱచుచు ననుట; ధర్మజభీమఫల్గునుల్—యుధిష్ఠిరభీమార్జునులు; కెలనన్—పార్శ్వమునందు; నవ్విరని యన్వయము.

ఈపద్యమునందు హాస్యరసము వర్ణితము.

'గెలనన్'—అనుపదమును సరళాదిగానే పఠించిన గెల్లనన్ అనుపదముయొక్క రూపాంతరముగా భావింపవచ్చు; అప్పుడు కలకలమని (నవ్వి రని) యర్థము. అయినను గెలనన్ అనుటకుఁ బ్రయోగాంతరములు కానంబడలేదు.

మ. సమయజ్ఞుం డయి గర్గసంయమి మహాసంకల్పముం జెప్పఁ గ
ల్పమహీజంబు సదక్షిణాకము నిజప్రాణేశుఁ గూడ న్సుప
ర్వమునిశ్రేష్ఠున కిచ్చె దానముగ ధారాపూర్వ మవ్వేళఁ దు
భ్య మహం సంప్రదదే నమో నమ యటంచ ద్దేవి మోదంబునన్.82

(వ్యా) సమయజ్ఞుండయి—ముహూర్తమును దెలిసికొనినవాఁడై; గర్గసంయమి—గర్గుఁడను మునీంద్రుఁడు; మహాసంకల్పమున్—దేశకాలాదులను నివారింప నుద్దేశించిన దురితాదులను విపులముగా నుద్ఘాటించెడు గొప్పసంకల్పమును; సుపర్వమునిశ్రేష్ఠునకున్—నారదునకు; తుభ్య మహం...నమ యటంచున్—తుభ్యం—నీకొఱకు; అహం—నేను; సంప్రదదే—ఇచ్చుచున్నాను; నమోనమః—నమస్కారము, నమస్కారము; అటంచున్—అని పలుకుచు; 'తుభ్యమహంసంప్రదదేనమమ' అని సామాన్యముగాఁ బాఠము; (దానియర్థము) నమమ—(ఇఁకను నీవస్తువు) నాదికాదు; స్వత్వనివృత్తిపూర్వకపరస్వత్వాపాదనము దాన మనంబడును. ఇయ్యది దానకాలమునఁ జెప్పెడుమంత్రము.

అటంచున్—ఇం దరసున్న పెట్టఁదగదు. సతులఁట—అనుచో నటశబ్దము ప్రసిద్ధాశ్చర్యసూచకము—కావున నరసున్న గలదు.

## నారదుండు శ్రీకృష్ణునిచేఁ బసులు గొనుట

ఆ. ధారవోసి మఱియుఁ దద్వ్రతాంగంబుగా
దాన మిచ్చె నపుడు తలిరుఁబోఁడి
మణిసువర్ణధాన్యమయపర్వతంబులు
గోసహస్రవాజికుంజరములు. 83

సుగమము.

క. ఇవ్విధమున దానము గొని
చివ్వలయోగిరపుఁదపసి చెట్టును గూడం
బువ్వులసరులం జుట్టిన
యవ్విభుని చెఱంగు విడిచి యల్లన నగుచున్. 84

(వ్యా) చివ్వలయోగిరపుఁదపసి—కలహాశనముని; చివ్వ—కలహము; యుద్ధము; ఓగిరము—అశనము; తపసి—ముని; చెఱంగు విడిచి—కొంగు (కట్టు)ను వదల్చి; అల్లనన్—మృదువుగా.

క. సత్యముగ నిన్ను నిప్పుడు
సత్యాసతి మాకు నిచ్చె సకలామ్నాయ
స్తుత్య యిఁక మా యభీప్సిత
కృత్యంబులు సలుపు మనుచుఁ గేళిపరుం డై. 85

(వ్యా) సకలామ్నాయస్తుత్య—సమస్తవేదములచేతను బొగడఁదగినయో దేవా; మా యభీప్సితకృత్యంబులు—మేము కోరినపనులు.

'మా' యనుబహువచనముచే నిట నారదుఁడు తన కప్పుడు కృష్ణునిపైఁ గలిగిన స్వామ్యమును దానంగలిగిన యాధిపత్యమును సూచించెనని యెఱుంగునది; కేళిపరుండై—వేడుకయం దిచ్చ గలవాఁడై.

సీ. మేళవించినవి సుమ్మీ దీనిమెట్లని
మాంసలాంసంబున మహతిఁ జేర్చి

మిన్నేటిజలము సుమ్మీ తొలంకెడు నని
డాచేత మణికమండలు వొసంగి
యిది జపోచితము సుమ్మీ జతనం బని
వలచేతఁ బద్మాక్షవలయ మిచ్చి
యీశానుఁ డిచ్చెఁ జుమ్మీ మాకు నిది యని
శార్దూలచర్మంబుఁ జంకఁ జొనిపి
**తే.** పొమ్ము పొ మ్మని యొకకొంత పోవఁ బోవ
రమ్ము ర మ్మని మరలఁ జేరంగఁ బిలిచి
కపటనటనాపరుం డైన కంసవైరిఁ
బరమముని నవ్వుటాలకుఁ బనులు గొనియె. 86

(వ్యా) దీనిమెట్లు—ఈమహతి యను నావీణయొక్క మెట్లు; మేళవించినవి సుమ్మీ యని—తత్తద్రాగస్వరముల కనుకూలముగా నమర్పఁబడియున్నవి చూడుమా; మాంసలాంసంబునన్—మాంసల + అంసంబునన్—(కృష్ణుని) బలిసినభుజమునందు; మహతిన్—మహతియను పేరుగల తనవీణను; చేర్చి—ఉంచి; మిన్నేటిజలము—ఆకాశగంగోదకము; తొలంకెడు నని—తొణఁకఁబోవును జుమా యని; నీరు చిందకుండఁ జూచుకొనుమని భావము; డాచేతన్—ఎడమచేత; జపోచితము—జపకాలమునం దర్హమైనది;

జప మనఁగా దేవత నుద్దేశించిన మంత్రముయొక్క పురశ్చరణము.

'జ కారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశనః
జన్మకర్మహరో యస్మా త్తస్మా జ్జప ఇతిస్మృతః'

—అని జపశబ్దార్థము.

జతనంబు—జాగ్రత్తగా నుంచికొనుమనియనుట; వలచేతన్—కుడిచేతియందు; పద్మాక్షవలయము—తామరపూసలదండను; పొమ్ముపొమ్మని...చేరంగఁబిలిచి; ఈవాక్యము కేవలము హాస్యరసోత్పాదకము; నవ్వుటాలకున్ — నవ్వులాటయొక్క రూపాంతరము; అనఁగాఁ బరిహాసమునకై యని యర్థము.

**మ.** నిగమాంతప్రతిపాద్యు నాద్యు నభవు న్నిత్యు న్గుణాతీతు వి
శ్వగురున్ జిన్మయు నవ్యయుం బరము నిశ్శంకం బనుల్గొంచు మహా
నిగరిష్ఠుండు కృతార్థుఁ డయ్యె నన సందేహింపఁగా నేల భ
క్తగణాధీనుఁ డనంగ నవ్విభుఁడు లోకఖ్యాతిఁ బెంపొందఁడే. 87

(వ్యా) నిగమాంతప్రతిపాద్యః_వేదాంతములందు నిరూపింపఁబడిన వాఁడును;

'తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి'

—అని బృహదారణ్యకోపనిషత్తు.

'తద్వేదగుహ్యోపనిషత్సు గూఢం తద్బ్రహ్మావేదతే బ్రహ్మయోనిం
యేపూర్వం దేవాఋషయశ్చ తద్విదు స్తేతన్మయా అమృతావై బభూవుః'

—అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

'ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా త ఉపనిషద్బ్రాహ్మీంవావత
ఉపనిషద మబ్రూమేతి'

—అని తలవకారోపనిషత్తు (కేనోపనిషత్తు).

'సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్'

—అని శారీరకమీమాంసా సూత్రము.

'వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః'

—అని భగవద్గీత.

ఆద్యః_జగత్తులకు మొదటివాఁడును;

'సదేవసోమ్యేదమగ్ర ఆసీ దేకమే వాద్వితీయం బ్రహ్మ'

—అని ఛాందోగ్యోపనిషత్తు.

'బ్రహ్మవా ఇదమగ్ర ఆసీ త్తదాత్మానమేవావైత్'

—అని బృహదారణ్యకోపనిషత్తు.

'సర్గాణా మాది రంతశ్చ మధ్యం చై వాహ మర్జున'
'తమేవచాద్యం పురుషంప్రపద్యే యతః ప్రవృత్తిః ప్రసృతాపురాణీ'

—అని భగవద్గీత.

అభవః_పుట్టుక లేనివాఁడును;

'సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽ మృతోఽభయో
బ్రహ్మాభయంవై'

—అని బృహదారణ్యకోపనిషత్తు.

'అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణః'
'యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్'

—అని భగవద్గీత.

నిత్యుఁ డ్—శాశ్వతముగా నుండువాఁడును;

'నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా
మేకో బహూనాం యో విదధాతి కామాన్
తత్కారణం సాంఖ్యయోగాధిగమ్యం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః'

—అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

'నిత్య స్సర్వగత స్స్థాణు రచలో౽యం సనాతనః'

—అని భగవద్గీత.

గుణాతీతుఁ డ్—నిర్గుణుఁడును;

'ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా
కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ'

—అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

'అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాయ మవ్యయః
శరీరస్థో౽పి కౌంతేయ న కరోతి నలిప్యతే'

—అని భగవద్గీత.

'సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియవివర్జితం
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ'

—అని భగవద్గీత.

విశ్వగురుఁ డ్—లోకములకుఁ బ్రభువును;

'ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషో౽ంతర్యామ్యేష యోని స్సర్వస్య
ప్రభవాప్యయౌ హి భూతానాం'

—అని ఛాందోగ్యోపనిషత్తు.

'ఏష సర్వేశ్వర ఏష భూతాధిపతి రేష భూతపాలః'

—అని బృహదారణ్యకోపనిషత్తు.

'యస్మా త్పరం నా పర మస్తి కించి
ద్యస్మా న్నాణీయో నజ్యాయో౽స్తి కశ్చిత్'

—అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

(అర్థాంతరము) లోకములకు జనకుఁడును;

'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి
యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మ'

—అని తైత్తిరీయోపనిషత్తు.

'పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః'

—అని భగవద్గీత.

లోకములకు జ్ఞానోపదేష్ట యనియు నర్థము; విరించ్యాదులకును బ్రహ్మ విద్యోపదేష్టయని భావము—

'యో బ్రహ్మాణం విదధాతిపూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతితస్మై
తగ్ం హ దేవ మాత్మబుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే'

—అని మంత్రవర్ణము.

గురుశబ్దార్థము వివరింపఁబడుచున్నది:—

'గుకార స్త్వంధకారస్స్యా ద్రుకార స్తన్నిరోధకః
అంధకారనిరోధత్వా ద్గురు రిత్యభిధీయతే'
'గుకారస్సదితిప్రోక్తో రుకారో జ్ఞానవాచకః
బ్రహ్మజ్ఞానైకరూపత్వా ద్గురు రిత్యభిధీయతే'

చిన్మయుఁడు—జ్ఞానస్వరూపుఁడును;

'ప్రజ్ఞానం బ్రహ్మ'

—అని యైతరేయోపనిషత్తు.

'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ'

—అని తైత్తిరీయోపనిత్తు.

'విజ్ఞాన మానందం బ్రహ్మరాతే ర్దాతుః పరాయణమ్'

—అని కౌషీతక్యుపనిషత్తు.

అవ్యయుఁడు—నాశరహితుఁడును;

'అశబ్దమస్పర్శ మరూప మవ్యయం
తథా రసం నిత్య మగంధవచ్చ యత్
అనా ద్యనంతం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యు ముఖా త్ప్రముచ్యతే'

—అని కఠోపనిషత్తు.

'ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః
యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః'
'న జాయతే మ్రియతే వా కదాచిత్'
'అనాదిత్వా న్నిర్గుణత్వా త్పరమాత్మాఽయ మవ్యయః'
—అని భగవద్గీత.

పరముఁ డన్—సర్వోత్తముఁడును; (అగు పరమేశ్వరుని)
'దివ్యోహ్యమూర్తః పురుషస్స బాహ్యాభ్యంతరో హ్యజః
అప్రాణోహ్యమనాశ్శుభ్రో హ్యక్షరాత్పరతః పరః'
—అని ముండకోపనిషత్తు.

'త మీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దైవతానాం పరమంచ దైవతం
పతిం పతీనాం పరమం పరస్తా
ద్విదామ దేవం భువనేశమీడ్యమ్'
—అని శ్వేతాశ్వతరోపనిషత్తు.

'ఋతం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్'
ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమః'
—అని నారాయణీయము.

'పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః
పరమం యో మహద్బ్రహ్మ పరమం యః పరాయణం'
—అని మహాభారతము-ఆనుశాసనిక పర్వము.

నిశ్శంకన్—మనస్సంకోచములేక; కొంకులేక; పనుల్గొంచున్—సేవలు చేయించుకొనుచు; మానిగరిష్ఠుండు-మునిశ్రేష్ఠుఁ డగు నారదుఁడు; కృతార్థుఁడు—ధన్యుఁడు; అవ్విభుఁడు—సర్వవ్యాపి యగు నాపరమాత్మ (కృష్ణుఁడు); భక్తగణాధీనుఁడు—భక్తుల సమూహములకు వశుఁడు; అనంగన్—; పెంపొందఁడే—మించిన ర్తింపఁడే.

ప్రసంగవశంబున నిచట భక్తిస్వరూప మొకించుక వివరింపఁబడుచున్నది.

భక్తి యనఁగాఁ బూజ్యులయం దనురాగము; అనఁగా వందనీయులయెడ నలుపు నుత్తమప్రేమ; పూజ్యులు దేవబ్రాహ్మణమాతృపితృగురుప్రముఖులు. అట్టివారి దెస నుంచు ప్రేమ మారాధింపవలయునను జ్ఞానముతోఁ గూడినది. అదియే భక్తి యనంబడును. అది రాగాత్మకమని యహైతుకమని యేకాంతమని మూఁడువిధములు; ప్రయోజన

మును గోరి చేయుభక్తి రాగాత్మకము; ప్రయోజనమును గోరక యే కారణములేకయే చేయుభక్తి యహైతుకము; సర్వకాలసర్వావస్థలయందును తైలధారవలె నేకాకారముగాను నవిచ్ఛిన్నముగాను దాదాత్మ్యము గలుగునట్లు పరమేశ్వరునియందుఁ జేయు భక్తి యేకాంతభక్తి; ఇదియే యనన్యభక్తియు ముఖ్యభక్తియు ననంబడును.

ఇట్టిభక్తి ద్రుతచిత్తులకుఁ గలుగునుగాని యద్రుతచిత్తులకుఁ గలుగదు. ద్రుతచిత్తులనఁగాఁ గరఁగినమనసు గలవారు; అనఁగా ద్రవీభూతమైన మనసుగలవా రనుట; అట్టి వారికిఁ బ్రపంచమంతయును సర్వదా భగవత్స్వరూపముగానే గోచరించును. అట్టియుత్తమభక్తికి జాతి విద్యా వయో రూప కుల ధన క్రియాదిభేదములు లేవు. మాంసవిక్రయము చేయు ధర్మవ్యాధుఁడును బాలుఁడైన ధ్రువుఁడును దిర్యగ్జంతువగు గజేంద్రమును నింకను బలువురు నుత్తమభక్తి సలిపి భగవత్కృపాపాత్రులై ముక్తులైరని పురాణములు నుడువుచున్నవి.

అట్టిపరమభాగవతులగు మహనీయులను స్మరించుట మహాపుణ్యప్రదం బని యార్యులు చెప్పియున్నారు.

'ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి'

—అని ప్రాచీనశ్లోకము.

అట్టి భాగవతోత్తములకు భగవంతుఁడు వశుఁడై వారికోర్కులు దీర్చుచుండును. ప్రహ్లాదుఁడు ప్రార్థింపఁగా శ్రీహరి స్తంభంబున నరసింహరూపుఁడై యావిర్భవించెను. గజేంద్రుఁడు మొఱవెట్టఁగా లక్ష్మీదేవితోడనుం జెప్పక పరువిడివచ్చి వానిం గాపాడెను. ద్రౌపదికి సభలో మానరక్షణము చేసెను. ఇటు లెన్నియో దివ్యచరిత్రములు గలవు.

(వి) నారదుఁ డిట్లు భగవంతుం డగుకృష్ణునిపైఁ దనవీణాదిపరికరములను బెట్టి మోయుమనిచెప్పుట పరిహాసమునకై యని బయటికిఁ గన్పడినను నాదేవర్షి భక్తాగ్రేసరుఁడు గావునఁ దనవస్తువులు భగవంతునిదివ్యశరీరంబు సోఁకనేని యవి పరమపావనంబులై తదీయసంస్పర్శముచేఁ దనకును బావనత్వసిద్ధి యొదవునను భక్తిభావంబున నటు లొనర్చెనని తెలియనగు.

నారదుఁ డనఁగా నజ్ఞానమును బోఁగొట్టువాఁడనియుఁ బరమాత్మవిషయకజ్ఞానమును ముముక్షువుల కిచ్చువాఁ డనియు నర్థములు పెద్దలు చెప్పియున్నారు. అతఁడు దేవర్షులలో శ్రేష్ఠుఁడని శ్రీకృష్ణుఁడు విభూతియోగంబునఁ జెప్పెను.

'అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలోమునిః.'

'అశ్వత్థో వృక్షజాతీనాం బ్రహ్మలోక గురు ర్భవాన్
మేరు స్త్వం పర్వతేంద్రాణాం దేవర్షీణాంచ నారదః'

—అని హరివంశమునందుఁ గృష్ణునిగూర్చి మహేశ్వరుని వాక్యము.

భగవంతుండగు శ్రీకృష్ణుఁడు తన కత్యంతప్రియభక్తుల లక్షణము నిట్లు నిరూపించెను:—

'అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ
సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్సమే ప్రియః
యస్మాన్నోద్విజతేలోకో లోకా న్నోద్విజతేచ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్సచమే ప్రియః
అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్సమే ప్రియః
యో నహృష్యతి న ద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్సమే ప్రియః
సమ శ్శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః
తుల్యనిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః'

అని చెప్పి యట్టియుత్తమభక్తులకు యోగక్షేమములను సమకూర్చుచుందు నని చెప్పెను.

'అనన్యా శ్చింతయంతో మాం యేజనాః పర్యుపాసతే
తేషాంనిత్యాభియుక్తానాం యోగక్షేమంవహామ్యహమ్'

—అని భగవద్గీత.

అట్టియేకాంతభక్తులే పరమభాగవతు లని చెప్పఁబడుదురు.

'సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః
భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః'

‘గృహీత్వాపీంద్రియై రర్థా న్యో నద్వేష్టి నహృష్యతి
విష్ణోర్మాయామిదంపశ్యన్ సవై భాగవతోత్తమః’

—అని భాగవతము-స్కంధము 11.

అట్టియుత్తమభక్తులే సాధువు లనంబడుదురు:—

సాధువులలక్షణమును శ్రీకృష్ణుఁ డుద్ధవున కి ట్లుపదేశించెను.

‘కృపాలు రకృతద్రోహ స్తితిక్షు స్సర్వదేహినాం
సత్యసారోఽనవద్యాత్మా సమ స్సర్వోపకారకః
కామైరహతధీ ర్దాంతో మృదు శ్శుచి రకించనః
అనీహో మితభుక్శాంత స్స్థిరో మచ్ఛరణో మునిః
అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జితషడ్గుణః
అమానీ మానదః కల్యో మైత్రః కారుణికః కవిః
ఆజ్ఞాయైవం గుణాన్దోషాన్ మయాదిష్టానపిస్వకాన్
ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత్సోపి సత్తమః
జ్ఞాత్వాజ్ఞాత్వాపియేవై మాం యావాన్ యశ్చాస్మి యాదృశః
భజంత్యనన్యభావేన తేమే భక్తతమామతాః’.

—అని భాగవతము-స్కంధము 11.

‘వాక్సూనృతాదయా దానం దీనోపగతరక్షణం
ఇతిసంగస్సతాంసాధు హ్యేతత్సత్పురుషవ్రతమ్
యే ప్రియాణి ప్రభాషంతే ప్రయచ్ఛంతిచసత్కృతిం
శ్రీమంతోఽనింద్యచరితా స్తే దేవానరవిగ్రహాః
శుచిరాస్తిక్యపూతాత్మా పూజయే ద్దేవతా స్సదా
దేవతావద్గురుజన మాత్మవచ్చసుహృజ్జనం.
ప్రణిపాతేనహి గురూన్ సంతోఽనూచానచేష్టితైః
కుర్వీతాభిముఖాన్ భృత్యై దేవాన్ సుకృతకర్మణా
ఆత్మప్రశంసా మరణం పరనిందా తథైవచ
అనిందా పరకృత్యేషు స్వధర్మపరిపాలనం
కృపణేషు దయాళుత్వం సర్వత్ర మధురాగిరః’.

—అని కామందకీయ నీతిసారము.

సత్య నారదునివలనఁ బ్రాణనాథుని గైకొనుట

చ. అపుడు విరించిసూనుఁడు జనార్దను నెయ్యపు వాలుఁగంటిఁ జూ
చి పడఁతి నీమనోహరునిఁ జేకొను మిచ్చెద నంచుఁ బల్కు-చో
నపరిమితప్రమోదభరితానన యై వెస నిచ్చె వేలుపుం
దపసికి నాత్మభూషణవితానము లన్నియు నిష్క్రయంబుగన్. 88

(వ్యా) వాలుఁగంటి_నిడుదలగు (విశాలములగు) కన్నులు గలది; నిష్క్రయంబుగన్_వినిమయముగా (మార్పుగా).

క. ఇచ్చి కయికొనియెఁ గ్రమ్మఱ
నచ్చిగురుంబోఁడి విభుని నా వైభవమున్
మెచ్చి కురియించి రపుడు వి
యచ్చరు లచ్చెరువుగాఁగ నలరులవానల్. 89

(వ్యా) అలరులవానల్_పుష్పవర్షములను.

వచ్చినవారిని సత్కరించుట

చ. తనుతరమధ్య యాగమవిధానము దప్పక యుండ మౌనిచే
ననుమతిఁ గాంచి మ్రొక్కి వినయంబున నందఱ నామతించి క
ల్పనగము గ్రొవ్విరు ల్కనకపాత్రములం దగ నించి యిచ్చె వా
యనములు రుక్మిణీప్రభృతు లౌ సవతు ల్పదియాఱువేలకున్. 90

(వ్యా) ఆమతించి_పిలిచి; వాయనములు_బహుమానములు.

నారదుఁడు కృష్ణుని స్తుతించుట

క. ఈచందమున నమానుష
గోచరమహిమాఢ్యుఁ డైనగోవిందుని స
త్యాచంద్రముఖివరు సుర
వాచంయమివరుఁడు చతురవాచాప్రౌఢిన్. 91

(వ్యా) అమానుష......మాఢ్యుఁడు_అమానుషగోచర_మనుష్యులకుఁ దెలియరాని; మహిమాఢ్యుఁడు_మహిమచే నొప్పువాఁడు; సురవాచంయమివరుఁడు_దేవర్షి

చంద్రుఁడవు; ఈ కర్తృపదమునకు 100 వ పద్యమునందలి 'కొనియాడి యరి?' యను క్రియతో నన్వయము; చతురవాచాప్రౌఢిక్—నేర్పుగలమాటల గారవముతో.

## పా ద భ్ర మ క ము

క. ధీర శయనీయశరధీ
మారనిభానుమతమమత మనుభావిరమా
సారసవననవసరసా
దారదసమతారతారతామసదరదా. 92

(వ్యా) ధీర—పండితుఁడా (సర్వజ్ఞుఁడా యనుట); శయనీయశరధీ—శయనీయ—పడకగా నుండెడు; శరధీ—సముద్రముగలవాఁడా; (జలనిధిశయనుఁడనుట); మార ......మమత—మార—మన్మథునియొక్క—; విభా—కాంతికి; అనుమత—సమ్మతమైన (సమానమైన); మమత—అభిమానము గలవాఁడా (శరీరసౌందర్యము గలవాఁడని భావము); మనుభావిరమా—మను—మననముచేత; భావి—కలిగెడు; రమా—సంపద గలవాఁడా; (లేదా) మను—మనుష్యకోటి; భావి—కొనియాడెడు; రమా—లక్ష్మీదేవిగలవాఁడా యని యర్థాంతరము; సారసవననవసరసా—సార—శ్రేష్ఠమైన; సవన—యజ్ఞములందు; నవ సరసా—(శ్రేష్ఠుఁడైన) రసికుఁడైనవాఁడా (యజ్ఞభోక్త యనుట); దారదసమతారహార—దారద—పాదరసమునకు; సమ—సమానమైన; తారహార—స్వచ్ఛమైన ముత్యాలహారము గలవాఁడా; (అతిధవళమైనముక్తాహారము గలవాఁడా యనుట).

ఇక్కడఁ బ్రాచీనముద్రితము లగు గ్రంథములలో "తారతార" యను పాఠము కానంబడియెడు. దానికిని నిదే యర్థము. (తార—ముక్తాహారము).

తామసదరదా—తామస—దుష్టులకు; దరదా—భయమును గలిగించువాఁడా.

ఈపద్యమురచన పాదభ్రమక మనంబడును. అనఁగాఁ బ్రతిపాదమును ద్రిప్పి చదివినను నదే పాద మేర్పడును గాన నీపద్యము పాదభ్రమక మనఁబడును.

ఇదియే ప్రతిలోమానులోమపాద మనంబడును.

(వి) ఇచట శబ్దచిత్రరచనలం గుఱించి యించుక ప్రస్తావింపఁబడుచున్నది:— యమకము, నిరోష్ఠ్యము, ఏకాక్షరి, ద్వ్యక్షరి, అనులోమవిలోమము, గర్భకవిత్వము, బంధకవిత్వము, మొదలగు శబ్దచిత్రరచన లధమంబు లని యాలంకారికులండఱును జెప్పియున్నారు.

'శబ్దచిత్రం వాచ్యచిత్రమవ్యంగ్యం త్వవరం స్మృతమ్' అని కావ్యప్రకాశిక యందు మమ్మటాచార్యుఁడు.

యమకమును గుఱించి యాచార్యదండి కావ్యాదర్శమునందు
'ఆవృత్తిం వర్ణసంఘాతగోచరాం యమకం విదుః
తత్తు నైకాంతమధురం తతః పశ్చాద్విధాస్యతే'

అని చెప్పెను. అనఁగా యమకము కరంబు మధురంబుగాదనియుఁ గావున దానింబిమ్మట నిరూపింతు ననియు నర్థము. ఆదికాలంబునుండి సంస్కృతకవులును దదితరకవులును శబ్దాలంకారములను జిత్రములను గ్వాచిత్క్యముగాఁ బ్రయోగించుచువచ్చిరి.

వాల్మీకిమహర్షి రామాయణంబున సుందరకాండమునందుఁ బంచమసర్గ మంతయు నంత్యప్రాసనియమంబుతోఁ జెప్పెను. కాళిదాసుఁడు రఘువంశమున నవమ సర్గమంతయు యమకయుతంబుగా రచియించెను. పిదప భారవి మాఘుఁడు మున్నగు మహాకవులు శబ్దచిత్రంబులను బెల్లుగాఁ గల్పించిరి.

ఆచార్యదండి యనేకవిధములగు యమకభేదములను విపులముగా నుడివి వాని కుదాహరణము లిచ్చియున్నాఁడు. గోమూత్రికాబంధమును సర్వతోభద్రబంధమును నేకాక్షరద్వ్యక్షరరచనలను స్వరనియమరచనలను నిరూపించియున్నాఁడు. తనదశకుమారచరిత్రమునం దుత్తరపీఠికయందు సప్తమోల్లాసమంతయు నిరోష్ఠ్యముగా వ్రాసెను.

భారవి తనకిరాతార్జునీయమునందు 15 వ సర్గయందు శబ్దచిత్రరచన లనేకములు గావించెను.

'ససాసిఃసాసుసూః సాసో యేయా యేయా యయాయయః
లలౌలీలాంలలోఽలోలః శశీశశిశుశీః శశన్'

ఇది యేకాక్షరపాదము. (15–5)

ననోననున్నో నున్నోనో నానా నానాననానను
నున్నోఽనున్నో ననున్నేనో నానేనా నున్ననున్ననుత్'

ఇది యేకాక్షరశ్లోకము. (15–14)

'దేవాకానినికావాదేవాహికా స్వస్వకాహివా
కాకారేభభరే కాకా నిస్వభవ్య వ్యభస్వని'

ఇది సర్వతోభద్రబంధము. (15–25)

'వికాశమీయుర్జగతీశమార్గణాః
వికాశమీయుర్జగతీ శమార్గణాః

వికాశమీాయుర్జగతీ శమార్గణాః
వికాశమీాయుర్జగతీ శమార్గణాః'

ఇది సర్వ్రత్రయమకము. (15-52)

మాఘుఁడు తనశిశుపాలవధమహాకావ్యమునందు శబ్దచిత్రరచనలు విచ్చలవిడిఁ గావించెను.

'జజౌజోజాజి జిజ్జాజీ తంతతో ఽతితతాతితుత్,
భాభోభీభాభిభూభాభూ రారారిరరిరీరరః'

ఇది యేకాక్షరపాదశ్లోకము (19-3)

'సకారనానారకాస కాయసాదదసాయకా
రసాహవావాహసార నాదవాదదవాదనా'

ఇది సర్వతోభద్ర బంధము. (19-27)

'సాసేనాగమనారంభో రసేనాసీదనారతా
తారనాదజనామత్త ధీరనాగమనామయా'

ఇది మురజబంధము. (19-29)

'నానాజావవజానానా సాజనౌఘఘనౌజసా
పరానీకే ఽహేనిరాపతాన్వియా తతయాన్వితా'

ఇది ప్రతిలోమానులోమపాద శ్లోకము. (19-40)

ఇదియే పాదభ్రమక మనంబడును.

'ప్రవృత్తే వికసద్ధ్వానం సాధనేష్వ విషాదిభిః
వవృషే వికసద్ధ్వానం యుధమాప్య విషాణిభిః'

ఇది గోమూత్రికాబంధము. (19-46)

'నీలేనానాలనలిన నిలీనోల్లలనాలినా,
లలనా లాలనేనాలం లీలాలోలేనలాలినా'

ఇది ద్వ్యక్షరశ్లోకము. (19-84)

'దాదదోదుద్దదుద్దాదీ దాదాదో దూదదీదదోః
దుద్దాదందదదేదుద్దే దదాదదదదోదదః'

ఇది యేకాక్షరశ్లోకము. (19-114)

'సత్త్వంమానవిశిష్ట మాజిరభసా దాలంభ్య భవ్యః పురో
లబ్ధాఘుక్షయశుద్ధిరుద్ధురతరశ్రీవత్సభూమి ర్ముదా

ముక్త్వాకామమపాస్తభీః పరమృగవ్యాధస్సనాదంహరే
రేకాస్త్యై స్సమకాలమభ్రమదయీారోస్తైస్తదా తస్తరే'
ఇది చక్రబంధము. (19-120)

శబ్దచిత్రముల నధమం బని చెప్పిన ధ్వన్యాలోకకర్త యగు నానందవర్ధనాచార్యుఁడే తన దేవీశతకమునం దనేక చిత్రరచనలు గావించియున్నాఁడు.

'యయాయాయాయాయ్యయాయాయాయంయోయోయంయేయయైయయాం
యయయుయాయియయేయాయ యయే౽యాయాయయయాయయుః'
ఇది యేకాక్షరశ్లోకము.

'జితానయాయానతాజి తారసాతతసారతా
నసావనానావసాన యాతనారిరినాతయా'
ఇది సర్వతోభద్రశ్లోకము.

'సాభావక్షాశవర్యానత విభవితనుర్వ్యాపలక్షావభాసా
జానానస్యాశయప్రానవనశివనప్రాయశస్యానజా
సాతంవర్మానస్థారహసిరసిహరస్థానవర్మావతంసా
పాయాదక్తారణత్రామతనమనతమత్రాణరక్తాదయాపా'
ఇది ప్రతిపాద ప్రతిలోమానులోమ శ్లోకము.
ఇదియే పాదభ్రమకము.

ఇంకను నుదాహరణంబులు గ్రంథవిస్తరభీతిచేఁ జూపఁబడవయ్యె.

ఆంధ్రమహాకవులును స్వల్పముగా ఛేకయమకాదిశబ్దచిత్రంబులను బ్రయోగించి యున్నారు.

'ద్రోణము గాంచె నిర్జరవధూజనమంగళగేయవిస్ఫుర
ద్రాణము దీపరాజిరుచిరస్ఫురదోషధిసత్త్వకల్పిత
త్రాణము రత్నదీధితివిరాజితహాటకసానుమండలీ
కోణము నభ్రచుంబిగురుకూటవికస్వరధాతుశోణముఖ్'
భాస్కరరామాయణము, యుద్ధకాండము.

'మణిఘృణిగణయుతరశనా, ఝుణఝుణితాగణితరణిత చరణాంచితఘూ
మణఘూమణరచనవిచ, క్షణకంకణకింకిణీకఝుంకృతు లారన్'
భాస్కరరామాయణము, బాలకాండము.

బమ్మెరపోతన భాగవతమునందు శబ్దాలంకారములు బహుళముగాఁ బ్రయోగించి యున్నాఁడు.

‘పావనములు దురితలతా, లావనములు నిత్యమంగళప్రాభవసం
జీవనములు లక్ష్మీసం, భావనములు వాసుదేవపదసేవనముల్.’

—భాగవతము, స్కంధము 1.

‘విరియఁ గువలయంబు విధిపదంబు చలించు
నెసఁగుభువనభంగ మీవు వొలయ
మలయనలదు పవన జలదవేణికలపై
మలయనలదుపవనవలయభవన’

—వసుచరిత్ర. ఆ 4.

‘ఈశదండముపరపాదప, వేదండము పరమపటిమవిహసితపురభి
త్కోదండము భవదీయభు, జాదండమునకు ఘటింప జయమగు నాజిన్’

—వసుచరిత్ర. ఆ. 6.

ఆధునికకవులు శబ్దచిత్రరచనలను బహుళముగాఁ గావించియున్నారు.

కేవల వేదాంతగ్రంథ మగు సీతారామాంజనేయసంవాదమునందు:—

‘క. నానానూనుని ననిన న్నేనేనన నిన్ను నన్ను నేననుననినన్,
నేనును నేనన్నా నా నేనును నిన్నెన్ని నన్ను నిను నేననినా’

అని యేకాక్షరపద్యము గలదు. ప్రబంధరాజ శిరోభూషణ వేంకట విజయ విలాస మను కావ్యము సకలవిధము లగు శబ్దచిత్రరచనలతో నిండియున్నది. క్లేశకరంబును సరసార్థభావహీనంబును గేవలశబ్దవైచిత్ర్యమాత్రఫలంబును నగు శబ్దచిత్రరచన యుత్తమకావ్యము కాకున్నను జదువరులకు రుచిభేదము గలుగుటకును గొందఱికదియిష్ట మగుటంజేసియు నీరచనావైచిత్రిని మహాకవులును దమయుత్తమకావ్యములలోఁ గ్వాచిత్కముగాఁ గావించియున్నారనియు నంతమాత్రమున నుత్తమకావ్యత్వమునకు హాని వాటిల్లదనియుఁ దెలియవలయు.

ఇఁక దీనిని విస్తరింపనేల.

### గోమూత్రికాబంధము

క. విదళితదైత్య రమాగృహ
పదసారసవినత దేవ పతగేశహయా
చిదమిత చైత్యశమావహ
మదవారణ విమతభావ మతపాశ
జయా. 93

(వ్యా) విదళితదైత్య—నఱుకఁబడినరాక్షసులు గలవాఁడా (రాక్షసులను జంపినవాఁడా యనుట); రమాగృహ—లక్ష్మికి నివాసస్థాన మైనవాఁడా; పదసారసవినతదేవ—పదసారస—పాదకమలముల యందు; వినత—నమస్కరించుచున్న; దేవ—దేవతలుగలవాఁడా; పతగేశహయా—పక్షీంద్రమును వాహనముగాఁ గలవాఁడా; చిదమిత—చిత్—జ్ఞానముచేత; అమిత—అప్రమేయుఁడా; (అప్రమేయజ్ఞానస్వరూపుఁడా యనుట); చైత్యశమావహ—చైత్య—జీవులకు; శమ—శాంతిని; ఆవహ—కలుగఁజేయువాఁడా; మదవారణ—మదమును బోఁగొట్టువాఁడా (అహంకారమును బోఁగొట్టువాఁ డనుట); విమతభావమతపాశజయా — విరుద్ధము లగు భావములు మతములు పాశములు (బంధములు) వీనిని జయించినవాఁడా; విరుద్ధభావములు—కామక్రోధాదులు; విరుద్ధమతములు—నాస్తికాదులు; విరుద్ధపాశములు—భయసంశయజుగుప్సాదులు.

ఇది గోమూత్రికా బంధము. దీని యుద్ధారము:—

తే. మొనసి గోమూత్రరేఖల మూలలందు, వలయుపద్యంబు నాలుగంఘ్రులను వ్రాసి
చదివిరేనియు సుకవులు సమ్మదమున, ధాత్రిగోమూత్రికాఖ్యబంధంబు దనరు.

శ్లో. వర్ణానా మేకరూపత్వం య ద్యేకాంతర మర్ధయోః
గోమూత్రికేతి త త్ప్రాహు ర్దుష్కరం తద్విదో విదుః.

—అని కావ్యాదర్శమున దండి.

## నాగబంధము

చ. జలదవితానసీల ఖలసాలకులక్షితివారణేశ ని
శ్చలమునివారపాల సురచారణయక్షనవానుకూల కుం
డలివరహారలోల నరనారదతత్పర భూవిధేయ యు
జ్జ్వలమనునీతిశీలితవశంవద శక్రరమానికేతనా. 94




(వ్యా) జలదవితానసీల — జలద_మేఘములయొక్క; వితాన_సమూహమువలె; నీల_నీలవర్ణుఁడా; ఖల......వారణేశ — ఖల_దుష్టులనెడు; సాలకుల_చెట్లసమూ

హములను; క్షతి_నశింపఁజేయు; వారణేశ_గజేంద్రమా; నిశ్చలమునివారపాల—నిశ్చల_చలింపని; (అనఁగా నిశ్చలమనస్సులు గల); మునివార—మునిబృందములను; (అనఁగా యోగీశ్వరులను); పాల_రక్షించువాఁడా;

నిశ్చలమనులే యోగులు. యోగ మనఁగాఁ జిత్తవృత్తినిరోధము. అనఁగాఁ జిత్తైకాగ్ర్యహేతువగు నుపాసనము. యోగి సంకల్పములను సన్న్యసింపవలయు.

'న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన' అని భగవంతుం డగుశ్రీకృష్ణుఁడు చెప్పి యోగిలక్షణములను నిట్లు నుడివెను.

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః.
జ్ఞానవిజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః.
సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే.

—భగవద్గీత. అ. 6.

సుర...కూల—సురలు చారణులు యక్షులు వీరికి హితము సేయువాఁడా; కుండలివరహారలోల—కుండలివర_వాసుకిని; హార_హారముగాఁ గలపరమశివునియందు; లోల_ఆసక్తుఁడా; (హితుఁడా యనుట); (కుండలి_సర్పము); నరనారదతత్పర_నరుఁడు నారదుఁ డను ఋషులయెడ నాదరము గలవాఁడని భావము; భూవిధేయ_భూమికి విధేయుఁడా; (అనఁగా భూదేవికి వశుఁడనుట); ఉజ్జ్వల...వశంవద—ఉజ్జ్వల_ప్రకాశించుచున్న; మనునీతి_మనువుయొక్క హితోపదేశములందు; (అనఁగా వాని నాచరించుటయం దనుట); శీలిత_స్వభావముగలవారికి; వశంవద_విధేయుఁడా; (అనఁగా వట్టివారికిఁ బ్రసన్నుఁడని భావము); శక్రరమా-దేవేంద్రునియైశ్వర్యమునకు; నికేతనా—స్థానమైనవాఁడా; (అనఁగా దేవేంద్రునివంటిభోగము కలవాఁడా.

ఇది నాగబంధము. దీని యుద్ధారము:—
ఇలతో నెనుబదినాలుగు, నిలయంబులు నగుఁ బయోదనిభనీలాంగా
మెలిగొన్న పాముపలె వెల్గుప లగుఁ దలతోఁక నాగబంధంబునకున్.

—అని అప్పకవీయము.

చ. సరిగా నల్ నవకోష్ఠముల్ నెఱపి దాసందంశరీతిం బర
స్పరరేఖల్ గదియించి పార్శ్వము లధోభాగంబు కోణంబులుం
బరివేష్టింపఁగఁ జుట్టి పుచ్ఛముఖముల్ ప్రాగ్రేఖలం దీర్చి స్ర
గ్ధరయో చంపకమాలయో యొగి నిడంగా నాగబంధంబగున్.

—అని ప్రబంధసంబంధబంధనిబంధనగ్రంథము.

## ఛురికాబంధము

క. శ్రీవర వరవరహృతభవ
భావన వనజాయతాక్ష పాలితవిబుధా
ధావితదనుభవ నియమిన
భావనచతురా సముద్ధృతార్ణవవసుధా. 95



(వ్యా) శ్రీవర—లక్ష్మీదేవికి మగఁడా; వర...భావన—వర—శ్రేష్ఠమైన; (మహిమవంతమైన); వర—దేవతా ప్రాప్తము లగు ప్రసాదముల చేత; హృత—హరింపఁబడిన; భవభావన—సంసారచింతలు కలవాఁడా; (అనఁగా భక్తులకు వరము లొసఁగి వారిసంసృతిక్లేశములను బోఁగొట్టువాఁడని భావము; వనజాయతాక్ష — కమలములవలె విశాలములగు కన్నులుగలవాఁడా; పాలితవిబుధా — రక్షింపఁబడిన దేవతలు కలవాఁడా; ధావితదనుభవ—ధావిత — తఱుమఁబడిన; దనుభవ—రాక్షసులు కలవాఁడా; నియమి... ...చతురా—నియమి—మునులయొక్క; సభా—మొత్తములను; అవన — రక్షించుటయందు; చతురా—సమర్థుఁడైనవాఁడా; సముద్ధృతార్ణవవసుధా — సముద్ధృత — పైకెత్తఁబడిన; అర్ణవవసుధా— సముద్రమందలి భూమి కలవాఁడా; (అనఁగా సముద్రమున మునిఁగినభూమిని పైకెత్తినవాఁడా యనుట); వరాహావతారకథ యిచట సూచితము.

ఇది ఛురికాబంధము. (ఛురికా—కత్తి)

దీనియుద్ధారము:—
చరణాంత్యవర్ణ మొక్కటి, చరణయుగాద్యంబుఁ జేసి సరసులు మువ్వా
రిరుగడలమధ్య మొకటిగఁ, బరుజులగదియింప ఖడ్గబంధం బొనరున్.
—అప్పకవి.

ఈ పద్యమున మొదటిపాదమున 'శ్రీవరవర పదహృత' యనియే యన్ని గ్రంథములలోను పాఠము కానంబడుచున్నది. పదహృత యని యున్నచో ఛురికాబంధమున నక్షరవ్యావృత్తి భంగమగును గాన 'వరహృత' యనియే కవి వ్రాసియుండనోపు నని యూహించి యట్లు సవరించితి.

## చక్రబంధము

శా. చిత్రాకృత్యభినందితవ్రజమృగాక్షీమధ్యగా యక్షరా
మిత్రోష్ణద్యుతిదిగ్ధచక్ర జనివల్మీకర్క్ష పా కృష్ణభా
సత్రారాధ్య నుతింతు నిన్ను జగదీశా విక్రమాతిస్థిరా
రాత్రీనాంచితభామితాబ్జ సదయా రాధానుభావాకరా. 96



(వ్యా) చిత్రా...... మధ్యగా—చిత్రాకృతి—చిత్రమైనయాకారములచేత; అభినందిత—సంతోషపెట్టఁబడిన; వ్రజమృగాక్షీ—గొల్లవనితలయొక్క—; మధ్యగా—మధ్యమును బొందినవాఁడా; (వారినడుమనుండువాఁడా యనుట); అక్షరా—నాశరహితుఁడా;

మిత్రో...చక్ర—మిత్ర–సూర్యునియొక్క; ఉష్ణద్యుతి–తీక్ష్ణకాంతులచేత; దగ్ధ–పూయఁబడిన; చక్ర–చక్రాయుధముఁ గలవాఁడా; అనఁగా సూర్యకాంతులవలెఁ దేజరిల్లుచక్రము గలవాఁడా యనుట; జనివల్మీకర్క్షపా—జని–సంసారమనెడు; వల్మీక–పుట్టలకు; ఋక్షపా–భల్లూకపతియైనవాఁడా; (నశింపఁజేయువాఁడాయనుట); కృష్ణభా–నల్లనికాంతి గలవాఁడా; సత్రారాధ్య–యాగములందుఁ బూజింపఁదగినవాఁడా; జగదీశా–లోకనాయకా; విక్రమాతిస్థిరా–పరాక్రమముచేత మిక్కిలిస్థిరుఁడా; రాత్రీ...తాక్ష—రాత్రీన–(రాత్రి+ఇన) చంద్రునియొక్క; అంచిత–అందమైన; భా–కాంతులచేత; మిత–కొలువఁబడిన (అనఁగాఁ బోల్పఁబడిన); అబ్జ–శంఖముగలవాఁడా; (అనఁగాఁ జంద్రునికాంతులవలె ధవళమగుశంఖము గలవాఁడా యనుట); సదయా–దయతోఁగూడినవాఁడా; రాధానుభావాకరా—రాధా–రాధాదేవియొక్క; అనుభావ–విభవములకు; మహిమములకు; ఆకరా–స్థానమైనవాఁడా; నిన్ను–నుతింతుఁ.

ఇది చక్రబంధము. ఉద్ధారము:—

మ. పయిఁబైఁగాఁ బదిచుట్లునాఱుదళముల్ ప్రాగ్రేఖలందీర్చి స్వా
హ్వాయపత్ర్యాహ్వయముఖ్యచిహ్నములు గన్పట్టంగఁ బాదత్రయా
శ్రయరేఖాంత్యపదాశ్రయాదివృతిగా శార్దూలవిక్రీడితా
హ్వయవృత్తంబు యథాక్రమంబుగ లిఖింపం జక్రబంధం బగుఁ.

ఈ పద్యము రెండవపాదమున నన్నిపుస్తకములలోను 'జనివల్లీకర్ష ణా' యనియే పాఠ మున్నది. అట్లున్నచో యతిభంగ మగును గావున 'జనివల్మీకర్క్షపా' యని సవరించితి.

ఇందు మూఁడవచుట్టు 'కృష్ణరాయకృతి' యనియును నాఱవచుట్టు 'నంది తిమ్మకవి' యనియు వచ్చునట్లు కృతిపతిపేరును గవిపేరును బొందింపఁబడియున్నవి.

## ద్వ్యక్షరి

క. మనమున ననుమానము నూ
నను నీనామ మనుమనుమననమును నేమ
మ్మున మాన నన్ను మన్నన
మను మను నానామునీనమానానూనా. 97

(వ్యా) నానామునీనమానానూనా—నానా–సకల; మునీన–మునిశ్రేష్ఠుల యొక్క; మాన–ప్రమాణములకు; అనూనా–అధికుఁడా; (అనఁగా ఋషులకందఱి

మను నప్రమేయమైనమహిమ కలవాఁడనుట; మనమునన్—మనస్సునందు; అనుమానమున్—సందేహమును; ఊనను—పెట్టను; 'సంశయాత్మా వినశ్యతి' అని భగవద్గీత; నీనామ మను—నీపేరనెడు; మను—మంత్రముయొక్క; మననమును—ధ్యానమును; నేమమ్మునన్—నియమముతో; మానన్—వదలను; నన్నున్—అట్టియేకాంతభక్తుఁడ నగునన్ను; మన్ననన్—ప్రీతితో; మనమను—మనుము+అను—జీవింపు మని చెప్పుము; అనఁగా ననుగ్రహింపుమా యనుట.

ఇది ద్వ్యక్షరకందము.

## ద్వికంద క్రౌంచపద వృత్తము

అంకురితశ్రీసంగభుజాంకా హరిహయమణిమదహరతనువర్ణా
సంకటకృద్దైత్యాశయశంకాజనననిజచరిత శయధృతశంఖా
పంకజనాభా భంజితపంకా పరమపురుష భవపరిభవనామా
శంకరభావా కిసలయసంకాశపదయుగ కలశశరనిధిశయనా. 98

(వ్యా) అంకురిత...భుజాంకా—అంకురిత—మొలచిన; శ్రీ—లక్ష్మియొక్క; సంగ—కూడికవలని; భుజాంక—భుజచిహ్నము గలవాఁడా; అనఁగా లక్ష్మిదేవితోడి సంగముచే శుభరేఖలు భుజములయందుఁ గలవాఁడా యని భావము. శ్రీసంగ—సంపదయొక్క కూడికగల యనియు నర్థము చెప్పవచ్చును. హరి...తనువర్ణా—హరిహయమణి — ఇంద్రనీలమణులయొక్క; మద—గర్వమును; హర — పోఁగొట్టు; తనువర్ణా — దేహకాంతిగలవాఁడా; అనఁగా నీలవర్ణముగల శరీరకాంతిగలవాఁడా యని భావము; సంకట......చరిత—సంకటకృత్—కష్టములను గలిగించెడు; దైత్య—రాక్షసులయొక్క; ఆశయ—కోరికలకు; శంకాజనన—సందేహమును బుట్టించు; నిజచరిత—స్వకీయవృత్తాంతము గలవాఁడా; అనఁగా రాక్షసుల యాటోపమును బోఁగొట్టు నడవడి గలవాఁడాయనుట; శయ—హస్తమునందు; ధృత—ధరింపఁబడిన; శంఖా—శంఖము కలవాఁడా; పంకజనాభా—తమ్మిబొడ్డు కలవాఁడా; భంజితపంకా—భంజిత—పోఁగొట్టఁబడిన; పంకా—పాపముకలవాఁడా; పరమపురుష—పురుషోత్తముఁడా; భవపరిభవనామా—భవ—సంసారమును; పరిభవ—తిరస్కరించెడు; నామా—పేరు కలవాఁడా; అనఁగాఁ గృష్ణుని దివ్యనామమును వచించినంతమాత్రముననే జనులపాపములు నశించు నని భావము.

హరి ర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః.

శంకరభావా—శివుఁడు భావమునందుఁ గలవాఁడా; (శివునిధ్యానించువాఁడనుట;) కిసలయ...పదయుగ—కిసలయ—చిగుళ్లతో; సంకాశ—సమానమైన; పదయుగ—పాదములు గలవాఁడా; కలశ...శయనా—కలశశరనిధి—క్షీరసముద్రమునందు; (శరనిధి—జలనిధి); శయనా—పవ్వళించువాఁడా.

ఇది ద్వికంద క్రౌంచపదవృత్తము.

క్రౌంచపదవృత్తలక్షణము:—

ప్రతిపాదమునకు భ మ స భ న న న య గణములును బదునొకండవయక్షరమును బందొమ్మిదవ యక్షరమును యతిస్థానములును గలది. ఇందు రెండుకందపద్యములిమిడియున్నవి. రెండేసిపాదము లొక్కొక్క కందపద్యముగాఁ జదువనగును. ఇట్లు రచించుట గర్భకవిత్వ మనఁబడును.

భుజంగప్రయాత గర్భ స్రగ్విణి

వాసుదేవా ఘనస్వచ్ఛకాంతీ రమా
వాస వంశస్వరవ్యక్తవేదక్రమా
రాసలాస్యప్రకారప్రవీణోద్యమా
వాసవాదిస్తుతవ్యక్తనామా నమః. 99

(వ్యా) వాసుదేవా—వసుదేవుని పుత్రుఁడా; ఘనస్వచ్ఛకాంతీ—ఘన—మేఘమువంటి; స్వచ్ఛ—శుద్ధమైన; కాంతీ—కాంతికలవాఁడా; రమావాస—లక్ష్మీదేవికి నివాసస్థానమా; వంశ...క్రమా—వంశ—పిల్లనగ్రోవియొక్క; స్వర—నాదముచేత; వ్యక్త—స్పష్టమైన; (తెలియఁబఱుపఁబడిన); వేదక్రమా—వేదములయొక్క వరుస కలవాఁడా; అనఁగా నద్దేవుని పిల్లనగ్రోవిస్వరములు వేదతుల్యములై యొప్పు నని భావము; రాసలాస్య......ద్యమా—రాసలాస్య—రాసక్రీడయను నర్తనవిశేషముయొక్క; ప్రకార—విధమునందు; ప్రవీణ—చతురమైన; ఉద్యమా—ప్రయత్నముగలవాఁడా; (అతిచతురముగా రాసక్రీడలు సలుపువాఁడా యని భావము); వాస......నామా—వాసవాది—ఇంద్రుఁడు మొదలగువారిచేత; స్తుత—పొగడఁబడిన; వ్యక్త—స్పష్టమైన; నామ—నామధేయము కలవాఁడా; నమః—నమస్కారము.

ఇది భుజంగప్రయాతగర్భ స్రగ్విణి.

స్రగ్విణీవృత్తలక్షణము—
ప్రతిపాదమునకు నాలుగు రగణములును సప్తమాక్షరము యతిస్థానమును గలది.

భుజంగప్రయాతవృత్తలక్షణము—
ప్రతిపాదమునకు నాలుగు యగణములును సప్తమాక్షరము యతిస్థానమును గలది.
(నమో యనుపదము మొదలుగాఁ జదివిన భుజంగప్రయాత మగును.)

క. అని చిత్రగతుల నవ్విభుఁ
గొనియాడి మునీంద్రుఁ డరిగె గోపవధూటీ
జనతావల్లభుఁడును మి 100
త్రనికాయముతోడ నిజపురంబున కరిగెన్.

(వ్యా) చిత్రగతులన్ — నానాప్రకారములుగా; కొనియాడి — స్తుతించి; స్తుతి యనఁగా గుణసంకీర్తనము, కేవల భగవన్నామోచ్చారణంబును స్తుతియందుఁ జేరును.

(వి) ఇచ్చట విష్ణునామసంకీర్తనమహిమనుఁగూర్చి యించుక లిఖింపఁబడుచున్నది:—

హరినామసంకీర్తనము సర్వపాపహరంబనియు సర్వశుభప్రదాయకం బనియుఁ బురాణములు వక్కాణించుచున్నవి.

'ధ్యాయన్ కృతే యజన్యజ్ఞై స్త్రేతాయాం ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి తదాప్నోతి కలౌ సంకీర్త్య కేశవమ్'
—అని విష్ణుపురాణము.

మఱియుఁ బురాణవచనములు:—
ధ్యాయేన్నారాయణం దేవం స్నానాదిషు చ కర్మసు
ప్రాయశ్చిత్తం హి సర్వస్య దుష్కృతస్యేతి వై శ్రుతిః
అతిపాతకయుక్తోఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్
భూయ స్తపస్వీభవతి పంక్తిపావనపావనః
హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః

జ్ఞానతోఽ జ్ఞానతోవాపి వాసుదేవస్య కీర్తనాత్
తత్సర్వం విలయంయాతి తోయస్థం లవణం యథా
హరేర్నామైవనామైవ నామైవ మమజీవనం
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా
స్తుత్వా విష్ణుం వాసుదేవం విపాపో జాయతే నరః
విష్ణోస్సంపూజనా న్నిత్యం సర్వపాపం ప్రణశ్యతి

హరినామసంకీర్తనధ్యాననమస్కారాదులు హింసాదిరహితముగాఁ జేసినచే ఫలవంతమగు. అట్లు చేయువాఁడే వైష్ణవుఁడు.

'నచలతి నిజవర్ణధర్మతోయ, స్సమమతిరాత్మసుహృద్విపక్షపక్షే
నహరతి నచహంతి కించిదుచ్చైః, స్థితమనసం తమవేహి విష్ణుభక్తమ్'
'విమలమతి రమత్సరః ప్రశాంతః, శ్శుచిచరితోఽఖిలసత్త్వమిత్రభూతః
ప్రియహితవచనోస్తమానమాయో, వసతిసదాహృది తస్య వాసుదేవః'

—అని భాగవతమున వైష్ణవలక్షణము చెప్పఁబడినది.

హరిసమర్చనము సర్వకామప్రదం బనుటకు మఱియుఁ గొన్ని పురాణవచనలుదాహరింపఁబడుచున్నవి:—

'యం యం కామ మభిధ్యాయే త్తంత మాప్నో త్యసంశయామ్
సర్వాన్ కామా నవాప్నోతి సమారాధ్య జగద్గురుమ్'
అవశేనాపి య న్నామ్ని కీర్తితే సర్వపాతకైః
పుమా న్విముచ్యతే సద్య స్సింహత్రస్తై ర్మృగై రివ
సకృత్ స్మృతోఽపి గోవిందో నృణాం జన్మశతైః కృతమ్
పాపరాశిం దహత్యాశు తూలరాశి మివానలః
ఏకోఽపి కృష్ణస్య కృతప్రణామో
దశాశ్వమేధావభృథేన తుల్యః
దశాశ్వమేధీ పునరేతి జన్మ
కృష్ణప్రణామీ న పునర్భవాయ'

కావుననే మహాభారతమునందుఁ గడపట

'ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునఃపునః
ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణ స్సదా'

అని భగవంతుఁ డగు వ్యాసుఁడు నుడివి యమ్మహేతిహాసమును ముగించెను.

చ. నిజపురి కేఁగుదెంచి ధరణీధరుఁ డప్పుడు భోజరాజధ
ర్మజకురునాథముఖ్యమహీమండలనాథులఁ దక్కఁగల్గు బ
న్ధుజనులఁ గల్పకద్రుమజనూతనదివ్యవిభూషణాంబర
వ్రజము లొసంగి వీడ్కొని నిరంతరసౌఖ్యరసైకలోలుఁ డై. 101

సుగమము.

క. తలిరులతుదఁ జినుకులు జల
జల వడియఁగఁ దడిసి మెలఁగుచలికరువలి ను
న్బొలపమున విరియుపరువపుఁ
దొలుమొగడలవలపుదెలుపు తోఁటలలోనన్. 102

(వ్యా) తలిరులతుదన్—చిగుళ్ల కొనలనుండి; చినుకులు—జలబిందువులు; జల జలన్—జలజలమని; వడియఁగన్—రాలఁగా; తడిసి; మెలఁగు—సంచరించు; చలికరువలి—చల్లని మలయమారుతముయొక్క; నున్బొలపమునన్—మృదుప్రసరణముచేత; విరియు—వికసించుచున్న; పరువపు—ప్రాయము గల; తొలుమొగడల—మొదట వేసిన మొగ్గలయొక్క; వలపు—పరిమళమును; తెలుపు—ప్రకటించు; తోఁటలలోనన్—ఆరామములందును.

ఈ వాక్యమునకు 105 వ పద్యమునందలి 'యొలలాడుచుండె' నను క్రియాపదముతో నన్వయము.

ఈ పద్య మంతయు నచ్చతెలుఁగుపదములతోడను సర్వలఘువులతోడను మనోహరముగాఁ గూర్పఁబడినది.

అలంకారము—వృత్త్యనుప్రాసము.

కావ్యగుణములు: ప్రసాదము-మాధుర్యము-సౌకుమార్యము.

క. దరదళదంబుజముకుళో
దరదళమిళదళికులచ్ఛదప్రహతిసర
త్సరసరజోధూసరపరి
సరసరసీతీరకుంజసదనస్థలులన్. 103

(వ్యా) దర—కొంచెముగా; దళత్—వికసించిన; అంబుజముకుళ—తామరమొగ్గల యొక్క; ఉదరదళ—నడురేకులయందు; మిళత్—కూడుకొనిన; అళికుల—తుమ్మెదల

కూటువలయొక్క; ఛద—ఱెక్కలయొక్క; ప్రహతి—తాఁకుడులచేత (కొట్టుటచేత); సరత్—జాఱుచున్న; సరస—రసవంతమైన; రజః—పరాగముచేత; ధూసర—బూడిదవర్ణముగా నైన; పరిసర—చుట్టుప్రక్కలనుండు; సరసీతీర—కొలఁకులగట్టులందలి; కుంజసదనస్థలులన్—పొదరింటిప్రదేశములందును. ఇది యొక పేసమాసము.

ఈ వాక్యమునకును 105 వ పద్యమునందలి 'యోలలాడుచుండె' నను క్రియాపదముతో నన్వయము. ఇది కేవలసంస్కృతపదములతో మనోజ్ఞముగా రచింపఁబడినది.

అలంకారములు కావ్యగుణములు పైయట్లు; యమకమును నరయునది.

క. మరకతగోమేదకపు
ష్యరాగవిద్రుమవిదూరసంభవముక్తా
హారినీలవజ్రకురువిం
దరత్నమయకృతకభూమిధరకందరలన్. 104

(వ్యా) విద్రుమ—పగడము; విదూరసంభవ—వైదూర్యము; కురువింద—కెంపు; కృతకభూమిధర—కృతకాద్రులయొక్క; కందరలన్—గుహలయందు.

ఈ వాక్యమునకును 105 వ పద్యమునందలి 'యోలలాడుచుండె' నను క్రియాపదముతో నన్వయము.

సీ. భోజకన్యాసరిద్రాజహంసము సత్య
భామాశుకీకేళిపంజరంబు
జాంబవతీనిశాచంద్రోదయంబు కా
ళిందీసరోజినీందిందిరంబు
భద్రాకలాపినీప్రావృడంబుదము సు
దంతారసాలలతాపికంబు
మిత్రవిందావనీచైత్రాగమము లక్ష
ణాహారయష్టికానాయకంబు
తే. షోడశసహస్రకామినీస్తోమధేను
కారిరంసామదోత్కటవారణేంద్ర
మనఁగ సౌఖ్యాంబునిధి నోలలాడుచుండెఁ
గృష్ణుఁ డఖిలావనైకవర్తిష్ణుఁ డగుచు. 105

(వ్యా) భోజకన్యా—రుక్మిణియనెడు; సరిత్—నదికి; రాజహంసము—రాయంచయగువాఁడును; సత్యభామా—సత్యభామయనెడు; శుకీ—ఆఁడుచిలుకకు; కేళిపంజరంబు—క్రీడించు గూఁడగువాఁడును; జాంబవతీ—జాంబవతియనెడు; నిశా—రాత్రికి; చంద్రోదయంబు — చంద్రోదయమగువాఁడును; కాళిందీ—కాళింది యనెడు; సరోజినీ—తమ్మితీఁగకు; ఇందిందిరంబు—తుమ్మెదయగువాఁడును; భద్రా — భద్ర యనెడు; కలాపినీ — ఆఁడునెమిలికి; ప్రావృడంబుదము — వర్షాకాలపు మేఘ మగువాఁడును; సుదంతా—సుదంతయనెడు; రసాలలతా—తియ్యమామిడితీఁగకు (చెట్టునకు); పికంబు—కోయిలయగువాఁడును; మిత్రవింద—మిత్రవింద యనెడు; వనీ—వనమునకు; చైత్రాగమము—వసంతునిరాకయగువాఁడును; లక్షణా—లక్షణ యనెడు; హారయష్టికా—ముత్యాలహారమునకు;(యష్టి—కోయ్య; కోయ్యవలెఁ బొడవుగానుండుటవలన హారయష్టియని పేరు); నాయకంబు—నాయకమణియగువాఁడును; షోడశ......వారణేంద్రము—షోడశసహస్రపదాఱువేవురైన; కామినీ—వలపుగల యువతులయొక్క; స్తోమ—గుంపులనెడు; ధేనుకా—ఆఁడేనుఁగులతోడ; 'కరిణీ ధేనుకా వశా' యని యమరుఁడు; రిరంసా—(రంతుమ్ + ఇచ్ఛా; సన్నంతము) క్రీడింపవలయునని యిచ్ఛగలిగిన; మదోత్కట—మదాతిరేకము గల; వారణేంద్రము—గజేంద్ర మగువాఁడును; అనఁగ౯—అనునట్లు; కృష్ణుఁడు—; అఖిలా......డగుచు౯—అఖిల—ఎల్ల వారిని; అవన—రక్షించుటయందు; ఏక—ముఖ్యముగా; వర్తిష్ణుఁడగుచు౯—వర్తించుస్వభావము కలవాఁడై; సౌఖ్యాంబునిధి౯—సుఖసాగరమునందు; ఓలలాడుచుండె౯—తేలియాడుచుండెను; వినోదముగా విహరించుచుండెను. అనఁగా నిరవధికానందమును బొందుచుండె నని భావము.

అలంకారము. రూపకాంతర్గతరూపకము.

వర్తిష్ణు వనుటకు నుదాహరణము—

నిరాకరిష్ణూ వర్తిష్ణూ వర్ధిష్ణూ పరితోరణమ్
ఉత్పతిష్ణూ సహిష్ణూచ చేరతుః ఖరదూషణౌ.

—అని భట్టికావ్యము—సర్గము 5.

సీ. కౌశికగోత్రవిఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రుఁ డార్వేలపవిత్రకులుఁడు
నందిసింగామాత్యునకును దిమ్మాంబకుఁ
దనయుండు సకలవిద్యావివేక
చతురుఁడు మలయమారుతకవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయక్షితీశ

కరుణాసమాలబ్ధఘనచతురంతయా
నమహాగ్రహారసన్మానయుతుండు

తే. తిమ్మయార్యుండు శివపరాధీనమతి య
ఘోరశివగురుశిష్యుండు పారిజాత
హరణ మనుకావ్య మొనరించె నంధ్రభాష
నాదివాకరతారాసుధాకరముగ. 106

(వ్యా) మలయమారుతకవీంద్రునకున్—మలయమారుతుం డను కవివరునకు; మేనల్లుండు — భాగినేయుండు; కృష్ణరాయ......యుతుండు—కృష్ణరాయక్షితీశ—కృష్ణరాయమహీపతియొక్క—; కరుణా — దయవలన; సమాలబ్ధ—పొందంబడిన; ఘన—గొప్పవియగు; చతురంతయాన—పల్లకీలు; మహాగ్రహార—గొప్పయగ్రహారములు;(అనెడు) సన్మాన—బహుమతులతో;యుతుండు—కూడినవాండు; అగ్రహారశబ్దమునకు వ్యుత్పత్తి— అగ్ర—బ్రాహ్మణభోజనమునకై; హార—రాజులు తమభూములనుండి హరించిన (అనంగా వేర్పఱచిన) భూమి.

ఈ యగ్రహారనామ మెద్దియో మనకుం దెలియరాకున్నది.

తిమ్మయార్యుండు—తిమ్మయ యను పేరుగల పూజ్యుండు; శివపరాధీనమతి—శివుని యందు వశమైనమనస్సు గలవాండు; (శివభక్తుం డనుట); 'శివపదాధీనమతి' యని పాఠాంతరము. దానికి పరమశివునిచరణములయం దధీనమైన మనస్సు కలవాండని యర్థము.

అఘోరశివగురుశిష్యుండు—అఘోరశివాచార్యులనెడివారికి శిష్యుండు; ఆదివాకరతారాసుధాకరముగన్—సూర్యుండు చంద్రుండు నక్షత్రములును నున్నంతకాలము; శాశ్వతముగా నుండునట్లు; ఆంధ్రభాషన్ — తెలుంగుబాసయందు; పారిజాతహరణ మను కావ్య మొనరించెన్, అని యన్వయము.

శా. ఏకచ్ఛత్త్రితసర్వభూతల నృసింహేంద్రక్షమాభృత్తపః
పాకద్యోతితరూప మార్తికతులాభారప్రదానోన్నతా
శోకస్తన్యసమాభ్రసన్నిభ మారిత్ర్యాలంకపోద్యద్యశ
శ్శ్రీకర్ణాటమహీశ వైరికరిరాట్సింహప్రతాపోదయా. 107

(వ్యా) ఏకచ్ఛత్త్రిత — ఏకచ్ఛత్రముగలదిగాం జేయంబడిన—అనంగా నేకచ్ఛత్రాధిపత్యమునకు లోంబడిన; సర్వభూతల—సమస్తభూమండలములు గలవాండా; ఏక

ష్ఛ(తాధిపతియనుట); నృసింహ...రూప—నృసింహేంద్రక్షమాభృత్—నరసింహరాజుయొక్క; తపఃపాక—తపస్సుపండుటచే; ద్యోతిత—ప్రకాశించుచున్న; రూప—రూపము గలవాఁడా; (నరసింహరాజుయొక్క కుమారుఁడనుట); మౌక్తిక...ప్రదానోన్నతా—మౌక్తిక—ముత్యములయొక్క; తులాభారప్రదాన—తులాభారమును దానము చేయుటచే; ఉన్నతా—మహనీయుఁడా; కోక.....సన్నిభ—కోకస్తనీ—వనితలకు; (చక్రవాకములవంటి వక్షులుగు స్తనములు గలది); అసమాస్త్రసన్నిభ—మన్మథునితో సమానమైనవాఁడా; హరిత్—మహీశ—హరిత్—దిక్కులందు; కూలంకష—ఒరయుచున్న; (వ్యాపించుచున్న); ఉద్యత్—అతిశయించుచున్న; యశశ్శ్రీ—కీర్తిసంపదలుకల్గిన; కర్ణాటమహీశ—కర్ణాటదేశాధిపతీ; వైరి...దయా—వైరి—శత్రులనెడు; కరిరాట్—గజశ్రేష్ఠములకు; సింహప్రతాపోదయా—సింహపరాక్రమస్ఫూర్తి కలవాఁడా.

ఈ పద్యమునందు స్ఫురించు ధ్వనులు వివరింపఁబడుచున్నవి:—

'మౌక్తికతులాభార ప్రదానోన్నతా'—అనుటచే సత్యభామ పుణ్యకవ్రతము నాచరించినపుడు కృష్ణసహితంబుగాఁ గల్పద్రుమమును నారదమహర్షికి దానమిచ్చిన కథ స్ఫురించెడు.

'వైరికరిరాట్సింహప్రతాపోదయా'—అనుటచేఁ గృష్ణుఁడు శత్రుత్వముం బాటించుచుఁ దనతో యుద్ధముచేసిన దేవేంద్రుని జయించి విజయముఁ గాంచిన విషయము స్ఫురించెడు.

క. భువనవిజయాఖ్యసంస
న్నవరత్నవిభాప్రభాతనలినాప్త రమా
ధవచరణకమలసేవా
ప్రవణమతీ వీరరుద్రపర్వతవజ్రీ. 108

(వ్యా) భువన...నలినాప్త—భువనవిజయమను పేరు గల; సంసత్—సభయందలి; నవరత్నవిభా—నవరత్నములయొక్క కాంతులకు; ప్రభాతనలినాప్త—బాలసూర్యుఁడా; బాలసూర్యాతపము మణులను శోభింపఁజేయు స్వభావము గలది కావున రత్నపరీక్ష చేయువారు సూర్యోదయసమయమునందు రత్నగుణములఁ బరీక్షింతురు.

అనఁగా బాలసూర్యుఁడు రత్నమును బ్రకాశింపఁజేయునట్లు కృష్ణరాయమహారాజు భువనవిజయ మను పేరు గల తనకొలువుకూటమునందలి సభాసదుల మనంబులను వికసింపఁజేయువాఁడని భావము; రమా.....మతీ—రమాధవ—విష్ణువుయొక్క; చరణ

కమల—పాదారవిందములను; సేవా—భజించుటయందు; ప్రవణ—చతురమైన; మతీ—బుద్ధి కలవాఁడా; (విష్ణుభక్తుఁడని భావము); వీర......వజ్రీ—వీరరుద్ర — వీరరుద్రుఁడనెడు; పర్వత—కొండకు; వజ్రీ—దేవేంద్రుఁడగువాఁడా.

'భువనవిజయాఖ్యసంసత్'—అనుటచేఁ గృష్ణుఁడు సర్వలోకములను జయించి సర్వోత్కృష్టుఁడై వర్తించుట సూచితము.

### మంగళమహాశ్రీవృత్తము.

చిత్తజభిదంఘ్రియుగచింతనకళాధిగతజిష్ణుసమవైభవవిశేషా
విత్తరమణామరగవీతరణిభూజలదవిశ్రుతకరాంబురుహ గోష్ఠీ
నృత్తమణిరంగతల నీతిమనురాజనిభ నిర్భరదయారసపయోధీ
మత్తగజయూథమదమగ్నసుఖితాళిరవమాన్యగృహమంగళమహాశ్రీ.


109

(వ్యా) చిత్తజ......విశేషా—చిత్తజభిత్—పరమశివునియొక్క; అంఘ్రి యుగ—పాదద్వంద్వములను; చింతనకళా—ధ్యానించువిద్యచేత; అధిగత—పొందఁబడిన; జిష్ణుసమ—ఇంద్రునికి సమానమైన; వైభవవిశేషా—భోగాతిశయము గలవాఁడా; విత్త......కరాంబురుహ—విత్తరమణ—కుబేరుఁడు; అమరగవీ—కామధేనువు; తరణిభూ—(సూర్యునికొడుకగు) కర్ణుఁడు; జలద—మేఘము; (వీరివలె); విశ్రుత—ప్రసిద్ధమైన; కరాంబురుహ—కరకమలములు గలవాఁడా; అనఁగా వారివలె పేరాళముగ దానము చేయువాఁడాయని భావము; గోష్ఠీ......రంగతల—గోష్ఠీ—సభలయొక్క (విద్వాంసుల సభలయొక్క); నృత్త—నర్తనమునకు; మణిరంగతల—రత్నమయమైన నాట్యస్థలమైనవాఁడా; అనఁగా విద్వాంసు లితని నాశ్రయించి యితనితో సరససల్లాపక్రీడలు గావించుచుందురని భావము; నీతిమనురాజనిభ—నీతి—ధర్మములవిషయమై; మనురాజనిభ — మనురాజుతో సమానమైనవాఁడా; నిర్భరదయారసపయోధీ—నిర్భర—అధికమగు; దయారస—కరుణారసమునకు; పయోధీ—సముద్రమువంటివాఁడా; మత్త...... మంగళమహాశ్రీ—మత్తగజయూథ—మదపుటేనుఁగుల గుంపులయొక్క; మద—మదజలమునందు; మగ్న—మునిఁగినవై; సుఖిత—సుఖించుచున్న; అళి—తుమ్మెదలయొక్క; రవ—శబ్దములచేత; మాన్య—పొగడఁదగిన; గృహ—భవనముయొక్క; మంగళ—శుభమైన; మహాశ్రీ—గొప్పసంపద కలవాఁడా.

అనఁగాఁ గృష్ణదేవరాయల గృహమునందు మదపుటేనుఁగులు కట్టఁబడియున్న వనియు వానిమదజలమునకై మధుకరనికరములు ముసరుచు సొంపుగ ఝుంకారములు సేయుచు సొగియుచుండుననియు నది సకలసంపదలచే విలసిల్లుచు నెప్పుడును మంగళములతోఁ దెలువారుచుండు ననియు భావము.

ఇందలి ధ్వనులు వివరింపఁబడుచున్నవి:—

'చిత్తజభిదంఘ్రియుగచింతనకళాధిగతజిష్ణుసమవైభవవిశేషా' — అనుటచేఁ బరమశివచరణస్మరణంబుచేయు భక్తులకు వాసవసమభోగములు చేకూఱు నని ధ్వని స్ఫురించెడు.

'నిర్భరదయారసపయోధీ'—అనుటచేఁ గృష్ణస్వామి శరణాగతుఁడైన యింద్రుని తప్పులుమన్నించి కల్పవృక్షమును దీసికొనుమనిచెప్పి తన యపారకృపారసంబును బ్రకటీకరించెనను ధ్వని స్ఫురించెడు.

'మత్తగజయూథమదమగ్నసుఖితాళిరవమాన్య గృహమంగళమహాశ్రీ'—అనుటచే సత్యభామయుఁ గృష్ణుఁడును గృతకృత్యులై యవాప్తసకలకాములై వారును నెల్లవారును దమ గృహంబులు సకలమంగళములతో నెల్లసిరులతో నొప్పార నిరంతర సుఖానుభవంబులఁ జొక్కుచు నలరారుచుండిరని ధ్వని స్ఫురించుచున్నది.

(వి) 'చిత్తజభిదంఘ్రియుగ......విశేషా'—

దీనిచేఁ గృష్ణరాయమహారాజు వైష్ణవమతావలంబియైనను శివద్వేషము బొత్తిగా లేనివాఁ డనుటయేకాక శంభుసేవాతత్పరుఁడనియుఁ దెలియవచ్చెడు. కావుననే య మ్మహీపాలుఁడు విరూపాక్షము శ్రీకాళహస్తి చిదంబరము రామేశ్వరము మున్నగు సుప్రసిద్ధ మహాశివక్షేత్రములలోని దేవాలయములలో గోపురనిర్మాణము నైవేద్య దీపారాధనాదికైంకర్యములు నిరంతరముగా జరుగుటకై భూదానములు మొదలగు ననేక కైంకర్యములుచేసెను. ఆ వృత్తాంతము లందందుఁ గానంబడు శిలాశాసనములవలనను దామ్రశాసనములవలనను దెలియవచ్చుచున్నవి.

ఈవృత్తము మంగళమహాశ్రీ యనుపేరు కలది. ప్రతిపాదమునకు భ జ స న భ జ స న గ గ గణములును దొమ్మిది పదునేడవయక్షరములు యతిస్థానములును గలది. ఈవృత్తము పేరును దీనికడపటఁ గవి పొందుపఱచియుండుట చమత్కారము.

ఇదియుంగాక గ్రంథాంతమునందును మంగళముసేయుట శుభప్రదము కావున మంగళమహాశ్రీయను పదములఁ బ్రయోగించి యిచట సరసకవికులతిలకుం డగు తిమ్మ

నార్యుఁడు తనకును గృతీశ్వరునకును జదువరులకును శుభంబు లొదవునటులు మంగళము చేసియున్నాఁడు.

దీనికిఁ బ్రమాణము:—

'అంతేకావ్యస్య నిత్యత్వా త్కుర్యా దాశిష ముత్తమామ్
సర్వత్ర వ్యాప్తయే విద్వా న్నాయకేచ్ఛానురూపిణీమ్'

—అని సారస్వతాలంకారము.

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే
వీరపురుషా ణ్యాయుష్మత్పురుషాణిచ భవంతి అధ్యేతారశ్చ ప్రవక్తారోభవంతి'

—అని పాతంజలమహాభాష్యము.

ఈ కావ్యమునందు మొదటను గడపటను శ్రీకారము నెలకొలుపఁబడియుండు టచే నిది శ్రీకారసంపుటిత మనంబడును. సర్వశుభప్రదము.

శ్రీ కృష్ణార్పణ మస్తు.

ఓం త త్సత్.

---

గ ద్య ము

ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నందిసింగయామాత్యపుత్త్రి కౌశికగోత్రపవిత్ర సుజనవిధేయ
తిమ్మయనామధేయ ప్రణీతం బైన పారిజాతాపహరణం
బను మహాప్రబంధంబునందుఁ
బ ం చ మా శ్వా స ము.

సంపూర్ణము.

---

ఆ. ధరణిఁ బారిజాతహరణంబుచేఁ గల్గు
సహృదయులకుఁ జాలసంతసంబు
కరమునరసమైన పరిమళోల్లాసంబు
గదుర మదులు సొగియుఁగాదె మిగుల.

క. కృతికర్తను గృతిపతినిం
గృతినిం గృతివివృతికరుని గృతిపాఠకులం
గృతివివృతిని గృతసుకృతులఁ
గృతకృత్యులఁజేసి మనుపు కృపతోఁ గృష్ణా.

క. శ్రీపద్మాసత్యాధవ
నీపాదయుగంబుఁ గొలుతు నిచ్చలు నన్నుం
జేపట్టి కరుణఁ బ్రోవుము
నాపాలిటి పారిజాతనగమయి కృష్ణా.

వ్యాఖ్యాతృగద్యము

ఇది శ్రీపరమేశ్వరీసనాథ నిరంతరభజన నాగపూడిగ్రామాభిజన
భారద్వాజగోత్ర సామగద్రాహ్యాయణసూత్ర పవిత్రచరిత్ర
యజ్ఞేశ్వరార్యపుత్త్రి సూక్తిపరితోషితార్య కుప్పుస్వా
మ్యార్యప్రణీతం బైన పారిజాతాపహరణ
మహాకావ్యవ్యాఖ్యావికాసం బగు
పరిమళోల్లాసంబునందుఁ
బంచమాశ్వాసము.

---



పారిజాతాపహరణకావ్యమునందలి

# పద్యముల యకారాద్యనుక్రమణిక

శ్రీ

పారిజాతాపహరణములోని

# తప్పొప్పుల పట్టి

| తప్పు | ఒప్పు | పుట | పద్యం | పంక్తి |
|---|---|---|---|---|
| సరస | నరస | 1 | 1 | 11 |
| పసు | వస్తు | 2 | 1 | 2 |
| గ్రంథాధిని | గ్రంథాదిని | 3 | ,, | 1 |
| మాగ్ధ్యంబు | మాగ్ధ్యంబు | 4 | 2 | 10 |
| రుక్మిణిదేవి | రుక్మిణీదేవి | 4 | ,, | 19 |
| పద్యార్థము | పద్యార్థము | 8 | 8 | 16 |
| గాఁవు | గాఁపు | 10 | 12 | 14 |
| షోడవ | షోడశ | 12 | 13 | 16 |
| పరపంథి | పరిపంథి | 13 | 15 | 5 |
| బృంధావన | బృందావన | 16 | 19 | 10 |
| అకల్పము | ఆకల్పము | 16 | 19 | 16 |
| తర్నము | రత్నము | 17 | 20 | 15 |
| పడఁతులను | పడఁతిని | 18 | 22 | 24 |
| సరసాధిప | నరసాధిప | 26 | 33 | 18 |
| బట్టువాడని | బట్టువాఁ డని | 38 | 52 | 7 |
| జ్ఞపికి | జ్ఞప్తికి | 39 | 53 | 10 |
| పారిజాతఇతీరితః | పారిజా తేతిశబ్దితః | 44 | 58 | 5 |
| అడిగిత | అడిగిన | 44 | 61 | 24 |
| ఆని | అని | 46 | 66 | 3 |
| 79 | 69 | 46 | ,, | 26 |
| ఆననము | ఆసనము | 49 | 79 | 20 |
| సత్యబామ | సత్యభామ | 50 | 80 | 4 |

| తప్పు | ఒప్పు | పుట | పద్యం | పంక్తి |
|---|---|---|---|---|
| ల్గటియించి | ల్ఘటియించి | 53 | 89 | 1 |
| నవ్వుఁకైన | నవ్వులకైన | 54 | 94 | 8 |
| వెఱచునొ | వెఱచునో | 54 | ,, | 9 |
| సర్మ్రించు | స్మరించు | 55 | 95 | 6 |
| ప్రత్యైకము | ప్రత్యేకము | 56 | 98 | 21 |
| అనగా | అనఁగా | 57 | 99 | 13 |
| శమ జెంది | శ్రమఁజెంది | 57 | ,, | 16 |
| దారకుని | దారుకుని | 59 | 105 | 21 |
| వాపద | నాపద | 63 | 112 | 17 |
| బుస | బున | 63 | 113 | 24 |
| యపటము | యపటను | 64 | 115 | 23 |
| నాడఁ | నాఁడ | 68 | 121 | 7 |
| బొరయులుయు | బొరయుటయు | 69 | ,, | 2 |
| స్వాంగీకృతొ | స్వాంగీకృతో | 69 | ,, | 17 |
| శైశశావస్థ | శైశవావస్థ | 72 | 127 | 5 |
| మలత్వ | మల్పత్వ | 75 | 135 | 2 |
| స్త్రీలింగము | స్త్రీలింగము | 76 | 138 | 19 |
| గ్రందముల | గ్రంథముల | 78 | 140 | 16 |
| కీలొల్పి | కీల్కొల్పి | 86 | 14 | 9 |
| విశ్రాంత | విశ్రాంతి | 87 | 15 | 11 |
| వెజ్జ | వెజ్జి | 94 | 33 | 19 |
| గార్కొనిన | గాల్కొనిన | 95 | 34 | 10 |
| వెడఁగ | డవిఁగ | 95 | 34 | 23 |
| కార్కొనిన-సందడించిన | కాల్కొనిన-ప్రజ్వరిల్లిన | 95 | 34 | 23 |
| దోతక | ద్యోతక | 100 | 38 | 26 |
| ముసకుబు ర్వము | ముసుకుఁ బూర్వము | 101 | 39 | 13 |
| దాపిత్రము | ధాపితము | 102 | ,, | 25 |
| నాగునా | నగునా | 104 | 42 | 28 |
| పదములను | పదమును | 107 | 45 | 7 |
| నమనన్మథుని | మన్మథుని | 107 | ,, | 22 |

| తప్పు | ఒప్పు | పుట | పద్యం | పంక్తి |
|---|---|---|---|---|
| కఱచునయు | కఱచునవియు | 112 | 49 | 5 |
| నిండఁగ్రోలి | నిండఁగఁగ్రోలి | 112 | ,, | 10 |
| అసక్తుఁడైన | ఆసక్తుఁడైన | 114 | 51 | 9 |
| వారునును | వారును | 115 | 52 | 6 |
| నగుపదము | ననుపదము | 118 | 53 | 18 |
| మెఱయుచున్ | మొఱయుచున్ | 121 | ,, | 11 |
| పొడమె | పొలిచె | 127 | 54 | 5 |
| పొడమెన్-పుట్టెను | పొలిచెన్-ప్రకాశించెను | '27 | 54 | 15 |
| చకోర | చకోరక | 129 | 59 | 6 |
| నించు | నించి | 133 | 64 | 26 |
| సింహానన | సింహాసన | 141 | 71 | 9 |
| గఱుత్మంతు | గరుత్మంతు | 142 | 72 | 28 |
| మదియ | మదీయ | 143 | 75 | 25 |
| తెగ తెక | తెక తెక | 151 | 88 | 3 |
| ప్రూసికొని | ప్రూసికొని; | 153 | 88 | 30 |
| బడలి; | బడలి | ,, | ,, | ,, |
| రలంధ్రములందు క్తమును | రంధ్రములందు రక్తమును | 155 | 88 | 24 |
| బెబ్బులును | బెబ్బులులును | 156 | 88 | 5 |
| జొల్ల మోర | జొల్లి మోర | ,, | ,, | 10 |
| సాంధులన్ | పాంథులన్ | 160 | 90 | 18 |
| [illegible]మధేవునకు | కామధేనువునకు | 165 | 96 | 28 |
| ఉత్ప్రేష | ఉత్ప్రేక్ష | 177 | 5 | 15 |
| యానము | యానయానము | 185 | 19 | 16 |
| తెఱుంగు | తెలుంగు | 186 | 20 | 3 |
| యన్యురాగము | య్యనురాగము | ,, | 21 | 13 |
| హృదయంబుఁ | హృదయంబు, | ,, | ,, | 18 |
| ఆవతార | అవతార | 190 | 28 | 13 |
| శ్మంగార | శృంగార | 192 | 32 | 26 |
| ఆంఘ్రి | అంఘ్రి | 193 | 33 | 9 |
| మెట్టవే | మట్టవే | ,, | ,, | 13 |

| తప్పు | ఒప్పు | పుట | పద్యం | పంక్తి |
|---|---|---|---|---|
| 190 పుటసంఖ్య | 196 | 196 | | |
| పురోణో | పురాణో | 196 | 37 | 9 |
| పితము | పీఠము | 200 | 38 | 22 |
| జాలందరము | జాలంధరము | 201 | ,, | 27 |
| ప్రదిపాది | ప్రతిపాది | 202 | ,, | 18 |
| సహస్రనామము | సహస్రనామస్తోత్రము | 202 | ,, | 23 |
| జీవానలంబున్ | జీవానిలంబున్ | 204 | ,, | 26 |
| ఘణిః | ఫణీ | 205 | ,, | 15 |
| స్కొందనా | స్కందనా | ,, | ,, | 20 |
| యోగప్రాజ | 'యాగప్రాజ' | 206 | ,, | 27 |
| ఖండబండం | ఖండఖండం | 207 | ,, | 2 |
| నని వానా | నవినానా | 211 | 41 | 28 |
| లాస్య | ల్లాస్య | 212 | ,, | 28 |
| వాదుకా | పాదుకా | 213 | ,, | 27 |
| పట్టుచె | పట్టుచే | 215 | ,, | 23 |
| ఆనంగా | అనంగా | ,, | ,, | 26 |
| మొదలను | మొదలు | 216 | 41 | 2 |
| పుక్ష్పము | పుష్పము | ,, | ,, | 7 |
| పాశవర | పాశేశ్వర | 217 | ,, | 6 |
| గీష్మ | గ్రీష్మ | 221 | 45 | 1 |
| సరిసిజ | సరసిజ | 226 | 53 | 14 |
| వఘూారు | సధూసరు | ,, | ,, | 20 |
| 65 | 56 | 228 | 56 | 2 |
| హాస్తశలంబున్ | హాస్తతలంబునన్ | 229 | 58 | 15 |
| ప్రకాశి.చు | ప్రకాశించు | ,, | ,, | 19 |
| ప్రబంవంబునందు | ప్రబంధంబునందుఁ | 232 | గద్యము | 5 |
| ద్వితీయా | తృతీయా | ,, | ,, | 6 |
| ద్వితీయా | తృతీయా | ,, | ,, | 14 |
| తిలకో | 'తిలకో'– | 236 | 9 | 21 |
| కుసతియు | కులసతియు | 247 | 27 | 23 |

| తప్పు | ఒప్పు | పుట | పద్యం | పంక్తి |
|---|---|---|---|---|
| సంఘాన | సంధాన | 259 | 49 | 11 |
| హేతూ | హే తూ | 260 | 52 | 23 |
| భయూనకరపము | భయానకరసము | 274 | 81 | 9 |
| ఉధితి | దీధితి | 281 | 1 | 11 |
| సమూహమును గలవారును | సమూహముగలవారును | 283 | 13 | 20 |
| యసాక్షులు | యక్షులు | 289 | 13 | 26,27 |
| ధ్యులు | సాధ్యులు | ,, | ,, | 27 |
| కపోడలమండలీ | కపోలమండలీ | 292 | 18 | 9 |
| క్రమమును | క్రమమును | 293 | 21 | 8 |
| ప్రమోగింపఁ | ప్రయోగింపఁగా | 293 | 21 | 12 |
| వృదశ్రవుండు | వృద్ధశ్రవుంకు | 295 | 30 | 25 |
| గణములను | గణములును | 300 | 35 | 13 |
| నర్ధందు | నర్ధమందు | 302 | 40 | 12 |
| సులక్షైక | సులక్షైక | 314 | 62 | 3 |
| స్నానమొనర్చి | స్నానమొనర్చి | 316 | 68 | 15 |
| ద్రోనదియుసుభద్ర | ద్రోవదియు సుభద్ర | 318 | 72 | 5 |
| ఆనవుడు | అనవుడు | 320 | 77 | 17 |
| ప్రాఖ్యోక్తి | ప్రౌఢోక్తి | 321 | 78 | 6 |
| మారనిఖాను | మారవిభాను | 333 | 92 | 5 |
| వదసా | పదసా (ఈ ద్వాగము) | 338 | 93 | ,, |
| కలవాఁడా | కలవాఁడా) | 340 | 94 | 23 |
| తిస్థిరా | తిస్థిరా | 342 | 95 | 4 |
| నత్రారాధ్య | సత్యారాధ్య (ఈ ద్వారము) | 342 | 96 | ,, |
| మనమును | మనమును | 344 | 97 | 5 |
| శింకాజనన | శంకాజనన | 344 | 98 | 20 |
| ఏక | (ఏక | 351 | 107 | 27 |
| బవరింపఁబడు | విచరింపఁబడు | 352 | 107 | 11 |



